# విస్తరిస్తున్న
# మన విద్యారంగం




## చతుర
## సమర్పణ

తల్లిదండ్రులు సహజంగా తమ పిల్లలు బాగా చదువుకుని, గౌరవనీయమైన ఉద్యోగంలోనో, లాభసాటి వ్యాపారంలోనో స్థిరపడి, జీవితంలోని అత్యున్నత సోపానాలనధిరోహించాలని కోరుకుంటారు. సంఘంలో హోదా, పలుకుబడీ, డబ్బూ సంపాదించి క్రమశిక్షణతో జీవిస్తూ తమకి మంచి పేరు తేవాలని వాంఛిస్తారు. ఆ ప్రయత్నంలో భాగంగానే వాళ్ళని చిన్ననాడే మంచి స్కూళ్ళలో చేర్పిస్తుంటారు. అడుగడుగునా వారి చదువును పర్యవేక్షిస్తుంటారు.

పిల్లవాడికి మూడో ఏడు వస్తోందంటేచాలు తల్లిదండ్రులు ఏ స్కూల్లో చేర్పిద్దామా అన్న ఆలోచనలో మునిగిపోతుంటారు. అప్లికేషన్ ఫారాలు, అడ్మిషన్ టెస్టులు ముగిశాక తాము కోరుకున్న మంచి స్కూల్లో అడ్మిషన్ వస్తుందో లేదోననే దిగులుతో కొన్నిరోజులు గడిచిపోతాయి. ప్రవేశం దొరికాక డొనేషన్, ఫీజులు, యూనిఫారం, పుస్తకాలు, నోట్‌బుక్స్, సరికొత్త బ్యాగు, పెన్సిళ్ళు, రబ్బర్లువంటివాటితో ప్రారంభమైన స్కూలు జీవితం కుర్రాడికి కొద్ది రోజులకే విసుగు పుడుతుంది. ఏదో ఓ సాకు చెప్పి స్కూలు తప్పించుకునే ఉపాయాలు అన్వేషిస్తాడు. 3 నుండి 5 సంవత్సరాలలోపు వయసుగల పిల్లలు కొంతమందిలో ఈ లక్షణానికి కారణం పొద్దున్నే స్కూలుకి పరుగెత్తాల్సి రావటం, వారి బరువుకి మించిన పుస్తకాల్ని మోయాల్సి రావటంతో అనవసరమైన మానసిక వత్తిడికి, శారీరక శ్రమకు గురవుతుండటమేనంటారు డాక్టర్లు. పిల్లలు ఆరవ సంవత్సరం వచ్చేవరకు మామూలు చదువుకి సిద్ధం కాలేరు. అప్పటివరకూ వారికి ఆటపాటలతో చదువు నేర్పాలే తప్ప పుస్తకాలతో, హోం వర్కులతో వేధించకూడదని విద్యావేత్తలు అంటున్నారు. 3 నుండి 5 సంవత్సరాల లోపు వయసు|గల పిల్లలు ఏ విషయంలోనైనా ఒకేసారి 15 నిమిషాలకి మించి ఏకాగ్రత ప్రదర్శించలేరనీ, అలాంటివారిని గంటలతరబడి డెస్కుముందు కూర్చోబెట్టి చదివించడం, రాయించడంవల్ల వారిలో అసలు చదువంటేనే అయిష్టత ఏర్పడే ప్రమాదముందనీ వారు చెబుతున్నారు. పిల్లలు ఏదైనా ఒక భాషను వినటంద్వారా, మాట్లాడటంద్వారా చక్కగా నేర్చుకుంటారు. ఆ తర్వాతే వారితో పుస్తకాలు చదివించటం, రాయించటం మంచిదంటున్నారు విద్యావేత్తలు. చిన్నపిల్లలకు పాఠ్యగ్రంథం ఒకటి మించి ఉండకూడదనీ, అందులోని పాఠాలు కూడా ఆటలద్వారా, పాటలద్వారా బోధించినట్లయితేనే పిల్లలు శ్రమలేకుండా నేర్చుకోగలుగుతారనీ కూడా శాస్త్రవేత్తలంటున్నారు. ఆ కృషిలో భాగంగానే ప్రస్తుతం ఉత్తరప్రదేశ్‌లోని కొన్ని స్కూళ్ళలో 'సే అండ్ సింగ్' పద్ధతిలో విద్యాబోధన ప్రారంభించారు.

ఇలాంటి ఆదర్శవంతమయిన స్కూళ్లు మన రాష్ట్రంలో కూడా అక్కడక్కడ లేకపోలేదు. హైద్రాబాద్‌లో వికాస్ భారతి స్కూలు ఈ కోవకు చెందినదే. నాగార్జున సాగర్ రోడ్డుమీద 10 ఎకరాల విస్తీర్ణంలో ప్రశాంత ప్రదేశంలో ఉన్న 'రెసిడెన్షియల్ కమ్‌డే స్కూల్' ఇది. ప్రారంభించిన 10 సంవత్సరాల్లో మంచి పేరు తెచ్చుకుంది ఈ స్కూలు. పిల్లల కోసం ఆటబొమ్మలు, మంచి పుస్తకాలు మరెక్కడా లేని విధంగా వేల ఖర్చుతో సేకరించారు. పసితనంలో చదువు భారంలా కాకుండా, ప్రోత్సాహిక దిన చర్యలా వుండేలా ఈ స్కూలు బోధనా పద్ధతులను రూపొందించారు.

అలా ప్రైమరీ ఎడ్యుకేషన్‌నుండి ప్రారంభమైన విద్యార్థిజీవనం అంచెలంచెలుగా క్లాసులు పెరుగుతూ మాధ్యమిక స్థాయిని దాటుతుంది. తరువాత పదవతరగతి. అది పాసయిన విద్యార్థులందరికీ ఇంటర్మీడియెట్‌గానీ, ఆపై చదువులకిగానీ వెళ్ళే ఆసక్తీ స్థోమతా లేకపోవచ్చు. అలాంటివారు వృత్తివిద్యాకోర్సుల్ని ఎంచుకోవటం మంచిది. అంతేగాక ఐ.టి.ఐ., పాలిటెక్నిక్‌వంటి కోర్సులలో చేరితే కొంతవరకు ఉద్యోగాల వేట తప్పటమేగాక స్వయం ఉపాధి పథకాలతో తామే నలుగురికి ఉపాధి చూపించగల అవకాశాలుంటాయి.

ఇంటర్మీడియెట్‌లో ప్రవేశం దొరికినా ఈరోజుల్లో విద్యార్థులు ఎదుర్కొనే ఇబ్బందులు అనేకం. వారి చదువులు తల్లిదండ్రులకు తల

# SHYAM SIDDHARTHA JUNIOR COLLEGE

(Recognised by Govt. of A.P.)

*Regd. Office:*
Opp: Blood Bank,
YMCA Circle,
Narayanaguda,
Hyd.-29, Ph: 552561.

**College Block:**
Padmashali Bhavan,
Near Shalimar Theatre,
Narayanaguda,
Hyd.-29, Ph: 510417.

**ADMISSIONS ARE OPEN FOR
INTERMEDIATE I & II YEAR**

**MPC BPC MEC CEC HEC**

**Co-Education. Both English & Telugu Media**




## INSTITUTE OF ENGINEERING STUDIES

**Opp. Blood Bank, Narayanaguda
Hyderabad - 500 029, Ph: 552561, 510417**

**The Institution which has students from allover India.**

Institute of Engineering Studies (Estd. 1981) a reputed Institution in A.P. offers excellent coaching for Govt. recognised Diploma & Degree Courses in Engineering

**Degree Courses: Equivalent to B.E.,/B.Tech., Degree**

**• AMIE • AMIMechE • AMIETE • AMAeSI**

(Civil / Mechanical / Electronics / Electrical / Aeronautical / Textile etc.)

**Diploma Courses: Equivalent to Polytechnic Diploma**

**• T.Engg. • Dip. IETE • A.T.Engg. • P.T.Engg.**

(Mechanical / Electronics / Automobile / Production)

| Qualification | Diploma Course | Degree Course |
|---|---|---|
| **SSC** | **3 Years** | **5 Years** |
| **Inter (BPC)** | **2 Years** | **4 Years** |
| **Inter (MPC)** | **$1\frac{1}{2}$ year** | **$3\frac{1}{2}$ years** |
| **Diploma Holders** | | **$2\frac{1}{2}$ years** |

For Details Contact in person or obtain the prospectus and Application for Admission for Rs. 20/- (M.O./D.D.)



K.Shyam Siddhartha, B.Tech.
Secretary & Correspondent.



కుమించిన భారంగా పరిణమిస్తున్నాయి. ఇంటర్మీడియట్ పాసయ్యాక కూడా తర్వాత ఏ కోర్సు చదవాలన్నది పెద్ద ప్రశ్నార్థకంగా ఉంటోంది. ఇంటర్మీడియట్ చదివే వయసు చాలా కీలకమైంది. అటు మానసికంగానూ, ఇటు విద్యాపరంగానూ పిల్లల జీవితాల్ని మలుపుతిప్పేది ఈ కాలమే. ఇప్పుడు తీసుకునే నిర్ణయాలపైనే వారి భవితవ్యం ఆధారపడి ఉంటుంది. కాబట్టి తల్లిదండ్రులూ, విద్యార్థులూ కూడా అన్ని విషయాలూ అవగతం చేసుకుని ఏ చదువు అనువుగా ఉంటుందో తెల్సుకోవాలి. ఇంటర్ పాసయినవారికి ఉన్నత విద్యావకాశాలు ఏమేం ఉన్నాయో తెలియక ఎక్కువమంది సంప్రదాయక కోర్సులవైపే మొగ్గుచూపిస్తుంటారు. అయితే ప్రొఫెషనల్ కోర్సులైన మెడిసిన్, ఇంజినీరింగ్‌లపట్ల తీవ్ర ఆకర్షణ ఉన్నా అవకాశాలు పరిమితం! వాటిలో ప్రవేశం దొరకనివారు నిరుత్సాహపడిపోతున్నారు. అలా బాధపడకుండా వారు మనరాష్ట్రంలోనేకాక దేశవ్యాప్తంగా ఉన్న వివిధ విద్యాసంస్థల్లో లభ్యమయ్యే కోర్సుల వివరాలు తెలుసుకుని, వాటిలో చేరి, విలువయిన విద్యాసంవత్సరం వృధాకాకుండా జాగ్రత్తపడవచ్చు.

మన యువకుల్లో వ్యక్తిగత ఆసక్తులు, అభిరుచులు పక్కనపెట్టి తల్లిదండ్రులో, బంధుమిత్రులో ఇచ్చిన సలహామేరకు కెరీర్‌ను ఎంచుకునేవారు ఎక్కువమంది కన్పిస్తారు. బలవంతంగానో, తప్పుగానో తీసుకున్న నిర్ణయాలు విద్యార్థి భవిష్యత్తును నాశనంచేస్తాయి. విద్యార్థి తన ఆసక్తి, అభిరుచి, అవకాశం, సామర్థ్యం మొదలైన విషయాలన్నీ విశ్లేషించుకుని తన ముందున్న మార్గాలన్నీ పరిశీలించుకుని తగిన నిర్ణయం తీసుకోవాలి. మన పాఠశాలల్లో విద్యార్థులకు కెరీర్ గైడెన్స్ కౌన్సెలింగ్ సౌకర్యాలు సరిగా లేవు. ఇందుకు మార్గదర్శకంగా నిలిచే సాహిత్యం కూడా చాలా తక్కువ. జనరల్ కోర్సులతోపాటు వివిధ ప్రొఫెషనల్ కరస్పాండెన్స్ కోర్సుల గురించిన సమగ్ర సమాచారం తెలుసుకోవటం ప్రతి విద్యార్థికీ అవసరం. అందువలన అలాంటి పరిస్థితుల్లో 'ఈనాడు' ఎడ్యుకేషన్ కౌన్సిలింగ్‌లాంటివాటిని సద్వినియోగం చేసుకోవాలి. వ్యవసాయ ప్రధానమైన దేశం మనది. అంతేకాదు, ఏ దేశీయులకైనా వ్యవసాయ సంబంధిత పరిపూర్ణ అవగాహన అవసరం. అందుకు అగ్రికల్చరల్ ఎడ్యుకేషన్ విద్యార్థికి అవసరం.అగ్రికల్చరల్ ఇంజనీరింగ్, వెటర్నరీ సైన్స్, యానిమల్ హస్బెండరీ, ఫిషరీస్, డైరీటెక్నాలజీ, సెరీకల్చర్, హార్టీకల్చర్, ఫారెస్టరీ, హెూంసైన్స్, ఫార్మ్‌సైన్స్, రూరల్ డెవలప్‌మెంట్‌వంటి విభాగాలలో ఇంటర్మీడియట్ విద్యార్థులు చేరి తమ జీవితాన్ని రాచబాటలో నడుపుకోవచ్చు. మెడికల్ ఎడ్యుకేషన్‌లో ఎం.బి.బి.ఎస్.కేగాక మిగతా డెంటిస్ట్రీ, ఫార్మసీ, నర్సింగ్, హెూమియోపతి, హ్యూమన్ బయోలజీ, ఫిజికల్ మెడిసిన్ - రీహాబిలిటేషన్, భారతీయ వైద్యవిధానంవంటి వివిధ కోర్సులకు కూడా అప్లై చేయవచ్చు. ఇంజనీరింగ్ టెక్నలాజికల్ ఎడ్యుకేషన్‌లేగాక ఇంకా ఇతర ముఖ్యమైన కోర్సులు అనేకం ఉన్నాయి. మేనేజిమెంటు ఎడ్యుకేషన్, కంప్యూటర్ ఎడ్యుకేషన్ లీగల్ ఎడ్యుకేషన్, టీచింగ్, ఫిజికల్ ఎడ్యుకేషన్, ఫైన్‌ఆర్ట్స్, ఫొటోగ్రఫీ, డిజైన్, మ్యూజిక్, హెూటల్ మేనేజ్‌మెంట్, సోషల్‌వర్క్, సైన్స్ లైబ్రరీ - ఇన్‌ఫర్మేషన్ సైన్సెస్, ఓరియంటల్ లెర్నింగ్ వంటివాటిలో ఆసక్తిగల కోర్సులో విద్యార్థి ప్రవేశంపొందవచ్చు.

ఇంటర్మీడియట్ పాసైన అధికశాతం విద్యార్థులు ఇంజనీరింగ్, మెడికల్, అగ్రికల్చర్‌వంటి ప్రొఫెషనల్ కోర్సులపైనే ఎక్కువ ఆసక్తీ ఆదరణా చూపిస్తారు. కానీ ఇంటర్మీడియెట్ పాసైనవారికి ఇంకా అనేక ఇతర కోర్సులు ఈనాడు లభ్యమవుతున్నాయి. అందరికీ తెలిసిన హెూటల్ మేనేజిమెంట్ కోర్సుదగ్గరినుంచి పెద్దగా తెలియని లీగల్, టీచర్ ఎడ్యుకేషన్ కోర్సులు కూడా ఇంటర్ పాసైనవారికి అందుబాటులో ఉన్నాయి.

ఇటీవలికాలంవరకూ మాస్టర్ ఆఫ్ బిజినెస్



అడ్మినిస్ట్రేషన్ (ఎంబిఏ), మాస్టర్ ఆఫ్ మేనేజ్ మెంట్ స్టడీస్ (ఎం.ఎం.ఎస్.), పోస్టుగ్రాడ్యుయేట్ డిప్లొమా ఇన్ బిజినెస్ అడ్మినిస్ట్రేషన్ (పిజిడిబిఏ) వంటి కోర్సులు కేవలం గ్రాడ్యుయేట్లకే ఆఫర్ చేస్తూవచ్చారు. కొన్ని యూనివర్సిటీలు ఇప్పుడు ఇంటర్ పాసైనవారికి కూడా బాచులర్ ఆఫ్ బిజినెస్ అడ్మినిస్ట్రేషన్ (బిబిఏ), బాచ్‌లర్ ఆఫ్ బిజినెస్ మేనేజ్‌మెంట్ (బిబిఎం), బాచులర్ ఆఫ్ బిజినెస్ స్టడీస్ (బిబియస్), బాచులర్ ఆఫ్ మేనేజ్‌మెంట్ స్టడీస్ (బిఎంఎస్)వంటి కోర్సులు ఆఫర్ చేస్తున్నాయి. మేనేజ్‌మెంట్ కెరీర్ కావాలని అభిలషించేవారు ఇంటర్ తరువాత ఈ కోర్సులు ఎంపికచేసుకోవచ్చు. అయితే ఇందులో మాస్టర్స్ డిగ్రీ కూడా చేయడంవల్లనే హెచ్చు ఉపయోగాలున్నాయి. మేనేజ్‌మెంట్ కెరీర్‌పట్ల గల ఆకర్షణని సొమ్ముచేసుకునేందుకు యూనివర్సిటీల లేదా ప్రభుత్వ గుర్తింపులేని అనేక సంస్థలు ఇంటర్‌మీడియెట్ పాసైనవారికి కూడా మేనేజ్‌మెంట్ కోర్సులు ఆఫర్ చేస్తున్నామని ప్రకటనలు గుప్పిస్తుంటాయి. కాబట్టి ఏ సంస్థనుంచి కోర్సు చేస్తున్నామన్నది కూడా ముఖ్యమని గుర్తుంచుకోవాలి.

మనరాష్ట్రంలో కాలేజ్ ఆఫ్ మేనేజ్‌మెంట్ స్టడీస్, గాంధీ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ అండ్ మేనేజ్‌మెంట్ (గీతమ్) మాత్రమే ఈ కోర్సును ఆఫర్‌చేస్తోంది. ఈ సంస్థ ఆంధ్రా యూనివర్సిటీకి అనుబంధంగా ఉంది. సంప్రదించాల్సిన చిరునామా: డైరెక్టర్, కాలేజ్ ఆఫ్ మేనేజ్‌మెంట్ స్టడీస్, గీతమ్ ఎండాడ, విశాఖపట్నం-530 040.

ఇతర రాష్ట్రాలలో కొన్నిచోట్ల ఈ కోర్సులున్నాయి.

కోర్సులో అడ్మిషన్ సంపాదించుకోవటం ఒక ఎత్తయితే తరువాత విద్యాసంవత్సరంలో సమయం వృధాచేయకుండా శ్రద్ధగా చదివి మంచి మార్కులు సంపాదించుకోవటం మరొక ఎత్తు. ప్రతి విద్యార్థికి పరీక్షలకి తయారుకావటం ఎలాగన్నదే ప్రధాన సమస్య. పరీక్షలకి ముందుగానే జాగ్రత్తపడితే ఏ ప్రశ్నకై

నా సమాధానం రాయగలనన్న ఆత్మవిశ్వాసం ఏర్పడుతుంది. పై చదువులకి వెళ్ళాలన్నా, ఉద్యోగాలకు అర్హత సంపాదించాలన్నా పరీక్షలు అనివార్యం. అందుకని పరీక్షల్ని విద్యార్థులు ఛాలెంజిగా తీసుకొని ధీరోదాత్తంగా ఎదుర్కోవాలి. కరెక్ట్‌గా ప్లానింగ్ లేక ప్రిపేరుకాకపోతేనే పరీక్షలంటే భయం పుడుతుంది. సబ్జెక్టుని క్షుణ్ణంగా చదివి రివిజన్ చేసుకోవాలి. పరీక్షల్ని దృష్టిలో ఉంచుకుని చదవడం నేర్చుకోవాలి. పరీక్షలముందు ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోవాలి. బాలెన్స్‌డ్ డైట్ తీసుకోవాలి. పరీక్షలప్పుడు టీ, కాఫీలు తాగటం, పిల్సు వాడటం మంచిదికాదు. ఆరోగ్యానికి తగు ఆహారం తగినంత నిద్ర అవసరం. నిద్ర లేకుంటే దాని ప్రభావం పరీక్షలపై పడుతుంది. కనుక మొదటినుంచీ చదివితే పరీక్షల రోజుల్లో ఈ సమస్యలుండవు. మనసుని ప్రశాంతంగా ఉంచుకుని, మానసికమైన అలజడిని దూరంచేసుకోవాలి. పరీక్ష హాలులో విద్యార్థికున్న సమయం అమూల్యం. ఆ కొద్ది సమయంలో రాయాల్సిన ప్రశ్నలకు సమాధానాలు సిద్ధం చేసుకోవాలి. మొదటి ప్రశ్నతోనే కాలమంతా వృధాచేసి బ్రహ్మాండంగా రాసినా లాభంలేదు. అన్ని ప్రశ్నలను|ఆన్సర్‌చేయాలి. కనుక అన్నిప్రశ్నలకు సమానమైన ప్రాధాన్యత నివ్వాలి. విజయాన్నే ఊహించాలి. అపజయాల ఆలోచనలకి తావివ్వకూడదు.

శరీరానికి వ్యాయామం ఎంతో మెదడుకి చదువు అంతగా ఆరోగ్యాన్ని చేకూరుస్తుంది. మానవుని అభ్యున్నతికి విజ్ఞానం ఆత్మవంటిది. ఆత్మ లేనిదే వ్యక్తికి జీవితంలేదు. భర్తృహరి తన సుభాషితాల్లో 'విద్యలేనివాడు వింతపశువు' అన్నాడు. 'చదువు అంతులేని బంగారుగని' అన్నాడింకో మేధావి. బ్యాంకులోని డబ్బు తీసినకొద్దీ తరుగుతుంది. కాని మెదడు అనే బ్యాంకులోని విజ్ఞానమనే ధనం తీసినకొద్దీ పెరుగుతుందే తప్ప తరగదు. విద్యను మించిన మంచి మిత్రుడు లేడు.

ఇంటర్ విద్యార్థులకి ఉన్నత విద్యావకాశాలకు సంబంధించిన డైరెక్టరీని 'ఈనాడు' నేత్ర

త్వంలో 'ప్రతిభ' పేరుతో వెలువరించారు. ఇది ఎందరికో మార్గదర్శి అయింది. అలాగే ప్రగతిపథం పేరుతో ప్రతి శుక్రవారం విద్యా సంబంధిత సమాచారాలు ఈనాడులో వెలువరిస్తున్నారు. అవి చదివితే విద్యార్థికి చక్కని అవగాహన ఏర్పడుతుంది.

ప్రభుత్వ విద్యాసంస్థలలో బోధన సన్నగిల్లడంతో చదువుపై ఆసక్తి ఉన్నవారు ఆర్థికంగా ఇబ్బందిపడుతూ కూడా ప్రైవేటు విద్యాసంస్థలలోనే తమ పిల్లల్ని చదివించుకుంటున్నారు.

ప్రైవేట్ రంగంలో నిర్వహించే సంస్థలలో అన్ని విద్యాలయాలకూ ప్రభుత్వ గుర్తింపు, ధన సహాయం ఉండదు. వారు కేవలం లాభాల్నే దృష్టిలో పెట్టుకుని ఫీజులు వసూలు చేస్తూండటం ఆనవాయితీ. ఇలాంటి ప్రైవేటు సంస్థలమధ్య పోటీ తీవ్రంగా ఉండటంవలన క్రమశిక్షణ, బోధన ఎయిడెడ్ సంస్థలలోకంటే చాలా పటిష్ఠంగా ఉంటాయి. ఫలితాలు బాగుంటాయి. విద్యార్థులు చెల్లించే డబ్బుకి ప్రతిఫలం ముడుతుంది అని ఎక్కువమంది అభిప్రాయం.

ప్రభుత్వ జూనియర్ కాలేజీలలో నామమాత్రంగా విద్యాబోధన జరుగుతూ ఉంటుందని పరిశీలకులు అభిప్రాయపడుతున్నారు. ప్రైవేటు, రెసిడెన్షియల్ కాలేజీల్లో విద్యార్థులనుండి అధిక మొత్తాలలో ఫీజులు, డొనేషన్లు వసూళ్ళు చేస్తుంటారు కాబట్టి సహజంగానే మంచి క్రమశిక్షణ, లైబ్రరీ సదుపాయాలు, ఉత్తమ స్థాయిలో బోధన, ప్రతి విద్యార్థిపట్ల వ్యక్తిగత శ్రద్ధ తీసుకోవటంవలన సత్ఫలితాలు సాధిస్తుంటాయి.

రెసిడెన్షియల్ కళాశాల్లో విద్యార్థులకు కాలేజీ పరిధిలోనే నివాసం ఏర్పర్చి, నియమిత వేళలకు నిద్రలేపటం, చదువుకునే సమయం నిర్ణయించటంవంటివి చేస్తారు నిర్వాహకులు. ఆటలు పాటలతో, సినిమాలతో, టి.వి. చూడటంతో, స్నేహితులతో సమయం దుర్వినియోగం చేయకుండా విద్యార్థి లక్ష్యం కేవలం విద్యపైనే ఉండేలా కట్టుదిట్టం చేస్తారు. దీనివలన విద్యార్థి అల్లరిచిల్లరిగా తిరగటానికి అవకాశమే ఉండదు. చదువుపైనే దృష్టి కేంద్రీకరించటంవలన రెసిడెన్షియల్ కాలేజీల విద్యార్థులందరికీ అత్యున్నతమైన మార్కులు రావటం చూస్తుంటాం. అంతేకాదు, వాళ్ళంతా మెడిసిన్, ఇంజనీరింగ్, సివిల్ సర్వీసెస్‌వంటి కోర్సులలో సులభంగా ప్రవేశం పొందగల్గుగుతారు.

ఇక అమెరికా యూనివర్సిటీలో గ్రాడ్యుయేట్‌గా ప్రవేశం పొందాలంటే వారి పద్ధతి ప్రకారం విద్యార్థికి 16 సంవత్సరాల విద్య పూర్తవ్వాలి. 16 సంవత్సరాలకన్న తక్కువ విద్య ఉన్నవారిని అక్కడ అండర్‌గ్రాడ్యుయేట్లు అంటారు. అక్కడ యూనివర్సిటీ చదువు గ్రాడ్యుయేషన్ కాబట్టి అందులో ప్రవేశానికి ఇంటర్‌తో (10+2) పన్నెండేళ్ళు, ఆపైన బి.ఇ., బి.టెక్‌లాంటి నాలుగేళ్ళ కోర్సు పూర్తిచేసిన విద్యార్థులు అర్హులవుతారు. అప్పటికి వారికి 16 సంవత్సరాల విద్య పూర్తవుతుంది.

అక్కడ ఒక్కొక్క యూనివర్సిటీకి ఒక్కొక్క పద్ధతిలో అప్లికేషన్ ఫారమ్ ఉంటుంది. కాబట్టి మొదట తాను చేరదల్చుకున్న యూనివర్సిటీకి అభ్యర్థన పంపుతూ సబ్జెక్టును సూచించి, అప్లికేషన్ ఫారమ్‌ని, తగిన సమాచారాన్ని పంపమని కోరాలి. అమెరికాలోని విద్యార్థులేకాక ప్రపంచవ్యాప్తంగా అనేక దేశాలనుంచి విద్యార్థులు ప్రవేశాన్ని కోరుతూ దరఖాస్తులు పంపుతారు కాబట్టి వారి వారి ప్రతిభలను గుర్తించడం, ఈ దేశాల విద్యాస్థాయితో ఆ దేశపు స్థాయిని సరిపోల్చి తగిన విద్యార్థిగా గుర్తించడం చాలా కష్టతరమయిన విషయం. ఈ అసౌకర్యాన్ని అధిగమించడంకోసం అమెరికాలోని అన్ని యూనివర్సిటీలు, ప్రపంచవ్యాప్తంగా అన్నిదేశాల విద్యార్థులకు వివిధ కోర్సులో ప్రవేశం కల్పించేందుకు వీలుగా కామన్ ఎంట్రన్స్ పరీక్షలు నిర్వహించే పద్ధతి రూపొందించింది. ఈ సౌకర్యం హైద్రాబాద్‌లో కూడా ఉంది. ప్రపంచవ్యాప్తంగా అనేక దేశాల్లో ఏటా నాలుగునుంచి ఆరుసార్లు ఈ పరీక్షలు నిర్వహించబడతాయి. బిజినెస్ మానేజ్‌మెంట్‌కి సంబంధించిన గ్రాడ్యుయేట్ లేదా

పి. హెచ్.డి. కోర్సు చేయగోరేవారు గ్రాడ్యుయేట్ రికార్డ్ ఎగ్జామినేషన్ (జి.ఆర్.ఇ.) (జనరల్)కి వెళ్ళాలి. అభ్యర్థులు తప్పనిసరిగా అర్హతను సంపాదించాల్సిన పరీక్ష టోఫెల్. (టెస్ట్ ఆఫ్ ఇంగ్లీష్ ఏజ్ ఎ ఫారిన్ లాంగ్వేజ్). టీచింగ్ అసిస్టెంట్‌షిప్ కోరే అభ్యర్థులు దీనికి తోడు టి.ఎస్.ఇ (టెస్ట్ ఆఫ్ స్పోకెన్ ఇంగ్లీషు) కూడా చేయాలి. అండర్ గ్రాడ్యుయేట్, గ్రాడ్యుయేట్, పోస్ట్‌గ్రాడ్యుయేట్ - ఏ కోర్సుకు అడ్మిషన్ కోరేవారైనా ఇంగ్లీషు మాతృభాష కానివారందరూ టోఫెల్ రాసితీరాలి. ఇందులో ఇంగ్లీషు వొకాబ్యులరీ, బేసిక్ గ్రామరు, వగైరాలన్నీ ఉంటాయి.

విద్యాప్రమాణాల్ని మెరుగుపరచడానికి విద్యారంగంలో రాజకీయ జోక్యానికి స్వస్తిచెప్పాలనీ, పరీక్షల పద్ధతిని వికేంద్రీకరించాలని విద్యావేత్తలు అభిప్రాయపడుతున్నారు. అసమర్థతకు, రాజకీయనాయకులకు, ప్రభుత్వానికి విద్యాసంస్థలు వీలైనంత దూరంలో ఉండాలి. నిరక్షరాస్యతా నిర్మూలననూ, జనాన్ని చైతన్యవంతం చేసే పనినీ స్వచ్ఛంద సంస్థలకు అప్పగిస్తే ఫలితాలు బాగుంటాయని వారి సూచన.

'నిరక్షరాస్యత జాతికి కళంకం' అన్నారు మహాత్మాగాంధీ. విద్య మనిషిలోని సృజనాత్మక శక్తుల్ని బహిర్గతం చేసి, మనిషిని మనీషిగా మార్చడానికి తోడ్పడాలన్నారాయన.

దేశాల ఆర్థిక ప్రగతిలో, వ్యక్తి జీవితంలో ప్రధానపాత్ర వహించే విద్య స్త్రీపురుషులిద్దరికీ ఆవశ్యకం. భావ వికాసం, అందువల్ల లభించే ఆత్మవిశ్వాసం, జీవితాన్ని నిర్దిష్టంగా మల్చుకోగలిగే ధైర్యం, త్వరితంగా మారుతున్న పెరుగుతున్న అవసరాలకు అనుగుణంగా తనను తాను తీర్చిదిద్దుకోగలిగే సామర్థ్యం విద్యవల్ల వ్యక్తికి అలవడతాయి.

'మన విద్యార్థుల్లో లోపంలేదు. ఉన్న లోపం యావత్తూ వ్యవస్థలో ఉంది. స్వతంత్ర భారతదేశపు మారుతున్న అవసరా

లకు, పరిస్థితులకు దీటుగా ఉన్నత విద్యను పునర్వ్యవస్థీకరించాలి' అన్నారు విద్యావేత్త డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్. ప్రజాస్వామ్య రాజ్యంలో నాయకత్వ పాత్రను నిర్వహించగలిగే సమర్థులుగా విద్యాలయాలు విద్యార్థుల్ని తీర్చిదిద్దాలని ఆయన ఆకాంక్ష.

విద్యను జాతి పురోగమనానికి దోహదం చేసే సాధనంగా అభివృద్ధి పరచాలని నెహ్రూ అన్నారు. కాని ఆ కృషిలో మన ప్రభుత్వాలు ఘోరంగా విఫలం అయ్యాయి. విద్య కేవలం ఉద్యోగాలకోసమే అన్న భావన విద్యార్థుల్లో, తల్లిదండ్రుల్లో పేరుకుపోయింది. సామాజిక, సాహిత్య విలువలను విద్యార్థులకి ప్రభోదించే విధంగా నూతన విద్యావిధానం రూపొందించవలసిన ఆవశ్యకత ఎంతో ఉంది. విద్యాభివృద్ధికై ఉపాధ్యాయులు ప్రత్యేక శ్రద్ధ చూపాలి. విద్యార్థులు రాజకీయాలకు అతీతంగా ఉంటూ ప్రగతిబాటలో నడిచేలా చూడాలి. మన విద్యార్థులు ప్రపంచ దేశాల్లోని ఏ విద్యార్థుల స్థాయికీ తగ్గరు. కానీ వారి ఆలోచనల్ని సరైన పద్ధతిలో ఉండేలా చూడటం ఉపాధ్యాయులు, తల్లిదండ్రుల కర్తవ్యం. మన విద్యాలయాలు భారతీయ సంస్కృతి, జీవన విధానంతో ముడిపడి ఉన్నాయి. ఆదర్శవంతంగా ఉంటూ ఆచరించి మరీ పెద్దలు విద్యార్థులకి హితబోధ చేయాలి.

గ్రామీణప్రాంతాలలో విద్యవకాశాలు తక్కువగా ఉన్నాయి. మారుమూల గ్రామాలకు విద్యను అందించటం ప్రభుత్వానికి సాధ్యపడనప్పుడు ప్రైవేటు సంస్థలు, స్వచ్ఛంద సంస్థలు, విద్యాభిమానులు ముందుకు వచ్చి ప్రైవేటురంగంలో విద్యావ్యాప్తికి కృషిచేయవలసిన అవసరం ఉంది. గ్రామాల్లో, జిల్లాల్లో మహిళలు అధికసంఖ్యలో నిరక్షరాస్యులుగా ఉన్నారు.

విద్య నేడు సామాన్యునికి అందుబాటులో లేకుండా అంగట్లో సరుకుగా మారిందనే విమర్శలు విన్పిస్తున్నాయి. అలాగాక ప్రజలందరికీ

అది అందుబాటులో ఉండేలా, విద్యార్థులంద రికీ విద్యాభ్యాసానంతరం ఉపాధి లభించేవి ధంగా విద్యావ్యవస్థని మార్చాలి. మానవతా విలువల్ని పెంపొందించి శ్రమ విలువల్ని గౌరవించేవిధంగా విద్య విద్యార్థుల్ని తీర్చిదిద్ద గలగాలి. విద్యార్థిజయమే జాతికి బలం గనుక విద్యార్థులు తమ జీవితంలో లభించిన అపూ ర్వ సమయాన్ని విద్యార్థిదశలో సద్విని యోగం చేసుకోవాలి.

విద్య సామాజిక మార్పుకు సాధనం కా వాలి. అది విద్యకు గల ఉత్తమ ఆశయాలలో ఒకటి. ఆ ఆశయసాధనకు అనువుగా విద్యాబో ధన జరగాలి. విద్యార్థులకి ఉత్తమ ఉపాధ్యా యులేకాదు, చక్కటి గ్రంథాలయాలు కూడా అందుబాటులో ఉండాలి.

ఈ శతాబ్దాంతంలోపుగా అందరికీ విద్య అనే లక్ష్యసాధనకై తగు విధానాల రూపకల్పన నిమిత్తం ప్రపంచంలోనే అధిక జనాభాగల తొమ్మిది దేశాల శిఖరాగ్ర సదస్సు ఇటీవల ఢిల్లీలో జరిగింది. మిగతా దేశాలమాటెలా ఉన్నా మనదేశంలో మాత్రం విద్యారంగం పరిస్థితి లోపభూయిష్టంగా ఉంది. ముఖ్యంగా విద్యావిషయంలో వెనుకబడిన తొమ్మిది రాష్ట్రా లలో ఆంధ్రప్రదేశ్ ఒకటని కేంద్రప్రభుత్వం నిర్ణయించింది. దేశ జనాభాలో సుమారు 45 కోట్లమందికి సంతకం పెట్టగలిగేపాటి చదువు కూడా లేదన్నది అక్షరసత్యం. రాజకీయ నా యకులంతా పదేపదే ఉద్ఘాటించినప్పటికీ అంతులేని నిర్లక్ష్యానికి గురయ్యే రంగాలలో

విద్య ఒకటి. ఇక ప్రాథమిక విద్య గురైనంత నిర్లక్ష్యానికి మరే దశ విద్య కూడా గురవటంలే దు. అసలు పునాదిలోనే లోపం ఉన్నందువల్ల లక్ష్యం నెరవేరటం కష్టం. ప్రాథమిక విద్యా రంగంలో ప్రభుత్వాలు, పంచాయితీలు, స్వ చ్ఛంద సంస్థలు, తల్లిదండ్రులు, ఉపాధ్యాయు లు సమైక్య కృషి జరిపినప్పుడే అందరికీ విద్య లక్ష్యం సిద్ధించి నిరక్షరాస్యత నిర్మూలన మవుతుంది.

విద్యారంగంలో 45 సం॥లుగా విశిష్టసేవలందిస్తున్న

# శ్రీరామా రూరల్ కళాశాల (గురుకులము)

## చిలుమూరు-522 301, తెనాలి R.M.S. గుంటూరుజిల్లా



శ్రీ సుబ్బయ్యగారు



SRIRAMA RURAL COLLEGE,
CHILUMURU – GUNTUR (Dt.)



శ్రీ మధుసూధనరావుగారు

ఓ రంగంలో ఓ వ్యక్తికిగాని, ఓ సంస్థకుగాని సుదీర్ఘ చరిత్ర ఉన్నదంటే అది ఆ వ్యక్తికిగాని, ఆ సంస్థకుగాని ఎంతైనా గర్వకారణమే. రానున్న 1994-95 విద్యాసంవత్సరం ప్రారంభంలో చిలుమూరు, **శ్రీ రామా రూరల్ కళాశాల (గురుకులము)** 46వ విద్యాసంవత్సరంలోనికి ప్రవేశించినది. ఈ శుభతరుణంలో నాటినుండి నేటివరకు తనతో సహకరించిన ప్రతి ఒక్కరికి కృతజ్ఞతలను తెలుపుతున్నది.

అది నవభారత రాజ్యాంగం తుదిమెరుగులు దిద్దుకుంటున్న తరుణం. నిరక్షరాస్యత నిర్మూలన అధికరణం మన రాజ్యాంగంలో చోటుచేసుకొంటున్న సమయం. విద్యార్థిలోకంలో అంతర్గతంగానున్న శక్తియుక్తులను వెలికితెచ్చి తద్వారా వారి మానసిక, శారీరక అభ్యున్నతికి తోడ్పడాలన్న ధ్యేయంతో 1949 జూన్ 6న తెనాలి పట్టణానికి తూర్పుగా 16 కిలోమీటర్ల దూరంలో కృష్ణానది ఒడ్డున ఉభయ రామేశ్వర క్షేత్రానికి స్థానమైన చిలుమూరు గ్రామంలో నిర్మలమైన ప్రశాంత వాతావరణంలో పచ్చని ప్రకృతిమధ్య **శ్రీ కొలసాని వెంకటసుబ్బయ్య చౌదరిగారిచే** ఈ కళాశాల నెలకొల్పబడినది. **1950–'51**లో దీనికి అనుబంధంగా శ్రీ నెహ్రూ హాస్టలు కూడా ఏర్పాటుచేయబడినది. నాటినుండి అవిరళకృషి సల్పుతూ విద్యార్థులయొక్క, వారి తల్లిదండ్రులయొక్క సహకారంతో విద్యార్థులకు విద్యాసౌకర్యాన్ని కలుగచేస్తూ రాష్ట్రంలోని అన్నిప్రాంతములవారికి ప్రయోజనకారియై అత్యుత్తమ ఫలితాలతో అత్యున్నత విద్యాప్రమాణాలతో దినదిన ప్రవర్ధమానమవుతూ అందరి ఆదరాభిమానములకు పాత్రమై ప్రైవేటు విద్యారంగంలో అగ్రగామి సంస్థగా వెలుగొందుతున్నది. 5వ తరగతినుండి 10వ తరగతివరకు తెలుగు, ఇంగ్లీషు మీడియములలో వేలమంది విద్యార్థులు క్రమశిక్షణతో శిక్షణపొంది వారి ఉత్తమ భవితకు పునాదులు వేసికొని ఉన్నతవిద్యను కొనసాగించి దేశవిదేశాలలో ఇంజనీర్లుగా, డాక్టర్లుగా, ప్రొఫెసర్లుగా, లాయర్లుగా, పరిణితి చెందిన రాజకీయ నాయకులుగా, బిజినెస్ మాగ్నెట్స్‌గా రాణిస్తున్నారు. మంచి మార్కులు పొందటమే గాకుండా ఫస్టురాంకులతో పాటు అనేక విశిష్టస్థానాలను చేజిక్కించుకొని నేషనల్ మెరిట్ స్కాలర్‌షిప్స్ పొందియున్నారు.

సమాజంలో వ్యక్తి వ్యక్తిగా గౌరవింపబడాలంటే విద్య విజ్ఞానంతోపాటు క్రమశిక్షణ చాలా అవసరం. వినయ విధేయతలచేత, సౌశీల్యాది సద్గుణ సంపదలచేత విద్య రాణిస్తుంది. సౌశీల్యము, సత్ప్రవర్తన లేని విద్య **నిరుపయోగమ**నిగదా పెద్దలు చెప్పేది. అందుకే ముందు క్రమశిక్షణకు ప్రాధాన్యమివ్వటం, తద్వారా విద్యార్థిని విద్యావంతునిగా, సచ్ఛీలునిగా చేయటం కళాశాల ప్రధాన ఆశయం. కళాశాలకు అనుబంధంగా 1979లో **'కొలసాని వెంకటసుబ్బయ్య చౌదరి శ్రీరామా రూరల్ రెసిడెన్షియల్ జూనియర్ కళాశాల'** ఏర్పడినది. 1988లో కంప్యూటర్ సెంటర్ కూడా నెలకొల్పబడినది.

**ఈ గురుకుల ప్రాంగణంలో 5వ తరగతినుండి ఇంటర్మీడియట్‌వరకు తెలుగు, ఇంగ్లీషు మీడియములలో రెగ్యులర్ శిక్షణపొందే అవకాశమున్నది.**

| Year | Appeared | | I Class | | II Class | | III Class | | Passes | No. APRJC seats secured |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | E.M. | T.M. | E.M. | T.M. | E.M. | T.M. | E.M. | T.M. | | |
| 1990–91 | 35 | 84 | 34 | 70 | 1 | 14 | – | – | 100% | 2 |
| 1991–92 | 44 | 82 | 41 | 54 | 3 | 24 | – | 4 | 100% | 7 |
| 1992–93 | 46 | 132 | 32 | 73 | 11 | 36 | 1 | 13 | 93.2% | 2 |

**డైరెక్టర్**
శ్రీరామా రూరల్ కళాశాల (గురుకులము)
చిలుమూరు-522 301, గుంటూరుజిల్లా.



విద్యావ్యాప్తిలో భాగంగా ముఖ్యంగా దళితుల్ని విద్యావంతుల్నిగా తీర్చిదిద్దటం చాలా అవసరం. విద్య అనే గొప్ప శక్తి వారికి అందితే సమాజంలో వారు తమ స్థానాన్ని పదిలపరుచుకుంటారు. బలహీనవర్గాల్ని, దళితుల్ని విద్యావంతులుగా తీర్చిదిద్దినప్పుడే సమాజం అభివృద్ధిచెంది సామాజికమార్పు వస్తుంది.

విద్యావ్యాప్తికి మరొక ప్రముఖమైన అంశం ఉపాధ్యాయుల్లో చిత్తశుద్ధి. విద్యార్థుల్ని సమాజానికి ఉపయోగపడే వ్యక్తులుగా తీర్చిదిద్దటంలో ఉపాధ్యాయుల పాత్ర ఎంతో ఉంది. ఇందుకు అవసరమైన పాఠ్యాంశాలు, మానసిక వికాసానికి వ్యాయామం, క్రీడలు అవసరం.

మనిషిని మనీషిగా తీర్చిదిద్దవలసిన ఉపాధ్యాయులకు ఉద్యోగభద్రతవలన కావచ్చు ఇటీవలి సంవత్సరాల్లో కొంత నిర్లక్ష్యవైఖరి పెరిగింది. విద్యార్థుల్ని తీర్చిదిద్దటంతోపాటు వారు సమాజంలోని వ్యసనాలకు వ్యతిరేకంగా కృషి చేయాల్సిన అవసరం ఉంది. ప్రభుత్వ విద్యాసంస్థల్లో ఫలితాలు తగ్గడానికి ఉపాధ్యాయులేగాక ప్రభుత్వ బాధ్యత కూడా ఉంది. ఉపాధ్యాయుల పనితీరుపై సరైన పర్యవేక్షణ లేకపోవటం కూడా వైఫల్యాలకి కారణం. వీటన్నిటినీ చక్కదిద్దుకుంటూ పిల్లల భవిష్యత్తునేగాక వారి ఇష్టాయిష్టాలను కూడా దృష్టిలో ఉంచుకోవాలి. అప్పుడే మన విద్యారంగం ఫలవంతంగా పురోగమిస్తుంది.

**-జ్యోతిరాణి**

చతుర ఫీచర్

# కోవెలల కూటమి కుంభకోణం

పుష్కరుడు ప్రవేశించిన నదిలో స్నానంచేస్తే పాపాలు తొలగి సద్గతి లభిస్తుందనే విశ్వాసం జనంలో వ్యాపించి ఉంది. ప్రతి సంవత్సరం పుష్కరుడు ఒక పుణ్యనదిలో ప్రవేశిస్తాడని పురాణాల కథనం. గంగానదికి పుష్కరాలు వచ్చినపుడు ఉత్తరాదిలోని హరిద్వార్‌లో 'కుంభమేళా' జరుగుతుంది. అలాగే దక్షిణాదిలోని కుంభకోణంలో కూడా కుంభమేళా జరుగుతుంది. పన్నెండు సంవత్సరాలకొకసారి విభిన్నమైన తిథులలో ప్రయాగ, హరిద్వార్, వారణాసి, కురుక్షేత్రం, ఉజ్జయిని, విజయవాడ, రాజమండ్రి మొదలైన ప్రాంతాల్లో గంగా, గోదావరి, కృష్ణా మొదలైన నదులకి పుష్కరాలు వస్తాయి.

కుంభకోణంలో గత సంవత్సరం ఫిబ్రవరి 18న కుంభమేళా జరిగింది. ఈ ఉత్సవానికి నలభై లక్షలకుపైగా ప్రజలు హాజరయ్యారు. ఈ నగరానికి కుంభకోణం అనే పేరు రావడానికొక కథనం చెబుతారు. ప్రళయవేళలో బ్రహ్మదేవుడు తన సృష్టివినాశమవటం చూసి బాధపడతాడు. శివుని సలహాపై ఒక కుంభాన్ని అంటే మట్టికుండని తయారుచేసి అమృతంతో నింపుతాడు. నాలుగు వేదాలను అందులో దాచి కొబ్బరి ఆకులతో మూసివేసి మేరుపర్వత శిఖరంపై పెట్టాడు. ప్రళయం సంభవించినప్పుడు ఈ కుంభం దక్షిణాదివైపుకు కొట్టుకుపోయింది. శివుడు వేటగాని రూపంలో వచ్చి బాణంతో ఈ కుంభాన్ని కొట్టగా అది పగిలి లోపల ఉన్న అమృతం, వైదిక జ్ఞానం పక్కనున్న మహాంకం అనే చెరువులోకి పడిపోయాయి. అప్పటినుండి ఈ స్థలానికి కుంభకోణం అనే పేరు వచ్చింది. ఈ ప్రదేశంలోనే సూర్యుడు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులని ఆరాధించినందుకు భాస్కరక్షేత్రం అని కూడా అంటారు. కుంభమేళాలో ఉత్సవం వేలాది సంవత్సరాలుగా జరుగుతోంది. ఆరోజున సౌరమండలంలో సూర్యుడు కుంభరాశిలో ప్రవేశిస్తాడు. 12 సంవత్సరాల అనంతరం గురువు సింహరాశిలోకి ప్రవేశిస్తాడు. సూర్యుడు, గురు, చంద్రులు ఒకేపంక్తిలో కనిపిస్తారు. సూర్యచంద్రుల్ని గురువు దర్శించుకుంటాడు.

పూర్ణిమరోజున సూర్యుడు కుంభరాశిలో ప్రవేశించగానే మఘనక్షత్రం తన స్థానాన్ని గ్రహిస్తుంది. కుంభకోణంలో మహామఖం చెరువు పవిత్ర జలాలతో నిండిపోతుంది. ఆ రోజున గంగ, యమున, కావేరి, కృష్ణ, సరస్వతి, గోదా






వరి, నర్మద, తుంగభద్ర మరియు సరయూ నదులు భూగర్భంద్వారా ప్రవహించి మహామఖం చెరువులో కలుస్తాయి. అందుకే ఆరోజున మహామఖంలో స్నానంచేస్తే మనదేశంలోని అన్ని పవిత్ర నదుల్లో స్నానంచేసిన సౌభాగ్యం ప్రాప్తిస్తుందని ఆస్తికులు దృఢంగా విశ్వసిస్తారు.

బ్రహ్మ ప్రతిష్ఠించిన కుంభం మహామఖంలో దొర్లిపడేటప్పుడు కొన్ని అమృతబిందువులు చెరువుకు దగ్గర్లోనే పారుతున్న కావేరి, అరసలార్ నదులలో కూడా పడి కలిసిపోయాయి. అందుకే కావేరి, అరసలార్ నదుల్లో స్నానం చేస్తే పుణ్యం వస్తుందని ప్రజలంతా వాటిల్లో స్నానం చేస్తారు. కావేరి నది చిత్రమైన మలుపు తిరుగుతుంది. కనుక ఈ స్థలానికి కుంభకోణం అని పేరు వచ్చిందని అంటారు.

కుంభకోణంలో పుష్కరాలు కొన్నిసార్లు పన్నెండేళ్ళకి బదులు పదకొండేళ్ళకే వస్తాయి. భూమి సూర్యునిచుట్టూ ప్రదక్షిణ చేయడానికి 365 రోజులు పట్టినట్లే గురువు సూర్యునిచుట్టూ తిరగడానికి 4332 రోజులు పడతాయి. ఈ పరిభ్రమణం నిజానికి పన్నెండేళ్ళకు ముందే అంటే పదకొండేళ్ళ 868 రోజుల్లో పూర్తవుతోంది. అందుకే కుంభమేళా కొన్నిసార్లు పదకొండేళ్ళకు వస్తుంది. 1956లో కూడా పుష్కరాలు పదకొండేళ్ళకే వచ్చాయి.

దక్షిణాదిలో అత్యంత సుందర ప్రదేశమైన కొడైకెనాల్లో ఒక విచిత్ర సంఘటన జరుగుతుంది. కురంజీ అనే పుష్పం 12 సంవత్సరాల తరువాత వికసిస్తుంది. సౌరమండలంలో జరిగే ఒకానొక మార్పువలన ఆకాశంలో 'సన్‌స్పోటసీ' ఉత్పన్నమవుతుంది. దీనివలన వాతావరణంలో పరివర్తనం రాగా కురంజీ పూవు వికసిస్తుంది. అందుకే ఈ పుష్పవికాసానికీ కుంభమేళాతో సంబంధం ఉందంటారు పరిశీలకులు. 16వ శతాబ్దపు ఉత్తరార్థంలో తంజావూరు నేలిన రఘునాథ నాయకుని కాలంలో ఈ కుంభమేళాను అత్యంత వైభవంగా నిర్వహించేవారు. రఘునాథ నాయకుని స్వర్ణంతో, స్వర్ణముద్రికలతో తులాభారం చేసి ఆ బంగారాన్ని పేదలకు దానంచేశారని చరిత్ర చెబుతోంది.




## కుంభకోణంలోని మందిరాలు:

రెండువేల సంవత్సరాలకు పూర్వంనుండే ఈ పట్టణం తమిళనాడులో ప్రసిద్ధిపొందింది. కుంభకోణానికి 'ఆలయాల నగరం' అనీ, 'దేవ నగరం' అనీ పేర్లున్నాయి ఇక్కడ 43 ఆల యాలున్నాయి. వీటిలో 34 శైవసాంప్రదాయా లతో, 9 వైష్ణవసాంప్రదాయాలతో ఉన్నాయి.

## ఆది కుంభేశ్వరాలయం:

కుంభకోణంలో ఆది కుంభేశ్వరాలయం ప్ర ముఖమైంది. అమృతంతో నిండిన కుంభం ఈ నగరానికి దొర్లుతూ వచ్చినప్పుడు శివుడు మట్టితో శివలింగం సృజించి దానిపై పెట్టాడు. తను కూడా అందులో ప్రవిష్టుడయ్యాడు. అప్ప టినుండి ఆయన ఇక్కడ ఆదికుంభేశ్వరుడనే పేరుతో ఆరాధనలందుకుంటున్నాడు. నగ రంమధ్యలో ఈ గుడి ఉంది. దీని శిఖరగో పురం తొమ్మిది అంతస్థులతో ఉంది. దీన్ని రాజగోపురం అంటారు. ఈ శిఖరం వెనుకవైపు ఆలయపుష్కరిణి ఉంది. ఈ పుష్కరిణికి ఒక వైపు చెక్కతో తయారుచేసిన వినాయకుని ప్రతిమ, మరొకవైపు వెండితో మలచిన వినా యకుని ప్రతిమలు ఉన్నాయి. ధ్వజసంభానికి రెండువైపులా రెండు స్థంభాలపై వీరభద్రుని ఆకృతులు చెక్కబడి వున్నాయి. ఇవి అత్యంత ఆకర్షణీయమైనవి.

మందిర వివరాలన్నీ ఆలయకుడ్యాలపై చెక్కారు. తేలు, బల్లి రూపాలు శిల్పాలలో తీర్చిదిద్దారు.

## సారంగపాణి మందిరం:

వైష్ణవాలయాలలో సారంగపాణి ఆలయం ప్రముఖమైంది. ఆదిశేషునిపై అర్థశయనావ స్థలో విష్ణుమూర్తి ఇక్కడ దర్శనమిస్తాడు. లక్ష్మీ దేవి ఇక్కడ దేవికోమలవల్లి అనే నామంతో పూజలందుకుంటోంది. ఈ ఆలయశిఖర గో పురం 150 అడుగుల ఎత్తులో ఉంది. శిల్పక ళకు ఈ గుడి పెట్టింది పేరు. ఆలయానికి ఉత్తరాయణద్వారం, దక్షిణాయన ద్వారం అని రెండు ద్వారాలున్నాయి. సూర్యుడు ఉత్తరాయ ణంలో ఉన్నప్పుడు ఉత్తరాయణద్వారంగుండా గుడిలోకి ప్రవేశం ఉంటుంది. దక్షిణాయనంలో సూర్యుడు ఉన్నప్పుడు దక్షిణాయనద్వా రంద్వారా ప్రవేశం వుంటుంది. రథ



యాత్రకోసం ఆలయంలో ఒక విశాలమైన రథం ఏర్పాటుచేశారు. చెక్కతో తయారైన ఈ రథంపై ఆకర్షణీయమైన చిత్రాలు చెక్కివున్నాయి.

### చక్రపాణి ఆలయం:

ఇదికూడా వైష్ణవాలయమే! సారంగపాణి తమ్ముడే ఈ చక్రపాణి. ఈ గుడిలో హరిహరులను ఏకంచేసే ప్రయత్నం కనిపిస్తుంది. శివునిలా చక్రపాణికి మూడు కళ్ళున్నాయి. అందుకే ఆయన్ని రుద్రేశ్వరుడని కూడా అంటారు. ఒకప్పుడు గర్వితుడైన సూర్యుడు తన దేదీప్యమానమైన ప్రకాశంతో, చండప్రచండ కిరణాలతో చక్రపాణిని భయపెట్టడానికి ఎదురుగా వెళ్ళాడు. చక్రపాణి తన చక్రం సాయంతో ఆ కిరణాలు తిరిగి సూర్యునికే తగిలేలా చేశాడు. దాంతో సూర్యుడు అంధుడయ్యాడు. ఆ తరువాత ఆయన చక్రపాణిని ఆరాధించి వరప్రసాదితుడై తిరిగి తన చూపుని పొందాడని పురాణాల కథనం. కన్నెపిల్లలు ఈ కోవెలకి వచ్చి మంచి వరునికోసం ప్రార్థిస్తే ఆశ నెరవేరుతుందని ఇక్కడ విశ్వసిస్తారు. ఈ మందిరంలో పూజకు బిల్వపత్రాలు, పసుపు, కుంకుమల్ని వాడతారు.

### స్వామి మలయమందిరం:

కుంభకోణంనుండి ఆరు కిలోమీటర్ల దూరంలో కార్తికేయుని మందిరం ఉంది. తమిళనాడులో కుమారస్వామికి షణ్ముఖ, మురుగా, ఆర్ముగం, సుబ్రహ్మణ్యం, స్వామినాథన్, వేలన్, పళని-అప్పన్, కార్తికేయన్ మొదలైన అనేక నామాలతో ఎన్నో ఆలయాలున్నాయి. వీటిలో అర్చనలు జరుగుతుంటాయి. శివపార్వతుల తనయుడైన కుమారస్వామి తమిళులకు అత్యంత ప్రియమైన ఆరాధ్యదైవం. శైవమతానుయాయులు దక్షిణాదిలో తల్లిదండ్రులకు బదులుగా పుత్రునికే ప్రాముఖ్యం ఇస్తారు ప్రసిద్ధిచెందిన కార్తికేయుని ఆలయాల్లో స్వామి మలయమందిరం ఒకటి. ఇక్కడ కార్తికేయుడు స్వామినాథుడనే పేరుతో పూజలందుకుంటున్నాడు. ఆయన ఇక్కడ శివునికి, బ్రహ్మకు ప్రణవమంత్రం ఉపదేశించి ఓంకార జ్ఞానం కలిగించాడు. ఇక్కడే ఇంద్రునికి స్వా




మినాథుని దీవెనలు లభించాయి. తనకు వరాలిచ్చిన స్వామినాథునికి ఇంద్రుడు ఐరావతాన్ని కానుకగా సమర్పించుకున్నాడు. అందుకే అంతటా కార్తికేయుని వాహనం నెమలి అయినా ఇక్కడమాత్రం ఐరావతమే కనిపిస్తుంది. స్వామి మలయమందిరం ఎత్తు 60 అడుగులు. పైకి వెళ్ళడానికి 60 మెట్లు ఎక్కవలసి ఉంటుంది. మొదటిమెట్టుపై కొబ్బరికాయ కొట్టి పై మెట్లెక్కటం ఇక్కడి ఆచారం.

28వ మెట్టుదగ్గర ఒక మండపం కనిపిస్తుంది. అందులో బాలకుమారస్వామి శివుని ఒడిలో కూర్చుని తండ్రిచెవిలో ఓంకార ప్రణవమంత్రోపదేశం చేస్తున్నాడు. శివుని పాదాలచెంత నంది ఉంది. దానికి ఇరువైపులా బ్రహ్మ, విష్ణు, నారదుడు, అగస్త్యుడు మొదలైనవారి విగ్రహాలున్నాయి. పైకి చేరాక నేత్రవినాయకుని గుడి కనిపిస్తుంది. ఇక్కడ గణేశుని పూజించటంవలన నేత్రవ్యాధులు నశించి కళ్ళకు కొత్తకాంతి వస్తుందని భక్తులు విశ్వసిస్తారు.

స్వామి మలయమందిరమేగాక ఇక్కడి కాంస్యవిగ్రహాలు జగత్ప్రసిద్ధి పొందాయి.

కాంస్యశిల్పులు తరతరాలుగా, వేలాది సంవత్సరాలనుండి ఇక్కడ నివాసమేర్పరుచుకొని విగ్రహాల్ని మలుస్తున్నారు. వీరిని స్థపతులని అంటారు. వంశపారంపర్యంగా విగ్రహాల్ని మలిచే విద్య వీరికి వస్తోంది. కళారహస్యాల్ని తండ్రినుండి కొడుకు, గురువునుండి శిష్యుడు పొంది తమ జీవితకాలంలో ఆ కళకు అంకితమై తన పుత్రునికో, శిష్యునికో శిల్పకళారహస్యాల్ని నేర్పుతున్నారు. శతాబ్దాల తరబడి కళను నిత్యనూతనంగా ఉంచిన ఘనత స్థానిక స్థపతులదే! వీరికి ప్రభుత్వం తగిన ప్రోత్సాహాన్ని అందిస్తోంది. స్వామి మలయలో నిర్మితమైన ధాతుప్రతిమలు ప్రపంచమంతటా సంగ్రహాలయాలలో ప్రదర్శింపబడుతున్నాయి. ఆలయాల్లో కొలువుతీరి హారతులందుకుంటున్నాయి.

## శ్రీరామస్వామి మందిరం:

ఈ మందిర నిర్మాణం తంజావూరు పాలకుడు విజయరాఘవ నాయకుని పాలనలో జరిగిందంటారు. ఇక్కడ శ్రీరాముడు పరబ్రహ్మ తత్వరూపంలో కొలువుతీరాడు. ఈ అపురూపమైన ఆలయంలో రామకథ రాతిప్రతిమల ద్వారా చెప్పబడింది. ఇక్కడి హనుమంతుడు ఓ సంగీత శిక్షకునిలా దర్శనమిస్తాడు. ఆయన చేతిలో వీణ ఉంది. దీనివల్ల కుంభకోణం ఈనాడేకాదు, కొన్ని శతాబ్దాలుగా కళలకు, సంగీత పిపాసువులకు కేంద్రంగా ఉందని తెలుస్తోంది.

## కాశీవిశ్వనాథ మందిరం:

ఈ ఆలయంలో విశ్వనాథునికే గాక తొమ్మిది పవిత్ర నదులకీ పూజలు జరగటం విశేషం. కుంభమేళారోజు మహామఖం చెరువులో ప్రవిష్ఠమైన 9 నదులకీ ప్రతిమలున్నాయి ఇక్కడ. 7వ శతాబ్దానికి చెందిన అప్పర్ ఇక్కడ స్నానం చేసి నదుల వర్ణనతో పూజాపద్ధతిని అద్భుతంగా రాశాడు.

ఇవేగాక కుంభకోణం పరిసరాలలో చోళుల కాలంనాటి సుందరమైన ఆలయాలు ఉన్నాయి. కుంభకోణానికి 2 కిలోమీటర్ల దూరంలో దారాసురం అనే ఊరుంది. దారాసురం లేక దారాపురానికి పూర్వం పేరు రాజరాజపురం. దీనిని 12వ శతాబ్దంలో రెండవ రాజరాజ చోళుడు నిర్మించాడు. చోళులు కట్టించిన ఆలయాల్లో ఇది అపూర్వమైంది.







**త్రిభువనమ్:**

కుంభకోణంకి దగ్గర్లోనే 'త్రిభువనం' ఉంది. ఇక్కడ త్రిభువన వీరేశ్వరుని ఆలయం ఉంది. దీనిని 12వ శతాబ్దంలో రెండవ కులోత్తుంగ చోళుడు కట్టించాడు. ఇది తంజావూరులోని బృహదీశ్వరాలయాన్ని పోలి వుంటుంది. ఈ మందిరంలోని విగ్రహాలన్నీ మెరుస్తుంటాయి. త్రిభువనం అందమైన పట్టుచీరలకు ప్రసిద్ధి. కాంచీపురంలో లభించే పట్టువస్త్రాలలాగే ఇవీ ఎంతో మన్నికైనవి.

## కుంభకోణానికి వెళ్ళటం ఎలా?

మద్రాసునుండి రైల్లో కుంభకోణానికి చేరుకోవచ్చు. లేదా తంజావూరునుండి రైల్లో ఇక్కడికి రావచ్చు. కుంభకోణాన్ని దర్శించాక సందర్శకులు నాగపట్టణానికి తప్పనిసరిగా వెళ్తారు. నాగపట్టణం మూడు మతాల సంగమస్థానం కావటం గమనించాలి. ఇక్కడి వేలాంకనిలో మేరీమాత చర్చి వుంది. ఈ మాత మహిమలు గలదని చెబుతారు. ఈమె ప్రేమ, దయలకు సాగరంవంటిదంటారు. సత్యమైన మనసుతో, మనస్ఫూర్తిగా మాత శరణువేడితే ఆర్తులకు ఆమె అవశ్యం సాయపడుతుంది. ఏ ధర్మానుయాయులైనాసరే, అన్యమతాలవారైనాసరే మాత సన్నిధిలో ఓ కొవ్వొత్తి వెలిగించి మరీ వస్తారు.

ఆ తరువాత దర్శించదగిన ప్రదేశం నాగోర్‌లోని దర్గా. ఇక్కడ వందలాది సంవత్సరాలుగా ఒక సూఫీసంతు కృప దీనులపై ప్రసరిస్తూ ఆపదలు నివారిస్తోంది. అన్ని మతాలవారూ ఇక్కడికి వస్తుంటారు. ఆ మహాత్ముని సన్నిధిలో తల వంచి ప్రణతులర్పించి ఓ అగరొత్తి వెలిగిస్తారు.

ఈ రెండు ప్రదేశాల తరువాత తిరునల్లార్‌లోని శనేశ్వరుని ఆలయం సందర్శించదగింది. ఏలిననాటి శని, రోగాలు, కష్టాలు బాధించినప్పుడు శాంతికోసం ఇక్కడి శనేశ్వరుని అర్చిస్తే బాధలు తొలగిపోతాయంటారు. ఈ గుడికి కూడా అన్ని మతాలవాళ్ళు వచ్చి శనికి పూజలు చేస్తుంటారు.

దీనినిబట్టి ఏకత్వంలో భిన్నత్వం భిన్నత్వంలో ఏకత్వం మనదేశానికి పరిమితమైన ప్రత్యేకతేమోనని అనిపించకమానదు!

**-జ్యోతిరాణి**

# చతుర

సంపుటి: 17 సంచిక: 3 ఏప్రిల్ 1994

● ఆ తోటలో చెట్టు-గట్టు, పుట్ట-పిట్ట అన్నీ ఆమె ఆప్తులే.

తల్లి ప్రేమకు దూరమై... ఎప్పుడూ తనదైన ఓ ఒంటరి ప్రపంచంలో బతికే పదమూడు సంవత్సరాల ఆ అమాయకురాలికి...

ఎన్నడూ చూడని ఓ వింతలోకాన్ని చూపించి, భయపెట్టి... బులిపించి... మొగ్గలోనే ఆమె జీవితాన్ని నలిపి, నాశనం చేశాడు ఓ కామాంధుడు.

గాలితో, ధూళితో మాట్లాడే ఆ అమాయకురాలు తననేమీ చెయ్యలేదన్న ధీమాతో ధైర్యంగా తిరిగే అతడిని... కాలంతోపాటు ఎదిగిన ఆమె... అధఃపాతాళానికి అణగదొక్కుతూ విధించిన శిక్ష ఎలాంటిది?

వావివరసలు మరచి పశుబలంతో పసిపిల్లలను సైతం చెరబట్టే రాక్షసుల జీవితాలకి సాక్షరరూపం వసంతలక్ష్మి రచన 'ప్రతీకారం' ఈ నెల చతుర సమగ్ర నవల.

# ప్రతీకారం

## వసంతలక్ష్మి

"అదిగో... అదే ఆ గ్రీన్ గేట్ ముందాపు" అని ఆమె అంటూండగానే ఆ గేట్ ముందాగింది టాక్సీ.

కిందకి దిగి ఒక్కక్షణం మూసివున్న గేట్ వంక చూసి టాక్సీకి ఆనుకుని అలాగే నిలబడి పోయిందామె. డ్రైవర్ ఆశ్చర్యంగా చూశాడు. టాక్సీలో ఎక్కిన క్షణంనించీ త్వరగా పోని మ్మంటూ తొందరచేసిన ఆ అమ్మాయి టాక్సీ దిగాక అలా తీరిగ్గా నిలబడిపోవడం ఆశ్చ ర్యంగా వుందతనికి. అనుకున్న సమయానిక న్నా ఓ అరగంట ఆలస్యమే అయింది. అయినా ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్టు నిలబ డిపోయిన ఆమె గేట్ బయట పార్క్ చేసివున్న కార్లను చూసింది. కలలోంచి బయటపడ్డ ట్టుగా ఓసారి ఉలికిపడి టాక్సీ బిల్ పే చేసి మెల్లగా గేట్ వైపు కదిలింది.

'ఎప్పటికీ... ఎప్పటికీ ఈ గేట్‌దాటి లోపలకు వెళ్లకూడదనే అనుకున్నాను... కానీ వెళ్లాలి. వెళ్లక తప్పదు' అనుకుంటూ వీలైనంత నిశ్శ బ్దంగా గేట్ తీసింది. పదిగజాల దూరంలో ఎత్తరుగు... పది పదిహేను మెట్లు.

అప్రయత్నంగానే గడ్డం కింద తడుము కుంది. మూడంగుళాల మచ్చ. ఈ మెట్ల మీదే కదూ పడి తగిలించుకుంట. మెట్లెక్కుతూనే చిన్న గ్రిల్స్ వరండా... వెనకాల పెద్ద హాలు. హాలు తలుపు దగ్గరగా వేసివుంది. శబ్దం కాకుండా మునివేళ్ల మీదనడిచి తలుపు ముందో క్షణం ఆగి తిన్నగా తలుపు తోసింది. హాలంతా అప్పటికే జనంతో నిండిపోయి వుంది. చాలామంది నించునే ఉన్నారు. మనో హిత లోపలికి అడుగు పెట్టింది. ఎవరో గుసగు సగా మాట్లాడుతున్న అలికిడి. కదలకుండా నిల్చుని అక్కడున్న జనాలను చూడనా రంభించింది.

వీళ్లందరూ... దగ్గర, దూరపు బంధువులూ స్నేహితులే! శత్రువులు కూడా వుండొచ్చు. తల దగ్గర వెలుగుతున్న దీపం.

వెన్నెల వరదాలాంటి వల్పుటి గుడ్డకింద సన్నగా అస్థిపంజరంలా కుంచించుకుపో యిన శరీరం. అవును మరి... తొంభై ఏళ్ల శరీరం. పెద్దగా దుఃఖపు ఛాయలు కనిపించక పోయినా అక్కడున్న వాళ్లు గుసగుసలుగా మాట్లాడుకుంటూనే వున్నారు. వాళ్లందరూ ఒక ర్నొకరు బాగా ఎరుగున్నవాళ్లే. కలిసి చదువుకో డమే కాదు... ఒకే ఇంట్లో పెరిగారు. ఆ వంశవృక్షానికి పూచిన పూలే వాళ్లంతా. సోమ యాజుల కృష్ణమూర్తిగారంటే చాలు... వారి వంశం విరగబూసిన పున్నాగ చెట్టులాంటిది. అందులోనూ కృష్ణమూర్తిగారంటే సింహస్వ ప్నమే. అందుకు కారణం అతను సంపా దించిన ఆస్తులే.

మనోహిత ముందుకు కదిలింది. మనిషికీ మనిషికీ మధ్యన మిగిలిన స్థలంలో చురుగ్గా కదులుతూ ముందుకు నడిచింది.

శవం చుట్టూరా కూర్చుని వున్నారు కుటుంబ సభ్యులు. ఒక్కొక్కళ్లనీ చూస్తూనే గుర్తు పట్టేసింది. ఎంత ఆశ్చర్యం. ఒక్కళ్లంటే ఒక్కళ్లు... ఒక్కళ్లు కూడా మారలేదు. ఎందుకు? వాళ్లెందుకు మారాలి. ఈ ఇంటి నించి దూరంగా సుదూరంగా పారిపోయింది తనే! వాళ్లంతా ఎక్కడివాళ్లక్కడ సురక్షితంగా కడుపులో చల్ల కదలకుండా ఏళ్లకేళ్లు బతికేసా రు. ఎందుకు మారతారు?

"ఆ మనిషిలోని పట్టుదలను మెచ్చుకు తీరాలండీ. యాభై ఏళ్లొస్తే చాలు ఎప్పుడు కూచుని తిందామా అని చూసే తరం మనది. అరవై ఆరో యేట జీవితంలోకి తొలిసారి అడు గు పెడుతున్నట్టు కన్‌స్ట్రక్షన్ వర్క్స్ ప్రా రంభించారు. ఈ ఇరవై అయిదేళ్లలో కోట్లు సంపాదించాడు. ఎప్పుడు ఏం చెయ్యాలి? ఎవరికి ఏం కావాలనేది బాగా తెలిసిన మనిషి. కావాలనుకున్నది సాధించేందుకు ఏం చె య్యాలో బాగా తెలిసినవాడు అదే అతని విజయ రహస్యం!"

అలవాటయిన ఉపన్యాసాల ధోరణిలో మాట్లాడుతున్నాడు మునిసిపల్ ఛైర్మన్.

రామారావ్ వినటం మానేసాడు. అది ఆయన గొప్పతనమా? ఏది? ఇరవై సంవత్సరా లుగా ఒంటరిగా బతకడమా? ఇరవై ఏళ్లుగా రక్తమాంసాలను ధారపోసి తన అపురూప టెక్స్ టైల్స్‌ను దేశంలోనే చెప్పుకోదగినదిగా తయా రు చెయ్యడమా? ఏది గొప్పతనం? కూతుళ్లనూ కొడుకులనూ ఎవరిదారిన వాళ్లు బతకండని




శాసించి స్థిరపడిన కంపెనీని కొడుకు భుజాల మీదకు బలవంతంగా నెట్టేయడమా? రామారావు ఇరవై సంవత్సరాలుగా మందుల కంపెనీ కోసం ఉక్కిరిబిక్కిరై పోవడమా? మున్సిపల్ ఛైర్మన్ ఉపన్యాసం సాగిపోతూనే వుంది.

"దీక్ష అంటే ఆయనదే! మొట్టమొదటిసారి ముప్ఫై ఏళ్ల క్రితం అనుకుంటా ఆయనతో మొదటి పరిచయం. అప్పుడెలా వున్నాడో ఇప్పుడూ అలాగే! శాంతానికి పెట్టింది పేరు. ముప్ఫై ఏళ్లలో ఆస్తిని ముప్ఫైరెట్లు చేశాడు. అయినా మనిషిలో అదే వినయం... అదే సహనం... అదే శాంతం" కామేశ్వరి అసహనంగా కదిలింది.

సహనం! ఎవరికి? నాన్నగారికా? ఆరవై ఏళ్ల క్రితం 'నేను బావని తప్ప మరొకరిని పెళ్లి చేసుకోను' అని చెప్పినప్పుడు శాంతానికి పెట్టింది పేరైన ఆయన రౌద్రత చూడాల్సిందే. పిల్లలు మాట వినట్లేదని ఏమాత్రం స్ఫురించినా ఆయన కోపం అగ్ని పర్వతంలా... ఆ గర్జనలు...

అప్పుడూ అలాగే తనని తిట్టిన తిట్టు తిట్టకుండా రెండ్రోజులు తిట్టాడు. 'నా అక్క కొడుకైనా నీ బావ నీ డబ్బు చూసే వెంటబడుతున్నాడు కానీ నిన్ను చూసి కాద'న్నాడు. నచ్చజెప్ప జూసిన తల్లిని కొట్టినంత పని చేశాడు. 'వాడో కంత్రీవెధవ. ఇప్పుడు పిల్లిలా వుండి రేప్పొద్దున్న పులిగా మార్తాడ'న్నాడు.

కామేశ్వరి తల తిప్పి చూసింది.

మగవాళ్లలో బారెడు తెల్లటి గడ్డం వున్న విశ్వనాథం ఇట్టే అగుపించాడు.

'అప్పుడు నాన్న చెప్పింది నిజమే' గొణుక్కుందావిడ.

మున్సిపల్ ఛైర్మన్ స్పీచ్ సాగుతూనే వుంది.

"ఆయనో మంచి మిత్రుడు. ఈ రోజు అతను మనకిలా దూరం కావడం ఓహ్"

"నిజమే! నాన్న నాకు దూరమైపోయారు" వెక్కిళ్లు పట్టి ఏడుస్తున్న గిరిజ అనుకుంది... చెప్పిన ప్రతిమాటా ఎంత శాంతంగా వినేవారో! అమ్మ పోయాక పెళ్లి మాటేఎత్తలేదు. రాముడిని ఆదర్శంగా పెట్టుకున్న వ్యక్తి. అందుకే పెళ్లైన ఆర్నెల్లకే సూర్యానికి నూరేళ్లునిండిపోయినా 'అమ్మా విధిరాత కాదనడం ఎవరి తరం? నువ్వు నాకు బరువుకాదు. నేనున్నంత వరకూ నీకేలోటూ రాదు' అన్నాడు. నాన్న వెచ్చటి రెక్కలకింద జీవితం హాయిగా సాగిపోయింది. యాభై అయిదేళ్లు దాటినట్టు అనిపించడమే లేదు. జీవితం అంటే ఏమిటో ఇంకా ఓనమాలు దిద్దుకోవడంలోనే వుంది మనసు.

తలెత్తిన గిరిజకు ఎదురుగా తన వంకే చూస్తున్న సుందరం కనిపించాడు. ఇద్దరి చూపూ మసకబారింది. కళ్ల నిండుగా నీళ్లు. సుందరం గిరిజ దగ్గరకు వచ్చి భుజం తట్టాడు, ఓదార్పుగా. తండ్రి లాలింపు అతని స్పర్శలో లేదు. కానీ ఆ చిన్న ఓదార్పు... చాలు! కళ్లు తుడుచుకుంది.

"ఆయన అందరితో ఎంత ఆత్మీయంగా వుండేవాడంటే స్వంత మనుమలైనా బయటి స్నేహితులైనా ఆ పెదవుల మీద అదే చిర్నవ్వు..." అంటున్నాడు మునిసిపల్ ఛైర్మన్.

రామారావ్ మనవరాలు పదేళ్ల హరిత తాతగారి మొహాన్ని భయంగా చూసింది. బిగదీసుకు పోయిన దవడ కండరాలు, ఒణుకుతున్న పెదవులు "తాతగారూ" భయంభయంగా పిలిచింది.

హఠాత్తుగా ఆ అమ్మాయి చూపు మనోహిత మీద ఆగిపోయింది.

"తాతగారూ... అదిగో ఆ చివర... ఆవిడ ఎంత బాగుంది... ఒక్కసారి అటుచూడండి. ఆవిడ మన చుట్టమేనా? ఎప్పుడూ ఒక్కసారి కూడా మనింటికి ఇంతవరకూ రాలేదు"

రామారావ్ తలెత్తాడు. అతని చూపు ఆమె చూపులననుసరించింది. అక్కడికొచ్చిన చాలా మందిలో ఎవరు ఎవరనేది రామారావుకీ తెలీదు. అందరూ కొత్తగానే వున్నారు.

"నాకు నాన్న గురించే కాదు.. నాన్న పరిచయస్థుల గురించీ తెలీదు" గొణుక్కున్నాడు.

"ఎంతో బాగుంది... కదూ" హరిత అడుగుతోంది.

అప్పటిక్కానీ అతని చూపు అందర్నీ దాటి

# అగ్గిపుల్లలతో అద్భుతం!







అగ్గిపుల్లలతో అద్భుత కళాఖండాలను సృష్టించడంలో నాకు నేనే సాటి అంటున్నాడు క్వీన్స్‌లాండ్‌లోని కలౌండ్రాకు చెందిన లెన్‌హ్యూగ్స్. ఈ కళలో ఇతనికున్న అభిరుచి, అనుభవం సాటిలేనివని ఒప్పుకోక తప్పదు. విదేశాల్లో కూడా లెన్ పేరు మారుమోగుతోంది. ముఖ్యంగా అగ్గిపుల్లలతో ఇతడు తయారుచేసిన కళాఖండాల్లో అమిత ప్రశంసలు పొందినవి రెండు. న్యూజిలాండ్‌లోని అతి పెద్ద చర్చ్‌గా పేరొందిన 'క్రైస్ట్ చర్చ్ కాథడ్రల్, మాస్కో రెడ్‌స్క్వేర్‌లోని 'బాసిల్స్ కాథడ్రల్'. ఆ రెండిట్లో అతని సమయం, శ్రమ, అభిరుచి కూడా ఎక్కువగా వినియోగించింది బాసిల్స్ కాథడ్రల్ తయారీలోనే. ఫొటోలో అతని చేతుల్లో వున్నవి వాటి నమూనాలే.

ఆమె వరకూ పోలేదు. పక్కకు తిరిగివున్న ఆమె మొహం ఓవైపు మాత్రం కనిపిస్తోంది. అదీ కొంచం కొంచమే. ఆమె ముందు ఎవరో అడ్డంగా నించున్నారు. కొంచం వెనక్కు జరిగాడు.

ఆమె... ఆమె.

అయోమయంగా వుంది. నమ్మకం కుదరట్లేదు.

ఒక్కసారి తీక్షణంగా చూశాడు. అంతే హఠాత్తుగా లేచి నిల్చున్నాడు. రెండడుగులు ఆవైపు కదలగానే ఎవరో ఆపేశారు.

"మీరుండండి రామారావుగారూ.. తదితర కార్యక్రమాలకి ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఒక్క పావుగంట, మరింక ఆలస్యంలేదు"

మళ్లీ అయోమయం ముందుకు వెళ్లాలా? వద్దా? ఏం చెయ్యాలి. ఆలోచించే లోపలే చెయ్యి పట్టుకు తీసుకెళ్లి తండ్రి శవం పక్కన కూర్చోబెట్టారెవరో.

"ఎవరావిడ? మన చుట్టమా?" మళ్లీ అడిగింది హరిత. రామారావుగారు కళ్లు మూసుకున్నారో క్షణం. బలవంతాన వచ్చింది జవాబు అతని పెదవులు దాటి.

"అవును"

ఇంతలో ఇంకెవరిదో గొంతు కృష్ణమూర్తి గారిని పొగుడుతూ అంది "జీవితాన్ని ఎలా మన చెప్పుచేతల్లో ఉంచుకోవాలనేది ఆయనకు తెలిసినంతగా మనెవరికీ తెలీదు"

నిజమే! జీవితాన్నే కాదు మనుమల్ని కూడా ఎలా చెప్పుచేతల్లో ఉంచుకోవాలనేది ఆయనకు బాగా తెలుసు.

"అవును" అనుకున్నాడు అభిలాష్! ఉద్యోగం ఇస్తానని ఆశ చూపించి మనవరాలితో పెళ్లికి ఒప్పుకున్నాకే అపాయింట్‌మెంట్ ఇవ్వడం ఆయనకే చెల్లింది. ఆ పెళ్లి చేసుకోడం ఆ కంపెనీలో ఉద్యోగానికి రావటం రెండూ తెలివితక్కువ పనులే. మీనాక్షిని పెళ్లి చేసుకోమని అడగటం కొండచిలువనోట్లో పడమని అడగటం లాంటిదే. అసహనంగా పక్కకు కదిలాడు అభిలాష్.

తలెత్తి భర్తవంక చూసింది మీనాక్షి. ఆ జనం, ఆ హడావిడీ అతనికి నచ్చదని ఆమెకు తెలుసు. అయినా ఇదేం పెళ్లా పేరంటమా! అయినా ఎంత ఉగ్గబట్టుకున్నా ముక్కూ మొహం తెలీని ఈ బంధుబలగం ముందు ఒంటరిగానే అనిపిస్తుందతనికి. అసలా కంపెనీలో పనిచెయ్యటమే ముళ్లమీద ఆరేసిన పట్టుబట్ట చందం!

మీనాక్షి చూపులు మేనమామ మీదకు మళ్లాయి. రామారావ్ మాటిమాటికీ వెనక్కు తిరిగి చూస్తున్నాడు. పెరగని గడ్డాన్ని నిమురుకుంటూ ఎడం చేత్తో జుట్టు వెనక్కు తోసుకుంటూ! అసహనం అతని చేష్టల్లో కనబడుతూనే వుంది.

మీనాక్షి చూపులు ఆ చూపుల్ని అనుసరించాయి. ఉహూ! ఎవరూ తెలిసిన వాళ్లు లేరే? అపార్ట్‌మెంట్స్‌లో వాళ్లు పెద్దగా తెలిసిన వాళ్లు కాకపోయినా మర్యాదకి వచ్చి చూసిపోయేవాళ్లు, వెనకాల నించున్నారు చాలామంది ఆడవాళ్లు. బహుశా వాళ్లు టెక్స్‌టైల్స్‌లో పనిచేసే వారు కావచ్చు నరే! ఆ వెనకాల చెక్కిన వీనస్ శిల్పంలా ఎవరు? ఎవరామె?

పాలూ పసుపూ కలబోసిన రంగు. తల తిప్పి నప్పుడల్లా ముక్కు చివర మెరుస్తున్న వజ్రపు తునక. పెద్దమామయ్య మాటిమాటికీ ఎందుకటు చూస్తున్నాడు.

కొంచం పక్కగా కూర్చున్న సన్నిహిత చూపును దాటిపోలేదది... మాటిమాటికీ తండ్రీ మీనాక్షీ వెనక్కు తిరిగి చూడటం.

"నాన్నా... మనో కదూ" తండ్రి పక్కకు జరిగి అడిగింది. ఈ లోగానే ఎవరో గట్టిగా అరిచారు.

"అన్నీ సిద్ధంగా వున్నాయి. లేవండి లేవండి... ఇలా ఎంత వరకూ కూర్చుంటారు? పిల్లలు ఆకలికి ఆగలేరు"

ఒక్కొక్కళ్లుగా లేవటం ప్రారంభించారు. కూర్చున్న వాళ్లు లేచి నిల్చున్నాక కూడా వెనక్కి తిరిగి మళ్లీమళ్లీ చూస్తూనే వున్నారు. మీనాక్షి, రామారావ్, ఈసారి సన్నిహిత కూడా.

"ఎక్కడో చూసినట్టుగానే వుంది" ఇంకా ఆలోచిస్తూనే వుంది మీనాక్షి.

మిగతా కుటుంబ సభ్యులు కూడా వెనక్కి

చూస్తున్నారు.

"ఎక్కడో చూశాం... గుర్తురావట్లేదు"తలలు గోక్కుంటూ ఆలోచిస్తున్నారు.

"సన్నిహిత పోలికలున్నాయికదూ. రంగు మినహాయిస్తే... ఆ చూపులు... ఆ నాజూకు తనం సన్నిహిత కొంచెం సన్నబడి తెల్లబడితే ఎలా వుంటుందో... అచ్చం"

"దగ్గర చుట్టమే అయుండాలి మరి"

సన్నిహిత రెండు నిమిషాలు ఆలోచించాక శ్రీనివాస్ వైపు తిరిగి "మనో వచ్చినట్టుంది" అంది.

శ్రీనివాస్ ఉలిక్కిపడ్డాడు. "ఎక్కడ? నిజమా?" నమ్మలేనట్టుగా అడుగుతూనే వెనక్కు తిరిగాడు.

"ఇన్నేళ్ల తరువాత ఇలా తిరిగి వస్తుందంటావా?" మళ్లీ అడిగాడు.

అపాటికే ఒక్కొక్కళ్లూ వరుసగా గుర్తుపట్టా రామెను.

"అది మనో కదూ...అచ్చం ఇల్లు వదిలి పారిపోయినప్పుడెలా వుందో అలాగే వుందిప్పుడూ"

"ఏం జరిగింది? ఇంట్లోంచి పారిపోయిందా?" గుసగుసలు.

"అవును... ఇరవై ఏళ్లకిందట. ఇంట్లోంచి పారిపోయింది"

"పారిపోయిందా?"

"అలా చెప్పుకుంటారేమిటి? బోర్డింగ్ స్కూల్లో వేశామని చెప్పారు. ఆ తరువాత మళ్లీ ఇంటికొచ్చిన జాడ లేదు. ఇదిగో మళ్లీ ఇప్పుడే..."

"ఓహ్ ఆ పిల్ల రామారావుగారి పెద్ద కూతురు కదూ"

"అలాగే వుంది"

"ఇంట్లోంచి పారిపోయిందా? లేచిపోయిందా?"

"ఏమో ఎవడికి తెలుసు... ఇరవై ఏళ్ల క్రితం సంగతి." మాటలు ఇలా సాగుతూనే వున్నాయి. బయట శవయాత్ర సిద్ధమైంది.





పది నిమిషాల తర్జన భర్జనల తరువాత పిల్లాపాపల్తో సహా ఇంటిల్లిపాదీ శ్మశానానికి వెళ్లాలని నిశ్చయించుకున్నారు.

"డాడీ... అందరూ ఆవిడనే చూస్తున్నారు. ఎవరావిడ?" సౌందర్య తండ్రి భుజం మీద చెయ్యేసి పిలిచి మరీ అడిగింది. మనోహర్ చటుక్కున తలెత్తాడు.

"ఎవరు?"

సౌందర్య చూపుల వెంట సాగిందతని దృష్టి.

అక్కడ ఆ చివర... చూపుల చివర మనోహిత.

"భగవాన్" అప్రయత్నంగా అతని నోటి వెంట వచ్చిందా మాట. మనోహిత కళ్లు తిప్పుకుంది.

సన్నిహిత కూతుర్ని వెంట నడిపించుకుంటూ జనాలను తప్పించుకుంటూ ముందుకు నడిచింది.

మనోహిత ముందు నించుని ఆమె భుజాల మీద రెండు చేతులూ వేసి,

"మనోవి కదూ? అవును నువ్వు మనోవి. అక్కని చెల్లెలు గుర్తుపట్టలేదా?"

ఆమె మాటలు పూర్తయేసరికి ఒకరి కౌగిలిలో ఒకరు.

"సోనీ" సౌమ్యంగా పలికింది మనోహిత స్వరం.

వాళ్లిద్దరూ ఒకరినొకరు కౌగిలించుకోవడం మంత్రి పదవిలో ఉన్న మనోహర్ గమనించాడు. చుట్టూ చూశాడో క్షణం. దూరంగా హడావిడిగా తిరుగుతున్న శ్రీనాథ్ అతని చూపుల్లో అర్థం గమనించి పరుగెత్తుకు వచ్చాడు.

"శ్రీ... అదిగో అటు చూడు... ఆ తెల్లచీర..."

"అవును... అందరూ ఆవిడనే చూస్తున్నారు. నీకు తెలుసా మామయ్యా? ఎవరావిడ?"

"దానికేం కావాలో కనుక్కో. మనకందుబాటులో వుంటే ఇచ్చి పీడ విరగడ చెయ్యి. అది మళ్లీ ఈ గేటు దాటి అడుగు పెట్టకూడదు"

★ ★ ★

మనోహిత చేతుల్లో ఒదిగిపోయిన సన్నిహిత కళ్లలో నీళ్లు తిరిగాయి.

"ఎన్నాళ్లకు ఎన్నేళ్లకు నిజంగా నాకు నాకు

ఊహు... మాటల్లో చెప్పలేను''

చేతుల్లో ఒదిగిన సోనీ మీదుగా తమనే వింతగాచూస్తున్న మనుమల వంక తలెత్తి చూసింది మనోహిత.

కదలిక లేని చిత్రంలా వుందా దృశ్యం. వరసలు వరసలుగా నించున్న జనాలు ఆ మొహాల్లో స్పష్టంగా కనిపిస్తున్న ఆశ్చర్యం. గడ్డ కట్టిన ఆ స్తబ్ధతలో ఊపిరి పీల్చే శబ్దం కూడా వినిపించడంలేదు.

రామారావ్ మనోహిత వంక చూశాడు. మనోహిత కళ్లు వాల్చుకుంది. సన్నగా ఒణుకు. గాలికి నాట్యం చేసే సన్నజాజి తీగలా కదిలిపోయింది మనోహిత.

''అక్కా... ఎందుకు ఇలా? నీ చేతులు ఒణుకుతున్నాయి?'' మనోహిత పెదవుల మీద చిరునవ్వు పరచుకుంది.

సన్నటి సుకుమారపు తీగలో భావోద్వేగం ప్రవహిస్తే ఏమవుతుంది? ''నేను...నేను మరిక బయల్దేరాలి. నాతో పాటు వస్తావా?''

''అదేమిటి? అందరితోపాటు శ్మశానానికి రావా?''

''ఊహు.. తాతయ్యను చివరిసారి చూద్దామనుకున్నాను. చూశాను. మళ్లీ అక్కడిదాకా ఒద్దులే. ఒకవేళ నువ్వు వెళ్తానంటే వెళ్లిరా. నీ కోసం వెయిట్ చేస్తాను''

''ఊహు... ఒక్క నిమిషం... మీ మరిదికి చెప్పి వస్తాను ఆగు''

''బయట నించుంటాను.. రా'' నిశ్శబ్దంగా ఎలా వచ్చిందో అలాగే బయటకు కదిలింది.

బయటకు అడుగు పెడుతూనే ఒక్కసారి బలంగా వూపిరి పీల్చుకుంది.

పిల్లని తండ్రి దగ్గర వదిలి వచ్చింది సన్నిహిత.

''పాపం! అంతా తలలు బద్దలుకొట్టుకుంటున్నారు''

''జ్ఞాపకాల తోటా? ఇంతకీ ఎక్కడికి వెళ్దాం?''

''పెద్దత్త...''

''ఒద్దు... నా కిష్టంలేదు...''

''తోటలోకి వెళ్దాం''

గేట్‌దాటి పదడుగులు వేశాక పక్కకు తిరిగారు. అదే తోటకి దారి. ఆ దారివెంట చిన్నప్పుడు లెక్కలేనన్ని సార్లు నడిచింది. అప్పట్లో దట్టంగా పెరిగిన పొదలు... ఒకదాంతో ఒకటి అల్లుకుపోయి. పెనవేసుకుపోయిన లతలూ, ఓహ్ ఆకువచ్చటి గుహల్లా వుండేవవి. ఇప్పుడా పొదలు లేనట్టున్నాయి. అందంగా చిన్నగా కత్తిరించిన క్రోటన్స్ మొక్కలు, ఆ ఇంట్లో మనోహిత చిన్నప్పట్నించీ ఇష్టపడింది ఆ తోట ఒకటే.

''హఠాత్తుగా ఆ రోజున ఎక్కడికి వెళ్ళిపోయావ్ మనో?'' సన్నిహిత అడిగింది.

''బాంబే వెళ్ళాను... అక్కడో ఆశ్రమం వుంది. నాలా ఇల్లొదిలేసిన అమ్మాయిలకోసం''

''అనాథాశ్రమమా?''

''ఊహు... వాళ్ళే నన్ను చదివించారు. చివరకు ఎమ్.ఎస్.కోసం అమెరికా కూడా పంపారు...''

''నువ్వు... నువ్వు డాక్టర్వా?''

''అవును...''

''ఏదైనా స్పెషలైజ్ చేసావా?''

''సర్జరీలో...''

సోనీ అక్క చెయ్యి పట్టుకుంది.

''ఇంతకీ... పెళ్ళి...''

''ఊహు... చేసుకోవాలనిపించలేదు''

''ఎవరూ నచ్చలేదా?''

''నీ సంగతి చెప్పు- అతని పేరు శ్రీనివాస్ కదూ... ఆ పాపలిద్దరూ...''

''అవును హారిత- సౌమ్య. ఇద్దరికీ తండ్రిపోలికలే. శ్రీనివాస్... ఓహ్ నీకు తెలీదు కదూ... నువ్వు వెళ్ళిపోయాక తాతయ్య టెక్స్‌టైల్స్ ఫ్యాక్టరీ పూర్తిగా ఒదిలేసాడు. ఒక్కసారి వెనక్కి తిరిగి చూడు. అవిగో ఆ రెండు అపార్ట్‌మెంట్స్ తాతయ్య కట్టించినవే. ఒక్కో బిల్డింగ్‌లో సెవెన్ ఫ్లోర్స్. ఒక్కో ఫ్లోర్‌లో పన్నెండు వాటాలు. అన్నీ రెంట్‌కి ఇచ్చారు. శ్రీనివాస్ చూస్తాడు ఆ వ్యవహారాలన్నీ...''

''శ్రీనివాస్ నీకు నచ్చాడా?''

''ఊ... తాతయ్యకి చాలా నచ్చాడు. సిరి



యస్ అండ్ సిన్సియర్ అనేవాడు''

గుబురుగా పెరిగిన పొదల మధ్యనించి ఒంగి నడిచారిద్దరూ. అయిదు నిముషాల నడక.

సూర్యకాంతికి కూడా చోటివ్వకుండా దట్టంగా పెరిగిన చెట్లు. ఒకదానితో ఒకటి కలగలిసి కొత్తవాసనలు వెదజల్లుతున్న పువ్వులు... ఆ చివర్న ఓ చిన్న కొలను. దాని చుట్టూ అందంగా పెరిగిన పూలమొక్కలు. నాలుగైదు పున్నాగచెట్ల మధ్య రాళ్ళు పేర్చుకుని గదిలా... మార్చుకుని... మనోహిత కళ్ళు మిలమిలలాడాయి. ఆ రాళ్ళు ఇంకా అలాగే వున్నాయి. ఉండీ ఉండీ ఊసులాడుతున్నట్లు పిట్టల పిలుపులు. అది తప్ప మరే శబ్దం వినబడని చోటది. ఆ రాళ్ళమధ్య కూర్చుంది మనోహిత.

''సోనీ... ఇరవై ఏళ్ళయినా... ఇవి... ఇవన్నీ...''

''అక్కా... నీకు తెలీదు కదూ... నువ్వు వెళ్ళిపోయాక ఒక్కళ్ళని కూడా ఆ ఇంట్లో వుండనివ్వలేదు. సరిగ్గా మూడు రోజులు భైమిచ్చాడు. అంతే... క్షణాల్లో ఇళ్ళు వెతుక్కుని ఎవరిదారిన వాళ్ళు విడిపోయారు. చివరికి నేనూ... డాడీ కూడా... ఇరవై ఏళ్ళ తరువాత... ఇదిగో ఆయన పోయాకే అందరూ ఆ ఇంట్లో అడుగుపెట్టడం. తనకి రావాలనిపిస్తే ఎవరింటికైనా వచ్చేవాడు. అంతే... ఈ తోట కూడా ఆయనే చూసుకునేవాడు''

''ఒక్కసారి ఇంటికి వెళ్దాంరా... అన్నట్టు అందరూ శ్మశానానికి వెళ్తే ఇంట్లో ఎవరుంటారు?''

''నిజంగా వెళ్దామా? పద... ఇంట్లో వంట ఏర్పాట్లు జరుగుతూండి వుంటాయి. ఈ పది రోజులూ ఇల్లు దాటి వెళ్ళరుగా... పద'' ఇద్దరూ వెనక్కు నడవటం మొదలెట్టారు.

''అక్కా... ఇన్నేళ్ళ తరువాత... ఇది ఆశ్చర్యంగా లేదూ? నువ్విలా రావడం... మనిద్దరం కలిసి ఇంటికి వెళ్ళడం...'' దారిలోనే ఆగిపోయి అంది నన్నిహిత.

''అవును పద'' ఆ సంవత్సరాలు అదృశ్యమైపోయాయి. చిన్నప్పుడు సోనీతో కలిసి స్కూల్‌నించి ఇంటికి తిరిగి వెళ్ళిన క్షణాలు సజీవంగా కళ్ళముందు నిలిచాయి. గేట్లోంచి కాకుండా పెరటి వైపునించి ఇంట్లోకి వచ్చారు. బయటే గాడిపొయ్యి వెలిగించి వంటలు చేస్తున్నారు.

నన్నిహితను చూస్తూనే ఏదో అడుగుతోందా వంటావిడ. మనోహిత సుపరిచితమైన ఆ ఇంట్లోకి నడుస్తూనే గబగబా మెట్లవైపు వెళ్లింది. మూడంతస్థుల ఆ భవనం ఒకప్పుడు... ఒక మహాకుటుంబం. ఇప్పుడో ఓ శిథిల గృహం.

రెండో అంతస్థు చివరి గది... ఒణికే చేతుల్తో దగ్గరకు వేసివున్న తలుపుల్ను తోసింది.

గబగబా లోపలకు నడిచి గదిమధ్యన నిల్చుంది. అది తన గది. అప్పటికీ, ఇప్పటికీ... ఎప్పటికీ. కిటికీలోంచి తొంగిచూస్తున్నట్టున్న మనీప్లాంట్ ఆకులు, లైట్ బ్లూకలర్ గోడలు- ఆ రోజు ఉదయం... రెండు జతల బట్టలతో ఇల్లుదాటినప్పుడు ఎలావుందో ఇప్పుడూ అలాగే వుందా గది.

ఆ సింగిల్ కాట్ బెడ్ స్ప్రెడ్‌మీద రోజెస్. వాల్ పేపర్‌మీద రోజెస్. చివరికి కర్టెన్స్ ప్రింట్ కూడా రోజెస్...

అందుకేనా తన జీవితం ఓ గులాబీ కొమ్మైంది...

హఠాత్తుగా బయటకు వచ్చి తలుపు దగ్గరకు లాగింది.

''కొంచెం కాఫీ తాగుదాం రా'' చివరిమెట్టు మీద నిలబడి వుంది నన్నిహిత.

ఇద్దరూ హాల్లోకి నడుస్తున్నారు.

''ఆరోజు రాత్రి... ఆరోజు నీ పుట్టిన్రోజు కదూ... అప్పుడు నాకు పదేళ్ళు. నాకు నాకేమీ తెలీదు. నాకు అర్థమైందల్లా ఒకటే. జరగకూడనిదేదో జరిగింది. ఒకరిమీద ఒకరు అరుచుకోవడం చూసి పెద్దత్తను అడిగినా చెప్పలేదు. నువ్వెళ్ళిపోయాక... అందరినీ పరన పరసనా అడిగాను. నీ గురించి... ఊహు... ఒక్కళ్లూ నోరు విప్పలేదు''

''తరువాతైనా ఒక్కళ్లూ మాట్లాడలేదా?''

''ఊహు... ఎవ్వరూ ఆ విషయమే ఎత్తలేదు. నాన్న నేను మరో ఇంటికి మారిపోయాం. పెద్దత్త స్కూల్ అవర్స్ అయ్యాక రాత్రి




ఏడింటివరకు ట్యూషన్ ఏర్పాటుచేసింది. ఇంటికి ఏడున్నరకి వచ్చేదాన్ని సెలవుల్లో స్పోర్ట్స్ కాంప్‌కి పంపేవారు. నువ్వెళ్ళిపో యావు... అంతే ఈ కుటుంబం చీలిపోయింది. నాకు నచ్చలేదది. కాని ఏం లాభం? ఒకళ్ళూ నోరు విప్పి ఏమీ మాట్లాడరు. ముఖ్యంగా నువ్వు లేనిలోటు ఒకళ్లు తీర్చగలిగేది కాదు. ఇప్పుడు కూడా నువ్విలా ఇక్కడున్నావనే నిజా న్ని నమ్మలేకపోతున్నాను. నేను నీతో మాట్లాడు తున్నాననే ఈ నిజం కలా అనిపిస్తోంది. నువ్వు లేకపోవడం నా జీవితంలో ఎంత శూన్యాన్ని నింపిందంటే... నేను ఏకాకిననే నిరాశ నన్ను క్షణం కూడా స్థిమితంగా బతకనిచ్చేది కా దు...''

హాల్లో ఈ చివర్నించి ఆ చివరిదాకా ఎప్పటి లాగే డైనింగ్ టేబుల్. ఆ చివర టీ కెటిల్... సన్నిహిత గబగబ నడిచి గ్లాస్ డోర్ జరిపి రెండు కప్స్ సాసర్స్ బయటకు తీసింది. అప్పుడూ అలాగే స్కూల్‌నించి రాగానే ఇద్దరూ పాలు తాగేవారు. రెండు కప్పుల్లోకి కాఫీ ఒంపింది.

''ఆ క్షణం ఎందుకలా జరిగిందో నాకే తెలీదు'' మెల్లగా అంది మనోహిత.

''ఎందుకలా జరిగింది?''

మనోహిత మొహం బిగునుకుపోయింది. కోపం దూమెరుగ్గా ఎరుపురంగద్దింది ఆమె చెక్కిళ్ళకు. తలతిప్పి కిటికీలోంచి బయటకు చూసింది.

మునురుపట్టిన ఆకాశం... ఆషాడమాసం ఎప్పుడూ అంతే. మబ్బులే తప్ప వాన రాదు, ఓ వక్క ఉక్కపోత. ఉరుములు మెరుపులు ఊరికేనే వస్తాయి. ఒక్కచుక్కా జల్లు పడదు.

మనసుకే కాదు- వాతావరణమూ ఉక్కిరిబి క్కిరి చేస్తూన్నట్టుగానే వుంది.

''ఆ విషయం మాట్లాడటం నాకిష్టంలేదు'' దృఢంగా పలికిందామె స్వరం.

''ఇప్పుడు కూడా? ఇరవై ఏళ్ళ తరువాత కూడా నాకు చెప్పకూడదా?''

మనోహిత తల అడ్డంగా వూపింది.

''నీ గురించి నాకు తెలిసిందేమీలేదు. తెలుసుకుందామని అడిగాను. ఇన్నేళ్ళుగా ఓ అక్క వుండీ లేనట్టుగానే బతికాను. నువ్వు తిరిగివస్తే ఇద్దరం అన్యోన్యంగా వుండచ్చని ఆశపడ్డాను. నా మనసు పంచుకునేవాళ్ళు లేక ఎంత పరితపించిపోయానో అది నాకే తెలుసు. సరేలే... నిన్ను బలవంతపెట్టి బాధపెట్టను. కాని ఒకటి నువ్వెప్పుడైనా మనసువిప్పి మాట్లా డదలుచుకుంటే నీకోసం నేనున్నానని మరచి పోకు. ఆరోజు రాత్రి నువ్వు చెప్పిందేమిటో నాకర్థంకాలేదు. నిజమే. అత్తలు చెప్పలేదు. చివరకు మా ఫ్రెండ్స్ వివరించారు. అయినా ఇప్పటికీ నీ గురించి నాకు అర్థంకాలేదు'' ఒక్కక్షణం ఆగింది సన్నిహిత.

''ప్రతి జ్ఞాపకానికీ ఓ మచ్చ మిగులుతుంది సోనీ. కొన్ని అనుభవాలు ఎప్పటికీ మర్చిపోలేని జ్ఞాపకాలుగా మారతాయి. కానీ వాటితోనే జీవితం ఆగిపోదు. మార్పులు వస్తూనే వుంటాయి'' అంది మనో

''ఈ ఇల్లు ఒదిలేసాక...'' అడగలేనట్టు ఒక్కక్షణం ఆగింది.

''ఊ...''

''ఇంకేవైనా చేదు అనుభవాలు ఎదుర య్యాయా?''

''ఊహు... లేదు. జాగ్రత్త పడటం నేర్చుకు న్నాను. నా గురించి కాదు నేను చెప్త. అనుభ వంతో. లోకాన్ని చూసి జీవితాల్ని చదివి...''

అక్కని మధ్యలోనే ఆపేసింది సన్నిహిత.

''జాగ్రత్త పడటం అంటే...''

''ప్రతివాళ్ళనీ ఉంచాల్సినంత దూరంలో ఉంచేదాన్ని దగ్గరి స్నేహితులు కూడా చాలా తక్కువ''

సన్నిహిత ఇద్దరి కప్పుల్లో మళ్ళీ కాఫీ నింపింది.

''ఏమిటో పుస్తకాలంటే వున్న ఆసక్తి- మను మలమీద లేదు నాకు. గుంపులు గుంపులుగా మనుమల్ని చూస్తే ఊపిరాడదు, ఎవ్వరూ అక్కర్లేదనిపిస్తుంది''

''ఈ మాటలు నువ్వు మనస్పూర్తిగా అంటు న్నావా?''

''అవును... ఇంతవరకూ నా జీవితం అలాగే

గడిచింది''

''ఇక్కడున్నప్పుడో?''

''ఇక్కడున్నప్పుడా? అప్పుడూ అలాగే బతికేదాన్ని. అందరిమధ్య ఒంటరిగా, అందరి బంధువుల మధ్య ఓ కొత్త వ్యక్తిలా... కానీ... వాళ్ళవసరం నాకుందనిపించినప్పుడు... వాళ్ళంతా నన్ను ఒంటరిదాన్ని చేశారు''

''అది గతం... ఇప్పుడు మనమంతా ఒకటే''

''ఉహు... కాదు. తాతగార్ని చివరిసారి చూడ్డానికి వచ్చానంతే. ఆరోజున చివరికి తాతగారు కూడా నన్ను నమ్మలేదు. అయినా తాతగార్ని చివరిసారి చూడకుండా ఆగలేకపోయాను. ఆయన పోకముందు కలుసుకుని వుంటే... బాగుండేది. అన్నీ అడిగేసేదాన్ని. ఆయనంటే నాకెంత ఇష్టమో చెప్పుండే దాన్ని''

''మీ మరిదిగారితో ఎప్పుడూ నీ గురించే మాట్లాడేవారట''

''అవునా? ఏం చేప్పేవారట''

''ఆయన్నే అడుగు...''

ఒక్క క్షణం నిశ్శబ్దం.

''వాళ్ళు తిరిగిరాకముందు వెళ్ళిపోతాను. శ్రీనివాస్‌ని కలవలేను. మళ్ళీ వాళ్ళందరి మొహాలు చూడటం ఇష్టంలేదు నాకు''

''జీవితంలో జరగదనుకున్న అద్భుతం అకస్మాత్తుగా జరిగింది. నిన్ను మళ్ళీ పోగొట్టుకోలేను. పోనీ మా ఇంటికి రారాదూ. నువ్వొస్తానంటే సాయంత్రానికి వెళ్ళిపోదాం. పిల్లలు శ్రీనివాస్ సంతోషిస్తారు 'మా' అనుకునే వాళ్ళొకళ్ళున్నారని. ఇన్నేళ్ళ విశేషాలు మాట్లాడుకోవాలి. వస్తావు కదూ'' ''చూద్దాం'' రానని ఖచ్చితంగా చెప్పలేకపోయింది మనోహిత.

''అందరూ విడివిడిగానే వుంటున్నారా?''

''ఊ... మేం బంజారాహిల్స్‌లో చిన్న ఇల్లు కట్టుకున్నాం. కామేశ్వరి అత్త నల్లకుంటలో- సుందరం పెదనాన్న గిరిజత్త మలక్‌పేటలో, డాడీ నేనూ పెద్దత్త ఇంటికి దగ్గర్లో వుండేవాళ్ళం. డాడీ ఇంకా అక్కడే వుంటున్నారు'' అని ఒక్కక్షణం ఆగి- మనోహర్ సంగతి చెప్పలేదు కదూ... మినిష్టర్ కదా... అతనింటికి ఎవరూ వెళ్ళరు. అప్పుడప్పుడు అతనే వస్తాడు. వాళ్ళమ్మాయి సౌందర్య. ఎల్.ఎల్.బి. చేస్తోంది. అయిదారేళ్ళైంది. ఆ చదువు ఎంతకీ అవదు. గానీ ఈలోగా ఎన్ని వ్యవహారాలు జరిగాయని... పెళ్ళి కాకుండానే తల్లినవుతానని పంతం పట్టింది. పాపం ఆ పుట్టిన పిల్ల తల్లిమొహం చూడకుండానే శాశ్వతంగా కళ్ళు మూసింది. ఈ విషయాలన్నీ చెప్పి బోర్ కొట్టిస్తున్నానా? అందుకే అడిగాను. మాతోపాటురా తీరిగ్గా మాట్లాడుకుందామని...''

''ఇంకేం మిగిలాయి మాట్లాడుకుందుకు''

''చాలా... ఇంతవరకూ ఎవరికీ చెప్పుకోలేనివి. చెప్తే కాని మనసుల్లో ఆరాటం తీరదు. అలాగని ఇంట్లోవాళ్ళకి చెప్పుకోలేం. అందుకే'' హఠాత్తుగా ఏదో స్ఫురించి ఆగిపోయింది సన్నిహిత.

''అవును సరిగ్గా చెప్పావ్''

''సారీ అక్కా... ఆ వుద్దేశ్యంతో అనలేదు నేను- నువ్వు ఇంట్లో మనిషివి కాదని కలలో కూడా అనుకోలేను. నువ్విలా ఎదురుగా లేనప్పుడు కూడా అనుకోలేదు. ఛి... ఛీ... నా మైండ్ పనిచెయ్యటం లేదు. ఏం చెప్పాలనుకుంటున్నానో ఏం చెప్తున్నానో అర్థంకావట్లేదు''

సన్నిహిత కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

''సానీ... ఎందుకా కన్నీళ్ళు... ఇంకా చిన్నతనం పోలేదు నీకు. చిన్నప్పుడూ అంతే- చీటికి మాటికి ఏడ్చేదానివి''

''అక్కా... నన్నెప్పుడైనా గుర్తు తెచ్చుకున్నావా?'' కళ్ళు తుడుచుకునే ప్రయత్నం చెయ్యకుండానే అడిగింది సన్నిహిత.

''ఆ... చాలాసార్లు. అప్పటికి నేను వెళ్ళిపోయేసరికి చాలా చిన్న పిల్లవు. నీ స్నేహితులు వేరు, నీలోకం వేరు. నాలోటు నీకంతగా తెలీదనే అనుకున్నాను''

''ఉహు... నువ్వు వెళ్ళిపోవడం నా మనసుకో పెద్ద దెబ్బ. నువ్వు ఎప్పటికీ తిరిగిరాకపోయేసరికి చచ్చిపోయావేమోనని భయపడ్డాను కూడా. ఒక్క ఉత్తరం కూడా రాయలేదని, నీకు నేనంటే పెద్ద లెక్కలేదని అనుకునేదాన్ని''

''సారీ సానీ... నువ్వు మరీ అంతగా ఫీలౌతావనే ఆలోచనే రాలేదు నాకు. నువ్వు అందరితో




బాగా కలిసిపోగలవనే అనుకునేదాన్ని. నాలా ఒంటరితనం నిన్ను వెంటాడదని అని పించేది. నువ్వు నాలా కాదు. నీ వినయంతో అందరినీ గెలుచుకోగలవని అనుకున్నాను''

''ఉహు... నావల్ల కాలేదు. పోట్లాటలంటే భయం. అరుచుకోవడాలు, తిట్లు, ఉహు భరించలేను. ఒక్కోసారనిపిస్తుంది. పోట్లాడుకో వడం కూడా సరదాగా వుంటుందేమోనని''

మనోహిత మనోహరంగా నవ్వింది.

''పోట్లాటలు సరదాగానేకాదు, బాధగా కూడా వుంటాయి''

''సర్లే... ఈ విషయాలలా వుంచు.. సోనీ... నీ మనసులో ఏదైనా వుంటే సూటిగా చెప్పె య్యి. నా చేతనైన్న సాయం చేస్తాను. చెప్పు... నిన్ను గమనిస్తూనే వున్నాను. మనసులోఏదో దాచుకు మధనపడిపోతున్నావు'' సానున యంగా అడిగింది.

''అక్కా... నాకు... నాకేం చెయ్యాలో తెలీటం లేదు. మనందరం కలిసినా ఏం చెయ్యగలం అనేదే తెలవట్లేదు. నీకు తెలీదు నువ్వు వెళ్ళి పోయిన మూడోరోజే తాతయ్య ''అపురూప టెక్స్‌టైల్స్''లో అడుగుపెట్టడం మానేసారు. అది ఇన్నేళ్ళుగా డాడీ, పెదనాన్న మామయ్య చూస్తున్నారు.

అప్పుల్లో నడుస్తోంది. ప్రతియేటా నష్టాలువ స్తున్నాయి. అది అమ్మాలని వాళ్ల ఉద్దేశ్యం. తాతగారికి ఆస్తులు అమ్ముకోవడం ఇష్టంలేదు. రాత్రి ఏడున్నరకి తాతగారు పోయారు. శవా న్ని నట్టింట్లో పెట్టుకుని మళ్లీ అమ్మకాల ప్రసక్తి తెచ్చారు. నాకూ శ్రీనివాస్‌కి ఇష్టంలేదు. మన అనుకునేవాళ్లందరూ చిన్నో చితకో ఈ కంపెనీ లోనే ఉద్యోగాలు చేస్తున్నారు. సగం పైన జీవితాలు గడచిపోయాయి. ఆస్తులు అమ్ము కుంటే భవిష్యత్తు మాటేమిటి? అదీగాక ఉద్యో గాల మూలంగానైనా కలిసి వుంటున్నాం. లేక పోతే ఒహరి మొహం ఒకరు చూసుకోరు. అది తాతయ్యకు బాగా తెలుసు. ఎవరు ఎవరితోటీ సఖ్యంగా లేరు. ఈ విపత్తు నించి ఎలా బయటపడాలో అర్థం కావటంలేదు.

నీకేమైనా అర్థమైందో లేదో తెలీదు. చెప్పవ లసినవి చాలా వున్నాయి...''

మధ్యలోనే ఆపింది మనోహిత.

''ఇప్పుడొద్దు...'' అంటూ వాచ్ చూసుకుని ''ఇప్పటికే చాలా ఆలస్యమైంది. వాళ్లందరూ తిరిగి వచ్చేస్తారు... వెళ్లాలి. చెప్పానుగా ఎవర్నీ కలుసుకోవడం, మాట్లాడం నాకిష్టంలేదు. మీ అడ్రస్, ఫోన్ నంబర్ ఇవ్వు మళ్లీ వచ్చి కలుస్తానులే. అన్ని వివరాలతో జరిగినదంతా తెలిస్తేకాని ఏం చెయ్యలేం. కాని ఈ రోజు ఫ్లైట్ టికెట్ బుక్ చేసుకున్నాను. వెళ్లాలి. ఓ వారం రోజులు సెలవు పెట్టి వస్తాను. మీకు ఎప్పుడు వస్తే కన్వీనియెంట్‌గా వుంటుంది?''

సంతోషంతో ఎగిరిగంతేసినంత పని చే సింది సన్నిహిత...

''నిజంగా ... నిజంగా నువ్వు వస్తావా?''

''వచ్చేవారం రానా?''

''రేప్పొద్దున్నే వచ్చినా మంచిదే. అక్కా అది నీ ఇల్లే అనుకో. నీకంటే మిగతా పనులు ఎక్కువా?''

''సరే... వచ్చేముందు ఫోన్ చేస్తాను. మరింక వెళ్లనా?''

మనోహిత లేచి నిల్చుంది. ఒకసారి హాల్‌ని కళ్లారా చూసుకుంది. సన్నగా వానజల్లు మొద లైంది. నాలుగడుగులు నడిచాక దొరికిందో ఆటో. ఆటోలో కూర్చుని తల వెనక్కు వాల్చింది.

'మళ్లీ ఈ ఇంటికి ముఖ్యంగా హైదరాబాద్ రాకూడదనుకున్న తనేనా ఇలా! నిజమే ఎందుకు దోషిలా చెయ్యని తప్పుకి తను శిక్ష అనుభవించాలి? తన మనసుకి నచ్చిన పని చెయ్యగల హక్కు తనకుంది'



ఆరోజు మనోహిత పదమూడో పుట్టినరోజు.

అప్పుడప్పుడే మొగ్గ తొడుగుతున్న యవ్వనం. ప్రపంచం కొత్త కాంతుల్ని విరజిమ్ముతున్న సమయం. ఆ పెద్ద భవనం అది భవనం కాదు ఓ కుటుంబం. కృష్ణమూర్తిగారి కుటుంబం.

"నా పిల్లలంతా నా కళ్లముందే ఉండాల న్నది ఆయన జీవితాశయం. అందుకే కొడుకు లు, కూతుళ్లు, మనవలతో ఆ ఇల్లు చైతన్య స్రవంతిలా వుండేది. పిల్లల కోసం రెండో అంతస్తు కట్టిన ఆయన మనవలకోసం మూడో అంతస్తు కట్టాడు.

మూడో అంతస్థులో కృష్ణమూర్తి పెద్దకొడుకు సుందరానికి రెండు గదులు. రామారావుగారికి రెండు గదులు. చిన్న కూతురు గిరిజకు రెండు గదులు ఇచ్చారు.

పెద్దకొడుకు సుందరం వెనకాలో పెద్ద కథ వుంది.

ఇంటర్ పూర్తి చేసి లిటరేచర్‌తో బి.ఏ. చెయ్యడానికి కాలేజీలో చేరాడు. కీట్స్ పొయట్రీ అంటే ప్రాణం పెట్టేవాడు. అప్పుడెప్పుడో కొంచం కవిత్వం కూడా రాసినట్టు గుర్తు. తప్పటడుగు లేస్తున్న చిన్ని పాపాయిలా జీవితం సాగిపోతున్న రోజుల్లో ఓ మలయమారుతంలా చల్లగా ప్రవేశించింది వసంత. మనోజ్ఞతకు రూపం ఇచ్చినట్టుండేదామె.

సుతిమెత్తని కంఠస్వరం. అలవోకగా చూస్తూ కళ్లరెప్పలు వాల్చి నప్పుడు కమనీయ కావ్యాలనిపించే కళ్ళు, పెదవి విరుపులో సైతం నాట్య భంగిమల్ని ప్రదర్శించే నేర్పరితనం, ఆమె నడక ఓ పలికే రాగం. కాలిమువ్వలు సరిగమల్ని ఏర్చికూర్చి పలికేవి. సుందరం జీవితం వసంత మయమైపోయింది. కళ్లు తెరిస్తే ఆమే కళ్లు మూసినా ఆమే, సుందరం ఓ కీట్స్‌లా, ఓ షెల్లీలా, ఓ కృష్ణశాస్త్రిలా మారిపోయాడు. పెదవి విప్పితే కవిత... కలం తీస్తే కవిత. ఆ కవితల్లో ప్రాణం పోసుకున్న వనిత వసంత. మొదటి సంవత్సరం పరీక్ష తప్పాడు సుందరం. ఇహ లాభంలేదని భేషజాలు పక్కకి నెట్టి వసంత తల్లిదండ్రుల్తో మాట్లాడాడు కృష్ణమూర్తి. పెళ్లి ముహుర్తాలు పెట్టుకున్నారు. కార్తీకంలో పెళ్లి.

అప్పటికే చదువు మానేసి తండ్రితోపాటు కంపెనీకి వెళ్లడం ఆరంభించాడు. అయిదు నెలల విరహం అంటే మాటలా?

అడపాదడపా అక్కడో ఇక్కడో కలుసుకునే వారిద్దరూ.

ఆ రోజూ అలాగే కలుసుకున్నారు.

"చీకటి పడిపోతోంది. వెళ్లిపోవాలి" అది పదహారోసారి వసంత అలా అనడం.

నిజమే ఏడున్నరైపోయింది.

అయిష్టంగానే లేచారిద్దరూ.

వసంత ఇంటి వీధి సులువులో నించున్నారిద్దరూ.

"అయిదు నెలలిలా చాలా కష్టంగా వుంది వసంతా. పోనీ మీ నాన్నగారితో చెప్పి ముహూర్తం శ్రావణంలో పెట్టించకూడదూ?" నాజూకైన వసంత చేతివేళ్లు నిమురుతూ అడిగాడు.

"అశ పావం... వంక నా మీదకు నెట్టేద్దామనా? పోనీ నువ్వే వచ్చి అడుగు"

"రానా?"

"ఊహు... వొద్దు... విరహము కూడా సుఖమే కాదా..." హఠాత్తుగా ఎగిరి అతని పెదవులపై పెదవులాన్చి ఒక్క నిమిషం అంతే... చటుక్కున వెనక్కు తిరిగి నడుస్తూ...

"ఇదిగో ఈ జ్ఞాపకాలు నెమరేసుకో" అంటూ ముందుకు సాగింది.

"ఇంటివరకూ రానా వసంతా?" కలలో నించి తేరుకున్నట్టు ఓ క్షణం ఆగి అడిగాడు.

"వద్దులే... అదుగో ఇల్లు కనిపిస్తూనే వుందిగా"

ఆ తొలిముద్దు జ్ఞాపకాలు నెమరేసుకుంటూ వెనక్కు తిరిగాడు. అంతే అదే చివరిసారి వసంతని చూడటం.

తెల్లారేసరికి వసంత కనిపించటంలేదన్న వార్త సుడిగాలిలా ఉక్కిరి బిక్కిరి చేసేసింది.

ఆ మాట వింటూనే స్పృహతప్పి పడిపోయిన సుందరం కోలుకునే సరికే వారం పది రోజులైంది.

ఊరికి దూరంగా పాడుబడిన కోటలో దిగుడు బావిలో నాల్రోజుల తరువాత కుళ్లిపోయిన ఆమె శవాన్ని చూసి అంత్యక్రియలు చేశారన్న వార్త సుందరాన్ని చేరకుండా జాగ్రత్త పడ్డారంతా.

కానీ నెల రోజుల తరువాత ఓ సాయంత్రం చల్లగాలికని బయటకు వెళ్లిన సుందరం మళ్లీ ఇంటికి రాలేదు.

ఎక్కడికి వెళ్లాడో ఏం చేశాడో ఎవరికీ తెలియదు.

పదేళ్ల తరువాత అతను ఇంటికి తిరిగి వచ్చేసరికి చెల్లెళ్లిద్దరి పెళ్లిళ్లూ జరిగి పోవడం గిరిజ అర్నెల్లకే వైధవ్యాన్ని వెంటబెట్టుకుని తిరిగిరావడం జరిగిపోయింది.

పెద్ద చెల్లెలు కామేశ్వరి మేనత్త కొడుకు విశ్వనాథాన్ని ఏరికోరి పెళ్లి చేసుకోడం. తండ్రి అల్లుడికి కంపెనీలో ఉద్యోగం ఇచ్చి అక్కడే వుంచుకోవడం కొంచం చిరాకనిపించాయి. కామేశ్వరి కొడుకులు శంకరం, శ్రీనాథ్‌లు, కూతురు మీనాక్షి, తమ్ముడు రామారావు పెళ్లి జరగడం, ఇద్దరు పిల్లల తరువాత హఠాత్తుగా రామారావు భార్య కార్ యాక్సిడెంట్‌లో పోవడం ఆరేళ్ల మనోహిత, ఏడాది సన్నిహిత, లోకం పట్టనట్టుగా వుండే రామారావ్ అతని మనసుని కలిచివేశారు. ఆ ఇంట్లో పిల్లలందర్నీ చూసేది ఒక్క కామేశ్వరే. గిరిజ ఇష్టం వుంటే బయటకు వచ్చేది లేకపోతే రోజుల తరబడి గది గడపదాటి బయటకు అడుగైనా




పెట్టేది కాదు. అందరి కంటే చిన్నవాడు మనోహర్. అన్నీ స్వతంత్ర్య భావలే. ఎవరి మాటా అతని చెవికెక్కదు. అందుకే చదువు పూర్తవుతూనే లక్షాధికారి కూతుర్ని ఏరికోరి చేసుకుని ఇంటికి తెచ్చాడు. కులాంతరమైనా కృష్ణమూర్తి అభ్యంతర పెట్టలేదు. సుందరం మళ్లీ ఇంటికి వచ్చేసరికి సౌందర్య నెలల పిల్ల. శైలజ మాట్లాడటమే తక్కువ. వీలైనంత వరకూ గది బయటకు వచ్చేదికాదు.

అందుకే కృష్ణమూర్తిగారు ఓ నియమం ఏర్పాటు చేశారు. రోజూ ఎలాగూ వీలుకాదు కాబట్టి ఆదివారాలు అందరూ కలిసే భోజనాలు చేయాలి. పిల్లల పుట్టిన రోజులు చిన్నచిన్న సరదాలూ అందరూ కలిసి చేసుకోవాలి. అందుకే ఆ రోజు అందరూ ఇంట్లోనే వున్నారు. మనోహిత పదమూడో పుట్టిన రోజు. ఒక్కొక్కళ్లకి పదేళ్లు రాగానే ఎవరి గదులు వాళ్లకు ఏర్పాటు చేసింది కామేశ్వరి. రెండో అంతస్థులో మనోహిత, మీనాక్షి, శంకరం, శ్రీనాథ్‌ల గదులున్నాయి. సన్నిహిత, సౌందర్య ఓ గదిలో వుండేవారు.

ఆరోజూ అందరూ కలిసి భోజనాలకి కూర్చున్నారు. పట్టుపరికిణీ, పట్టు జాకెట్, కొత్తగా జారిపోతున్న ఓణీ. తాతగారి పక్కన కూర్చుని వుంది మనోహిత. తొందరపడి ముందే ఆమె జీవితంలోకి తొంగి చూసిన యౌవనం ఆమెను ప్రౌఢగా తీర్చిదిద్దినా మనను మాత్రం బాల్యంలోనే వుందింకా.

"మనో ఏంటమ్మా! అంత నిశ్శబ్దంగా మాటలు రాని మొగలిపువ్వులా కూర్చున్నావ్? మీ ఫ్రెండ్స్ నెవరినైనా నీ పుట్టిన రోజుకి పిలిచావా లేదా?" కృష్ణమూర్తిగారు మనవరాల్ని అడిగారు.

"జవాబివ్వవేం మనో" కామేశ్వరి గొంతు.

"అదేమిటో మాటలు రాని మూగపిల్లలా ఎవ్వరితోటీ నోరు విప్పి మాటే మాట్లాడదు"

"స్పందనని పిలుద్దామనుకున్నాను. దానికి జ్వరం. వారం రోజులుగా స్కూల్‌కి రావట్లేదు" వినీ వినిపించనంత నెమ్మదిగా వుంది మనోహిత స్వరం.

"స్పందనా? కొత్తగా చేరిందా?" కృష్ణమూర్తి ప్రశ్న.

"ఎక్కడుంటారు? ఎవరమ్మాయి?"కామేశ్వరి ఆత్రంగా అడిగింది.

"వాళ్ల ఇంటికెప్పుడయినా వెళ్లావా?"

"లేదు"

'అందుకే మనింటికి పిలవలేదుకదూ!" అన్నారు తాతగారు.

తాతగారంటే మనోహితకు ప్రాణం. ఎంత ప్రాణమో ఆయనంటే అంత కోపం కూడా. 'కనీసం రోజుకు గంటైనా నా కోసం స్పేర్ చెయ్యలేరా?' అదీ ఆ చిన్నారి కోపానికి కారణం. ఇరవై నాలుగ్గంటలూ ఆయనతో మాట్లాడినా వినుగనిపించదు. ఇంట్లో ఎప్పుడైనా ఎవరైనా కాస్త సౌమ్యంగా ఇలా వున్నావ్ అలా వున్నావని విసిగించకుండా, విమర్శించకుండా, ఆప్యాయంగా మాట్లాడతారంటే అది ఆయనే. కానీ ఆయనకి మాట్లాడే తీరికే దొరకదు. ఎంతసేపూ టెక్స్‌టైల్ మిల్స్ ఫ్రెండ్స్. ఆయన జీవితం అంతే!

అత్తంటే అయిష్టం ఎలా మొలకెత్తిందోగాని ఇంతంతై.. చివరికో పెనుభూతంలా మారి... మనసంతా ఆక్రమించి...చివరికి ఆమెను ఏకాంతపు ఒంటి స్తంభపు మేడలో బంధించింది. అలాగని ఇంట్లో ఎవ్వరూ ఆమెని నిర్లక్ష్యం చెయ్యలేదు. కానీ ఎవరేం మాట్లాడినా విమర్శించినట్టే అనిపిస్తుందామెకి. తల స్నానం చెయ్యటం అంతగా నచ్చదు. ఆ కుంకుడు కాయ రసం కళ్లల్లోకి వెళ్లి రోజంతా కళ్లు ఎర్రగా మండుతూ వుండటం బాగుండదు. ఇహ జుట్టు తడారిపోయాక ఆ చిక్కులు తీసేప్పుడు తల విరిగిపోతుందేమో అనిపిస్తుంది. అందుకే తల స్నానం వద్దనడం. బారెడు పొడుగున్న ఆ జుట్టు జడవేయించుకునేసరికి మెడ నొప్పి. ఇవన్నీ ఎవరూ ఆలోచించరు. శుభ్రంగా వుండదు తల స్నానం అంటే చాలు ఏ మూలో దాక్కుంటుంది. నిద్రమొహం. గోళ్లు తీసుకోదు.ఎవరితోనూ మాట్లాడకపోతే పోనీ, ఇంట్లో వుండదు. ఎప్పుడూ ఆ తోటలోనే మకాం' అంటారు.

తోటలోకి వెళ్లి గంటలు గడవటం వాళ్లకి నచ్చదు. అలాగని ఎవ్వరూ ఆపరు.

ఏదో ఒకటి అనాలి, అంటారు.

నిశ్శబ్దంగా లేచింది మనోహిత.

"మళ్ళీ ఎక్కడికి తోటలోకేనా?" కామేశ్వరి ప్రశ్న.

"పగలు కూడా తోటలోకి వెళ్ళద్దా?" కోపంగా అడిగింది మనోహిత.

వెంటనే వెళ్ళిపోవాలి... ఈ జనారణ్యంనించి ఈ చూపుల విమర్శనించి.

"వెలుగుండగానే వచ్చేస్తాను. కదలకుండా ఇరవై నాలుగ్గంటలూ తిని కూర్చుంటే గుమ్మాలు విరగ్గొట్టి పెద్దవి పెట్టుకోవాలి. తిండి తిన్నాక మనని లేపడానికి పనివాళ్లను పెట్టుకోవాలి"

"ఓహ్... ఏం మాటలవి మనో?"

కృష్ణమూర్తిగారు పెద్దగా నవ్వారు.

"ఇలా గాలి వెలుగూ తగలకుండా ఇంట్లో కూర్చుంటే ఒంట్లో ఏ భాగం పనిచెయ్యదు. చర్మం పాలిపోతుంది. చివరకు మంత్రించిన శిల్పాల్లా కదల్లేకుండా మిగిలిపోతాం"

"చాల్చాలు... ఇంక ఆపు. ఈమధ్య వాగటం ఎక్కువైపోయింది. ఎప్పుడో ఓసారి ఇలా అందరం కూర్చుని తింటాం. అలాంటప్పుడు ఇలా మాట్లాడటం బావుండదు. నువ్వింకా చిన్నపిల్లవి కాదు. అలా మాట్లాడితే తోటలోకి పరిగెడతావ్. ఇప్పుడు నీకు తోటలో ఏం పని? పెరిగిన ఆడపిల్లలు అలా తిరగటం మన ఇంటావంటా లేదు. ఇహ మీదట నువ్వు తోటలోకి వెళ్లకు" కోపంగా వుంది కామేశ్వరి స్వరం.

"ఓ గంటలో వచ్చేస్తాను" ఎవరి జవాబుకీ ఎదురు చూడకుండా గబగబా బయటకు నడిచింది.

వెనకాల వాళ్లందరూ ఎలా చూస్తారో వూహించుకుంటే ఆ చూపుల బాణాలు తరుముతున్నట్టనిపించింది. ఒక్కసారి పరుగందుకుని వాళ్ల చూపులకందనంత దూరం వెళ్లిపోవాలని బలంగా అనిపించింది. పరుగెడితే మళ్ళీ ఓ నీతిబోధ. అందుకే నడక వేగం పెంచింది.





నిశ్శబ్దాన్ని అలంకరించుకున్న ఆ సరస్సు ఓహ్ ఒక్కసారి చైతన్యం కళ్లు విప్పినట్టనిపించింది.

"స్పందనా" మనోహిత గొంతులో మార్దవం.

"కోపం వచ్చిందా స్పందనా... ఏం చెయ్యను? ఏ పని చెయ్యాలన్నా వెయ్యి కళ్లు, పదహారు చట్టాలూ. చిన్నపిల్లవు కాదు ఇటెళ్లకు అటెళ్లకు అంటూ ఒకటే సొద. పెద్దత్తకు ఈమధ్య చాదస్తం ఎక్కువైపోయింది. జుట్టు తెల్లబడుతోంది. ముసలిదైపోతోంది కదూ" ఓణీ కుచ్చెళ్ల దగ్గర్నించి ఓ డైరీ అరచెయ్యంత చిన్నది బయటకు తీసింది.

"నీకు చెప్పానుకదూ ఈ కుటుంబం గురించి ఓ పెద్ద నవల రాస్తాను. అందుకే వాళ్లందరి గురించీ రాసుకుంటున్నాను. నేను నవల రాస్తానంటే ఎవరూ నమ్మరనుకో. అయినా నువ్వు నమ్ముతావు. నా మాటలు వినడానికి కనీసం నువ్వైనా దొరికావు. లేకపోతే... ఊ... నేను ఏమైపోయేదాన్ని"

ఆ రాళ్ల మధ్య చదరం ఓ పట్టు పరుపులా అనిపించిందామెకు. వెల్లకిలా పడుకుని కళ్లు విప్పింది. ఆకు పచ్చని రంగు దట్టంగా అలుముకున్నట్టు చెట్లు. ఎలాగోలా దారి చేసుకు దూసుకు వస్తున్న వెలుగు కిరణాలు.

"స్పందనా ఆ చెట్లు తలలు దగ్గరకు చేర్చి ఏం గుసగుసలాడుకుంటున్నాయో విన్నావా? ఆ చెట్లు మనుషుల్లా లేవూ... ఆ గుసగుసలు ఏదో కుట్రలా వుంది? ఒక్కసారి కళ్లు మూసుకో ఈ శబ్దాలు, జరగబోయే ఘోరాన్ని సూచిస్తాయిలా వుంది"

ఒక్కసారి ఒళ్లంతా ఒణుకు కెరటంలా పాకి లేచి కూర్చుంది.

"బహుశా పెద్దత్తలాంటి వాళ్ల ఆత్మలేవో మనమీదకుట్ర పన్నుతుంటాయి. మనం జాగ్రత్తగా వుండాలి స్పందనా" అంటూ డైరీ తెరిచింది మనోహిత.

అయిదారడుగుల దూరంలో చెట్ల మధ్యన నించున్న మనోహర్ నవ్వాడు.

"పెద్దత్త ఆత్మ ఇక్కడికొచ్చిందా?"

మనోహిత త్రుళ్ళిపడింది.

"మనోహర్"

చిన్నప్పటినించీ అతన్ని పేరుపెట్టి పిలవ

డమే అలవాటు. తండ్రి తమ్ముణ్ణి పిలిచినప్పుడల్లా అనుకరించి అనుకరించి అలవాటైపోయింది.

డైరీ కింద పడిపోయింది. లేచి నిల్చుంది మనోహిత.

"నిజమా?"

ఎదురుగా అతని ఉనికిని నమ్మలేకపోతోంది.

"ఈ దారిన వెళ్తున్నాను. నీ గొంతు వినబడింది. ఏదీ నీ ఫ్రెండ్. స్పందన కదూ... పారిపోయిందా?" చుట్టూ చూస్తూ అడిగాడు.

"ఇక్కడికి ఎందుకొచ్చావ్? అబద్ధాలాడకు... నువ్వీ తోటలోకి ఎప్పుడూ రాలేదు. ఈ దారిన ఎందుకొచ్చావ్? నన్ను వెంటాడుతూ వచ్చావ్ కదూ?" తీవ్రంగా వుందా లేత స్వరం.

ఒంగి ఆమె డైరీ పైకితీస్తూ,

"నువ్వు నవల రాస్తే ఎవరూ నమ్మరా? ఎందుకూ?" ఆమె కంఠంలో తీవ్రతని గుర్తించనట్టే అడిగాడు.

"నేనలా అని అనలేదే" మనోహిత మొహం సిగ్గుతో కందిపోయింది.

"నువ్వన్నావు... నేను విన్నాను" చుట్టూ ఓసారి గమనించి ఓ చెట్టు మొదట్లో వున్న రాయి మీద కూర్చున్నాడు.

"నువ్వు సరిగ్గా భోజనం చేశావో లేదోనని మనిద్దరి కోసం అయిస్క్రీమ్ తెచ్చాను"

"ఎక్కడుంది?" అక్కడే కదలకుండా నిల్చుని అడిగిందామె.

మనోహర్ వెనకాల్నించి ఓ చిన్న కారీబాగ్ ముందుకు తీశాడు.

"నువ్వు అయిస్క్రీం తెచ్చావంటే... నా వెనకాలే వచ్చి వుంటావు" మనోహర్ వినీ విననట్టు నటిస్తూ అయిస్క్రీమ్ కప్స్ బయటకు తీశాడు.

"మనో... నువ్వు చాలా తెలివైన దానవు. మనవాళ్లా సంగతి గమనించట్లేదు. అద్భుతమైన తెలివితేటలు నీవి" నవ్వుతూ అంటున్నాడు మనోహర్.

"అన్నీ అబద్ధాలే" గొణుక్కుంది మనోహిత.

"చెప్పు.. ఎందుకు నా వెనకాలే వచ్చావు?" నిట్టూర్చాడు మనోహర్.

"నీకు అయిస్క్రీం ఇవ్వడానికి" ఓ కప్పు ముందుకు చాపాడు.

"నీకు చాలా ఇష్టంకదూ... ఈ రాళ్లన్నీ పేర్చింది నువ్వేనా? ఎంత బాగుంది ఓ గదిలా... నాకు చాలా నచ్చింది"

మనోహిత తలెత్తి అతని వంక చూసింది. పాలరాయి ముక్కల్లా మెరుస్తున్న చిన్నకళ్లు, గాలికి కదులుతున్న జుట్టు, ఎప్పుడూ నవ్వుతున్నట్టు కనిపించే పెదవులు. నిజమే... ఇంట్లో అందరిలోకీ మనోహర్ అందగాడు. సినిమా హీరోలా వుంటాడు. తండ్రికి కుడిభుజం. వ్యవహారదక్షత తెలిసినవాడు. పిల్లల్తో మాట్లాడేంత తీరిక దొరకలేదు అతనికెప్పుడూ. అతడంటే పిల్లలందరికీ ఆరాధనతోపాటు భయం కూడా. అతను ఇంట్లో వుండేదే చాలా తక్కువ.

"అయితే నాకోసం తెచ్చానంటావు" తీసుకుందుకు వెనకముందాడుతూ అందామె. ఒద్దని గట్టిగా చెప్పలేకపోతోంది. ఐస్క్రీం అంటే వున్న ఇష్టం అలా చెప్పనివ్వటంలేదు.

"సరే ఇలాగివ్వు" చాలా నెమ్మదిగా వినీవినబడనట్లుగా వుందామె స్వరం. చెయ్యిచాపి కప్ అందుకుంది. అందుకుంటూ అతని పక్కనున్న మరో చిన్న రాతిముక్కమీద కూర్చుంది. అయిస్క్రీమ్ తింటున్నకొద్దీ మనసు చల్లబడ్డట్టయింది. "పోనీ వెంట వస్తే వచ్చాడు అయిస్క్రీం తెచ్చాడుగా" అనుకుంది. కోపం తగ్గిపోయింది. అయినా అతనలా రావడం అంతగా నచ్చటంలేదు. ఎన్నో రోజులుగా వస్తున్న ఏకాంత స్థలం. అది ఆమె రహస్యం. ఎవరికీ ఇంతవరకూ ఆ స్థలం గురించి తెలీదు. తోటలోకి వెళ్తున్నట్టు తెలుసుకానీ తోటలో ఎక్కడికి వెళ్లేదీ ఇంతవరకూ ఎవరూ కనుక్కోలేదు. కాని ఇప్పుడు... మరోహర్ కనుక్కున్నాడు. అందుకే ఆ ప్రశాంతమందిరంలాంటి ప్రదేశం కొత్తగా వింతగా వుంది. ఇప్పుడది ఆమె స్వంతంకాదు. మనోహర్‌ది కూడా. ఆ విషయమే ఆమె మనసుకి నచ్చనిది.

అయిష్టంగా మరోసారి మనోహర్ వంక చూసి దూరాన వున్న పొదలవైపు తలతిప్పింది.



"ఇక్కడికి రోజూ వస్తావా?" మనోహర్ ప్రశ్న.

అయిస్క్రీం కప్స్ ఖాళీ అయ్యాయి. చిన్న చిన్న గులకరాళ్లు ఏరి నీళ్లలోకి విసురుతున్నాడు.

మనోహిత జవాబు చెప్పలేదు. ఆ చిన్న చిన్న గులకరాళ్లు నీటిఅంచు తగిలీతగలగానే సృష్టిస్తున్న నీటిఅలల్ను చూస్తోంది. ఆ అల... ఓ చిన్న కదలిక ఎంత నాజూగ్గా, ఎంత సుకుమారంగా. ఎంత స్వేచ్ఛగా వుంది మనోహర్‌లాగే. నేను అలా వుండకూడదా? ఉండలేనా? ఇలా ఆలోచనల భారంతో కృంగిపోయే బదులు... ఒంగిపోయే బదులు... హఠాత్తుగా ఆ చిన్ని శబ్దం ఆమె చెవుల్ను సోకింది. నీళ్లలో రాయి మునిగే శబ్దం. భళక్... భళక్... ఆ శబ్దం పెరిగి పెరిగి కొండంతై... సుడిగాలిలా చుట్టుకుపోయి తలనిండా నిండిపోయి ఉహు... ఏమిటీ బాధ... తల వెయ్యి చెక్కలయ్యేలా?

"ఆపు" ఆ కంఠంలో తీవ్రత.

మనోహర్ ఆశ్చర్యంగా చూశాడు.

"ఏమిటి మనో? ఏం ఆపాలి?"

"ఆ శబ్దం. ఆ రాళ్లు విసరటం. ఇక్కడ నిశ్శబ్దం తప్ప ఇంకేం వుండకూడదు" అది శాసనంలా వుంది. చేతిలో గులకరాయి వంక తేరిపార చూశాడు.

"ఓహ్ అదా... నీకా శబ్దం నచ్చదని నాకు తెలీదుగా"

రాళ్లు కింద మట్టిలోకి విసిరాడు.

ఎండిపోయిన ఓ చిన్నకొమ్మ తీసుకుని నేల మీద గియ్యటం మొదలెట్టాడు.

"ఇక్కడికి రోజూ వస్తావా?" మళ్లీ అదే ప్రశ్న.

మనోహిత తలవూపింది.

"మా అందరి గురించీ వ్రాయడానికేనా?"

ఆమె భుజాలు కుదించింది.

"అంటే? ఆ నవల వ్రాస్తావనా? వ్రాయవనా? లేదా ఆ విషయం మాట్లాడటం ఇష్టం లేదనా?"

"అవును. ఆ విషయం మాట్లాడటం నాకిష్టంలేదు"

"పోనీ మీ ఫ్రెండ్ స్పందన గురించి మాట్లాడతావా?"

"దాని గురించి నీతో ఎందుకు మాట్లాడాలి?"

"నువ్వెందుకు లేని స్నేహితుల్ని సృష్టించుకుంటున్నావో నాకు కావాలి. నీకు స్కూల్లో ఎవరూ ఫ్రెండ్స్ లేరా?" మనోహిత మళ్లీ భుజాలు ఎగరేసింది.

"దానర్థం ఏమిటి? నీకే ఫ్రెండ్స్ అఖ్కర్లేదనా? ఉన్న ఫ్రెండ్స్ చాల్లేదనా? దాని గురించి మాట్లాట్టం ఇష్టం లేదనా?"

"నాకిష్టం లేదు"

"పోనీ దేనిగురించి మాట్లాడటం నీ కిష్టం?"

"నా వెనకాలే ఎందుకు వచ్చావు?"

మనోహర్ తల విదిలించాడు.

"మొండి... ఒట్టి మొండిఘటం. మనో నువ్వు ఇందాక అక్కతో అలా ధైర్యంగా మాట్లాడటం నాకు చాలా నచ్చింది. నా ఇష్టం. నేను వెళ్లితీర్తాను. మీరేమైనా అనండి అని నువ్వు వచ్చెయ్యడం చాలా నచ్చింది"

"నేను అన్లేదే?"

"అన్లేదు. కాని నువ్వు వచ్చెయ్యడానికి అర్థం అదే. అందరికీ అర్థమైందా సంగతి"

మనోహిత తలవంచుకుంది. 'అదే నిజమైతే అందరూ అలా అనుకుంటే ఎవరిష్టపడతారిక నన్ను?' మనసులోనే గొణుక్కుంది. 'దీనికి ఎంత పొగరు? ఎవరిమాటా లెఖ్ఖ చెయ్యదని' ఇప్పటికే తిట్టుకుంటూంటారు. అనుకుంటూ వుండటం ఏమిటి అత్త నూటిగానే అంటుంది. అలాగని వినయంగా, ఒద్దికగా వుండటమూ చేతకావడంలేదు. భరించలేని ఒంటరితనం, అసహాయత, భయం, ఎవరితో నూ మనసువిప్పి మాట్లాడనివ్వడం లేదు. ఏం మాట్లాడేది అర్థం అయ్యేలోపే మాటల జల పాతాలు ఉరికివడుతున్నాయి. అందరికీ కోపం వస్తోందన్న సంగతి అర్థం అవుతూనే వుంది. అసహనంగా గోళ్లు కొరకడం మొదలెట్టింది. మనోహర్ తలెత్తి చూశాడు ఆమె వంక. వయసుకి పదమూడేళ్లే అయినా పాతికేళ్ల యువతిలా యవ్వనాన్ని సంతరించుకున్న శరీరం




# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింద కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

ఏప్రిల్ చతుర నవల ప్రతీకారం

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

కళ్ళు తిప్పుకోలేని శరీర సౌష్టవం. అది గమనించని ఆమె అమాయకత్వం. లేకపోతే అశ్రద్ధో, తనను తాను అద్దంలో కూడా చూసుకుని ఉండదేమో అనిపించింది. అంతకుముందెప్పుడూ ఆ పిల్లని అతనంత శ్రద్ధగా గమనించిందీలేదు. ఒకటి అన్నకూతురు కావడం. రెండోది చాలా చిన్నపిల్ల. ఏదో తల్లిలేని పిల్లని అక్క చూస్తోంది. అంతే తెలుసతనికి. రామారావుగారు కూడా కూతుర్నంత శ్రద్ధగా పట్టించుకున్నది లేదు.

ఆ మధ్యాహ్నం. మనోహిత అందర్నీ కాదని తోటలోకి వెళ్లడం మనోహర్‌ని ఆకట్టుకుంది.

ఈమధ్య శైలజకీ అతనికీ అంతగా సరిపడటంలేదు. ఎప్పుడూ తగువులే. ఎందుకీ పెళ్లి చేసుకున్నానా అని అతను అనుకోని క్షణంలేదు. ఇక్కడ ఈ పిల్ల ఇలా ఒంటరిగా కలల లోకంలో.

కొంచెం ముందుకి వంగాడు మనోహర్. ఆమె మొహం. ఓహ్... ఎంత చక్కగా వుంది.

"పండువెన్నెల మించు యావణితి మోము
గండు మీనులబోలు కలికి కన్నులవి
తోరంపు బొమ్మలది తోయజగంధి,
కీరపలుకుల బాలకువలాయతాక్షి
తిలపుష్పముల బోలు తీరు నాసికము
తళుకుటద్దము మించు తరుణి చెక్కిళ్లు
వగడంపు ఛాయల వణితి పెదవులవి
తగుముత్యముల బోలు తరుణి దంతములు
నునువు శంఖముబోలు నళినాక్షి గళము
తొలకరి తీగెయా తోయజగంధి
అరటిబోదెల మించు అతివపెందొడలు
కరిదంతముల బోలు కలికి పిక్కలది
మదగజగమనంబు మగువనడకలది
కొదమ తాబేల్వంటి కుదురు నడకలది

పెళ్లికి ముందర సీతాదేవి వర్ణన అది. అక్షరాలా సరిపోయింది మనో రూపానికి.

అంత దగ్గరగా ఆమెను చూడగానే కళ్లు జిగేల్మన్నాయతనికి. మనోహర్ దృష్టి ఎక్స్‌రేగా మారి పట్టుపరికిణీ వెనకాల కాళ్లను గమనిస్తోంది. ఆ ఆలోచన అతనిలో అస్పష్టంగా ఉద్వేగాన్ని పెంచింది.

"నేను... నేనా ఉద్దేశంతో రాలేదు. ఒకవేళ... ఒకవేళ మీరంతా అలా అనుకుంటే మీరంతా నేనలా అనాలని కోరుకుని వుంటారు" హఠాత్తుగా జవాబిచ్చింది మనోహిత. కాస్సేపు నిశ్శబ్దం.

చిన్నగా నవ్వాడు మనోహర్.

"నిన్నెవ్వరూ జయించలేరు మనో. యు ఆర్ ఇన్‌విన్సిబుల్"

"అది పొగడ్తా?"

"అవును. కానీ అది నిజం కూడా. నీకు పోట్లాటలంటే ఇష్టమా?"

"ఊహు... నాకు నచ్చదు"

"పోనీ నేర్చుకో... నేను నేర్పనా?"

"ఏంటీ? పోట్లాటలు ఇష్టపడటమా?"

"ఊహు... పోట్లాడి గెలవటం. అది నాకు బాగా వచ్చని అంటారందరూ"

"ఎవరందరూ?"

"నన్ను గమనించిన జనాలు... నాతో పోట్లాడి ఓడిపోయిన జనాలు"

"ఊహు... నాకిష్టంలేదు. ఆ బదులు వేరే ఇంకేమైనా నేర్చుకోవచ్చుగా"

"ఏం నేర్చుకోవాలనుకుంటున్నావ్?"

మళ్లీ భుజాలు కుదించింది. "ఏదైనా..."

"ఏదైనా..." వినుగ్గా వెక్కిరించాడు మనోహర్. అంతలోనే గొంతు తగ్గించి కోపం దాచుకుంటూ నవ్వాడు.

ఇదివరకెన్నడూ ఇలాంటి నిర్లక్ష్యపు జవాబులు ఎదురవలేదు. కొంచెం ముందుకు జరిగి,

"అలాకాదు మనూ... నీకేది ఇష్టమో నేను తెలుసుకోకూడదా?"

"ఎందుకు? తెలుసుకుని ఏం చేస్తావ్?"

కాస్త వెనక్కు జరిగింది మనోహిత.

అతని వెనకాల చెట్లలో గల గల... ఉలిక్కిపడ్డాడు. అతని కోపం అవధులు దాటింది.

"నేనిందాకే చెప్పాగా? నీ ధైర్యం నాకు నచ్చింది. అలా నాకెవరైనా నచ్చితే వాళ్ల వివరాలు పూర్తిగా కనుక్కోడం నా అలవాటు"

"ఇంతకుముందెప్పుడూ నువ్వు నా గు

రించి పట్టించుకోలేదు''

''ఇహపైన అలా జరగనివ్వను మనో. ఇహ పైన మనిద్దరం మంచి మిత్రుల్లా వుందాం''

''నువ్వు... మనం... బంధువులం... మరి మిత్రులం ఎలాగవుతాం?'' లేచి నాలుగడుగులు ముందుకు నడిచింది.

''అందుకే మనం ఇంకా మంచి మిత్రులం కాగలం. ఎవరూ మన గురించి వింతగా మాట్లాడరు''

''కాలేమనుకున్నాను'' నీళ్లలో పడుతున్న ధూళిరేణువుల్ని చూస్తోందామె.

''మంచి మిత్రులం మనం అంతే. మంచి ఫ్రెండ్స్ ఒకళ్లనొకళ్లు సంతోషంగా వుంచాలి. నేనిలా నీతో మాట్లాడటం నీకు సంతోషంగా లేదా? లేని ఫ్రెండ్‌ని సృష్టించుకుని మాట్లాడుకోటంకంటే ఇది నయంకాదూ? చెప్పు మన ఇది బాగుందికదూ?''

నెమ్మదిగా తలూపింది మనో. అవును... నాతో నేను నా ఒక్క కంఠస్వరం ఈ శూన్యాన్ని పలికించేకంటె రెండు స్వరాలు బాగుంది. ఎంత రహస్య ఏకాంత స్థలమైనా కాస్సేపటికి బోర్ అనిపిస్తుంది. ఏమిటోఅంతా అయోమయంగా వుంది. ఈ రకంగా మాట్లాడ్డం అంత సమంజసంగా లేదనిపిస్తోంది. కాని మనోహర్ ఎంత చతురంగా మాట్లాడాడంటే ఎలాగైనా లోపం ఆమెదే అనిపిస్తోంది. నెమ్మదిగా తలెత్తి అతనివంక చూసింది.

అతని పెదవులు నవ్వుతున్నాయి. అతని కళ్లు నవ్వుతున్నాయి. ఓహ్ ఎంతందంగా వున్నాడు. మనోకి అయోమయంగా వుంది. ఏదీ అర్థంకాని స్థితి. ఓ పదినిమిషాలు గట్టిగా ఏడుద్దామా అనిపించింది. ''ఇంకేదైనా నేర్చుకుంటానన్నావ్. ఏం నేర్చుకోవాలనుంది?'' మళ్లీ అదేప్రశ్న.

మనోకి జవాబు తోచలేదు. మళ్ళీ గోళ్లు కొరకడం మొదలెట్టింది. అతను ఆమెను గుర్తిస్తున్నాడు. ఆమెపట్ల ఆసక్తి చూపిస్తున్నాడు. మరింక అంతగా కలతచెందాల్సినదేముంది? మనసుని ఓదార్చుకోవాలని ఆమె ప్రయత్నం.

ఏం జరుగుతోంది? ఏం జరగబోతోంది? మాటలు ఎక్కడ్నించి ఎక్కడికి వెళ్తున్నాయనేది ఆమెకు అర్థం కావట్లేదు. ఆ చిన్నారి ఊహకు అందడంలేదు. ఏదో జరుగుతుందన్న భయం నిలవనియ్యట్లేదు.

కాస్సేపు ఓ కాలిమీద నించుని మరో కాలిమీదకు మారి చివరకు మాటల్ను కూర్చుకుంది.

''ఎక్కువ కష్టపడి సాధించగలిగితే నేర్చుకుంటాను''

''ఎందుకు?'' అతని కంఠంలో ఆశ్చర్యం పలికింది.

''అప్పుడిలా ఆలోచిస్తూ కూచునేందుకు టైమ్ దొరకదు. ఎక్కడ వున్నాను? ఎలా వున్నాను? ఏం తిన్నాను? ఫ్రెండ్స్ ఉన్నారా? లేరా? ఇలాంటివన్నీ గుర్తుండనంత బిజీగా వుండాలని నా కోరిక. నన్నీరోజున ఇలా హీనంగా చూసినవాళ్లే నా ప్రతిభను గుర్తించి మెచ్చుకోవాలి'' ఆమె చూపు దూరంగా వున్న చెట్లను కొలుస్తోంది.

''నిన్ను ఎవరైనా హీనంగా చూస్తున్నారా?'' మనోహర్ ఆశ్చర్యంగా అడిగాడు.

''అవును... అందరూ''

''మనో... ఎందుకలా అనుకుంటున్నావ్?''

''అనుకోడం కాదు నిజమే''

''మనో నువ్వెందుకిలా అసంతృప్తిగా, విచారంగా వుంటున్నావో నాకర్థం కావడంలేదు''

''నాకేం విచారం లేదు''

''ఊహు. కాదు, అది నిజంకాదు. మనం మిత్రులంకదా! చెప్పవూ? చెప్పమ్మా''

మనో భుజాలు కుదించి కనుబొమ్మలు ముడివేసి మళ్లీ గోళ్లు కొరకడం మొదలెట్టింది.

''నాకిలా ఇంటినిండా సందడి, మనుమలు నచ్చరు. ఇల్లు ఒక్క నిమిషం కూడా ప్రశాంతంగా వుండదు. ఎప్పుడూ మాటల గోల. పెద్దగా నవ్వులు. అరుపులు. ఒకర్ని ఒకరు దెప్పిపొడుచుకోవడం. ఒకర్ని ఒకరు ఏడిపించడం. ఇవన్నీ నాకిష్టం వుండవు''

''అందుకని... నువ్వు కష్టపడి నీ ప్రతిభకు మెరుగుపెడితే ఇవన్నీ వుండవనా నీ ఉద్దేశం?''




"అవును. నాలా కష్టపడి పైకి రాగలవాళ్లే నా చుట్టూ వుంటారు. అప్పుడీ వెకిలితనం, లేకితనం మా చుట్టుపక్కల కనిపించవు. నేను అందరికీ ఇష్టమైనదాననవుతాను"

మనోహర్ లేచి ఆమెవైపు అడుగులు వేశాడు. చూపుడువేలితో ఆమె నుదుటినించి పెదవులవరకూ సున్నితంగా నిమిరి-

"మనో నువ్వు అందరికీ ఇష్టమైనదానవే. అందరికీ నువ్వంటే ప్రేమే. ముఖ్యంగా నాకు నువ్వంటే చాలా ఇష్టం"

మబ్బులు కమ్మినట్టున్న ఆకాశంకింద గుబురుగా పెరిగిన పొదలు చీకట్ని పెంచుతున్నాయి. గాలి చల్లబడుతోంది. మనో శరీరంలో ఒణుకు.

మనోహర్ ఇంకాస్త దగ్గరకు జరిగాడు. ఆమె మొహం అతని రెండు చేతులమధ్య వుంది.

"మనో... నువ్వంటే నాకు చాలా ఇష్టం" ఇంకో అడుగుముందుకు వేశాడు. హఠాత్తుగా అతని పెదవులు ఆమె పెదవుల్ని పెనవేసుకున్నాయి. మనోకి ఊపిరందటంలేదు. ఉక్కిరిబిక్కిరైపోతోంది. విడిపించుకోవాలని వుంది. అయినా అతనికి కోపం వస్తుందేమోనన్న భయం ఆమెను ఆపేస్తోంది. "నువ్వంటే నాకెంతో ఇష్టం" అని చెప్పిన మొట్టమొదటి వ్యక్తి. దాదాపు రెండుగంటలు తనతోపాటు ఈ తోటలో కూర్చుని తన ఇష్టాఇష్టాల నడిగాడు. స్నేహితుల గురించి కనుక్కున్నాడు. అతనికి నిజంగానే నామీద ఆసక్తివుంది. ప్రేమవుంది. ఇప్పుడు పెనుగులాడితే విడిపించుకుంటే కోపం వస్తుందేమో.

నిజానికి అతనలా ముద్దు పెట్టుకోవడం కూడా పెద్ద ఇష్టంగా అనిపించటంలేదు. అమ్మ ఎలా దగ్గరకు తీసుకుని ముద్దాడేదో అలా చెక్కిళ్లమీద... నుదుటిమీద అలా అయితే బాగుండేది. అమ్మ బ్రతికున్నప్పుడు డాడీ కూడా అలాగే ముద్దు చేసేవారు. తల్లి జ్ఞాపకంతో ఓ రకమైన ఒంటరితనం ఒళ్లంతా అలలా పాకింది.

మనోహర్ ఆమెను మరింత దగ్గరకు లాక్కున్నాడు. అతని రెండు చేతులమధ్య ఆమె సుకుమారపు శరీరం విలవిలలాడ్తోంది. అయినా బాగానే వుంది. అమ్మ స్పర్శలాగా... నాన్న లాలింపులాగా అతను లోగొంతుతో చెప్తున్న మాటలు వెచ్చగా ఆమె చెక్కిళ్లు నిమురుతున్నాయి.

"మనో నువ్వు చాలా మంచిదానివి" ఆ మాటలు ఎంత ఆప్యాయంగా, ఎంత మధురంగా వున్నాయి.

అతన్ని విడిపించుకుంటే ఆ మాటలు వినబడవు. అతను చెప్పినట్టు వినకపోతే మళ్ళీ కన్నెత్తి తనవంక కూడా చూడడు.

"చూడకపోతేనేం?"

ఆమె కళ్లలో నీళ్లు తిరిగాయి.

"కాదు. ఎవరో ఒకరు చూడకపోతే నేను ఇలా బ్రతకలేను"

అందుకే అతన్ని కాదనగల శక్తిలేదు.

అంతలోనే ఏదో గమనిక. అతను... ఆతను డాడీ తమ్ముడు. ఇలా ముద్దుపెట్టుకోడం.

శైలజ పిన్నిని ఇలా ముద్దుపెట్టుకోడం చాలాసార్లు చూసింది.

ఓహ్... నేనింకా చిన్నపిల్లను. నాకు సరిగ్గా తెలీకపోవచ్చు. ఇష్టమైన వాళ్లను ఇలాగే ముద్దుపెట్టుకుంటారు కాబోలు. శిశిరంలో రాలిపడిన ఆకుల్లా దొర్లుతున్నాయి ఆమె ఆలోచనలు.

"ముద్దేకదా... దాని గురించి ఇంతగా ఆలోచించాలా?" తననుతనే విసుక్కుంది.

ఆలోచనలు కొట్టుకుపోయాయి ఏ తీరానికో. మనోహర్ తలెత్తాడు. ఒక్క క్షణం. అంతే. ఏం జరుగుతుందో తెలిసేలోపలే రెండు చేతుల్తో ఆమెను ఎత్తుకుని నాల్గడుగుల దూరం నడిచి గుబురుగా పెరిగిన గడ్డమీద పడుకోబెట్టాడు.

"మనోహర్ బాబాయ్... వద్దు" మనో అరిచింది.

ఊహు... ఆమె మాటలు వినబడితేగా. లేచి కూర్చోబోతున్న ఆమెను వెనక్కుతోసి బలంగా అదిమివట్టాడు.

"మనోహర్... ఇలా నాకు బాగాలేదు. ఒద్దు"

"ఊహు... ఏది బాగుంటుందో, ఏది బాగోదో నీకు తెలియదు" అతని గొంతులో ఎక్క

డ్నించి వచ్చిందా కాఠిన్యం.

ఒక్క ఉదుటున పట్టుపరికిణీ మోకాళ్లపైవ రకూ జరిపేశాడు.

"ఒద్దు... నాకిష్టంలేదు. ఒద్దు బాబాయ్"

"నన్నిప్పుడు బాబాయ్ అని పిలవకు. మనం ఫ్రెండ్స్మి అంతే"

"అయినా సరే నా కిష్టంలేదు"

"అబద్ధాలాడకు. నాకు తెలుసు. ముద్దు పెట్టుకున్నప్పుడు తెలిసింది. నీకు బాగా నచ్చిందని"

"ఉహు... నాకిష్టంలేదు"

"అబద్ధాలాడితే చంపేస్తాను"

అదిరిపడింది మనోహిత. భయం, అయోమయంతో ఏం చెయ్యాలో ఎలా ఎదుర్కోవాలో తెలీని మనసు పనిచెయ్యడం మానేసింది. నిస్సహాయంగా తలెత్తి అతనివంక చూసింది. అతని మొహం ఎర్రగా కందిపోయింది. ఊపిరి బలంగా పీలుస్తున్నాడు. ఆ కళ్లలో ఏమిటది ఎరుపా? కోపమా? కళ్లు గట్టిగా మూసుకుంది.

నిజమా? నిజంగానా? అతను ముద్దుపెట్టుకోవడం తాను ఇష్టపడిందా? ఇష్టం అంటే... నిజమే... అమ్మలాగో నాన్నలాగో ముద్దుపెట్టుకోడం ఇష్టమే. కాని నా మనసు నాకంటె అతనికి బాగా తెలుసునా? నా కిష్టమైందని అతనెవరు చెప్పడానికి? నా మనసుని పాలించడానికి అతనికేం అధికారం వుంది? భయం, అయోమయం తప్ప ఇంకేం తెలవడంలేదు.

"మనోహర్ ప్లీజ్... నాకేం తెలీదు. నన్ను వెళ్ళిపోనీ... నన్ను వదిలెయ్"

"నిజమే... నీకేం తెలీదు. నీకేం కావాలో నీకు తెలీదు. నీకేం కావాలో నాకు తెలుసు. నీక్కావలసింది నేను నేర్పిస్తాను"

నిజమే... ఆమె పిక్కలు ఏనుగుదంతాల్లాగే వున్నాయి.

"భయపడకు మనో. నీకు ప్రేమించడం నేర్పిస్తాను"

ప్రేమ!

ఆ మాట ఆ చిన్నారిని ఉక్కిరిబిక్కిరి చేసింది. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

ఆమె పెనుగులాడటం మానేసింది. కళ్ళు మూసుకుంది...

నరకంలాంటి ఆ ఘట్టం ముగిశాక ఎప్పటికో కళ్ళు తెరచిన మనోహితకు గాలికి గుసగుసలాడ్తున్న చెట్లు కనిపించాయి.



తెల్లారి తన గది దాటి బయటకు రాలేదు మనోహిత. స్కూల్కి వెళ్ళలేదు. నైటీ కూడా మార్చుకోలేదు. చివరికి పాలు కూడా తాగలేదు. కామేశ్వరి కష్టపడి మెట్లు ఎక్కి పైకి వచ్చి తలుపు తట్టినా తియ్యలేదు.

"జ్వరమా? డాక్టర్ దగ్గరకు వెళ్దామా? పోనీ తలుపు తియ్యి ఒళ్ళు వేడిగా వుందేమో చూస్తాను"

"నన్నిలా ఒంటరిగా ఉండనివ్వండి. కొంచెం తలనొప్పి అంతే... నిద్రపోతే తగ్గిపోతుంది. మాటిమాటికీ వచ్చి డిస్టర్బ్ చెయ్యకండి" విసుక్కుంది మనో.

"ఇలాటి పిల్లల్తో ఎలా చావాలో అర్థంకావట్లేదు" గొణుక్కుంటూ మెట్లు దిగిందావిడ. కాని ఆ వయసులో తాముకూడా అలాగే వుండేవారని ఆవిడకు గుర్తురాలేదు. మనో కిటికీలో కూర్చుండిపోయింది. ఎవరికీ చెప్పుకోలేని బాధ. శారీరక బాధకన్న మనసు తీవ్రంగా అస్వస్థమైంది.

ముందురోజు రాత్రి మనోహర్ ఆమెను ఇంటివరకూ తీసుకురాక తప్పలేదు. ఆమె భుజాల చుట్టూ చేతులు వేసి నడిపించుకువచ్చాడు. పెరటి తలుపు దగ్గర ఆగి




''నిన్ను వదలి వెళ్ళడం ఇష్టంలేదనుకో'' అంటూ ఆమెను దగ్గరకు లాక్కుని ఆమె నుదిటిమీద ముద్దుపెట్టుకున్నాడు. చూపుడు వేలు గడ్డంక్రింద ఆన్చి ఆమె తల పైకెత్తి ''ఈ విషయం నోరువిప్పి ఎవ్వరితోటీ చెప్పకు. అర్థం అయ్యిందా?'' అని అడిగాడు. చూపుడు వేలి పొడుగాటి గోరు చర్మంలో దిగి నొప్పిని పిస్తోంది.

''అర్థమైందా?''

తల వూపింది.

''గుడ్ గర్ల్... లోపలికి వెళ్ళు. నేను గేట్లోంచి వస్తాను. రేపు రాత్రి తలుపు గడియ పెట్టకు''

తెల్లారింది. ఇంట్లో ఎప్పటిలాగే హడావిడి. పనిమనిషి గదులన్నీ తుడిచి వెళ్ళింది. తోట మాలి యధావిధిగా తనపని చేసుకుపోతున్నాడు. పోస్ట్‌మాన్ ఉత్తరాలు తెచ్చిచ్చాడెవరికో. పిల్లలంతా స్కూళ్ళకి వెళ్ళారు, వచ్చారు. మనోహిత గది దాటి బయటకు రాలేదు. ఆమె మనసులో ఏ ఆలోచనలూ కూడా లేవు. ఆమె మనసూ, శరీరం కూడా శూన్యమందిరాల్లా అనిపించాయి. స్పందనతో మాట్లాడాలని ప్రయత్నించింది. ఊహూ... స్పందన ఊహల్లోకి కూడా రాలేదు. ప్రయత్నించి ప్రయత్నించి విసిగి వేసారిపోయింది. స్పందన అదృశ్యమైపోయింది. ఇహ మళ్ళీ తిరిగి రాదు. కిటికీ లోంచి బయటి ప్రపంచాన్ని చూస్తూ అలాగే కూర్చుండిపోయింది. రాత్రి నిశ్శబ్దంగా నిస్తబ్దంగా వచ్చింది. రాత్రి కామేశ్వరి మళ్ళీ బతిమాలింది.

ఊహు... మనో తలుపు తియ్యడానికే ఇష్టపడలేదు.

''పాలు పంపించనా?''

''వద్దు''

''ఏం కావాలిమరి?''

'నా మనసులో మాట చెప్పుకుందుకో మనిషి' ఆ మాటలు పెదవి దాటి బయటికి రాలేదు. హఠాత్తుగా దుఃఖం వరదలా పొంగివచ్చింది. కళ్ళు నిండు సముద్రాలయ్యాయి. గదిలో లైట్ కూడా వేసుకోకుండా అలాగే వుండిపోయింది మనో.

రాత్రి పది దాటాక ఇంట్లో జనం నిద్రలోకి జారుకున్నాక తలుపుమీద చిన్నగా శబ్దం.

లైట్ వెయ్యకుండానే తలుపు బోల్ట్ తీసి మళ్ళీ కిటికీలో కూర్చుంది మనోహిత.

''ఒహ్... తలుపు తీసేవుందా?''

లోపలికి వచ్చి తలుపు మూశాడు మనోహర్.

''చీకట్లో కూర్చున్నావా మనూ?''

స్విచ్ ఆన్ చేసిన శబ్దం - లైట్ వెలిగింది.

వాడిపోయి, పాలిపోయిన మొహం, చెక్కిళ్ళ మీద ఎండిపోయిన కన్నీటి చారికలు.

''మనో నిన్ను చూసి ఎన్నో యుగాలైనట్టుగా వుంది. రోజంతా నీ గురించే ఆలోచనలు''

మనోహిత కదల్లేదు. తల తిప్పి అతనివంక చూసింది.

మనోహర్ ఆమెవైపు నడిచాడు.

ఆమెను అనుకుని నిలబడి, ''రోజంతా ఆలోచిస్తూనే వున్నావా? నో డియర్... పిచ్చి పిచ్చి ఆలోచనలు మానేయ్. ఈ జీవితం అనుభవించడానికి నువ్విలా బిక్కమొహం పెట్టుకుని కూర్చుంటే నేనెలా రానిక్కడికి. నీ బరువు.బాధ్యతలన్నీ నాకొదిలెయ్. నీ గురించి నీకేం తెలీదు. నీకు ఏం కావాలో నాకు తెలుసు. అవన్నీ నేను చూసుకుంటాను. నిన్న చెప్పింది గుర్తుందా? మిత్రులంటే ఒకరినొకళ్ళు సంతోషపరచాలి. నువ్వు నన్ను సంతోషంగా వుంచాలి. నేను నిన్ను సంతోషంగా వుంచుతాను. ప్రేమ గురించి సంపూర్ణంగా నేర్పుతాను నీకు''

అతని మాటల్లో మార్దవం, కళ్ళలో ఆప్యాయతకి కరిగిపోయింది మనోహిత. మనసు అతని స్పర్శకోసం, అతని లాలింపుకోసం తహతహలాడ్తోంది. అయినా ఏదో తడబాటు.

''నేను నీకు కూతురి వరస''

''ఆ వావివరసలన్నీ మనం ఏర్పరచుకున్నవే. మన సౌలభ్యంకోసం. మనకి ఏది సంతోషాన్నిస్తే ఆ పని చెయ్యాలి అంతే...''

''అంటే...'' ఏదో అడగాలనుకుని అడగలేకపోయింది.

''అదే చెప్పాను. ఇలాంటి పిచ్చిపిచ్చి ఆలోచనలతో మన ఆనందం పాడుచెయ్యద్దని''

అతని చెయ్యి ఆమె చుట్టూ బిగుసుకుంది.




మనోహిత అప్రయత్నంగా అతని గుండెల మీద వాలిపోయింది. బలమైన అతని చేతుల మధ్య సుకుమారపు గాజుబొమ్మలా మనో కళ్ళు మూసుకుంది.

''నిద్రా... అప్పుడే... లేలే'' మనోహర్ కంఠం ఉత్సాహంగా పలికింది.

''మనో... నువ్వు చెయ్యాల్సిందల్లా ఒకటే. నేను చెప్పినట్లు వినడం... అంతే. నేను నీ గురువుని. నేను చెప్పినట్టల్లా వినాలి... అంతే.

మనమధ్య ఈ విషయం రహస్యంగానే వుండాలి. నేన్నీకు మళ్ళీ మళ్ళీ చెప్పనీ విషయం.

ఈ విషయం ఎవ్వరికీ... ఎవ్వరికీ అంటే చివరికి నీ స్పందనక్కూడా చెప్పకూడదు. అర్థమైందా?

ఒకవేళ... ఒకవేళ నువ్వెవరికైనా చెప్పినా నీ మాటలు ఎవరూ నమ్మరు. నీకు పిచ్చెక్కిందని ఓ గదిలో పెట్టి తాళంవేస్తారు. లేదూ పిచ్చాసుపత్రిలో పారేస్తారు. అంతవరకు నువ్వీ సంగతి తీసుకురావనుకో. నువ్వు మాట్లాడవు. ఇది నా ఆజ్ఞ. కాదన్నావే... నేనేం చేస్తానో నాకేతెలీదు. ముక్కలు ముక్కలుగా నరికిపారేస్తాను నిన్ను. అది గుర్తుంచుకో. ఈ గోలంతా ఎందుకు? నువ్వు నన్ను సంతోషపెట్టు. నేను చెప్పినట్టు విను''

మనో మాట్లాడలేకపోయింది. భయంతో కళ్ళు పెద్దవయ్యాయి. తల వూపింది.

''గుడ్... అలా చెప్పినమాట వినాలి. నిన్ను పూర్తిగా నమ్మలేననుకో. అందుకే మధ్యమధ్య గుర్తుచేస్తూంటాలే''

మనోహర్ ఎప్పుడు వెళ్ళిపోయాడో తెలీదు.

తెల్లారి కిటికీలోంచి ఎండ మొహంమీద పడితేగాని మెలకువ రాలేదు.

గబగబా లేచి బ్రష్ చేసుకుంది.

డ్రెస్సింగ్ టేబుల్ మిర్రర్ముందు నించుని ఒకమారు తనను తాను పరిశీలనగా చూసుకుంది.

''ఊహూ... ఏం తేడాలేదు. ఎప్పటి రూపమే'' పెదవి విప్పి చెబితేగాని ఎవరికీ తెలీదా తేడా. ఎవరికీ చెప్పడానికి వీల్లేదు.

అంటే మనోహర్ అలా వస్తూనే వుంటాడు. అతను చెప్పినట్టల్లా చేస్తూనే వుండాలి. ఎవ్వరూ... ఎవ్వరికీ తెలీదు.

అద్దంలో తనను తాను చూసుకుందోసారి.

పోనీ... పెద్దత్తతో చేప్తే...

ఊహూ... అత్తకు ఎవరిమీదైనా ఏం చెప్పినా నచ్చదు. ఎవరికి? ఎవరికి చెప్పాలి?

గిరిజత్త ఏ లోకంలో వుంటుందో ఆమెకే తెలవాలి. డాడీ... డాడీకి ఎలా చెప్పాలి? అదే అమ్మ వుండివుంటే? మొదటిసారి అమ్మ లేని లోటు కొట్టొచ్చినట్లు కనబడింది.

''మనో నేను నిన్ను ప్రేమిస్తున్నాను. ఈ ప్రపంచంలో అన్నిటికన్నా మిన్నగా, కాని నేను చెప్పినట్టు వినకపోయినా, ఈ సంగతి ఎవరికైనా చెప్పినా ముక్కలు ముక్కలుగా నరికిపారేస్తాను''

ప్రేమిస్తున్నానంటూనే ఒపక్కన అంత క్రూరంగా ఏరకంగా, ఎలా చెప్పగలిగాడు మనోహర్.

★ ★ ★

చూస్తూంటేనే ఏడాది గిర్రున తిరిగిపోయింది. మళ్ళీ పుట్టినరోజు. ఎప్పటిలాగే ఇంట్లో సందడి. అందరూ కలిసి భోజనాలు చేశారు.

కామేశ్వరి నిశ్చింతగా నిట్టూర్చింది.

''మనోలో ఈ ఏడాదిలో ఎంత మార్పు? ఎవరికీ ఎదురు చెప్పటంలేదు. తోటలోకి వెళ్ళడంలేదు. ఎవరేది చెప్పినా వాదించడంలేదు. చాలా మారిపోయింది''

మనోకి పుట్టినరోజు జరుపుకోడం ఇష్టంలేదు. కొత్తబట్టలూ వేసుకోవాలని లేదు. అయినా తప్పదు. తలుపులు వేసుకు గదిలో ఒంటరిగా గడపాలని వుంది. అలాగ ఒంటరిగా వుండే యోగంలేదు.

మనోహర్ వస్తాడు.

ఆరోజు తెల్లవారకముందే రామారావ్ మనోహిత గదికి వచ్చాడు.

''మనో... ఇవాళ నీ పుట్టినరోజు కదూ. పధ్నాలుగు సంవత్సరాలు. మీ అమ్మే వుండి వుంటే...'' అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

మనోహిత తండ్రివంక చూసింది.

మనోహర్‌కి ఆయనకీ పదిహేనేళ్ళు తేడా. మనోహర్ అంత అందంగా అనిపించడాయన. నగం జుట్టు అప్పటికే తెల్లబడిపోయింది. గంభీరంగా, నిండు గోదారిలా వుంటాడాయన. చూపులతోనే లోకాన్ని శాసించగలడు. మనోహిత తల్లి యాక్సిడెంట్‌లో పోయేసరికి అతని వయను ముప్పై అయిదేళ్ళు. మళ్ళీ పెళ్ళి చేనుకుంటాడని ఎదురు చూశారు అందరూ.

ఊహు! ఎవరెన్నిరకాల చెప్పినా అతన్ని ఒప్పించలేకపోయారు. అపురూప టెక్స్‌టైల్స్ అతనిలోకం. ఎక్కువగా మాట్లాడడం అతని అలవాటు కాదు.

"మనో... మీ అమ్మా, నేనూ నీ గురించి ఎలాంటి కలలు కన్నామో అచ్చం అలాగే వున్నావు. నిన్ను చూసినప్పుడల్లా మీ అమ్మే గుర్తుకు వస్తుంది. మీ అమ్మలాగే నీ నమన్యల్ని నువ్వే పరిష్కరించుకునే విశ్వానం పెంపొందించుకో. ఇంతకంటే ఏం చెప్పగలను"

మనోని అక్కున చేర్చుకున్నాడు. మనోహితకి వెయ్యి ఏనుగుల బలం వచ్చింది. మనోహర్ గురించి చెబ్దామని పెదవి కదిపింది.

"డాడీ!"

ఇంతలో ఎవరో పిలవడంతో తండ్రి కిందకి వెళ్ళిపోయడు.

అప్రయత్నంగానే కన్నీళ్ళు ఆమె కనురెప్పలకిందినుంచి జారాయి.

ఈ ఇంట్లో అన్నీ అంతే.

తాతగారూ అంతే. "మనో నువ్వే నా లోకం" అంటాడు కానీ రోజుకో పది నిమిషాలు మాట్లాడే నమయం దొరకదు. కొండమీది కోతి కావాలన్నా నిమిషాల్లో తెప్పిస్తారు. కాని మనను విప్పి మాట్లాడుకుందుకు ఒక్కళ్ళకీ తీరిక వుండదు.

ఏళ్ళకేళ్ళు దొర్లిపోయినా అదే రొటీన్. అవే నరదాలు. అదే తీరికలేకపోవడం. ఈ జీవితాలిక ఇంతేనా?

ఆమెకు ఫార్మాలిటీస్ ముఖ్యంకాదు "నువ్వంటే మాకు ఇష్టం. నువ్వంటే మాకు ప్రాణం" అని పదిసార్లు చెప్తే చాలు. ఒకే ఇంట్లో ఏళ్ళుఏళ్ళు బతికేస్తే చాలు. మనిషికీ మనిషికీ మధ్య వుండేది అవసరమేనా? ఇంకేంలేదా? వీళ్ళంతా ఆయుధాల్లేని శత్రువులు. కోపంగా, కసిగా అనుకుందామె. ఈవేళ నా పుట్టినరోజు నాకు నచ్చినట్టు నేనుండాలా? అందరికీ నచ్చినట్టుండాలా? గొణుక్కుంది.

తోటలోకి వెళ్ళి ఏడాది. స్పందన అదృశ్యమై ఏడాది. ఆపైన తలుచుకుందుకు భయంవేసింది.

ఇంట్లో అందరూ నద్దుమణిగేసరికి పదిన్నర. నిద్రవస్తోంది. అయినా నిద్రపోడానికి వీల్లేదు. మనోహర్ వస్తాడు. అతనికి అలనట, నిద్ర నచ్చవు.

ఓసారి అలాగే తెలీకుండానే నిద్రలోకి జారిపోయింది. చెక్కిలిమీద పడ్డ అతని అయిదు వేళ్ళు నిద్రను తేల్చేశాయి. ఆ జ్ఞాపకం చాలు నిద్ర దరిచేరదు.

పదకొండవుతుండగా వచ్చాడు మనోహర్.

అతని రాక చిరాకనిపించినా వ్యక్తంచెయ్యడానికి వీల్లేదు. రాగానే అతని బోధన మొదలు.

"నేనంటే నీకు చాలా ఇష్టంకదూ!"

"ప్రపంచంలో అన్నిటినీ మించి" అని జవాబిచ్చింది. అలా జవాబివ్వాలని అతనే చెప్పాడు.

"అన్నిటినీ మించి కాదు. అందర్నీ మించి" నరిదిద్దాడు.

"నువ్వు నన్ను ప్రేమించావు. ప్రేమిస్తున్నావు. నిన్ను ప్రేమించమని అడిగావు. చెప్పు"

"నేను నిన్ను ప్రేమించాను. ప్రేమిస్తున్నాను. నన్ను ప్రేమించు మనోహర్. నువ్వే నా లోకం. నువ్వే నా జీవం..." చిలకపలుకుల్లా అప్పగించింది అతను నేర్పినమాటల్ని.

నిజమా... ఇవి... ఇవన్నీ నిజమా? కావచ్చు. లేకపోతే మనోహర్ ఎందుకు వస్తాడిక్కడికి? నాకు... నాకేమీ తెలీదు. ఏ మాటలు ఏ మనిషిని రెచ్చగొడతాయో... కానీ అతనికి తెలునది. బహుశా నాకు తెలీకుండా నన్ను ఎవరో ఒకరు ప్రేమించాలని కోరుకుని వుంటాను. అతన్ని ఆకర్షించివుంటాను. అది అతని తప్పా?





''అన్నట్టు నీ పుట్టినరోజుకి...'' షర్ట్‌జేబులో వెతుకుతూ ''ఏం తేలేదనుకున్నావా?''

''ఊహూ... ఇప్పటికే చాలా ఇచ్చాననుకున్నా వేమోనని''

అతని కళ్ళు విప్పారాయి వ్యంగ్యంగా. ఆమె కళ్ళు మామూలుగా... చిర్నవ్వుతో.

''ఇచ్చినది సరిపోతుందనే మాట ఏ ఆడ దాని నోటివెంట రాకూడదు. నరే... ఆ పాఠంకూడా నేర్చుకుందువుగానిలే... వూ... ఇదిగో తీసి చూడు'' చిన్న ప్లాస్టిక్ బాక్స్ మెరూన్‌కలర్‌ది. అయిష్టంగానే అందుకుని మూత తీసింది.

పచ్చలు పొదిగిన బంగారపు పైట పిన్ను. నోటి మాట రాలేదామెకి.

''నచ్చిందా?''

''చాలా... ఎక్కడ కొన్నావ్? చాలా షాప్‌లు తిరిగావా?''

''ఊహు... ఏం కొనాలో అర్థంకాలేదు. షాప్‌కి వెళ్ళాక హఠాత్తుగా నీ వయసు గుర్తొచ్చింది. చటుక్కున గుర్తొచ్చింది. పవిటలు వేసుకునే వయసని - పవిట పిన్... ఏరి కోరి మరీ కొన్నాను నా దేవతకోసం''

మనోహర్ ఈజీ ఛెయిర్‌లో వాలి సిగరెట్ వెలిగించాడు.

''ఊ... చెప్పు. ఈ రోజంతా ఏం చేశావు?''

ఇంకా ఆ పిన్నునే చూస్తున్న మనోహిత ఉలిక్కిపడింది. ఏదో కలలలోకంనించి వాస్తవం ఊబిలోకి జారిపోతున్నట్టనిపించింది. అవును... ఇంతే అతను వచ్చినప్పుడల్లా ఆరో జంతా ఎలా గడిపినదీ చెప్పాలి.

''ఈరోజు... ఈరోజు మామూలుగానే స్కూల్ కి వెళ్ళాను. నీకు తెలుసుగా నా పుట్టిన్రోజులను పబ్లిగ్గా జరుపుకోడం నాకు నచ్చదు. మామూ లుగా యూనిఫాంతోటే స్కూల్‌కి వెళ్ళాను. ఈరోజు... హిస్టరీ టెస్ట్. అందులో ఒక ప్రశ్న ఇలావుంది. హిస్టరీ అంటే ఏమిటి? వివరించు ము. ఎలా వ్రాయాలో కాసేపు అర్థంకాలేదు. తరువాత వ్రాయటం ప్రారంభించాను. చరిత్ర అంటే నవల వ్రాయటంలాంటిది. ఓ పది పన్నెండు పాత్రలు... వాళ్ళ జీవితాలు... కొన్నా ళ్ళు ఎవరి జీవితాలు వాళ్ళవి. ఆపైన అవన్నీ పెనవేసుకుపోయి కొన్నాళ్ళు సాగి, విడిపోయి చివరికి ఎవరి జీవితాలు వారివై... ఇదేగదా చరిత్ర. భావాల సంగ్రామం. అధికారాల సంగ్రామం... హఠాత్తుగా బాంబ్ ప్రేలుడు''

కాసేపు నిశ్శబ్దం.

''ఈ విషయాలన్నీ... నాకు అనుభవం లేక పోతే... చివరిమాట వ్రాయలేకపోయేదాన్ని''

''చివరిమాటా? ఏమిటది?''

''హఠాత్తుగా ఎదురుచూడని మలుపు... కల్లో కూడా వూహించని ముగింపు. జీవితాల్ని శాసించే అదృశ్యశక్తి''

మనోహర్ ఒక్కక్షణం కళ్ళు మూసుకున్నా డు. పెదవులమీద అదే చిర్నవ్వు.

''ఇంకేం చేశావు?''

''మ్యూజిక్ టీచర్ ర్రాలేదు. చెస్ ఆడాను. ఈమధ్య స్కూల్లో కొత్తమ్మాయి చేరింది. ఓహ్... నిజంగా ఛాంపియన్. నాలుగే నాలుగెత్తులు బస్... అందర్నీ ఓడించేసింది''

''నిన్ను కూడానా?''

''అవును... మొదటిసారిది చెస్‌లో ఓడిపో వడం. ఓసారి ఓడిపోయి ఆమె ఎత్తుల్ని గమనించాను. బెస్ట్ ఆఫ్ త్రీ అని సజెస్ట్ చేశాను. ఒప్పుకున్నారు. ఎవ్వరూ ఎదుర్కోలే రని గర్వం, నిర్లక్ష్యం ఆమెను పూర్తిగా ఆవ రించాయి. రెండో ఆట పదినిమిషాలాడి గెలిచా ను. మూడో ఆట మూడెత్తుల్లో ఆమెని ఓడించా ను''

మనోహర్ కళ్ళు విప్పారాయి.

పధ్నాలుగేళ్ళ మనోహిత అంచనా వేసినంత తెలివితక్కువది కాదేమో! ఎదురె త్తులు వేసి ఎదుటివాళ్ళను చిత్తుచెయ్యగల దేమో!

''ఇహ మాత్స్ క్లాస్ సరేసరి. ఎంత డల్ క్లాసంటే వాళ్ళంతా ఓ నమ్ చేసేసరికి ఓ కునుకు తీసి మొహం కడుక్కుని డ్రెస్ ఛేంజ్ చేసుకోవచ్చు''

''ఇహ పుట్టినరోజు పార్టీలో అందరూ నిన్నూ నీ అందాన్నీ పొగిడేవాళ్ళేకదూ'' సరదాగా వుంది మనోహర్ స్వరం.

''అవును... వాళ్ళ ఇష్టాయిష్టాలకు భంగం రానంతవరకూ నన్ను పొగుడుతూనే వుంటా రు''

మనోహర్ క్షణం ఆలోచించాడు.

''ఎందుకు మనో అలా అనుకుంటావు? నువ్వు చిన్నపిల్లవు కాదు. నీ సంగతి నువ్వు చూసుకోగలవు. నీకో రూమ్ స్పెషల్‌గా ఇచ్చా రు. వేళకు కావలసినవన్నీ అమరుస్తున్నారు. చదివిస్తున్నారు. ఇంతకంటే ఏంకావాలి?''

''అవును... అంతకన్నా కావలసినదేమిటి?'' వినీవినబడనట్టుగా అంది.

''పైగా నా అంతటివాడు నీకుండగా ఇంకేం కావాలి?'' లేచి తలుపు తీసేముందే బయట లైట్ ఆఫ్‌చేశాడు. ఆ చీకట్లో తలుపు దగ్గిరకు లాగి వెళ్ళిపోయాడు. మనోహిత మంచం నడిమధ్యన అలాగే కూర్చుంది. కద ల్లేదు. నిశ్శబ్దం ఆమెను ప్రక్షాళన చేస్తున్న ట్టుగా వుంది. ఈమధ్య మనసు నోరు మూసుకు పడివుండటంలేదు. 'ఇది తప్పు', 'ఇది తప్పు' అని మాటిమాటికీ ఆమెను నిలదీస్తోంది. కానీ ఎవరూ పట్టించుకోని స్థితిలో మనోహర్ స్నేహం, అతని పొగడ్తలు, చిన్నచిన్న బహు మతులు, అతని పెదవులపై మెరిసే చిర్నవ్వు లోని ఆప్యాయత ఆమెను ఓడించేశాయి. అతని తియ్యని మాటలకోసం చెయ్యవలసిన పనులు తల్చుకుంటే అయిష్టంగా, అస హ్యంగా, జుగుప్సగా చెప్పలేని వికృతరూపంలో వుందా భావన. అయినా అతని కన్‌సర్న్ ఆమెను గెల్చుకుంది. కానీ రోజులు గడిచి మనను పెరిగేకొలదీ ఆమెకు నిజం అర్థమౌ తోంది. అది ప్రేమకాదు నటన. అవి అర్థంలేని మాటలు, మనసుని మభ్యపెట్టి కావలసినది పొందే ఆయుధాలు.

ఎలా?

ఎలాగ ఆ ఊబినించి బయటకు రావడం?

ఏదో ఒకదారి వెతకాలి... తప్పదు.

ఎన్నాళ్ళిలాగ?

★ ★ ★

మనోహితకి పబ్లిక్ పరీక్షలు.

ఎవరిదో దూరపు బంధువులింట్లో పెళ్ళి. వెళ్ళక తప్పదు. చివరకు మనోహితను ఇంట్లోనే వుంచేశారు. ఎలాగూ రామారావ్, సుందరం, గిరిజ, కృష్ణమూర్తిగారు ఏ పెళ్ళిళ్ళకూ పే రంటాలకు వెళ్ళరు.

కామేశ్వరి, విశ్వనాథం పిల్లలందర్నీ తీసుకు వెళ్లారు. శైలజ తండ్రికి వంట్లో బాగుండలేదని పుట్టింటికి వెళ్ళింది. మనోహర్ రాక మరీ చిరాకు తెప్పించింది మనోహితకు. దిక్కుమాలిన పరీక్షలు లేకపోతే అందరితో వెళ్లేది. అయినా ఓ పక్కన పరీక్షలంటే అంద రూ వెళ్ళాలా? నా చదువు గురించి ఎవరికీ శ్రద్ధలేదు.

''పెళ్లికి వెళ్లలేదన్న దిగులు నీకు అఖ్ఖర్లే దు మనో, ఈ రాత్రి సరదాలన్నీ మనవే'' మంచం మీద కూర్చున్నాడు మనోహర్.

మనోహితకి ఒక్కసారి తండ్రి, తాతగార్లు బయటకు వచ్చి చూసేలా పెద్దగా కేకలు వేద్దామనిపించింది.

చిర్నవ్వుల పులితోలు కప్పుకున్న అతని మొహాన్ని పచ్చడి చేద్దామనిపించింది.

పిచ్చికుక్కలా మీదపడి క్షమించమని అడి గే వరకూ కొరికేద్దామనిపించింది.

వీటిల్లో ఏ ఒక్కటి జరిగినా అతను చూస్తూ వూరుకోడు. ముక్కలు ముక్కలుగా నరికిపారే స్తాడు. అతనంటే భయం తప్ప మరేం మిగల్లే దామె మనసులో.

తండ్రిలాగే వ్యాపార లక్షణం బాగా అబ్బింది మనోహర్‌కి. ఈమధ్య బాంక్‌లోన్‌తో స్వంతంగా రెడీమేడ్ గార్‌మెంట్స్ బిజినెస్ ప్రారంభించాడు. ఆర్నెల్లలో నిలదొక్కుకోవ డమే కాకుండా లాభాలు కూడా గడిస్తున్నాడు. చివరికి కృష్ణమూర్తి కూడా అతన్ని మెచ్చుకో కుండా వుండలేకపోయాడు.

''నా తర్వాత... ఈ ఫాక్టరీ ఎవరైనా చూడగ లరంటే అది మనోహర్ ఒక్కడే'' అని గర్వంగా చెప్పేవాడు. తండ్రి ఉద్దేశ్యం తెలిసాక మనో హర్ ప్రవర్తన నచ్చకపోయినా అతనికి వ్యతిరే కంగా మాట్లాడే ధైర్యం ఆ ఇంట్లో ఎవరికీ లేకుండాపోయింది.

మనోహిత మనసును దిగులు ఆవ రించింది.




ఈ ఇంటికి మనోహర్ మకుటంలేని మహా రాజు. అతని ముందు ఆమె విలువ ఈగకీ దోమకీ కూడా సరిపోదు.

అతను ఆ ఇంటి మహారాజు.

ఆమె ఓ మనిషి, కుటుంబంలో ఓ మనిషి. డాడీ కూడా అంతే. ఎవరితో చెప్పుకోను?

ఎవరు నమ్ముతారీ విషయం?

"మనో... నా ప్లాన్స్ గురించి నీకు చెప్పాను కదూ... ఓ ట్యుటోరియల్ మొదలు పెడదామని"

"అవును... ఈ ఇంటికి రాజువి ఇహ వీధి నేలదామని... ఆ పైన ఊరిని.. చివరకు రాష్ట్రాన్ని"

మనోహర్ కనుబొమ్మలు ముడివడ్డాయి. కళ్లు చిన్నవయాయి. ఆమె ముంగురులు సవరిస్తున్న చేతులు ఆ జుట్టును మెలితిప్పాయి. ఆమె అతన్ని విదిలించింది.

"నిన్ను నా ప్లాన్స్ వినమన్నానంతే... నేను మాట్లాడేప్పుడు నేల చూపులు చూడొద్దని వెయ్యిసార్లు చెప్పాను. ఇలా నా కళ్లలోకి చూడు"

ఇదివరకులా ఆమె దినచర్య గురించి అడగటం మానేసాడతను. ఎంతసేపూ తను చెయ్యబోయే బిజినెస్ ఆలోచించే ప్లాన్స్.. అవే. అప్పుడప్పుడు శైలజతో గొడవలు వివరించేవాడు. అతను చెప్పాక ఆమె అభిప్రాయం చెప్పాలి. అలాగని అది పూర్తిగా వినడు.

"ఈ ఏడో వచ్చేయేడో డాడీ రిటైరవుతారట. అపురూప టెక్స్‌టైల్స్‌కి డైరెక్టర్ నా తర్వాత నువ్వేనని చెప్పాడు. ఒకసారి డైరెక్టర్ నవనీ. ఫారిన్ యార్న్ తెప్పించి టెక్స్‌టైల్ ఇండస్ట్రీలో రివల్యూషన్ తెస్తాను"

"నిన్ను డైరెక్టర్‌ని చేసినంత మాత్రాన తాత గారీ మార్పులన్నీ ఒప్పుకుంటారా?"

మనోహర్ ఉరిమి చూశాడు.

"నోర్మూసుకుని విను"

"అలాగైతే వినడం ఎందుకు?"

"జస్ట్ విన్న జనం ఎలా ఫీలవుతారు తెలుసుకుందామని"

"అయినా తాతగారు ఇంత తొందరగా రిటైరవరు" హఠాత్తుగా మనోహర్ లేచి నిల్చున్నాడు.

"ఏమో చెప్పలేం"

ఈసారి మనోహిత మాట్లాడలేదు.

"ఒకసారి అడిగి చూడు"

"నువ్వే అడగరాదూ నేనేమన్నా నీ పిఏనా?" నెమ్మదిగా గొణిగింది.

"నువ్వేం అంటున్నావో నాకు వినబడలేదు" అతని పెదవుల మీద చిర్నవ్వు.

"నువ్వే అడిగితే బావుంటుంది"

"నేను అడగను"

షూలేసెస్ బిగించుకుంటూ,

"సండే రాత్రి వస్తాను. ఈలోగా అడిగిపెట్టు"

"సండేనా? ఏదో ట్రిప్ వుంది వెళ్తున్నానన్నావ్?"

"అన్నాను... ట్రిప్ కాన్సెల్ అయింది. ఏం?"

"సండే నేనువుండను"

"ఉండవా? ఎక్కడికి వెళ్తున్నావ్?"

"సండే మార్నింగ్ స్కూల్‌నించి అజంతా ఎల్లోరా వెళ్తున్నాము. మళ్లీ బుధవారం కాని రాము"

"ఈ సంగతి నాకు చెప్పలేదేం?"

"ఇంకా ఎవరికీ చెప్పలేదు"

"ఎందుకు?"

"చెప్పాలనిపించలేదు" అంది

"ఎలా అనిపించదు? నువ్వు చేసే ప్రతిపనీ నాకు చెప్పి తీరాలి"

ఒంట్లో శక్తంతా ఎవరో అదృశ్యంగా జలగలా మారి పీల్చేసి నట్లనిపించిందామెకి.

"సండే నువ్వు ఇంట్లో వుండాలి" అది ఆజ్ఞ.

"ప్లీజ్ మనోహర్... పిక్నిక్‌కి వెళ్లాలి, ప్లీజ్"

ఒంటిమీద ఒక్కనూలు పోగు లేకపోయినా ఆమె చిగురుటాకులా ఒణుకుతున్నది భయంతో చలికికాదు.

"సండే ఒక్క రోజే తీరిక నాకు, తరువాత



పదిహేన్రోజులు తీరికే వుండదు''

ఆమె కళ్లలో నీళ్లు తిరిగాయి.

''నాతో గడపాలంటే అంత బాధగా వుందా?'' మెత్తని కత్తిలా అతని స్వరం.

ఆమె క్రింది పెదవి పళ్లమధ్య కొరుక్కుంది.

''కాదు.. కానీ''

''కాదని నాకు తెలుసు. నేనంటే నీకు చాలా ఇష్టం. కదూ?''

''అవును. నువ్వంటే చాలా ఇష్టం. కానీ ఈ ఒక్కసారి నన్ను వెళ్లనీ''

''మళ్లీ చెప్పు''

''నువ్వంటే నాకు చాలా ఇష్టం మనోహర్. ఈ ఒక్కసారీ ప్లీజ్''

''నో...వీల్లేదు. నాతో వాదించకు డియర్. నీకోసం నా ప్లాన్స్ మార్చుకోను. మీ ప్రోగ్రాం మార్చుకోండి'' బయటకు వెళ్తూ మళ్లీ చెప్పాడు.

''నండే వస్తాను''

మనోహిత ఏడుపు గొంతులోనే వుండిపోయింది. చేతికందిన ఫ్లవర్‌వాజ్ నేలకు విసిరి కొట్టింది. అది పదహారు ముక్కలైంది. అంతలోనే స్ఫురించింది ఈ శబ్దానికి తాతగారో, డాడియో లేచివస్తే...

హఠాత్తుగా ఎక్కెక్కి ఏడవటం మొదలెట్టింది.

ఏడ్చిఏడ్చి ఓపికంతా ఉడిగిపోయాక బాత్‌రూమ్‌లోకి వెళ్లి తలారా స్నానం చేసింది చన్నీళ్లతో, చేసిన పాపం వదిలించుకుంటున్నట్టు. వారాలు, నెలలు, సంవత్సరాలు ఇలా గడచిపోవలసిందేనా? నిరాశ, అయిష్టం ఆమె మనసులో కాన్సర్‌లా పెరిగిపోతున్నాయి. ఇవిలాగే పెరిగితే ఏదో ఓ రోజున నేను చచ్చిపోవడం ఖాయం.

ఏదో ఒకటి చెయ్యాలి ఎలా?

లేదూ ఎముకలూ రక్తం మాంసం ఈ అవయవాలూ అన్నీ అదృశ్యమై పోతాయి.

★ ★ ★

ఆరోజు మనోహిత పుట్టినరోజు.

పగలు వీలవదని రాత్రి డిన్నర్ అరేంజ్ చేసుకున్నారు.

ఎప్పటిలాగే ఖరీదైన బట్టలు.కొత్తగా ఓ జత బంగారు గాజులు, ఓ గొలుసు చేయించారు కృష్ణమూర్తిగారు. ఎప్పటిలాగే కుటుంబం అంతా డైనింగ్ హాల్‌లో టేబుల్ ముందున్నారు. తాతగారు, ఆ పక్కన రామారావ్, సుందరం, ఈ పక్కన మనోహర్. మిగతా కుర్చీలో పిల్లలు పెద్దలు ఇంటిల్లిపాదీ అక్కడే వున్నారు.

మనోహర్ ముందే చెప్పాడు రాత్రికి వస్తానని.

ఎలా అతన్ని వదిలించుకోడం?

ఒకసారి తలెత్తి అందర్నీ చూసింది మనోహిత.

జీవితాంతం ఇహ ఇలాగే కొత్త బట్టలు కాదంటే నగలు విందు వినోదాలు మనోహర్... చివరికి చివరికి పెళ్లైనా అతన్ని తప్పించుకోడం కుదరదేమో. జీవిత ఖైదీనా నేను? ఎక్కడికి పారిపోయినా అతను వెంటాడి, వేటాడి వారానికి రెండు రోజుల నరకం, వారానికి రెండ్రోజుల చన్నీటి తల స్నానం పాపపంకిలాన్ని కడిగేసుకుందుకు.

''తాతగారూ'' ఎవరో తరుముకు వస్తున్న తొందర ఆమె పిలుపులో,

''మనోహర్ నా గదికి వచ్చి నన్ను నన్ను రోజూ కాదు కాదు వారానికి రెండ్రోజులు రేప్...''

గాలి కదిలినా వినిపించే నిశ్శబ్దం.

కామేశ్వరి తృళ్లిపడింది.

''మనోహరా? అవునా? నిజమా?''

''మనోహరా?'' సుందరం గొంతులో ఆశ్చర్యం.

''ఊహు... అలా జరగదు'' గిరిజ స్వరం.

రామారావ్ గారు లేచి కుర్చీ వెనక్కు లాగారు.

''మనోహర్ దిక్కుమాలిన వెధవా! నువ్వు... నువ్వు మనిషివేనా? ఏం చేశావు?''

మనోహర్ గొంతు ఖంగుమంది.

''అబద్ధం అది... అవి అన్నీ అబద్ధాలే. మనం సరదాగా దాని బర్త్‌డే సెలబ్రేట్ చేస్తు




న్నాం''

''మనోహర్'' నమ్మలేకపోతున్నాడు సుందరం.

''భగవంతుడా... ఎలాంటి మనిషి'' విశ్వనాథం గొంతు.

''మీరందరూ మీ మాటలు ఆపండి'' కృష్ణమూర్తిగారు ముందుకి వంగారు మనోహిత వంక. తల వాల్చుకుని వున్న ఆమె నిస్సహాయత వంక చూశారు.

''నిజమా మనో?''

తలెత్తలేదు కాని అవునన్నట్టు తలవూపిందామె. భయం బెంగ ఒక్కసారి ఏడుపు మొదలెట్టింది.

''శుద్ధబద్ధం.. ఒట్టి అబద్ధాల కోరు. ఎప్పుడూ అంతే'' మనోహర్ కంఠం స్థిరంగా పలికింది.

''నీ చిత్తం వచ్చినట్టు వాగకు'' రామారావుగారి అరుపు.

''నువ్వు దాని మాటలు నమ్ముతావా? ఒట్టి పిచ్చిమొద్దు. గాలితో చెట్లతో మాట్లాడే పిచ్చి మొహం'' మనోహర్ స్వరం దూకుడుగా పలికింది.

అక్క పక్కన కూర్చున్న సన్నిహిత ఉన్నట్టుండి పెద్దగా ఏడవటం మొదలెట్టింది.

కృష్ణమూర్తిగారు మనోహర్‌ని ఉరిమి చూశారు.

''మనోహర్... ఈ అరుచుకోడాలు తిట్టుకోడాలు బాగాలేవు. సామ్యంగా మాట్లాడితే వుండు లేదూ ఇక్కడ్నించి వెళ్లిపో'' రౌద్రంగా వుందాయన స్వరం.

''వెళ్లిపోవాలా? ఓ పక్కన నా మీద లేని నిందలన్నీ మోపుతుంటే నేను తలవంచుకు వెళ్లిపోవాలా?''

''ఉండనీండి నాన్నా... మనం అతని మాట కూడా వినాలి. ఆలోచించాలి'' సుందరం సమర్థన.

''మనో చెప్పమ్మా... ఏం జరిగింది?'' రామారావుగారి స్వరం ఒణికింది.

''మనోహర్ మాట వినాలా? ఏం వింటారు?'' అంటూనే మనోహిత వంక తిరిగి...

''మనో ఇది నిజమా? చెప్పమ్మా, బాబాయ్ అలా చేశాడా నిజంగా జరిగిందా? కలగన్నావా? ఒక్కోసారి కలలుకూడా నిజమనే భ్రమింపజేస్తాయి'' కామేశ్వరి ప్రశ్నించింది.

తల ఒంచుకున్న మనోహిత ఎక్కెక్కి ఏడుస్తూనే అవునన్నట్టుగా తలవూపింది.

''మనోహర్... నువ్వు మనిషివా? నువ్విలా ప్రవర్తించగలవని కలలో కూడా అనుకోలేదు. ఇదే నిజమైతే...'' ఆ మాటలు మధ్యలోనే ఆపేశాడు విశ్వనాథం.

''ఎవరో అబద్ధాలు చెప్తే నన్ను నేను సమర్థించుకోవలసిన అవసరం నాకు లేదు. అది ఒక మెంటల్ కేస్. ఎలాగోలా అందరి సానుభూతీ పొందాలని చూస్తోంది. ఆ అవతారం చూడండి, పిచ్చివాలకం అదీ... తోటలో కోతిలా గంతులు వేస్తూంటుంది. ముంగిలా గదిలోంచి బయటకి రాదు. ఎవరితోటీ మనసు విప్పి మాట్లాడదు'' గుసగుసల మధ్య అతని స్వరం కంచుగంటలా వినిపిస్తోంది.

''దాని సంగతి అందరికీ తెలును అబద్ధాల కోరు. ఆ సంగతి అందరికీ తెలును. అది అది ...'' అతని మాటలు తడబడ్డాయి.

''అలా అని వూహించుకుని వుంటుంది'' శైలజ అందుకుంది. మాటలు మధ్యలో ఆపి అందరూ ఆమెవైపు ఆశ్చర్యంగా చూశారు.

ఇంతవరకు శైలజ ఎప్పుడూ ఇలా నలుగురిలో పెదవి కదిపి మాట్లాడిందిలేదు.

''మనో ఇంకా చిన్నపిల్ల. ఆమెంటే ఎవరికీ పెద్ద ఇష్టం లేదు. ఒక్కళ్లంటే ఒక్కళ్లు కూడా స్నేహితులు లేరు. ఎవరింటికీ వెళ్లదు. ఎవర్నీ ఇంటికి రమ్మనదు. ఒంటి కాకి. ఇహ అందంగా కళ్లెదుట కనిపించినవాడు మనోహర్ ఒక్కడే. అతన్ని తలెత్తి ధైర్యంగా చూడదెప్పుడూ.

మనోహర్ తన అందాన్ని పొగడాలని ఎదురు చూసుంటుంది. మనోహర్ అంతగా పట్టించుకోకపోయేసరికి ఎలాగైనా వగ తీర్చుకోవాలని చెప్తోందిలావుంది''

రామారావుగారు కూతురి పక్కకు వెళ్లి కూర్చున్నారు.

''శైలజా ఇది మా కుటుంబ విషయం

నువ్వు కల్పించుకోవలసిన అవసరం లేదు. జవాబు చెప్పాల్సింది మనోహర్, నువ్వు కాదు'' మనోహర్ ఎగిరిపడ్డాడు.

''నేను చెప్పాల్సిన అవసరంలేదు. శైలజ ఒకటీ నేనొకటీ కాదు ఇద్దరం ఒకటే''

కృష్ణమూర్తిగారికి మతిపోయింది.

''గిరిజా పిల్లల్ని తీసుకెళ్ళు... పైకో కిందకో''

గిరిజకి అక్కణ్ణించి వెళ్లాలని లేదు. అయినా తండ్రి చెప్పాక వెళ్లకపోతే ఎలా?

''నేన్నమ్మలేకపోతున్నాను'' సుందరం ఆశ్చర్యం మళ్లీ ప్రకటించాడు.

''అదీ మన ఇంట్లో... ఇలా వావి వరసల్లే కుండా ఊహు''

''ఏం జరగలేదు. తమ్ముడి మీద ఆపాటి నమ్మకం లేకపోయిందాయనకి. చిన్నప్పట్నించీ పుట్టినప్పట్నించీ చూస్తున్న నా మీదే నమ్మకం లేదు. అసలు మనోని ముట్టుకునే ఆలోచనైనా కల్లో కూడా రాలేదు. మనో నీ కూతురు. నువ్వు నాకు ప్రపంచంలో అందరి కంటే ఇష్టమైన వాడివి, నువ్వు లేకుండా ఇంతవాడిని అయ్యేవాడినా? అలాంటిది నీ కూతురికి ద్రోహం చేస్తానా? నీ మీద మనసులో ఎంత గౌరవం వుందో ఆమె పట్ల కూడా అంత గౌరవమూ వుంది. నేనిలా చేసానని నువ్వు నిజంగా నమ్ముతున్నావా?''

''మనో విన్నావుగా? ఏమంటావు?''

మనో కదల్లేధు, తలెత్తలేదు, ఏడుపు ఆపలేదు. కామేశ్వరమ్మకి దిక్కుతోచట్లేదు.

''తమ్ముడూ... మరీ అంత కంగారుపెట్టకు. నిదానంగా పరిష్కరించాలిలాంటి విషయాలు'' తొట్రుపడుతూ చెప్పింది.

''నిదానం! ఎంతవరకు? జీవితాలు సర్వనాశనమైపోయాక కూడా నిదానమేనా?'' అంటూ మనో వంక తిరిగి...

''మనో... ఇలా నా వంక చూడు. ఇది ఆట కాదు. నువ్వు చెప్పిన విషయం జీవన్మరణాలకు సంబంధించినది. అది నువ్వు అల్లిన కట్టుకథా? నువ్వు కన్న కలా? నిజం చెప్పమ్మా... ఈ ఇంటి పరువు ప్రతిష్ఠలు నువ్వు చెప్పే మాట మీద ఆధారపడి వున్నాయి. చెప్పమ్మా'' మనోహిత ఒళ్లు గగుర్పొడిచింది.

కన్నీళ్ల మధ్య మసక మసగ్గా తండ్రి మొహం.

అతని మొహం గంభీరంగా నిజాన్ని తట్టుకోలేనట్టుగా వుంది.

తాతగారి వంక అర్థిస్తున్నట్టు చూసింది.

''చెప్పమ్మా... ఏం జరిగిందో చెప్పు''

మళ్లీ నిశ్శబ్దం.

''ఊహు... ఇదివరకే చెప్పాను''

కామేశ్వరి వైపు తిరిగింది.

''చెప్పు మనో... నువ్వేం చెప్పినా వింటాం. ఏం చెప్పాలనుకుంటున్నావో చెప్పెయ్యి''

మనోహిత ఒణికిపోయింది. సిగ్గుతో చితికిపోయి అవమానంతో ఊపిరాడక ఉక్కిరిబిక్కిరౌతున్న ఆ చిన్నారికి మాటలెక్కడ్నించి వస్తాయి.

''చెప్పానుగా'' గొణిగింది.

''ఎందుకు మాటిమాటికీ ఆ పిల్లని చెప్పు చెప్పని బలవంతం చేస్తారు? ఏదో పొరబాటున ఓ మాట చెప్పింది. మళ్లీ మళ్లీ ఆకట్టుకథే చెప్పమని ఎందుకు బలవంతం? అన్నయ్యా... నిన్ను చూస్తుంటే నాకు బాధగా వుంది. మనం ఏం పాపం చేశామని ఇలాగ. పెద్దన్నయ్య బతుకు అలాగయింది. పోనీ వదినపోయినా ఏదో మనసు నోదార్చుకుని బతుకుతున్నారంటే ఈ పిల్ల ఇలా తయారైంది. భగవంతుడా ఎందుకిలా జరుగుతోంది'' అతని కళ్లనిండానీళ్లు.

రామారావుగారు తమ్ముడి కన్నీళ్లు చూస్తున్నారు. మనోహిత తండ్రి వంక చూసింది. అతని కళ్లల్లో తమ్ముడి పట్ల ఆప్యాయత ప్రేమ ఏం చెయ్యలేని అసహాయత.

''మన జీవితాలకేం జరగలేదు. మనోకి ఏం జరగలేదు. ఇప్పుడు మనో చిన్న పిల్లకాదు. పదిహేనేళ్లు. ఇకపైన మనో అమ్మాయి. వయసొచ్చిన అమ్మాయి. ఏం జరగలేదు కదూ. చెప్పు మనూ!''

''అందరూ చెప్పడం కాదు, ఏం జరిగిందో ఏం జరగలేదో నువ్వు చెప్పు మనూ'' కృష్ణమూర్తిగారిలో ఎప్పటిలా సౌమ్యత లేదు.




"మనో... ఏదైనా జరిగితే వివరంగా చెప్పాలి. ఏదో ఓ మాట చెప్పేసి పెదవి కదవకపోతే ఎలా? నిజం తెలియకపోతే నేను ఏం చెయ్యాలో ఎలా నిర్ణయించను? ఎవరినని శిక్షించను? నువ్వు నాకు సరిగ్గా జరిగినది జరిగినట్టు చెప్పాలి. అప్పుడు తరువాత ఏం చెయ్యాలనేది నిర్ణయిస్తాం" మనోహిత కళ్లు గట్టిగా మూసుకుంది.

అవును ఇప్పుడు సూదుల్లాంటి ఆ చూపులు ఇహ గుచ్చుకోవు. వీళ్లందరి కళ్లల్లో ఇన్ని సూదులున్నాయా? అది నాకిన్నాళ్లుగా తెలియదేం?

ఏం చెప్పాలి తాతగారికి?

హఠాత్తుగా రోజూ మనోహర్ చెప్పే పాఠం గుర్తొచ్చింది.

'నేను... నేనే అతన్ని ప్రేమిస్తున్నాను. అతనంటే చాలా ఇష్టం. ప్రపంచంలో అన్నిటినీ మించిన ఇష్టం. నేనే అతన్ని నన్ను ప్రేమించమని అడిగాను. అతనే నా లోకం, అతనే నా ప్రాణం'

ఏం చెప్పాలిక తాతగారికి?

ఇదంతా ఎలా చెప్పను?

కృష్ణమూర్తిగారికి అయోమయంగా వుంది. కోపంగా వుంది. అసహాయత ఆయన సహనాన్ని పరీక్షిస్తోంది.

"మేం ఏం చేయాలో నువ్వు చెప్పు మనో. ఈ పరిస్థితుల్లో ఏం జరిగిందో నువ్వు చెప్పందే మాకు ఎలా తెలుస్తుంది?"

"నే చెప్పేది మీరు నమ్ముతారా? నమ్మితే ఇలా మాటిమాటికీ గుచ్చిగుచ్చి అడుగుతారా?"

"శైలజ చెప్పింది నిజమేనేమో! మనోహర్ హీరోలా వుంటాడు. ఇవన్నీ మనో కల్పనలేమో" సుందరం తనలో తను గొణుక్కున్నాడు.

హఠాత్తుగా మనోహిత చేతుల్తో మొహం కప్పుకుని ఏడవడం ప్రారంభించింది.

"ఇప్పుడిహ ఏం చెయ్యటం?"

"మనో... ఈ సంగతి ఇంకెవరికైనా చెప్పావా?" రామారావుగారు ఆమె తల నిమురుతూ అడిగారు.

'లేద'న్నట్టు తల ఊపింది.

"మరింకేం? ఏం జరగనట్టుగానే వుందాం. ఇది మన కుటుంబం పరువూ, ప్రతిష్ఠకు సంబంధించిన విషయం. నెమ్మదిగా ఆలోచించవచ్చు" విశ్వనాథం సూచన.

"మరీ పిల్లనలా బెంబేలు పెట్టెయ్యకండి. నిదానంగా చెప్తుంది." కామేశ్వరి సలహా. అంతలోనే ఏదో ఆలోచన వచ్చినట్టు.

"మనో చెప్పేది నిజమే అయివుంటుంది. అందుకే... అందుకే మరి మాట రావట్లేదు దానికి"

"అక్కా... నామీద నమ్మకంలేదా?" మనోహర్ కంఠం పూడుకుపోయింది. కళ్ళనిండా నీళ్ళు.

"ఏం జరిగిందో నాకేం తెలుసు? మనో భయపడుతోంది. అది చెప్పేది కూడా వినాలిగా మేం"

"వినండి. అది చెప్పే కట్టుకథలన్నీ వినండి" మనోహర్ గొంతులో ఉక్రోషం.

"మనోహర్! నీ ఇష్టంవచ్చినట్టు మాట్లాడకు" కృష్ణమూర్తిగారి హెచ్చరిక.

"చెప్పు మనో... ఒకవేళ ఇది నిజమైతే మనం పోలీస్ రిపోర్ట్ ఇవ్వాలి" కామేశ్వరి అడిగింది.

"ఏమని? మనోహర్ అన్న కూతుర్ని రేప్ చేశాడనా? ఓహ్..." విశ్వనాథం హేళన.

మనోహర్ పళ్ళు పటపటలాడాయి.

"అవును... అదే నిజమైతే ఆ నిజం పోలీస్‌లకి నేనే చెప్తాను" దృఢంగా పలికింది కామేశ్వరి స్వరం.

"కానీ... దానికి మేం ఒప్పుకోం" అది రామారావు స్వరం.

"మన కుటుంబం బజారుపాలవడం మాకెవరికీ ఇష్టంలేదు. ఈ కుటుంబాన్ని బఫూన్లలాగా పేపర్లకెక్కించడం మాకిష్టంలేదు" ఆయన గొంతు రుద్ధమయింది.

"ఈ వార్త బయటకు వస్తే... నష్టపోయేది నా కూతురు మీరందరూ కాదు"

"మనో... నా ఒక్కదానితో చెప్పు" కామేశ్వరి అనునయంగా అడిగింది.

ఓహ్... చాలా ఆలస్యంగా అనునయం.

"చెప్పమ్మా!"

"మీరు ఏరకంగానూ నాకు సాయపడలేరు."

"పోనీ మేం ఏం చేయాలో చెప్పు" కృష్ణమూర్తిగారి ప్రశ్న.

"మీ అందరినించీ నాక్కావలసింది ఒక్కటే... ప్రేమ, ఆప్యాయత, నేనూ మనిషిననే గుర్తింపు" కుర్చీ వెనక్కిలాగి లేచి నిల్చుంది.

"ఇంకా మన మాటలు పూర్తవలేదు"

"నేను చెప్పాల్సింది చెప్పేశాను... చెప్పేశాను... చెప్పేశాను" పరుగెత్తినట్లుగా మెట్లెక్కి గదిలోకి వెళ్ళిపోయింది మనోహిత.

జీవితంలో మొదటిసారిగా తల్లిని తల్చుకుని ఏడ్చింది.

'అమ్మా... నువ్వెందుకు అర్థాంతరంగా వెళ్ళిపోయావు"



"మనో కనిపించడంలేదు"

ఇల్లంతా హడావిడిగా గగ్గోలుగా వుంది. ఇల్లూ, వాకిలీ ఊరూ, వాడా గాలించడం అయింది. అయినా లాభంలేకపోయింది.

వారంరోజులు ఎలా గడిచాయో ఎవరికీ తెలియదు. చివరకు పోలీసులు కూడా విఫలమయ్యారు. ఇంట్లో ఎవరికీ తిండీ, తిప్పలూ లేవు.

చివరకు ఓ డిటెక్టివ్ ఏజన్సీని సంప్రదించారు.





"మీరేం చేస్తారనేది నాకనవసరం. మనోహితను తెచ్చి నాకప్పగించండి. మీరేం అడిగినా కాదనను"

ఆ మాటల్లోనే వ్యక్తమౌతోంది కృష్ణమూర్తిగారి బాధ.

"కృష్ణమూర్తిగారూ! ఇక్కడ డబ్బు సమస్యకాదు. మా శాయశక్తులా ప్రయత్నిస్తాం. ఈ పారిపోయిన పిల్లల్తో ఒకటే చిక్కు. వాళ్ళు తిరిగి రాదల్చుకోకపోతే బ్రహ్మదేవుడు వెదికినా కనబడరు"

ఆ మాటలు విననట్టుగా రామారావ్‌వైపు తిరిగి "వాళ్ళకి కావలసిన వివరాలు, మనో ఫొటోలు ఇవ్వు" ఆజ్ఞాపించినట్టుగా చెప్పాడు కృష్ణమూర్తిగారు.

"మనో ఎక్కువ మాట్లాడేది కాదు. ఆమెకు ఫ్రెండ్స్ ఎవరూ వున్నట్టులేరు" రామారావుగారు జవాబిచ్చారు.

"నువ్వెప్పుడైనా మనోని ఆమె ఫ్రెండ్స్ గురించి అడిగావా?"

"అలా అడగటం మనోకి నచ్చదు. అది ఎలా వుండేదో మీకు తెలుసుగా నాన్నా. తన ఇష్టమే తనది. ఎవర్నీ లెక్కచెయ్యదు.

మనోని చూసుకుని వాళ్ళమ్మను మర్చిపోదామనుకున్నాను. కామేశ్వరి, నేనూ ఎంతో ప్రయత్నించాం. అన్నట్టు మనో గురించి ఏదైనా తెలుసునంటే అది కామేశ్వరికే"

"ఇందాకే ఆవిడతో మాట్లాడాంగా? ఏం చెప్పారు... ఆ అమ్మాయికి పుస్తకాలంటే తగని ఇష్టం. కనిపించిన పుస్తకమల్లా కొని గది పుస్తకాల జాతర చేసేస్తుందని. ఒంటరిగా తోటలో గంటలు గంటలు గడిపేదనీ, ఫ్రెండ్స్ ఎవరూ లేరనీ, లేనివాళ్ళ పేర్లు కల్పించి వాళ్ళతో ఒంటరిగా మాట్లాడేదనీ, స్కూలంటే పెద్దగా ఆసక్తి లేకపోయినా పరీక్షలో మంచి మార్కులు వచ్చేవనీ, హఠాత్తుగా ఓ రెండు మూడేళ్ళుగా అలంకరణపట్ల శ్రద్ధ పెంచుకుందనీ, ఇంతేగా? ఈ పాపతో ఇంతకుమించి ఎవ్వరూ ఎప్పుడూ ఇంకేమీ మాట్లాడలేదా?"

"చిన్నచిన్న సరదాలు, పండగల్ని అందరం కలిసి జరుపుకునేవాళ్ళం. భోజనాలు కలిసి చేసేవాళ్ళం"

"భోజనాల గురించి కాదు. మాట్లాడటం

గురించి చెప్పండి''

ఆ డిటెక్టివ్ ఏజన్సీ తాలూకు మనిషి లేచి నిల్చున్నాడు. ఓ చేత్తో బ్రీఫ్‌కేస్ అందుకుంటూ ''అందరూ ఒకటే కుటుంబం. కలిసి వుంటు న్నారు. ఎవ్వరికీ ఆ అమ్మాయి గురించి ఏమీ తెలీదు. ఇంతవరకు ఒక్కొక్కళ్ళతో గంటలు గంటలు మాట్లాడి నేను తెలుసుకున్నది అది.

స్కూల్లో క్లాస్‌మేట్స్‌తో మాట్లాడాను. అంద రితో కలిసి మెలిసి బాగానే వుండేదట. ఆమె అంటే అందరికీ ఇష్టమే. కాని మరీ క్లోజ్ అని చెప్పుకోగల ఫ్రెండ్ ఒక్కళ్ళంటే ఒక్కళ్ళు కూడా లేరు.

''ఎప్పుడూ ఒంటరిగా ఉండటం ఇష్టపడే దని తెలిసింది. కాని ఒక్కళ్ళంటే ఒక్కళ్ళు కూడా ఆమెలో వేలెత్తి చూపించగల లోపం గురించి మాట్లాడలేదు. కాగడా పెట్టి వెదికినా ఇల్లొదిలి పారిపోయే లక్షణాలు లేవు.

''క్లోజ్ ఫ్రెండ్స్ లేరు. ఆమెకి ఎవరు బాగా నచ్చారు ఎవరు నచ్చలేదనేది ఎవరికీ తెలీదు. బాయ్‌ఫ్రెండ్స్ వున్న దాఖలాలు లేవు. అబ్బా యిల్తో మాట్లాడే అలవాటే లేదు. ఇరుగూ పొరుగిళ్ళకు వెళ్ళే అలవాటు లేదు.

''తెలిసిందల్లా మనోహిత పేరు, వయసు పదిహేనేళ్ళు, అయిదడుగుల ఎత్తు, పచ్చటి పసిమిఛాయ, పెద్దపెద్ద కళ్ళు. ఈ వివరాల్తో ఎక్కడని వెతకం? ఎలా సాధించం? అయినా ప్రయత్నిస్తాం'' అంటూ బయటికి నడిచాడు.

కృష్ణమూర్తిగారు చాలాసేపు నిశ్శబ్దంగా వుండిపోయారు. మనసును కొరికేస్తున్న ఆలోచ నలు.

సన్నగా వానజల్లు.

''మనో గొడుగు తీసుకెళ్ళలేదు'' గొణుక్కు న్నారు.

మనోకి వాన అంటే ఇష్టం. ఇలాంటి వాన లోనే ఓసారి తన్నుతాను మరచిన మనో డాన్స్ చేస్తుంటే ఆయన చూస్తే... అది... ఎన్నేళ్ళ క్రిందటిది? ఈమధ్య ఆమె డాన్స్ నేర్చు కుంటోందా లేదా? అన్నది గమనించే తీరిక కూడా లేకుండాపోయింది. అవును... గమ నించలేదుకాని గత కొన్నేళ్ళు ఆ చిన్నారి చైతన్యం శిలగా మారిన శిల్పమైపోయింది.

''మనోహర్‌నోసారి పిలు''

''ఆఫీస్‌లో వున్నాడు''

''పిలు... అర్జంటు''

''మనో చెప్పింది నిజామా నాన్నా? నేను ఎటూ నిర్ణయించుకోలేకపోతున్నాను. ఓవక్క కన్నకూతురు. మరోవంక తోడబుట్టినవాడు. ఎవర్ని నమ్మాలి? ఎవర్ని కాదనాలి? ఏడుపు తప్ప ఎవరెంత అడిగినా నోరు విప్పలేదు మనో... ఏం చెయ్యగలం?''

''చెప్పలేదు... నోరువిప్పి ఒక్కమాటా చెప్ప లేదు. మనం అందరం ఆమె పెదవి కదిపి చెప్తేకాని అర్థంచేసుకోలేని స్థితిలో వున్నాం. ఆ అమ్మాయి బాధను మనం ఏం పంచుకున్నాం? ఎంతో నమ్మకంతో, ఎంతో ఆశతో మనమేదో చేస్తామని నోరు విప్పిన ఆ పిల్ల గొంతు ఆశలగొంతు నులిమి చంపేశాం. మనం... మనందరం మనుమలమేనా? పక్కవాళ్ళ మంచిచెడులు మనకి అక్కర్లేదు. మన సమస్య లు తీరటం కావాలి... అంతే'' అన్నారాయన

తాతగారు ఏదో చేస్తారని ఎంత నమ్మకంగా రహస్యాన్ని పదిమందిలో వెల్లడిచేసిందో, ఆ నమ్మకం వమ్మయిపోయాక ఆ కుటుంబ పె ద్దగా నిలబడే హక్కులేదింక. మనో చెప్పాక... ఏం చెయ్యాలనే ఆలోచనే రాలేదెందుకు? చెప్పింది నిజమా? అనే అనుమానం ఎందుకొ చ్చింది?

మనోకి అండగా నిలబడి ఆ సమస్య పరి ష్కరించి వుంటే... నిజాన్ని బయటకు లాగి వుంటే... ఏ నిజాన్ని బయటకు లాగాలి? తెలియని నిజమైతేగదా! నిజమనితెలిసినా ఎందుకు నిర్లక్ష్యం చేసినట్టు. అవమానంతో, రోషంతో మాట్లాడలేని స్థితిలో వున్న ఆ పిల్లను గుచ్చిగుచ్చి అడిగి, జవాబివ్వలేదని దాని ఖర్మానికి దాన్ని ఒదిలి, ఇదేనా ఓ కుటుంబం చెయ్యాల్సిన పని? ఎవరి చేతికీ మట్టి అంట కూడదు... ఎవరూ ఇబ్బందిపడకూడదు.

ఏ సమస్యలూ రాకూడదు. ఏ సమస్యలైనా వచ్చాయో తోక ముడుచుకుని తప్పించుకోడాని కి ప్రయత్నిస్తాం, వెలుగుచూసిన బొద్దింకల్లా' ఆలోచనలు అలా సాగిపోతూనేవున్నాయి కృష్ణ మూర్తిగారిలో. మనోహర్ వచ్చాడు.

''ఏమిటీ అర్జంట్‌గా రమ్మన్నారట... చాలా బిజీగా వున్నాను. ఈసారి నగానికి సగం లాభం వచ్చే అవకాశాలున్నాయి''

కృష్ణమూర్తిగారు నింపాదిగా లేచి వెళ్ళి డోర్ క్లోజ్‌చేసి బోల్ట్ వేశారు. మళ్ళీ తిరిగి వచ్చి రివాల్వింగ్ చెయిర్‌లో కూర్చున్నారు.

''మనోహర్... ఆ పిల్లని ఎన్నిరోజులలా సతాయించావ్?''

''భగవంతుడా... మళ్ళీ మొదలా... రాత్రి ఓ వందసార్లయినా చెప్పివుంటాను నాకేం తెలియదు నన్ను విసిగించవద్దని. దానికేం పూనకం వచ్చిందో... నామీద ఇష్టంవచ్చిన కథలు కల్పించింది. నామీద ఏం కక్షో అర్థంకావట్లేదు. శైలజ చెప్పింది నిజమేకావచ్చు. ఆ పిల్లకి స్కూలు చదువు ఇలాంటివసలు నచ్చవు.''

''అని నీకెలా తెలుసు?''

''నాకా... నాకెలా తెలుస్తుంది? అందరూ మాట్లాడుకున్నప్పుడు వినడమే. మీరూ వినేవారుగా. ఎప్పుడైనా స్కూలుగురించి ఫ్రెండ్స్ గురించి మాట్లాడిందా?''

''నేనంతగా గమనించలేదు''

''బహుశా ఎవరినో ప్రేమించి వుంటుంది. వాడితో లేచిపోడానికి వంక దొరక్క ఇలా ఎత్తులేసి, ఇలా కథలు సృష్టించి...''

తండ్రివంక చూసి చిన్నగా నవ్వి ''ఈ జనరేషన్ ఎక్కడ్నించి ఎక్కడికి వెళ్తోంది. వీళ్ళ భవిష్యత్తు తల్చుకుంటేనే భయంగా వుంది. ఆ పిల్ల పిచ్చికి మీరెందుకు వర్రీ అవుతారు? మరీ చిన్నపిల్ల కాదు. ఏది మంచి ఏది చెడు అనేది తెలుసుకోగల వయసు. ఇలా ఇంట్లోంచి పారిపోతే మనమెందుకు బాధపడాలి? మన ప్రయత్నంగా మనం ఆ పిల్లని వెతికిద్దాం. ఒకవేళ... ఒకవేళ దొరక్కపోతే దాని ఖర్మ. ఎక్కడో ఓచోట క్షేమంగానే వుండి వుంటుందనిపిస్తోంది''

చాలాసేపు నిశ్శబ్దం.

మనోహర్ కంఠం ఉల్లాసంగా వుంది. చిరుబాధ తాలూకు ఛాయలు కూడా లేవు. ఎందుకంత ఉల్లాసం... ఉరిశిక్షనించి తప్పించుకున్నంత సంతోషం.

మనో కళ్లముందు మెదిలింది కృష్ణమూర్తిగారికి. 'ఎప్పుడూ ఒంటరిగా తనదైన లోకంలో గడిపే మనో ఇలా అబద్ధాలు చెపుతుందా?'

ఎప్పుడూ ఒంటరిగా వుండే ఆ పిల్లతో ఎందుకు సాన్నిహిత్యం పెంచుకోలేకపోయాను? ఎందుకు ఆ పిల్లకోసం ఓ అరగంట రోజూ వెచ్చించలేకపోయాను? మనుమలకంటే, మనసులకంటే డబ్బే ముఖ్యం అనుకున్నానా?'

కృష్ణమూర్తిగారి మనసు ఆయన్ని నిలదీసింది. ఆరోజు అందరి ప్రశ్నలకూ జవాబు చెప్పలేక కృంగిపోయి వెక్కివెక్కి ఏడ్చిన మనో రూపం కళ్ళలో మెదిలింది.

''ఇంకా ఆలోచిస్తున్నారా? అవన్నీ వదిలెయ్యండి నాన్నా. అలసిపోయినట్టున్నారు. టీ తెమ్మని చెప్పనా?'' మనోహర్ కుర్చీలోంచి లేచాడు.

''మనోహర్! ఆగు. మనో నిజం చెప్పిందని నాకు తెలుసు''

ఉలిక్కిపడ్డాడు మనోహర్.

''అయితే దాని అబద్ధాలే మీరు నమ్ముతారన్నమాట. నేను చెప్తున్నాను అది చెప్పినవన్నీ అబద్ధాలే''

''నువ్వు చెప్పింది విన్నాను. కానీ మనో చెప్పింది నమ్ముతున్నాను''

''నీకు కొడుకుమీదకంటే ఆ అబద్ధాలపుట్ట మీదే నమ్మకం ఎక్కువా? నువ్వు నాకన్న తండ్రివి. నువ్వే నమ్మకపోయాక నన్నింకెవరు నమ్ముతారు?''

కృష్ణమూర్తిగారు కొడుకువంక నిశ్శబ్దంగా చూశారు. శరీరంలో శక్తంతా ఉడిగిపోయినట్టు కుర్చీలో కూలబడిపోయారు.

''నాన్నా... మీకెలా చెప్తే అర్థం అవుతుందో నాకు తెలియటంలేదు. ఆమెతో నాకేమిటి సంబంధమని నన్నిలా వేధిస్తున్నారు? నన్ను మీరెందుకు నమ్మరు? నాకూ భార్యా, ఓ కూతురూ వున్నారు. ఆ పిల్లనలా ఎలా చేస్తాననుకుంటున్నారు?''

కృష్ణమూర్తిగారు నిశ్శబ్దంగా కూర్చున్నారు.

''అప్పుడప్పుడు ఆ పిల్లతో మాట్లాడటానికి ప్రయత్నించాను. స్నేహంగా వుందామనుకు





న్నాను. మీకు తెలుసుగా? ఆ పిల్ల ముభావం, మనసువిప్పి మాట్లాడకపోవడం నాకు నచ్చలేదు. నేను శ్రద్ధ చూపించి పలకరించినా మాట్లాడకపోవడం నాకు బాధనిపించింది. అంతే మరి పలకరించడం మానేశాను. దానికే నామీద కత్తికట్టాలా? దానికే నాతో మాట్లాడటం మానెయ్యాలా? దానికే నామీద ఇంత పెద్ద నిందమోపాలా?

రోజా ఇంట్లో చూడటం తప్ప పెద్దగా వివరాలేవీ తెలీని ఆ పిల్ల తోటలో, గుహలో ఒంటరిగా లేని స్నేహితుల్ని ఊహించుకుని కలల్లో బతికే ఆ పిల్ల, కట్టుకథల్ని చెప్పిబతికే ఆ పిల్ల, అందర్నీ బెదిరించడానికి పారిపోవడం ఏమిటీ? మీరు నన్ను నమ్మకపోవడం ఏమిటి?''

''తోటలో గుహేమిటి?'' కృష్ణమూర్తిగారు నెమ్మదిగా ప్రశ్నించారు.

''గుహా... ఓ... అదా... దట్టంగా చెట్లు అల్లుకొన్న చోటు... కామేశ్వరక్క చెప్తూనేవుండేది - అలా ఒక్కదానివీ తోటలో తిరక్కని. కాని నీ మాటెవరికి లెక్కన్నట్టు ఈ పిల్ల వెళ్తూనే వుండేది. తనకి ఎప్పుడేది చెయ్యాలనిపిస్తే అది చేసెయ్యడమే ఆ పిల్ల పద్ధతి''

మనో... మనో సంగతి నాకు తెలీదా? విరిసీ విరియని ఆ చిన్నారి వయసు పదిహేను, కాటికి కాళ్ళు చాపిన తన వయసు అరవై పైన. జీవితం తొలిమెట్టుమీద ఆ పసికందు, తుది మెట్టుమీద తను. ఆ పిల్ల మనసు చదివేందుకు ఈ అనుభవం చాలదా? మనసులో మర్మం లేకుండా వున్నదున్నట్టు మాట్లాడే ఆ అమ్మాయి తత్వం ఎన్నిసార్లు మనసులోనే తను మెచ్చుకోలేదు? అలాంటి అమ్మాయి ఇలా చేస్తుందని ఎందుకు అంచనా వెయ్యలేకపోయాడు?

ఆయన మొహం కందగడ్డలా మారింది. ఊపిరి వేగం పెరిగింది. మనో మొహం కళ్ళలో మెరిసిందొక్షణం.

''మనో చెప్పింది నిజం అని నాకు తెలుసు. మీరంతా అనుకున్నదానికంటే మనోని బాగానే స్టడీచేశాను నేను. ఆ పిల్ల చిన్నది. అబల, అది ఆసరాగా తీసుకుని నీ అవసరాలు తీర్చుకున్నావు అమానుషంగా... నీ తత్వం నాకు తెలుసు.

ఎంతకాలం... ఎంతకాలం ఆమెనలా హింసించావు?''

అతని మాటలు పూర్తి కాకముందే మనోహర్ వెళ్ళిపోడానికి తలుపువైపు నడిచాడు.

''నీ మొహం నాకు చూపించకు. వెళ్ళిపో.. నా కళ్ళ ముందునించి వెళ్ళిపో.. నా ఇంట్లోంచి వెళ్ళిపో.. నా ఇండస్ట్రీనించి వెళ్ళిపో''

మనోహర్ గిరుక్కున వెనక్కు తిరిగాడు ''ఏమిటీ?''

''అవును నా ఇండస్ట్రీనించి వెళ్ళిపో, నీ అవసరం నాకు లేదు. అది ప్రారంభిన్త మన కుటుంబం కోసం. నువ్వు కుటుంబాన్ని అవమానించావ్. నువ్వు కుటుంబంలో మనిషివి కాదు. నువ్విహ నీ గద్దమొహం నాకు చూపించకు''

కన్నీళ్ళు అతని మనసును తేళ్ళలా పాముల్లా కుడుతూనే వున్నాయి. ఆ బాధ మాటల్లో వ్యక్తం అవుతోంది.

''నీ ప్రవర్తనతో అలిసిపోయాను'' నిజంగానే ఆయన స్వరంలో అలసట.

మనోహర్ వెనక్కు నడిచి వచ్చాడు.

''నాన్నగారూ మీరు మీరివన్నీ కోపంతో అంటున్నారా? ఆమె చిన్నపిల్ల. నిజం చెప్పిందా? అబద్ధం చెప్పిందా అనేది మీకు తెలీదు. ఈ కంపెనీ ఇది మనందరిదీ అనుకుని పని చేశాను. నేను తప్పు చెయ్యలేదు చెయ్యలేదు చెయ్యలేదు. ఇహ ఆ విషయం మీద వాదనలు వద్దు. ఈ విషయం ఇక్కడికి మర్చిపోదాం. మనోని వెతికిద్దాం. ఇంటికి తీసుకొచ్చి జాగ్రత్త పడదాం. ఈ విషయం జరగనట్టే భావిద్దాం''

కృష్ణమూర్తిగారు బరువెక్కిన కళ్ళ రెప్పలు పైకెత్తారు. ''నా ముందునించి వెళ్ళిపొమ్మని చెప్పాను''

మనోహర్ చిన్నగా నవ్వాడు, ''మళ్ళీ ఆలోచించండి నాన్నగారూ''

''రేపు తెల్లారేలోగా నువ్వు ఇంట్లో, ఆఫీస్ లోంచి కూడా వెళ్ళిపోవాలి. నా ఏర్పాట్లు నాకున్నాయి'' మనోహర్ మొహం వాడిపోయింది.

"నా వాటా నాకు పంచి ఇవ్వండయితే.."

"వాటా? నీకు వాటానా? ఇది నేను కష్టపడి సంపాదించిన స్వార్జితం. నా తండ్రి నాకు కష్టపడే శక్తి తప్ప మరేం ఆస్తి ఇవ్వలేదు. అయినా సరే రేపటిలోగా లాయర్ని పిలు. ఆస్తి పంచిఇస్తాను. ఇండస్ట్రీలో నీ వాటా నేనే కొంటాను, నీ డబ్బు నీ మొహాన పారేస్తాను. నీ మొహం మాత్రం చూపించకు అంతే"

మనోహర్ తలుపు తెరిచాడు.

★ ★ ★

అది మనోహిత గది.

రెండేళ్ళుగా అతనికి సుపరిచితమైన గది.

కోపం అతన్ని దహించి వేస్తోంది. ఆ కోపాన్ని ఎవరిమీద చూపించాలి.

"దరిద్రపు మొహంది ఎంత మోసం చేసింది. జీవితం సర్వం నాశనం చేసింది"

అతని ఆలోచనలు వెంటనే తండ్రిమీదకు మళ్లాయి.

"నౌకర్ని పనిలోంచి తీసేసినట్టు ఇంట్లోంచి పొమ్మంటాడు. స్వంత కొడుకుని ఆ బిచ్ కోసం ఓహ్" కోపం రామారావ్ మీదకు మళ్లింది.

"దరిద్రుడు నన్ను సమర్థించివుంటే కూతురు అబద్ధం ఆడ్తోందని ఒక్కమాట చెప్తే ఇదంతా జరిగేది కాదు" ఈసారి గాలి విసురు కామేశ్వరి మీదకు మళ్లింది.

"అక్క మాత్రం ఒక్కమాట నావైపు మాట్లాడిందా?" గది నిశ్శబ్దం సముద్రంలావుంది. ఆ నిశ్శబ్దం అసహజంగా కృత్రిమంగా, ఎప్పుడూ తీసి వుండే కిటికీ మూసేసివుంది. మంచం మీద దుప్పటి నలగకుండావుంది. ఫ్లవర్ వేజ్‌లో వాడిన పువ్వులు మార్చలేదు.

మనోహర్ గది మధ్యన నించున్నాడు. అతని రాకను గుర్తించే మనిషి లేకపోవడం మొదటిసారి నిరాశ కలిగించింది. అయిపోయింది. జీవితం శూన్యమైపోయింది.

పరుపు దిళ్లు లాగి చింపి స్పాంజ్ ముక్కలుముక్కలుగా చేసి పారేశాడు. గదంతా స్పాంజ్ ముక్కలమయం. ఏది అందితే అది నేలకు విసిరికొడ్తున్నాడు.

"మనోహర్... ఏమిటది? పిచ్చిపట్టిందా? ఆగు" కామేశ్వరి గొంతు.

ముక్కలు కాబోతున్న బ్లాంకెట్ అతని వేళ్ల మధ్యనించి జారిపోయింది. అతని గుండె వేగం పెరిగింది. నెమ్మదిగా వెనక్కు తిరిగాడు.

"నువ్విప్పుడు హితబోధ చెయ్యకు అక్కా. కోపంలో నన్ను నేను మరచిపోయాను. ఏం చేస్తున్నాననేది మర్చిపోయాను. డాడీతో వాదించి వాదించి అలసిపోయాను. ఏం జరిగిందో తెలుసా! తెల్లారేసరికి ఇంట్లోంచి వెళ్లిపోవాలట. ఇండస్ట్రీలో నాకు చోటులేదు. కొత్త బిచ్చగాడిలా రోడ్డు మీద నిలబడి నా బతుకు తెరువు నేను చూసుకోవాలి"

కామేశ్వరి అయోమయంగా చూసింది. "మనోహర్.. ఎందుకిలా అందరి అంచనాలూ తలక్రిందులు చేస్తున్నావ్?"

"ఏం చేశాను?"

"ఏం చెయ్యలేదు? కూతుర్ని రేప్ చెయ్యడం. మనోహర్ ఎలా చెయ్యగలిగావు. నీకు సౌందర్య గుర్తు రాలేదా?"

"అక్కా ఎన్నిసార్లు చెప్పను? నేను చెయ్యలేదు, చెయ్యలేదు. దాన్ని ముట్టుకోను గూడాలేదు. మీ అందరి సానుభూతి కోసం అదేదో కథలల్లి చెప్తే మీరంతా నమ్మేసారు. ఈ ఇంట్లో మనో ఎవరితోనైనా చనువుగా వుందంటే అది నీతోటే నీకు తెలీదా ఆ పిల్ల మనస్తత్వం?"

"మనోహర్ అవన్నీ ఇప్పుడెందుకు? ఇప్పుడు నీకు సంతోషంగా వుందా? మనో వెళ్లిపోయింది. నాన్న బాధ సరేసరి. గిరిజ, సుందరం ఎవరితో మాట్లాడరు. జీవితాలు ఎంత అయోమయం అయిపోయాయంటే దీనికంతటికీ కారణం నువ్వు. మనోని బెదిరించో భయపెట్టో లొంగదీసుకున్నావు. నువ్వే నువ్వే దీనికంతటికీ కారణం" అంది బయటకి నడుస్తూ.

ఆరోజునించీ శైలజతో మాట్లాడిందే లేదు. శైలజ మాట్లాడే అవకాశం ఇవ్వట్లేదు. ఎలాగైనా శైలూని ప్రసన్నం చేసుకోవాలి. ముందుగదిలో సౌందర్య బొమ్మలమధ్య కూర్చునివుంది.

"డాడీ" తండ్రిని చూస్తూనే పరుగెత్తుకు వచ్చింది.

"హాయ్" ఒంగి ఎత్తుకున్నాడు.




నుదుటిమీద ముద్దుపెట్టుకోబోయిన మనోహర్ ఆగిపోయాడు. సౌందర్య మొహం ఒక్కసారి మనో మొహంలా అనిపించింది.

"మమ్మీ ఏది?"

లోపలి గదివైపు చూపించింది.

"సర్దుడు కార్యక్రమం"

ఇల్లు అద్దంలా వుంటేగాని శైలజకి తోచదు.

"ఇక్కడేవుండు... అమ్మతో కొంచం మాట్లాడాలి" గదిలో డబుల్ కాట్ బెడ్ మీద మూడు నాలుగు సూట్‌కేస్‌లు తెరిచివున్నాయి. బీరువాలో బట్టలు సూట్‌కేస్‌లలో సర్దుతోంది. మనోహర్‌వి కాదు.

జారిన కొంగు అందాలను ప్రదర్శిస్తోంది.

"శైలూ నీతో కొంచం మాట్లాడాలి. సర్దటం తర్వాత చూసుకోరాదూ?"

"నాకు తీరిక లేదు"

"తీరిక లేదా? మాట్లాడటం ఇష్టంలేదా? ఎన్నాళ్లిలా మాట్లాడకుండా దూరంగా వుంచుతావు. జీవితంలో అనుకోని మార్పులు జరిగిపోతున్నాయి. ఇద్దరం ఆలోచించి భవిష్యత్తు నిర్ణయించుకోవలసిన సమయం ఇది"

"నేను నా భవిష్యత్తును నిర్ణయించుకున్నాను. మరో గంటలో సౌందర్య నేను, వెళ్తున్నాం"

మనోహర్ వెనక్కు తూలాడు.

"ఎక్కడికి?"

"అది మీ కనవసరం. నేను మీతో రాజీపడలేను. నా బతుకు నన్ను బతకనీండి"

కోపంతో ఎరుపెక్కిన ఆమె కళ్లు, బుంగమూతి ఓహ్ ఎంతందంగా వుంది? కొంచం బొద్దుగా మోకాళ్ల వరకూ వచ్చిన పొడుగాటి జడ రారమ్మని వూరిస్తున్న మడత చీర కట్టుకీ జాకెట్‌కీ మధ్య.

"నువ్వెక్కడికీ వెళ్లడానికి వీల్లేదు. పిచ్చెక్కిందా? మతిపోయిందా? ఇల్లు వాకిలీ వదిలి మొగుణ్ణీ కూతుర్నీ ఏం చేస్తావ్? నువ్వు నాదానవు. నాతో పాటే వుండాలి"

అతని పెదవుల మీద చిర్నవ్వు ఆమె దగ్గరగా జరిగి హఠాత్తుగా ఆమె గుండెలమీద తలవాల్చి మెడచుట్టూ చేతుల్ను చుట్టి,

"శైలూ... జన్మజన్మలకూ నేను నీవాడిని. నువ్వు నా దానవు. నా కష్టం సుఖంలో అర్ధాంగివి. మొన్నటికి మొన్న నలుగుర్లో నా పరువు నిలబెట్టావు. నీ కోసం ఓ సర్‌ప్రైజ్ గిఫ్ట్. ఊహు ఇప్పుడే కాదు. రాత్రికి బయటకు వెళ్దాం, త్వరగా రారాదూ"

శైలజ రెండడుగులు వెనక్కు నడిచింది.

"నాకు మీ లంచాలు అవసరంలేదు. మీ హొటల్ డిన్నర్లూ వద్దు. నేనూ సౌందర్య వెళ్తున్నాం. నన్ను ఆపడం నీ తరంకాదు"

"ఎక్కడికి వెళ్తారు?"

"డాడీ నాకిచ్చిన అపార్ట్‌మెంట్ అలాగే వుంది"

"ఊహు, నేను ఒప్పుకోను ఎక్కడికి వెళ్తావు? ఎలా వెళ్తావు? నా కూతుర్ని తీసుకునా? నా కూతురు నాతోనే వుంటుంది" శైలూ బట్టలు సర్దుతూ నవ్వింది.

"ఆ విషయం లాయర్‌తో మాట్లాడండి" మనోహర్ త్రుళ్లిపడ్డాడు.

"లాయరా? ఎప్పుడు వెళ్లావు?"

"ఈ ఉదయం"

"దేనికి?"

"విడాకుల కోసం... లాయర్ దగ్గరకు ఎందుకు వెళ్తారు?"

చీరకుచ్చిళ్లు కొంచం పైకి దోపిందేమో స్టూల్ మీదకు ఎక్కేసరికి తెల్లగా నాజూగ్గా మెరుస్తూ కనిపించింది ఓ కాలు మోకాలివరకూ.

గబగబా ఆమె దగ్గరకు వెళ్లి నున్నటి కాలిమీద వేళ్లతో నిమురుతూ, "తలుపు గడియ వెయ్యనా? మిగతా సంగతులు తరువాత తేల్చుకుందాం" అతని కళ్లల్లో కాంక్ష. స్పర్శలోకోరిక.

"ముందు నా ఒంటిమీద చెయ్యితియ్యండి. నన్ను ముట్టుకోకండి అయ్ హేట్ యూ"

స్టూల్ మీంచి కిందకు దూకింది.

"శైలజా ఏమిటీ మొండితనం"

"ముందు దూరంగా జరగండి. లేదంటే అరుస్తాను. కేకలు వేస్తాను. అందరూ వస్తారు.

నన్ను రేప్ చేస్తున్నారని చెప్తాను'' మనోహర్ వెనక్కు జరిగాడు.

''ఎందుకు? ఎందుకిలా శైలజా?''

''ఎందుకంటే మీరు మనోని రేప్ చేశారు. ఇంత జరిగి నేను మీతో కలిసి బతుకుతానని ఎలాగనుకున్నారు. నా కూతుర్ని వావివరసల్లేని మీతో, మీ ఇంట్లో ఏ ధైర్యంతో వుండనిస్తాను. మీకు కుటుంబానికి అర్థం తెలీదు. మీతో కలిసి మేం బతకలేం.

విషయం వినగానే నేను మొదటనమ్మలేదు. అందుకే మిమ్మల్ని వెనకేసుకొచ్చాను అందరిలో. కానీ నా అంతరాత్మ అది నిజమే అని చెబుతూనే వుంది. నా దారికి అడ్డురాకండి.''

మనోహర్ రెండడుగులు వెనక్కి వేశాడు.

''మీరు లాయర్‌ని కలవండి. సౌందర్య విషయం మాట్లాడదాం. కానీ సౌందర్యని మీతో వుంచే ప్రసక్తేలేదు. వరసకు కూతురైన పిల్లను రేప్ చేసిన మీరు కన్నకూతుర్ని రేప్ చెయ్యరన్న గారంటీ ఏమిటి?''

సూట్‌కేస్ మూతలేస్తూ తలెత్తి చూసింది.

''వెళ్లండి. నా కళ్ల ముందునించి బయటకు వెళ్లండి. మిమ్మల్ని చూస్తేనే నా రక్తం మరిగిపోతోంది. వెళ్లండి. ఇంకో క్షణం మీరిలా ఎదురుగా వుంటే నేనేం చేస్తానో నాకే తెలియదు వెళ్లండి''

అతను తల విదిలించి బయటకు నడిచాడు. బయట ఒక్కక్షణం నిల్చుండిపోయాడు. ఆలోచించాలి భవిష్యత్తు గురించి జీవితం గురించి ఆలోచించాలి. కానీ అతని ఆలోచనల్నిండా ఆడవాళ్లే మనోహిత, కామేశ్వరి, శైలజ, సౌందర్య. నా జీవితాన్ని శాసించేది వీళ్లా?

''డాడీ... ఎక్కడికెళ్తున్నారు? నన్ను తీసికెళ్లరూ?'' ఎక్కడ్నించో సౌందర్య పరుగెత్తుకు వచ్చింది.

ఈ లోగా శైలజ పరుగెత్తుకు వచ్చి ఆ పిల్ల రెక్క పట్టుకుని ఇంట్లోకి ఈడ్చుకు వెళ్లింది.

మనోహర్ ఒక నిమిషం ఆలోచించాడు. శైలజకి నేనెందుకు డబ్బివ్వాలి? అపురూప టెక్స్ టైల్స్ నాది. అది ఎప్పటికీ నాదే కావాలి. సౌందర్య నా కూతురు. నాతోటే వుండాలి. ఎన్నేళ్లయినా సరే ఇవి సాధించి తీరాలి. అందరిమీదా పగ తీర్చుకోవాలి. చకచకా నడక ప్రారంభించాడు.

కళ్లముందు మనో సుకుమార శరీరం, పెద్ద పెద్ద ఆ కళ్లలో విహ్వలత ప్రత్యక్షమయాయి.

నో ఆమె గురించి ఆలోచించను. అది ఎక్కడో కుక్క చావు చస్తుంది. చావకపోయినా మళ్లీ ఈ ఇంటికి తిరిగిరాదు. రానివ్వను. నాకు చోటు లేని ఈ ఇంట్లో ఆమెకి మాత్రం ఎలా వుంటుంది?

★ ★ ★

శైలజ పిల్లను తీసుకుని వెళ్లిపోయింది. కృష్ణమూర్తిగారు అన్న మాట ప్రకారం ఆస్తి కూతుళ్లకూ కొడుకులకూ సమంగా పంచి మనోహర్ వాటాకి వచ్చిన దానికి లెఖ్కకట్టి డబ్బు అతనికిచ్చి ఆస్తిలో వాటా ముట్టినట్టు రాయించుకున్నారు. శాశ్వతంగా ఆఇంట్లో స్థానాన్ని పోగొట్టుకున్నాడు మనోహర్.

మొదటి రెండు రోజులూ హొటల్‌లో రూమ్ తీసుకుని గదిదాటి బయటకు రాకుండా గడిపాడు.

బాంబే వెళ్దామా? బిజినెస్ చేద్దామా? ఉద్యోగం చూసుకుందామా? ఢిల్లీ వెళ్దామా? ఆలోచనలు ఒకపట్టాన తెగలేదు.

పైకి వ్యక్తం చెయ్యలేని అవమానంతో మనసు మండిపోతోంది. ఎక్కడ చూసినా మనోహిత మొహమే కనిపిస్తోంది. కసి, కోపం ఆ క్షణంలో ఆ పిల్ల ఎదురుపడితే గొంతునులిమి చంపేసేవాడేమో.

హఠాత్తుగా మెరుపులా అతని మనసులో ఒక ఆలోచన. ఎందుకు రాజకీయాల్లోకి వెళ్లకూడదు? ఏ మనుషులు నిర్దాక్షిణ్యంగా బయటకు గెంటివేసారో వాళ్లముందే వూరందరి నివాళులూ అందుకోవాలి. అంతే శైలజని మర్చిపోయాడు. మనోని మర్చిపోయాడు. తండ్రి వూహల్లోకి కూడా రాలేదు. ఒకటే ధ్యేయం. అధికారం సంపాదించాలి. డబ్బు సంపాదించాలి. అంతే. ఒక్కోసారి ఏ అర్ధరాత్రో మెళకువ వస్తే ముందుగా గుర్తొచ్చేది మనో, వెనువెంటనే కట్టలు తెగిన కోపం. ఆ కోపం శైలజ వైపు మళ్లేది.

క్రమంగా ఎప్పుడైనా మనో గుర్తొచ్చేది




ముఖ్యంగా బెడ్‌రూమ్ మరెవరితోనైనా షేర్ చేసినప్పుడు. అదీ మొహాన్ని కప్పేస్తున్న జుట్టును వెనక్కు తోస్తున్న ఆమె నాజూకు చెయ్యి ఆల్‌మోస్ట్ ఎముకల్లా వున్న సన్నటి కాళ్లో, పల్చటి పెదవుల్లో, ఇంకా స్త్రీత్వం పుంజు కోని బ్రెస్ట్‌లైన్, ఏ భావాన్నీ వ్యక్తం చెయ్యని విశాలమైన కళ్లు ఇలా ఒక్కో శరీరపు భాగం జ్ఞప్తికి వచ్చేది. మనసులో ఇది అని వ్యక్తం చెయ్యలేని భావం పెరిగి పెరిగి వటవృక్షంలా మారేది. తన జీవితం సర్వనాశనం చేసిన రాక్షసి. ఆ రాత్రి హఠాత్తుగా ఏమాత్రం ఎదురు చూడని ఎటాక్ తెల్లారుతూనే ఆమె అదృశ్యం. తండ్రి ఈసడింపు రారాజు అవుదామనుకున్న ఆశ కూలి చివరకు... ఎలాగైనా అపురూప టెక్స్‌టైల్స్ సర్వనాశనం చెయ్యాలి. అంతే. అది అతని జీవితాశయం. తనకు దక్కనిది మరెవరికీ దక్కకూడదు.

ఆ కోపం మనో జ్ఞాపకం లాగే తెరమరుగున పడిపోయింది. జ్ఞాపకాల్తో వర్తమానం వృధా చెయ్యడం అతనికి నచ్చని పని. భవిష్యత్తు ఎదరవుంది. దాన్ని అందంగా మలుచు కుందుకే వర్తమానం అన్నది అతని సూక్తి.

అదంతా గతంగా మారి ఏనాడైంది. ఇప్పు డు మనో మొహం గుర్తు చేసుకుందామన్నా గుర్తు రావడంలేదు. గుర్తు చేసుకునే సమయం కూడా లేని బిజీలైఫ్ అతనిది. రాజకీయాలు అతని వూపిరి. అది అతని ఆరో ప్రాణమైంది. రాజకీయాల్లో అతని ప్రవేశానికి ముఖ్యమని చెప్పుకోదగ్గ వ్యక్తి నరసింహం.

అతని చదువు హైస్కూల్ గడపదాటలేదు. కాని తలలు మార్చెయ్యగల తెలివితేటలు అతనివి.

"నువ్వు చీఫ్ మినిస్టరే అవుతవో, ప్రైమినిస్ట రే అవుతవో అన్నా. నీ భవిష్యత్తు చెప్తున్నా చూస్కో" అన్నాడతను.

అన్నట్టుగానే అతను నేర్పిన ఆలోచనాస రళి, వాగ్ధాటి, చతురత విజయాలు సాధించి పెట్టాయి. పదేళ్ళు తిరిగేనరికి ఎమ్.పి. స్థా యిని సాధించగలిగాడు. మరో పదేళ్ళ శ్రమకి ఫలితం మంత్రిపదవి.

★ ★ ★

శైలజ తండ్రి ఇచ్చిన అపార్ట్‌మెంట్‌లో సౌందర్యతో ఒంటరిగానే వుంటోంది. కాలక్షేపా నికి ఏదో ఫర్మ్‌లో సెక్రెటరీగా చేరింది. నెలకో సారి మనోహర్ కూతుర్ని చూసేందుకు వెళ్ళేవా డు. నెల తరువాత నెల అలా నెలలు నెలలు ఏడాదులుగా మారాయి. తండ్రిని అనే తలపు అతనికి మధురంగా వుంది. విడాకులు మంజూరుచేశాక నెలకి రెండురోజులు మనో హర్ సౌందర్యతో గడపవచ్చని తీర్పునిచ్చాక నెలకి రెండురోజులే మనిషిగా బతుకుతున్నట్ట నిపించేదతనికి.

"ఈసారి సౌందర్యని నాతో పంపించు" శైలజని అడిగాడు. అప్పటికే రాజకీయాల్లో పరపతి సంపాదించడమే కాకుండా ఓ ఫ్లాట్, కారు కూడా కొనగలిగాడతను.

"ఊహూ... సౌందర్య ఇక్కడే ఉంటుంది" శైలజ జవాబు.

"ఎందుకు? సౌందర్య నా కూతురు కాదా? ఇన్నేళ్ళనించీ చూస్తూనేవున్నావు. తండ్రిగా నా బాధ్యత నేను నిర్వర్తించడంలేదా చెప్పు శైల జా?"

ఆమె భుజాలు ఎగరేసింది.

"సౌందర్య నీఅంత అందంగా లేదనుకో. అయినా స్మార్ట్‌గా కనబడుతుంది. డాన్స్ నేర్పి ద్దామని నా ఆశ"

శైలజ పెదవులపై చిర్నవ్వు. అతని ఆక ర్షణ తట్టుకోవడం కష్టంగా వుంది. అలా ఫీల వడం అది మొదటిసారి కాదు. అందుకే చటుక్కున లేచి కిటికీ పరదాలు సవరించడం మొదలెట్టింది.

"ఊహూ... సౌందర్యని పంపలేను. అది మీతో ఒంటరిగా ఒకే అపార్ట్‌మెంట్‌లో... ఊహూ... వద్దు"

ఉలిక్కిపడ్డాడు మనోహర్.

"ఇంకా... ఇంకా అవే ఆలోచనలా శైలజా? మైగాడ్! నువ్వది నమ్ముతున్నావా? ఆ శని గ్రహం అబద్ధాలు నిజమని నమ్ముతున్నావా? నా స్వంత కూతుర్ని నేను ఏమైనా చేస్తానని అనుమానమా?"

శైలజ దృఢంగా జవాబిచ్చింది "మీతో ఒంటరిగా వుంచటం ఇష్టంలేదు"

యుగాల నిశ్శబ్దం అనిపించాక రెండు నిముషాలకు పెదవి కదిపాడు మనోహర్.

"ఏదో ఓరోజు నిజం గుర్తించకపోవు. సౌంద ర్య తండ్రిగా నాతో కలిసివుంటే బాగుంటుంద నుకున్నాను. ఓకే... పోనీలే.. సౌందర్యని షాపింగ్‌కి తీసుకెళ్ళనా?" లేచి నిల్చుంటూ అడిగాడు.

"మీ ఇష్టం"

"రెండు గంటల్లో ఇక్కడ దింపేసి వెళ్తా ను"

శైలజ తల ఊపింది.

"వచ్చే నెల వస్తాను"

మళ్ళీ తల ఊపింది ఆమె.

అతని పెదవులమీద చిన్న చిర్నవ్వు విరి సింది ఆమెను గమనిస్తూంటే. ఎన్నాళ్ళో అక్క ర్లేదు శైలజ క్షమించడానికి.

ఈ ఆడవాళ్ళకోపం కఠినశిలలా కనిపించే వెన్నముద్ద. కొంచెం ప్రేమాప్యాయతలు చాలు. ఇట్టే కరిగిపోతారు.

సౌందర్య గదివైపు నడుస్తున్నారిద్దరూ.

ఒక్కసారిగా దగ్గరకు లాక్కుని శైలజ పెద వులమీద బలంగా ఓ ముద్దు సమర్పిస్తే మరింక ఆమె కాదనదేమో అనిపించింది.

ఈలోగా సౌందర్య రెడీ అయి వచ్చింది.

సౌందర్య అచ్చం అతని పోలికే.

ఉంగరాలు తిరిగిన జుట్టు. అతని కళ్ళలా గే మత్తుగా వాలిపోతున్న 'డ్రీమీ అయిస్'. చూపరులను ఆకట్టుకునే సమ్మోహనాస్త్రం చిర్నవ్వు. మొనదేలిన ముక్కు, గడ్డం చివర పెనరబద్దంత పుట్టుమచ్చ అతనిలాగే. ఆ మొహంలో ఇది అని చెప్పలేని ఆకర్షణ. మనోహర్‌కి నచ్చినది తన పోలికలు కాదు. పదేళ్ళయినా రాందే మానసికంగా ఎదిగి పోయి పెద్దరికం సంతరించుకున్న ఆమె ప్రవ ర్తన అతనికి బాగా నచ్చింది.

ఆ సంగతి సౌందర్య చురుగ్గానే గ్రహించగ లిగింది.

తండ్రికి బాల్యం, బాల్యపు వాసనలు నచ్చవు. అందుకే ఇంకా వికసించని బాల్యాన్ని కసిగా చంపేసిమరీ తండ్రి మనసుకు దగ్గర కాగలిగింది.

"బయట చాలా చలిగా వుంది" స్వెట్టర్ వేసుకుంటూ కామెంట్ చేసింది.

"అమ్మకి చెప్పిరా... లేకపోతే కోపమొ స్తుందావిడకి"

"ఊహు... రాదు. మేం ఇద్దరం మంచి ఫ్రెండ్స్‌మి"

"అలాగా... ఇదివరకైతే ఇలాంటి చిన్నచి న్న విషయాలకే ఎంతో అప్‌సెట్ అయిపో యేది"

"అవునా?" ఆశ్చర్యంగా అడిగింది సౌంద ర్య.

"అయిస్‌క్రీమ్ తిందామా?" మనోహర్ అడి గాడు.

"ఓహ్ ష్యూర్. ఎంత మంచివాడివి డాడీ... ఎన్నో యుగాలైనట్టుంది అయిస్‌క్రీమ్ తిని"

నవ్వింది సౌందర్య. అచ్చం తన మొహం తను అద్దంలో చూసుకున్నట్టనిపించింది మనో హర్‌కి.

ఆ రెండురోజులు సౌందర్య నన్నిధే జీవితం. ఆ తరువాత ఆమె జ్ఞాపకాలు కూడా మనసును పలకరించవు. సాధించాలి. ఏదో ఒక శిఖరాగ్రాన్ని చేరుకుని తీరాలి. లైఫ్ ఛాలెంజ్‌ని స్వీకరించాలి. జీవితంలో ఓటమి అనే ప్రసక్తి రాకూడదు... రాదు. అందుకే డబ్బు, అధికారం సంపాదించాలి ముందు. ఆపైన మనసు కోరినది వేదం అవుతుంది. దానికి రహదారి నరసింహం పరిచయం. అత నికి ముఖ్యమంత్రి దగ్గర్నించి తెరవెనకాల రాజ్యాంగాన్ని నడిపే వీధిగూండాలవరకూ ప్ర తివాళ్ళూ తెలుసు. అతన్ని ఆధారంచేసుకుని తీగలా అనంతంలోకి సాగిపోవచ్చు.

★ ★ ★

మరో వారం తరువాత అనుకోకుండా మంత్రిపదవి వరించిందతన్ని. ప్రమాణస్వీ కారం. అభిమానుల ఊరేగింపు. న్యూస్‌పేపర్లో పెద్ద ఫొటో వేసే ఏర్పాటుచేసుకున్నాడు. ఆ పేపర్ రామారావ్‌కి పంపి, "నాన్నగారి టేబుల్ మీదుంచే ఏర్పాటు చెయ్యి" అని నోట్ కూడా పంపాడు.





అతని గురించి పేపర్లో ఏ వార్త వచ్చినా అది తండ్రి చూసేలా చెయ్యాలి.

రోజులు లెక్కపెట్టుకునే లోపలే ఎక్కడ చూసినా మనోహర్ ఫొటోలు. ఎక్కడ చూసినా మనోహర్ గురించి వార్తలు. విజయం తరువాత విజయం. ఓవక్క బిజినెస్‌లో లెక్కపెట్టుకోలేనంత లాభాలు. అంతకుముందు దానధర్మాలు, దయాదాక్షిణ్యాలంటే ట్రాష్ అని కొట్టిపారేసినవాడల్లా సేవానదనాలకు, ఆశ్రమాలకు వేలల్లో విరాళాలిచ్చాడు.

ఎవరినోట విన్నా అతని పేరే. మనోహర్... ఎంత చిన్నవయసులో ఎంత పెద్దమనసు. మొట్టమొదటి యువ మినిష్టర్. అతన్ని చూసి చాలా నేర్చుకోవాలి నేటి యువతరం అనేవారు అందరూ.

"మీ విజయానికి ఇరవై ఏళ్ళు. ఒకదాని తర్వాత మరొకటి విజయాలే తప్ప మనకిక తిరుగులేదని నిరూపించాం" గ్లాస్‌లో చిన్న అయిస్‌క్యూబ్‌ని పరీక్షగా చూస్తూ అన్నాడు నరసింహం.

ఇరవైఏళ్ళ తరువాత నరసింహం, మనోహర్ కలిసి మరో ప్రాజెక్ట్‌కోసం ఆలోచిస్తున్న సందర్భం అది.

ఈ ఇరవైఏళ్ళలో నరసింహం చాలా మారాడు. భాషను సంస్కరించుకున్నాడు. అచ్చు రాజకీయ నాయకుడిలా కాటన్ లాల్చీ పైజామాలు, లేదా పంచె అతని డ్రెస్.

"రాత్రికి ఏమైనా అరేంజ్‌మెంట్స్..."

"వద్దు... ముందే జరిగిపోయాయి"

"మీరు చాలా ఫాస్ట్. ఇంతమంది అమ్మాయిలు మీకెలా పరిచయం అయ్యారో నాకు అర్థంకాదు. ఓకే..." అంటూ క్షణం ఆగి

"పొరబాటు చేశారు. మీరప్పుడే పెళ్ళిచేనుకుని వుంటే... నర్లెండి ఇప్పటికైనా మించిపోయింది లేదు. ఆ ఉద్దేశ్యం వుంటే చెప్పండి"

"ఏం? ఎందుకు?"

"జీవితంలో సెటిలయిపోవచ్చు"

"ఇప్పుడవలేదా?"

"ఇలా కాదు"

"మరింకెలాగ?"

"మీకు కోపం రాదంటే... భార్యాపిల్లలు... ఇవన్నీ పరిపూర్ణతనిస్తాయి. ఇలా రోజుకొహ రితో... అదిగో అలా చూడకండి. ముందే చెప్పాను" అంటూ కాసేపాగి,

"మీ బలహీనత కనిపెట్టి మంచి మూడ్‌లో మీ రహస్యాలను ఎవరైనా అమ్మాయి బయటకు లాగుతుందేమోనని నా భయం"

"యూ... నేను... ఆడవాళ్ళతో రహస్యాలు చెప్పడమా?" అసాధ్యం అన్నట్టుంది అతని స్వరం.

"సాధ్యమే. ఈరోజుల్లో ఆడపిల్లముందు పెదవి విప్పని ఘనుడెవరు? అందులోనూ మీరు... వర్ణనలు ఒద్దులెండి. మిమ్మల్ని మునగ చెట్టెక్కించి విషయం రాబట్టడం పెద్ద కష్టంకాదు. అలా లేచి వెళ్ళిపోకండి. కూర్చోండి. ప్లీజ్... మనం పోట్లాడుకోవడంలేదు. మీకు సలహా ఇస్తున్నానంతే. జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు, ఎవరితోనో ఒకరితో మనసులో మాట చెప్పుకోవాలనిపిస్తుంది. భార్యలా రహస్యాలు పంచుకోగలవాళ్ళు ఈ లోకంలో ఇంకొహరు ఉండరు. అందుకే మీరు పెళ్ళిచేసుకుంటే... ఇంకా మీకు నలబై ఆరే కదా!"

"ఆలోచించాలి" మనోహర్ గ్లాస్ పెదవులకానించుకుంటూ జవాబిచ్చాడు.

మనోహర్‌కి ఆ విషయం ఇదివరకే తెలిసివచ్చింది. ఫామిలీతోపాటు ఫ్రెండ్స్ స్నేహితులు ఇవన్నీ కూడా సోషల్ స్టేటస్‌కి చిహ్నాలే. కుటుంబం లేకపోవడం ఒక పెద్ద డ్రాబాక్‌గా వుందతనికి.

'ఆలోచించాలి' మరోసారి అనుకున్నాడు.

తలెత్తేసరికి నరసింహం పేపర్ చదువుతున్నాడు.

"ఏమిటి అంత దీక్షగా చదువుతున్నావ్?"

"వార్త... సంచలన వార్త!"

"ఏమిటబ్బా అంత సంచలనవార్త..."

"వచ్చే ఏడాది జరగబోయే ఎన్నికలకు యంగ్ అండ్ డైనమిక్ ముఖ్యమంత్రి కావాలి..."

"ఎప్పుడూ పాలిటిక్సేనా?"

"కాదు... కాదు.. ఏడాదంటే మనం చెయ్యావ

లసిన పనులు చాలా వున్నాయి. మీకు డబ్బూ, పలుకుబడి వుంది వాటిని ఖర్చుపెడితే ముఖ్యమంత్రి కావడం అంత కష్టమేమీకాదు. ఎప్పుడు ఏ పని ఆరంభించాలో అప్పుడే మొదలెట్టాలి. దాని గురించి ఆలోచిద్దాం. ఆలోచిస్తే నష్టంలేదుగా. నాదగ్గర ఇప్పటికే ఓ లిస్ట్ తయారుచేసివుంచాను. మీరెవరెవరిని కలుసుకోవాలో, ఎక్కడెక్కడ ప్రసంగించాలో, ఎవరెవరికి ఎంతెంత విరాళాలివ్వాలో, డబ్బు ఖర్చుపెట్టగలిగిన తాహతుకి మించినదేదీ లేదీ లోకంలో. ఓ ఇరవై లక్షలన్నా ఖర్చు చెయ్యాలి. పార్టీ ఫండ్ ఓ ఎనభైలక్షలు. మీకిక వ్యతిరిక్తత అనేది వుండదు. కాబరేడాన్సర్‌లు ఒళ్ళు విదిలిస్తే రాజకీయ చతురులు డబ్బు విదిలించాలి. మీ పేరు ఊరూవాడా మారుమ్రోగాలి'' మనోహర్ మాట్లాడలేదు.

''అదినరే... సడెన్‌గా గుర్తొచ్చింది. మీ ఫాదర్ కట్టిన మోడల్ అపార్ట్‌మెంట్స్ గురించి అందరూ గొప్పగా మాట్లాడుకుంటున్నారు. ప్రతినెలా రెంట్సే బోల్డంత వస్తాయట. ఆ వ్యవహారాలు మీ అన్నయ్య అల్లుడు చూస్తున్నాడట... మీకేం ఆసక్తిలేదా?''

''లేకేం... కాని ఇప్పుడేకాదు. సమయం రావాలి''

''వెల్. ఇద్దరూ ఇద్దరే. కొడుక్కి కొడుకే సాటి, తండ్రికి తండ్రే సాటి. పెళ్ళి గురించి సీరియస్‌గా ఆలోచించండి. మళ్ళీ కలుస్తాను''

నరసింహం వెళ్ళిపోయాడు.

హద్దులు దాటిన కోరిక ఇన్నేళ్ళు మనసుపొరల్లో జాగ్రత్తగా దాచుకున్న కోరిక కళ్ళు విప్పింది.

ముఖ్యమంత్రి... అవును... అధికారం కావాలంటే రాజకీయాలనే ఆశ్రయించాలి. పదవి కోసం ఏం చెయ్యడానికైనా సిద్ధమే. ఓ భార్యని తెచ్చుకోవడంతోసహా.

★ ★ ★

ఎప్పటిలాగే ఉదయం లేస్తూనే అపార్ట్‌మెంట్స్ చూసుకుందుకు బయటకు వచ్చారు కృష్ణమూర్తిగారు.

''అపురూప టెక్స్‌టైల్స్' వదిలేశాక అపార్ట్‌మెంట్స్ కట్టడం, రెంట్‌కి ఇవ్వడం అదే ఆయన జీవితాశయం అయిపోయింది.

అప్పటికే అపార్ట్‌మెంట్స్‌లో హడావిడి మొదలైంది. ఆ జనాల యౌవనం, వాళ్ళ మాటల్లో స్థైర్యం, బలమైన ఆకారాలూ చూస్తుంటే ఈర్ష్య అనిపించిందాయనకు. కృష్ణమూర్తిగారికి ఆయన యౌవనం గుర్తుకువచ్చింది. చిన్న ఉద్యోగం, వెంటనే పెళ్ళి. అయిదుగురు పిల్లల్ని పెంచడం, ధైర్యంచేసి ఇండస్ట్రీ ప్రారంభించడం. జీవితం మరోసారి కళ్ళముందు నడుస్తున్నట్టనిపించింది. అతని మేధస్సు అతని ఆర్థికస్థోమతని పెంచగలిగింది. కోటీశ్వరుడిని చెయ్యగలిగింది. పేరుప్రఖ్యాతులను తెచ్చిపెట్టగలిగింది. కాని ఇంకా యవ్వనం చివరి అంకం పూర్తికాకముందే బ్లడ్‌కాన్సర్‌తో చచ్చిపోయిన భార్యను బతికించుకోలేకపోయింది. సుందరం జీవితాన్ని సరిదిద్దలేకపోయింది. గిరిజ నుదిటివ్రాతను తప్పించలేకపోయింది. రామారావ్ మెతకబుద్ధిని మార్చలేకపోయింది. మనోహర్‌ని మంచిమార్గంలో నడిపించలేకపోయింది. చివరికి మనోహితను పారిపోకుండా ఆపలేకపోయింది. చివరికి ఆమెను మళ్ళీ ఇంటికి రప్పించలేకపోయింది. అప్పుడే శ్రీనివాస్ బండి అతని ముందాగింది.

''రండి... ఆఫీస్ గదిలోకి వెళ్దాం'' శ్రీనివాస్ ఆయన్ని ఆఫీస్ గదిలోకి తీసుకెళ్ళాడు.

ఇద్దరూ టీ తాగుతూ కూర్చున్నారు.

''ఏం ప్రాబ్లెమ్స్ లేవుకదా?''

''ఊహూ... ఇంట్లో, ఆఫీస్‌లో ఎక్కడా లేవు''

''మరింక నువ్వు చేస్తున్న పనేమిటి? ఊరికే తని కూర్చోవడమేనా? అలాగైతే ఇబ్బందులు తప్పవు''

''నా పెళ్ళైనప్పటినుంచీ ఇదేమాట చెప్తున్నారు. ఊహూ... అలాంటి రోజు రానివ్వను. మీరెప్పుడైనా 'నా మనవరాలితో పెళ్ళి చెయ్యడం... ఈ బాధ్యత అప్పగించడం పొరబాటున చేశాను' అనుకునేలా ప్రవర్తించానా?''

''లేదులేదు... ఇలా అంటూండబట్టే అలా వున్నావు నువ్వు'' ఇద్దరూ నవ్వుకున్నారు.

శ్రీనివాస్ మరీ పొట్టీ పొడుగూ కాకుండా చామనఛాయ రంగుతో చైతన్యానికి ప్రతిరూ




పంలా వుంటాడు.

కాలేజీలో చదివేరోజుల్లో రెసిలింగ్ ఛాంపియన్. ప్లేన్ పైలట్‌గా ట్రెయినింగ్ అయ్యాడు. అతని కళ్ళు సూటిగా చూస్తే ఎదుటివాళ్ళు నిజం తప్ప మరో మాట చెప్పలేరు. అందుకే అతన్ని ఇష్టపడ్డాడు కృష్ణమూర్తి గారు. అపార్ట్‌మెంట్స్ అతనికంటె బాగా ఇంకెవ్వరూ చూడలేరని కూడా ఆయనకి తెలుసు. ముఖ్యంగా సన్నిహిత శ్రీనివాస్‌ని ఇష్టపడి పెళ్ళిచేసుకుంది.

రామారావ్ మాటలమధ్యలో ఓసారి అన్నట్టు గుర్తు. మనోహర్‌కి ఆ పని నచ్చలేదని, బయటివాళ్ళకి అధికారం ఇవ్వడం ఎందుకన్నాడనీ...

శ్రీనివాస్ మాటల్తో వర్తమానానికి వచ్చాడాయన.

''రాత్రి చిన్నమావయ్య ఫోన్‌చేశారు''

''ఎవరు... మనోహరా?''

ఒక్క నిమిషం ఒళ్ళంతా ఓ చిన్న కుదుపు. తల తిరుగుతున్నట్టు అన్పించింది. కుర్చీ గట్టిగా పట్టుకున్నారాయన.

''తాతగారూ! ఏమైంది. ఒంట్లో బాగుండలేదా?''

''ఊహూ... కొంచెం పులకింతలా కుదుపు. బహుశా బి.పి. ఎక్కువైందేమో''

''ఇంటికి వెళ్దామా? తీసుకెళ్ళనా?''

''వద్దు... ఇక్కడే బావుంది. ఊ... ఇంతకీ ఏం చెప్తున్నావ్?''

''మనోహర్ మామయ్య ఫోన్‌చేశారు. ఇదివరలో కూడా అప్పుడప్పుడు ఫోన్ చేసి మంచీ చెడూ అడిగేవారు. క్షేమసమాచారం వినేవాళ్ళు అంతే... వచ్చేవారం మీ పుట్టినరోజుకి ఎవరైనా వస్తున్నారా అని అడిగారు. ఆయనకి వచ్చే వుద్దేశ్యం వుంటే రమ్మని చెప్పాను''

''ఎందుకు? ఎందుకలా చెప్పావ్?''

''మన ఫామిలీ అందర్నీ కలుసుకోవడం మీకు బాగుంటుందేమోనని''

''ఎలాగూ ఇవాళో రేపో పోతాడు. అందరూ ఒకసారి చూడండనా?''

''నా ఉద్దేశ్యం అదికాదు. ఒక్కోసారి మన అనుకునేవాళ్ళతో రాజీ పడటం మంచిది''

''మనోహర్ నా అనుకోదగ్గవాడు కాదు. అతన్ని త్యజించి ఇరవైఏళ్ళయింది. నువ్వు చెప్పిన ఇంగితం నాకు లేదనుకోకు. కానీ... కానీ మనోహర్ ఈ కుటుంబం గుండెకాయని క్రూరంగా చితగ్గొట్టేశాడు. వాడు... వాడు మనిషికాదు. పెద్దవాళ్ళ బాధ్యతలు ఏమిటో తెలుసా? 'పిల్లలకి వెచ్చటి గూడునివ్వాలి. వాళ్ళ మంచీ చెడులు చూడాలి. జీవితాన్ని ఎదుర్కోగల ఆత్మస్థైర్యం ఇవ్వాలి. మిగతా తిండీ, బట్టా, చదువూ ఎవరైనా ఇవ్వగలరు. మనం పిల్లల కోసం ఓ దుర్భేధ్యమైన కోటని నిర్మించాలి. అందులో వాళ్ళు నిర్భయంగా పెరగాలి. ఆ కోట పవిత్రంగా వుండాలి.

మనోహర్ ఆ కోటను అపవిత్రం చేశాడు. కుటుంబం విలువను సర్వనాశనం చేశాడు. అది మర్చిపోవడం నావల్లకాదు. అతన్ని నేను క్షమించలేను. మన రాష్ట్రానికి వాడో మంత్రి. వాడు ఏది కావాలనుకుంటే అది సాధించే రకం. వాడు సాధించలేకపోయింది ఈ ఇంట్లో వుండటం ఒకటే...''

ఆయనకు ఆ మాటలకే ఆయాసంగా వుంది. అయినా లెక్కచెయ్యలేదు. మాటలు అలా ఏకధాటిగా వచ్చేస్తున్నాయి. మాట్లాడేంత వరకు బతికేవుంటారు. మాట్లాడుతూ వాక్యం మధ్యలో ఎవరూ చావరని ఆయన నమ్మకం.

''వాడు వస్తాడన్న నమ్మకం నాకులేదు''

''అవును... మామగారు అక్కడే వున్నారు'' ఒక్కక్షణం ఆగి, ''మామయ్యగారికి ఏవైనా ప్రాబ్లెమ్స్ వుంటే చిన్నమామయ్య సాయం తీసుకుంటూంటారని చెప్పారాయన''

''ఎలాంటి సమస్యలు?'

''తెలీదు. ఆయన చెప్పలేదు''

''నాకు తెలుసుకోవాలని కూడా లేదులే''

''మామయ్య మీ పుట్టినరోజుకి రానన్నారా?''

''ఆ... ఏదో సాకు చెప్పాడులే. అందరూ ఎందుకు? నువ్వూ, సోనీ, పిల్లలు... శ్రీనాథ్ ఇక్కడే వున్నాడుగా. సౌందర్య...''

''ఇక్కడే వుందని విన్నాను''

''అవునటకదా... ఎవరితోటి... ఏదో పేరు విన్నాను... అతని పేరు రాజశేఖర చక్రవర్తి

అటగా... అందరూ చక్రవర్తి అని పిలుస్తారట''

ఆయాసం తీర్చుకుందుకో క్షణం ఆగి "అతను మంచివాడే. మనపిల్లే... పెళ్ళి కాకుండానే తల్లినై సెన్సేషనల్ న్యూస్ సృష్టించాలనుకుంది. ఆ పిల్ల పుట్టగానే చచ్చింది. ఇప్పటికీ అతగాడు ఇదంటే పడి చస్తాడటగా. అయిదారుసార్లు అతన్ని చూశాను. మంచివాడు పాపం దీని ట్రాప్‌లో ఎలా ఇరుక్కున్నాడో...''

"ఇప్పటికీ పెళ్ళి చేసుకుందుకు సిద్ధంగా వున్నాడట... సౌందర్య ఎటూ చెప్పడంలేదు''

"దానికి తండ్రిపోలికలు వచ్చినట్టున్నాయి''

"అతన్ని పిలిస్తే మీకేం అభ్యంతరంలేదుగా!''

"లేదు లేదు... పిలు... రమ్మను''

"ఇంకెవర్ని పిలవను?''

"... ...''

జవాబు వినిపించక తల ఎత్తాడు శ్రీనివాస్. అప్పటికే కుర్చీలో స్పృహతప్పి, తలవాల్చి ఉన్నారు కృష్ణమూర్తిగారు.



రామారావ్‌గారు మనోహర్ క్వార్టర్స్‌లో వున్నారు. ముఖ్యమంత్రి కాగల అవకాశాల గురించి వివరిస్తున్నాడు మనోహర్. రామారావ్‌కి కలలోలా అనిపిస్తోంది. ముఖ్యమంత్రి - ఓ రాష్ట్రానికి. మనసు మారుమూలల్లో ఏదో బాధ. ఎందుకు? నేనెందుకు జీవితంలో పైకి రాలేక పోయాను. ఎవరి తప్పది? ఇప్పుడివా అనుకుని ఏం లాభం అరవై నిండాక.

అప్పుడే ఫోన్ ట్రింగ్... ట్రింగ్.... అంది.

"హల్లో'' మనోహర్ మాట్లాడుతున్నాడు.

"నాన్నగారికి హార్ట్ ఎటాక్ వచ్చిందట. ఇంటెన్సివ్ కేర్ యూనిట్‌లో జాయిన్ చేశారట ఉస్మానియాలో. సోనీ వుందక్కడ''

"ఎలా వున్నారట?''

"తెలీదు''

"నువ్వు వెళ్ళి ఫోన్‌చెయ్యి''

"నువ్వు రావా?''

"ఊహూ... పొద్దుట వస్తాను. అదీ నువ్వు అవసరం అనుకుంటే''

ఇద్దరూ ఒకర్నొకరు చూసుకున్నారు.

"ఆయన వయసు ఎనభైదాటింది. ఎప్పుడో ఒకప్పుడు పోక తప్పదని మనకి తెలును''

★ ★ ★

సరిగ్గా ఆ సమయానికే వైజాగ్ కె.జి.హెచ్.కి ఉస్మానియానుంచి ఓ ఎస్.టి.డి. కాల్ వెళ్ళింది. మోహిత హార్ట్ సర్జన్... డ్యూటీలో లేదు. ఇంటినంబర్ ఇచ్చారు.

"హలో'' నిద్రలోనే ఫోన్ అందుకుందామె.

"హలో మోహితగారా? జస్టెమినిట్... హైదరాబాద్‌నించి ఎస్.టి.డి.

"మోహితా... నేను డాక్టర్ చంద్రని. అయిదు నిమిషాలక్రితం సోమయాజులు కృష్ణమూర్తిగారిని మాసివ్ హార్ట్ ఎటాక్‌తో ఇక్కడికి తెచ్చారు. ఆయన మీ నంబర్ ఇచ్చి చెప్పినదే చివరి మాట.

'నేనుండగా రాకపోయినా, నేను లేనని తెలిశాకయినా నువ్వు వస్తావని నేను ఎదురుచూస్తాను...' అన్నారు

హి ఈజ్ నోమోర్ మేడమ్''

★ ★ ★

"అప్పటికీ ఇప్పటికీ సిటీ ఎంత పెరిగిపోయిందో చూశావా? నీక్కావలసినంత వెండి బంగారాలు కొని దాచుకోగలవేమోగాని ఓ జానెడు స్థలం కొనడం గగనమైపోయింది సిటీలో'' సోనీ వరినరాల్ను చూపిస్తూ అంది.

అంతకు ముందు రోజే వైజాగ్‌నించి చెల్లె




లింటికి వచ్చింది మనోహిత. ఆ రోజు సరదాగా పిల్లల్ని తీసుకుని బిర్లామందిర్‌కి, టాంక్‌బండ్‌కి బయల్దేరారు.

ఎక్కడ చూసినా జనం జనం. రోడ్డు మీద నడవాలంటే ఒకళ్లనొకళ్లు రాసుకుంటూ తోసుకుంటూ పోవలసిందే. అప్పట్లో రోడ్లమీద ఒకటో రెండో కార్లు నడిచేవి. ఇప్పుడో రోడ్డు దాటాలంటే కార్ల ప్రవాహం ఆగితేనా?

బిర్లా మందిర్‌నించి సిటీలైట్లు నేలకు దిగి వచ్చిన నక్షత్రాల్లా వున్నాయి.

"నువ్వు వెళ్లిపోయాక, ఎవరిదారిన వాళ్లు విడిపోయాక బయటకు వచ్చిందే చాలా తక్కువ. కాలేజీలో ఫైనలియర్‌లో వున్నప్పుడు బొటానికల్ టూర్‌కని బయల్దేరినప్పుడే ఈ బయటి ప్రపంచం చూస్తి. అప్పుడే శ్రీనివాస్‌తో పరిచయం. ఆ పరిచయం పెరక్కముందే, తాతగారి దగ్గర ఉద్యోగానికి వచ్చాడు. అయిదారు నెలల్లో ఎంత విశ్వాసం పొందగలిగాడంటే ఇదిగో ఇలా..."

"అదంతా జరిగి పదేళ్లు దాటి వుండాలి"

"ఊ... వచ్చే నెలకి పదకొండేళ్లు"

రెయిలింగ్‌కి ఆనుకుని నిల్చుంది సన్నిహిత.

"తాతగారి ఊహాశక్తిని మెచ్చుకోవాలి. ఆ రోజుల్లోనే ఈ ఇబ్బందిని ఊహించి వుంటారు. అందుకే ఎక్కడా లేకపోయినా అపార్ట్‌మెంట్స్ కట్టడం మొదలు పెట్టారు. ఇప్పుడు వాటి విలువ రెండు వందల రెట్లు పెరిగి వుంటుంది. అప్పట్లో అందరూ ఆయనకు మతిపోయిందనీ పిచ్చెక్కిందనీ విమర్శించారు కాని ఇప్పుడో! అయినా ఆయన చాలాసార్లు అందరికీ చెప్పారు. ఎవరికివ్వాల్సింది వాళ్లకి చేశాను. నా మీదిక ఆశలు పెట్టుకోకండని. అయినా అందరికళ్లూ అపార్ట్‌మెంట్స్ మీదే వున్నాయి" ఒక్క నిమిషం నిశ్శబ్దం తరువాత మళ్లీ చెప్పటం మొదలెట్టింది సోనీ.

"తాతగారు అపార్ట్‌మెంట్స్ ఆరంభించాక ఎక్కడలేని డబ్బూ దానికే సరిపోలేదు. ఏం జరిగిందో తెలీదుకానీ డాడీకి అపార్ట్‌మెంట్స్ అంటేనే విసుగుమొదలైంది. వాటి పేరెత్తితేనే మండిపడతారు. బహుశా తాతగారి పేరు చూసి ఈర్ష్య పడుతున్నారేమో"

"ఎందుకు?"

"తెలీదు కానీ టెక్స్‌టైల్ మిల్స్ అమ్మే ఉద్దేశ్యంలో వున్నారని మాత్రం తెలుసు. అదీ తాతగారి ఆరో ప్రాణమే. దాన్ని వీళ్ల చేతుల్లో పెట్టి నిశ్చింతగా వుండేవారాయన. ఇలా వీళ్లు దీన్ని అమ్మే ఉద్దేశ్యంలో ఉన్నారని ఏమాత్రం తెలిసినా ఆయన ఇన్నేళ్లు బతికేవారుకాదు. ఎప్పుడో గుండె ఆగిపోయి వుండేది"

"ఎందుకు డాడీకా ఉద్దేశ్యం వచ్చింది. ఏవైనా ఇబ్బందుల్లో వున్నారా? మిల్స్‌లో నష్టాలు వచ్చాయా?"

"అదేం చెప్పరు. డబ్బు అవసరం అని మాత్రం అంటారు. ఇంకెందులోనో ఇన్వెస్ట్ చేసి వుంటారు. అపార్ట్‌మెంట్స్‌తో ఎలాంటి ఇబ్బందీలేదు. అవి అమ్మలేం. అసలు ఆ ప్రసక్తేలేదు. వాటిని కంటి రెప్పల్లా జాగ్రత్తగా చూసుకుంటానని శ్రీనివాస్ ప్రామిస్ చేశాడు.

"మరి టెక్స్‌టైల్ మిల్ అమ్మడానికి అందరూ ఒప్పుకున్నారా?"

"తెలీదు ఒప్పుకుంటారేమో. కానీ ఎందుకలా జరిగిందనేది అర్థంకావడంలేదు. అవన్నీ తాతగారు చూసుకున్నప్పుడు ఎంత బావుండేది?"

"అవును కదూ"

హఠాత్తుగా తండ్రి పట్ల జాలికలిగింది మనోహితకు. ఆయన చేతికి రాగానే ఇలా జరిగిందంటే ఆయనకెంత బాధగా వుందో. తండ్రితో తన అసమర్థతను పోల్చి చూసుకోడమే కాకుండా మిగతా అందరూ అలాగే చూస్తారని అనుకోవడం.

"శ్రీనివాస్‌కి అన్ని వివరాలూ తెలుసు. నాకు పెద్ద ఆసక్తి లేదనుకో"

ఇద్దరూ క్రిందకు దిగడం ఆరంభించారు.

"అసలిప్పుడు డాడీ ఆ మిల్ అమ్మకుండా చూడాలి. ఒకసారి డాడీతో మాట్లాడకూడదూ? అసమర్థుడిగానే జీవితం ముగిసిపోతుందేమోనని ఆయన భయం"

మధ్యలోఅయిస్‌క్రీమ్‌కొని ఇంటికి బయల్దేరారు.

మనోకి సిటీ కొత్తగా అనిపించడంలేదు. ఎవరింట్లోనో ఇరవై ఏళ్లు గడిపి స్వంత ఇంటికి తిరిగి వచ్చినట్టుగా వుంది. ఒక్క వైజాగ్‌లోనే కాదు బాంబేలో, ఢిల్లీలో, ఎక్కడెక్కడో జీవితాన్ని గడిపినా హైదరాబాద్ ఇచ్చిన నిశ్చింత ఎక్కడా లేదు. ఏదో పోగొట్టుకున్న బాధ మళ్లీ దాన్ని సాధించాలనే తపన అంతర్లీనంగా ఒళ్లంతా కళ్లు చేసుకుని చూస్తోంది. కళ్లతోనే సిటీ అందాలు తాగేస్తున్నట్టు... అయినా దాహం తీరితేగా.

చివరికి ఆటో ఇంటి ముందాగింది.

పిల్లలిద్దరూ వాళ్ల గదిలోకి వెళ్లిపోయారు చదువుకుందుకు. ఆ ఇల్లు మరీ చిన్నదేం కాదు. త్రీ బెడ్‌రూమ్స్, పెద్ద హాల్, ఓ చిన్న లైబ్రరీ, కిచెన్, ఇరవైమందికి సరిపోయే డైనింగ్‌రూమ్, అన్ని ఫెసిలిటీస్‌తో రెండు గెస్ట్ రూమ్‌లు.

ఇంటి చుట్టూ రంగురంగుల పూలతో పూల మడులు గేట్‌కి అటూ ఇటూ పున్నాగచెట్లు.

''నీకీ వాతావరణం నచ్చిందికదూ... మనిద్దరి టేస్ట్‌లూ దాదాపు ఒకటే...'' అంది సోనీ వంటగదిలోకి నడుస్తూ.

''కాఫీ తాగుదామా? ఏమిటో బయటకు వెళ్లొస్తే చాలు కాఫీ తాగితేగాని తోచదు''

''ఇంత పెద్ద ఇల్లు... చూసుకోవడం కష్టంకదూ''

''నిజమే అనుకో... అప్పుడప్పుడు ఎవరైనా వస్తారు... దసరాకి అందర్నీ పిలుస్తాం. దసరా ఇక్కడ, సంక్రాంతి కామేశ్వరత్త ఇంట్లో ఒక్క మనోహరే ఎప్పుడూ రాలేదు. రాజకీయాల్తోటే అతనికి రాత్రీ పగలూ... అతను మినిస్టర్ అయినప్పుడు తాతగారేమన్నారో తెలుసా... అందుకే మనదేశం ఇలా అఘోరించింది నేరస్తులు రాజ్యమేలుతారు అని''

''గిరిజత్త... సుందరం పెదనాన్న వస్తూంటారా?''

మధ్యలోనే మనో మాట మార్చడం గమనించింది సోనీ.

''సారీ మనో ఎందుకతని గురించి మాట్లాడ్డం మొదలెట్టానో నాకే తెలీదు. సాధారణంగా అతని గురించి ఎవరం మాట్లాడం'' ఇద్దరూ కాఫీ కప్పులు తీసుకున్నారు.

''మనో నువ్వు మా అందరిలో అంతర్లీనంగా అల్లుకుపోయివున్నావు. ఒక్కోసారి నీ మీద ఒళ్లు తెలీని కోపం వచ్చేది ఇలా అందర్నీ ఒదిలేసి వెళ్లిపోయావని. స్కూల్లోనో కాలేజీలోనో కాంపోజిషన్ రాయమన్నారోసారి. 'మనకుటుంబం' అది టాపిక్. నాకింకా గుర్తు మనిద్దరి గురించీ రాసాను. సన్నిహిత, మనోహిత అని. మా టీచర్ అడిగారు కూడా ఇంత సన్నిహితంగానా పేర్లు ఎంత అక్క చెల్లెళ్లైతే మాత్రం అని. ఇంకేదో''

''నా పేరిప్పుడు మనోహితకాదు''

సన్నిహిత తలతిప్పి ఆమె వంక చూసింది ''మరి?''

''మోహిత'

''మార్చుకున్నావా? ఎందుకు?''

''కొత్త జీవితం ప్రారంభించినప్పుడు కొత్త పేరు ఎంచుకోడం మామూలేగా. పైగా నాకోసం వెతికించినా ఎవరికీ నా ఆచూకీ దొరక్కూడదనే ఉద్దేశ్యం. ఎవరైనా ట్రై చేశారా?''

''అందరూ... పోలీస్ రిపోర్టివ్వడం, డిటెక్టివ్ ఏజెన్సీ హెల్ప్ తీసుకోడం దాదాపు రెండేళ్లు వెతికారు. తరువాత నిరాశపడి ఆశలు వదులుకున్నారు. మోహిత ఆ పేరే బాగుంది. ఈ విషయం ఇదివరకు చెప్పలేదేం. నిన్న శ్రీనివాస్‌కి పరిచయం చేసినప్పుడు కూడా'' మనోహిత నవ్వింది.

''ఇది మా అక్క అని చెప్పావు. అది చాలదూ''

''మోహిత! కొత్తగా వుంది''

''నీకు నా పేరు కొత్తగా వుందేమో.. నా కళ్లకి నువ్వే కొత్తగా వున్నావు. చిన్నప్పటి నా సోనీ వేరు ఇప్పుడు ఇద్దరమ్మాయిల తల్లివి. ముఖ్యంగా శ్రీనివాస్ భార్యవి'' సోనీ నవ్వింది.

''నాకు పదేళ్లుగా అలవాటైపోయిందిలే. నువ్వు నాలాగే పెళ్లి చేసుకునివుంటే ఆ కొత్తదనం నాకు సంతోషాన్నిచ్చి వుండేది'' మనో ఆ మాట విననట్టు నటించింది.

''అన్నట్టు ఇక్కడికి ఎవరెవరు వస్తారో చెప్పడం మొదలెట్టి ఆగాను కదూ. పెద్దత్తే





ఎక్కువగా వచ్చేది. అప్పుడప్పుడు శ్రీనాథ్ వస్తుంటాడు. శ్రీనివాస్ దగ్గర అసిస్టెంట్‌గా చేరాడీమధ్యే''

ఇంతలో ఫోన్ శబ్దం.

''ఒక్క నిమిషం''

''హలో... ఓ శ్రీనాధా? చెప్పు ఏమిటి విశేషాలు? ఎప్పుడూ లేనిదీవేళ కొత్తగా ఫోన్ చేస్తున్నావేమిటి? అత్తకూతురి మీద హఠాత్తుగా ప్రేమ ముంచుకొచ్చిందా?'' హఠాత్తుగా చూపులు అక్కవైపు తిప్పింది.

''ఎవరు? మనోనా? ఇక్కడలేదే? ఊహు ఎక్కడుందో తెలీదు. ఆ రోజు హఠాత్తుగా వచ్చి హఠాత్తుగా వెళ్లిపోయింది'' కాస్సేపు నిశ్శబ్దం.

''అవును ఆ రోజు ఓ పది నిమిషాలు మాట్లాడుకున్నాం. నిజమే తరువాత వెళ్లిపోయింది. రావాలనిపిస్తే తనే వస్తుందని అడ్రస్ అడగలేదు''

''ఎందుకో అంత ఆసక్తి'' టక్కున ఫోన్ క్రెడిల్ చేస్తూ మనోహిత వైపు తిరిగింది.

''శ్రీనాధ్ నా గురించి అడగటమా? నేనెవర్నో అతనికి తెలీదే. కనీసం ముఖ పరిచయం కూడా లేదు. నేనిక్కడుంటే అతనికేంటి?''

''అదే తెలీదు. అసలతను ఫోన్ చెయ్యటమే వింతగావుంది. బహుశా డాడీ కోసమో అత్తకోసమో ఫోన్ చెయ్యాలనుకున్నాడేమో''

''శ్రీనాధ్ ఎలాంటివాడు?''

''తెలీదు... ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడడు'' పిల్లలిద్దరూ పరుగెత్తుకు వచ్చారు.

''ఇది వీళ్ల డిన్నర్ టైమ్''

''పెద్దమ్మా నేన్నీ పక్కన కూర్చుంటాను'' హరిత అడిగింది.

''ఊహు వద్దు పెద్దమ్మా నువ్వు నా పక్కన వుండాలి'' సౌమ్య అథారిటీ.

మనోహిత నవ్వింది.

''మీ ఇద్దరి పక్కనా వుంటే బావుండదా?''

ఇద్దరి పక్కనానా? అదెలాగ?''

''ఇద్దరి మధ్యనా''

''ఊహు ఒద్దు... ఒకరికే మీ మొత్తం అటెన్షన్ ఇవ్వాలి. నగం సౌమ్యతో నగం నాతో వద్దు. మా ఇద్దరి మాటల్లో ఒక్కటి కూడా వినరు మీరు అలాగైతే''

''ఎవరి దగ్గరో వినివుంటుందా మాటలు. అవునా హరీ''

''ఇంకెవరు? నా దగ్గరే విని వుండాలి'' శ్రీనివాస్ లోపలికి వచ్చాడు.

''ఒక్క మాటా సక్రమంగా వుండదు''

''నిన్ను చూడకముందు మాటా మనసూ కూడా సక్రమంగానే వుండేవి. తరువాతే అక్రమంగా మారిపోయాయి. అతని చూపులు ఆమె పెదవులు మీద వాలి నెమ్మదిగా కిందకు సాగాయి. సోనీ చెక్కిళ్లమీద సిగ్గు మందారాలు. మనోహిత ఇద్దర్నీ గమనించింది. వాళ్లిద్దరూ, పిల్లలు... ఒకరితో ఒకరు పెనవేసుకున్న బంధాలు.

హఠాత్తుగా ఓ అజ్ఞాత కామన ఉవ్వెత్తున పైకెగసింది.

''ఊహు... ఈ బంధాలు నాకొద్దు.. అలాగని ఎప్పుడో నిర్ణయించుకున్నానుగా. నాక్కావలసిన జీవితాన్ని నేను ఏరికోరి ఎంచుకున్నాను. ఈ జీవితం కోసం రాత్రీ పగలూ శ్రమించాను''

''ఇంతకీ ఎవరి పక్కన కూచుంటారు పెద్దమ్మా?'' మళ్లీ అడిగింది హరిత.

''ఇద్దరి మధ్యనా''

ఆ సమాధానం పిల్లలిద్దరికీ కూడా నచ్చినట్టులేదు. హఠాత్తుగా మనోహితకి అనిపించింది 'పిల్లల్తో మాట్లాడ్డం నాకు రాదేమో' అని.

''ఇవాల్టికిలా సరిపెట్టుకుందాం. హరితా నీకు చాలా నచ్చిన మనుమల గురించి నాకు చెప్పాలి. డిన్నర్ ముగిసాక మనిద్దరం రహస్యంగా మాట్లాడుకుందాం. చెప్తావా?''

''రహస్యాలంటే నాకు తప్ప మరెవరికీ తెలీనివా?''

''అవును అవే ఏవైనా వున్నాయా?''

''ఓ చాలా మీకొక్కరికే చెప్తాను''

''పెద్దమ్మా... పెద్దమ్మా నేనూ మీతో వుంటాను. నాకూ చెప్పరూ ఆ రహస్యాలు'' సౌమ్య కుతూహలం.

''ఇహ అవి రహస్యాలెలాగవుతాయి?''

''పెద్దమ్మకి చెప్పాక అవి రహస్యాలెలాగవు తాయి?''

''అవుననుకో... అయినా'' ఏం చెప్పాలో ఆ పిల్లకి అర్థం కాలేదులావుంది ఓ క్షణం ఆలోచించింది.

మనోహిత అడిగింది, ''ఏం ఆలోచిస్తున్నావు హరితా? నీ రహస్యం ఒకళ్లకి చెప్పడానికి పదిమందికి చెప్పడానికీ ఏమైనా తేడా వుందా?''

''ఒకళ్లకి చెప్పడంవేరు. అందరికీ చెప్పడంవేరు. అందరికీ చెప్పేసాక మన దగ్గర ఏం మిగులుతుంది. పెద్దమ్మా! మీరు మీ రహస్యాలు ఎవరికైనా చెప్పారా''

''నిజమే ఎవరికీ చెప్పను. అలాంటి రహస్యాలు కొన్ని వున్నాయి''

ట్రింగ్... ట్రింగ్.

సన్నిహిత ఫోన్ రిసీవ్ చేసుకుంది.

''ఊహు... నాకు తెలీదు. అక్క చెప్పలేదు. ఒకవేళ ఫోన్ చేస్తే అడిగి చెప్తాను. ఊహు చెప్పలేదు. మనల్ని చూడాలనుకుంటే తనే వస్తుంది''

''మీ డాడీయా?'' శ్రీనివాస్ అడిగాడు.

''నేనెప్పుడు ఎవరితో మాట్లాడినా అంత కరెక్ట్‌గా ఎలా గెస్ చేస్తారు?''

''ఎలా అంటే నీ మాటలే చెప్తాయి నువ్వు మీ డాడీతో మాట్లాడావని''

''నువ్వు ఎవరికీ చెప్పొద్దన్నావ్ అందుకే''

''థాంక్యూ''

''ఏం చెప్పద్దన్నారు?'' శ్రీనివాస్ అడిగాడు.

''ఈసారి ఎవరినీ కలునుకోడం నాకిష్టంలేదు కనుక నేనిక్కడ వున్నట్టు చెప్పొద్దన్నాను. మీరు, పిల్లలు చాలు. ఊ పిల్లలూ చెప్పండి ఏం చేద్దాం.. ఎటైనా వెళ్దామా?''

''మీరు రెండ్రోజులుంటారా? నిజమా? ఈ ఇంటికి జాతరలా చుట్టాలువచ్చి పోవడమే గాని వుందామని ఎవరూ అనుకోరు. ఇక్కడ వుండేది మేమే. మిగతావాళ్లు వచ్చినప్పటి నుంచి వెళ్లిపోవాలనే ధ్యాస. అందరికీ వీడ్కోలు చెప్పడమే మాపని. తాతగారిని ఇక్కడ వుండమన్నా వుండరు. చెప్పండి మీరిక్కడే వుండిపోతారా?'' హరిత ప్రశ్న. మనో తల అడ్డంగా వూపింది.

''ఎలా వుండగలను? నా ఉద్యోగం... ముఖ్యంగా ఎంత మందో రోగులు నా కోసం ఎదురు చూస్తుంటారు. వెళ్లాలి. అయినా వస్తూ వుంటానుగా. వీలైతే ఇక్కడికి ట్రాన్స్‌ఫర్ చేయించుకుంటాను. అప్పుడు ఇక్కడే వుంటాను''

''ఊహు... అలాకాదు. మీరు రారు. వస్తే బోర్ కొడుతుంది. అంతేగా'' సౌమ్య అడిగిందీసారి.

''కాదు కాదు... మీతో వుండాలనే వుంది. కానీ ఇప్పుడే అంటే ఎలా? మీ స్కూల్‌లాగే నా హాస్పిటల్. మీరు నాతోపాటు ఇప్పుడే బయల్దేరి వస్తారా? ఊహు స్కూల్‌కి వెళ్లాలి. అలాగే నా హాస్పిటలో''

''దానిదేం వుంది. నేనక్కడ స్కూల్‌కి వెళ్లొచ్చు లేదా మీరిక్కడ హాస్పిటల్‌కి వెళ్లొచ్చు''

''నిజమే కాని వెంటనే కాదు, కాస్త సమయం కావాలి'' శ్రీనివాస్ ఏదో అనబోయాడు. అంతలో ఫోన్.

సన్నిహిత పరిగెడుతున్నట్టుగా ఫోన్ తీసింది.

''లేదు'' ఒక్కసారి పిల్లల్ని శ్రీనివాస్‌నూ మార్చి మార్చి చూసింది.

''ఎక్కడుందో తెలీదు. చెప్పలేదు. ఒకవేళ ఎవరితోనైనా మాట్లాడదలుచుకుంటే తనే మాట్లాడుతుంది. నాకు తెలీదు'' ఫోన్ క్రెడిల్ చేసింది.

''ఎవరు మమ్మీ?'' హరిత అడిగింది.

''ఎవరైతే నీకెందుకు.. ఇహ ఒక్కక్కళ్లు వస్తారా డిన్నర్ టైమ్ కూడా దాటిపోయింది'' మాట తప్పించింది సన్నిహిత.

''ఏమైనా హెల్ప్ చెయ్యనా?'' అంటూనే చొరవగా వంటింట్లోంచి ప్లేట్లు, గ్లాస్‌లు తేవడం టేబుల్ అరేంజ్ చెయ్యడం లాంటివి మొదలెట్టింది మనో.

''ఇలాంటి రోజు ఒకటి వస్తుందని తాతగారు కలలో కూడా అనుకోలేదు''. ఓ వక్కన శ్రీనివాస్, సోనీ మరో వక్క పిల్లలిద్దరి మధ్య మనోహిత.





''తాతగారు ఇరవై ఏళ్లు నీ జ్ఞాపకాల్లోనే బతికారు మనూ'' మనోహిత మనసు గతంలోకి తొంగి చూసింది.

అప్పుడప్పుడు తాతగారితో వాకింగ్‌కి వెళ్లడం, ఎప్పుడైనా మనసు విప్పి మాట్లాడటం అంటూ జరిగితే అది ఆయనతోటే.

''ఆయన అంతగా నన్ను గుర్తుంచుకుంటారనీ నా కోసం అలమటిస్తారని అనుకోలేదు'' లోగొంతుతో అంది మనోహిత.

''ఆయన ఎప్పుడూ మీ గురించే ఆలోచించేవారు''

ఓ పక్క వడ్డించడంలో సోనీకి హెల్ప్ చేస్తూనే చెప్తున్నాడు శ్రీనివాస్.

''దాదాపు ఏడాది క్రితం అనుకుంటాను. ఫస్ట్ టైమ్ హార్ట్ ఎటాక్ వచ్చిందాయనకి. అది వచ్చేముందు ఇద్దరం కలిసి టిఫిన్ చేస్తున్నాం. హఠాత్తుగా డెలీరియంలోకి వెళ్లిపోయి మాట్లాడటం మొదలెట్టారు. కళ్లు మూసుకుని వున్నాయి.

''మనో.. ఉహు కాదు కాదు బంగారు మనో నా చిన్నారి తల్లీ. నన్ను నన్ను ఎప్పటికీ క్షమించలేవా? నీకు నా అవసరం ఇప్పుడు లేకపోవచ్చు. నువ్వంటే నాకెంత ఇష్టమో ఎలా చెప్పను నీకు? నువ్వు ఇంటికి తిరిగి రావాలి. వచ్చి తీరాలి. దానికోసం ఏమైనా చేస్తాను'' అంటూ..!''

మనోలో ఏమాత్రం కదలికలేదు. కళ్ల రెప్పలు కూడా వాల్చకుండా చూస్తూండిపోయింది. కన్నీళ్లు పొంగి జారి చెక్కిళ్ల మీద సాగుతున్నాయి. కానీ మనసులో ఉప్పొంగిన ఉద్విగ్నతకు దారితోచట్లేదు. ఇరవై ఏళ్లు... ఇరవై ఏళ్లు ఏకాకిగా.

''అయినా ఒక్కదానివి ఎవరి అండదండలూ లేకుండా ఇంతగొప్ప స్థితికి చేరుకోడం నాటజోక్. మన కుటుంబంలో అలా స్వశక్తితో పైకొచ్చిన దానవు నువ్వే'' సోనీ అంది.

''మనోహర్ అంకుల్ పైకి రాలేదా?'' హరిత ప్రశ్న.

''అయినా అతనంటే నాకిష్టంలేదు. ఆయనకి పిల్లల మీద ప్రేమలేదు. ఆ రోజు ఆయన అదే మీ తాతగారు పోయిన రోజు శ్రీనాథ్‌తో ఓ రహస్యం చెప్పారు అదినాకు వినబడింది''

''నిన్నలా పెద్దవాళ్లందరినీ పేర్లతో పిలవద్దని చెప్పానా?'' కోపంగా వుంది సోనీగొంతు.

''చెప్పావు. అయినా నాకిలా పిలవడమే ఇష్టం. నేనిలాగే పిలుస్తాను''

''ఇంతకీ ఆ రహస్యం ఏంటో చెప్పు''

''శ్రీనాథ్‌ని పిలిచి ఎవరినో ఒదిలించుకోమని చెప్తున్నారు. దాన్ని వదిలించు... చంపేసినా సరే అని. ఆ క్యాయెల్టీ నాకు నచ్చలేదు''

''ఎవరి గురించి అన్నారు?'' శ్రీనివాస్ ముందుకు వం[illegible]డిగాడు.

''తెలీదు. దానికేం కావాలో కనుక్కుని పీడ వదిలించు అన్నాడు''

''దానిక్కావలసింది ఇచ్చి దాని పీడ విరగడచెయ్'' ఆ మాటలు అతను అంటున్నట్టుగానే వినిపించింది మనోకి

అతని కంఠస్వరం అంత బాగా జ్ఞాపకం వున్నట్టు ఈ క్షణం వరకు ఆమెకే తెలీదు.

ఒక్కసారి భయంతో ఒళ్లు జలదరించిందామెకి, ఆ వెనువెంటనే కోపం భగ్గుమంది.

ఒకసారి కుటుంబానికి దూరం చేశాడు. అది చాలదా? కాదు కాదు.. నేనే ఇల్లొదిలి వెళ్లిపోయాను. అతను మాత్రం దర్జాగా జల్సాగా.

అన్యాయం... అన్యాయం... మనసు రోదించింది.

శ్రీనాథ్‌కి పురమాయించాడు నా పీడ వదిలించుకోమని. గంట క్రితం శ్రీనాథ్ ఫోన్ చేసి నా ఆరా తీశాడు. శ్రీనాథ్ ఎందుకు?

మనోహర్ ఎందుకు చెయ్యకూడదు? మనోహర్ అందుకు తగ్గవాడే. కాదంటే అంతరాత్మకి భయపడుతున్నాడా? ఉహు... అతనికి అంతరాత్మ వుంటేగా.

ఈలోగా డోర్‌బెల్ మ్యూజిక్. ఉలిక్కిపడ్డారందరూ. సోనీ వెళ్లింది.

సౌందర్య! మనోహర్ కూతురు.

''రారా... సమయానికి వచ్చావ్. భోజనాలు చేశారా? లేక'' శ్రీనివాస్ సాదరంగా ఆహ్వానించాడు.

"లేదు... ఉదయంనించి ఆకలితో మాడిపో తున్నాను. ఎవరు? ఫ్రెండా .. అరె ఈవిడని ఆరోజు తాతగారింట్లో చూశాను. మీరా!..."

"మనోహిత... మనో ఇది సౌందర్య" తప్పక పరిచయం చేసినట్టుగా వుంది సోనీ పద్ధతి.

"ఎప్పుడొచ్చారు? ఉంటారా ఓ నాల్రోజులు?"

గత్యంతరం లేనట్టు తల వూపింది మనో.

నోటమాట రావటంలేదు. ఎదురుగా మనోహర్ ఉన్నట్టేవుంది. తండ్రిలాగే ఉంగరాలజుట్టు నవ్వుతున్నట్టుండే చిన్న కళ్ళు. తండ్రిలాగే ఎదుటివారిని అంచనా వెయ్యాలని ప్రయత్నించే చూపులు. సౌందర్య పేరుని సార్థకం చేస్తున్నట్టుంది. మనోహర్‌కి ఆడరూపంలా వుంది.

సన్నిహిత చూపులతోటే అక్కని ప్రశ్నించింది. మనో తల వూపింది. సౌందర్యకి ఆమె ఎవరనేది చెప్పాలి. ఎంతవరకు ఆ విషయం రహస్యంగా ఉంచగలరు?

"మనో నీకు జ్ఞాపకం లేకపోయి వుండచ్చు. అది మా అక్క నీ చిన్నప్పుడు వెళ్లిపోయింది"

"ఓ మీరా! ఆ రోజున తాతగారింటో అందరూ అలా పిచ్చెక్కినట్టు చూడ్డంలో ఆశ్చర్యం లేదుమరి. మీరెళ్లిపోయినప్పుడు నాకు నాలుగైదేళ్లు.. మేం అంటే మీకు అయిష్టం అని చెప్తూండేది అమ్మ... మరి ఇన్నేళ్లకి రాబుద్ధయిందా? ఎక్కడుంటున్నారు?"

"వైజాగ్‌లో"

"నిజమా... నేనూ అక్కడే లా చదువుతున్నాను. ఎక్కడ మీ ఇల్లు"

"ఫ్లాట్. కెజిహెచ్ దగ్గర్లోనే, అది మీకు దగ్గరా?"

"ఉహు కాదు" సీరియస్‌గా వుందామె స్వరం.

"ఇంతలోనే మూడ్ మారిపోయిందా? ఏం జరిగింది సౌందర్యా?" శ్రీనివాస్ ప్రశ్న.

"ఉహు ఇహ వైజాగ్ వెళ్లడం లేదు.ఇక్కడే వుంటాను. ఇక్కడికి వచ్చేసి నాలుగు నెలలైంది"

"అవతల నీ లా.. చక్రవర్తి"

"గోటుహెల్... అమ్మ అక్కడికి రమ్మంటే రాదు. ఇహ చక్రవర్తి మాటెత్తద్దు. కరాఖండీగా చెప్పేసాను. పెళ్లీగిళ్లీ అనే వ్యవహారాలు నాకు నచ్చవని. ఎంతమంది డాక్టర్లకి చూపించాను. ఒక్కడాక్టరూ ఇదీ రోగం అని చెప్పడు. అమ్మేమో గుండెనొప్పి గుండె నొప్పి అని గిలగిల్లాడిపోతుంది"

"మరెవరయినా మంచి డాక్టర్ దొరుకుతారేమో మనోని అడుగుదాం"

"అదేం మనో. మొగుడు డాక్టరా?"

మంచీ చెడూ అనేది ఆలోచించకుండా మనోవైపు చూస్తూ అడిగింది.

"కాదు మనోనే డాక్టర్, హార్ట్ స్పెషలిస్ట్"

"ఇవాళా రేపు స్పెషలిస్టులకేంలే ఏ వీధిలో చూసినా .వాళ్లే ఎన్నేళ్లైంది స్పెషలైజేషన్ చేసి?"

ఒకసారి కళ్లు మూసి తెరిచింది మనో. "పన్నెండేళ్లు"

"హస్తవాసి మంచిదేనా?"

"మంచిదైనా కాకపోయినా ఓ నెల రోజులు సెలవు తీసుకుంటున్నాను. నాకు చూడటం వీలవక పోవచ్చు. మరో మంచి డాక్టర్‌కి చెప్తానులే"

"ఎక్కడ పనిచేస్తున్నావు?" ప్రశ్నల పరంపర ఆపలేదు సౌందర్య

"కె.జి.హెచ్‌లో.."

"కె.జి.హెచ్‌లో మోహిత అని దేవతా హస్తం మనుమల్ని మెస్మరైజ్ చేసి బాధలు తగ్గిస్తుందని విన్నాను. ఆవిడని రికమెండ్ చెయ్యి"

శ్రీనివాస్, సోనీ మొహాలు చూసుకున్నారు కానీ మాట్లాడలేదు.

"ఇంతకీ ఈ బాధ తగ్గుతుందంటావా?"

"ఏ సంగతీ చూడందే ఎలా చెప్పగలం? మీ అమ్మ ఆరోగ్యం ఎలావుందో రిపోర్ట్స్ ఎలా వున్నాయో అవన్నీ చూడందే కొమ్ముల్ని చూసి బేరమాడినట్టు వుంటుంది"

"నువ్వెలాంటి కేసుల్ని చూస్తుంటావ్?"

"సర్జరీ... బైపాస్ ఓపెన్ హార్ట్... ట్రాన్స్




ప్లాంట్స్''

''ఆరేళ్ల క్రిందట మొట్టమొదటి హార్ట్ ట్రాన్స్‌ప్లాంట్ ఈ దేశంలో చేసి విజయం సాధించింది... అంటే నీ పేరు''

''అవును పేరు మార్చుకుంది. మోహిత''

''వావ్... నువ్వీకేసు టేకప్ చెయ్యాలి. నేను నిశ్చింతగా వుండగలను''

''అయామ్‌సారీ... చెప్పానుగా''

''ప్రపంచంలో అద్వితీయమైన విజయాలను సాధించటం గొప్పేననుకో... ఓ మినిష్టర్ భార్యను ట్రీట్ చెయ్యటం కూడా తక్కువేమీ కాదు''

''అయామ్‌సారీ''

''మోహితా! ప్లీజ్! జీవితంలో అలసిపోయాను. ఒక్క క్షణం ప్రపంచంలో నా అంత అదృష్టవంతులు లేరనిపిస్తుంది, మరో క్షణం నా దురదృష్టానికి ఆత్మహత్య చేసుకుందామనిపిస్తుంది. నా అనేవాళ్లు ఎవరున్నారు. నీకు తెలీదు. ఇరవై ఏళ్లక్రితమే అమ్మ నాన్నకి విడాకులు ఇచ్చేసింది. ఇద్దరూ విడిపోయారు. నన్ను నాన్న దగ్గర వుంచదు. అలాగని అమ్మ ప్రశాంతంగానూ లేదు.

అందుకే నాకు ప్రేమ మీద పెళ్లిళ్లమీద నమ్మకం లేదు. నా అనుకోగల పిల్లల కోసం ప్రయత్నించాను. అక్కడా దురదృష్టమే ఎదురైంది. నా మాటలు నిన్ను బాధపెడితే అయామ్‌సారీ... ప్లీజ్... నువ్వు నాకు హెల్ప్ చెయ్యాలి''

ఈ ప్రపంచం ఇంత సంకుచితమైనదా? ఎదురుగా మనోహర్ కూతురు సాయంకోరుతూ.

'ఊహు... నా వల్లకాదు' మనసులోనే అనుకుంది.

నాకు సంబంధించినంతవరకూ మనోహర్ లేడు. నా వృత్తే నాదైవం. నా జీవితంనాది. నావాళ్లు నా బంధాలు. నాకు తోచినది నేను చేస్తాను. గతంతో నాకు సంబంధంలేదు.

''మంచిది అమ్మని తీసుకుని కెజిహెచ్‌కి రా బుధవారం''

★ ★ ★

అన్నట్టుగానే బుధవారం ఉదయం తొమ్మిదయేసరికి డాక్టర్ మోహిత గదిలో తల్లితో సహా వుంది సౌందర్య. వాళ్లకి స్వంత విషయాలు మాట్లాడే అవకాశం ఇవ్వలేదు మోహిత.

సౌందర్య కళ్లు పెద్దవి చేసి ఆమె గదిని చూస్తూండిపోయింది. అది హాస్పిటల్ గదిలా లేదు. ఓ మంచి సీనరీలా వుంది. గోడల మీద సీనరీస్.

''ఇలా నీ దగ్గరకు వస్తున్నామని వినగానే హైదరాబాద్‌లో అందరూ అభినందించడమే. నెల్లూర్‌లో, ఢిల్లీలో పని చేశావటగా. ఎందుకన్నా మంచిదని ఇక్కడికి రాబోయే ముందు డాక్టర్‌గా నీ ఎఫిషియెన్సీ గురించి వాకబు చేశాను. నీ మీద నమ్మకం లేకకాదు. నా మీద నా నిర్ణయాల మీద నాకే నమ్మకంలేక. నీలాంటి డాక్టర్ ఇంత చిన్నకేస్ కోసం టైమ్ స్పేర్ చెయ్యడం మీ అదృష్టం అన్నారు. మనం బంధువులం అని చెప్పలేదు. కేస్ మీద ఇంట్రస్ట్ కొద్దీ నువ్వు టేకప్ చేశావని చెప్పాను. కొంచం జాగ్రత్తగా చూస్తావుకదూ''

మోహిత ఒక్కక్షణం ఆగి సౌందర్య వంక తీవ్రంగా చూసింది.

''నా పేషంట్లందరికీ నేను బెస్ట్ డాక్టర్ని. మళ్లీ నాకు జాగ్రత్తలు చెప్పనవసరంలేదు''

''అయామ్‌సారీ మనో.. ఏమిటో ఎప్పుడేమి మాట్లాడతానో నాకే తెలీడంలేదు''

మోహిత నవ్వింది.

ఇ.సి.జి కొలెస్ట్రాల్ లెవెల్, స్కానింగ్ మొదలైన టెస్టులన్నీ జరిగాయి.

చివరికి స్కానింగ్ రూమ్‌లో పెదవి విప్పింది శైలజ.

''మనో... నా మీద కోపం మరచిపోయావా? ఆ రోజు ఆ రోజున'' ఆమె కళ్లు నీళ్లతో నిండిపోయాయి.

''నలుగురిలో నిన్ను నిందించాను. ఆ రోజున ఆ క్షణంలో నన్ను ఏ భూతం ఆవహించిందో తెలీదు. ఎందుకలా మనోహర్‌ని వెనకేసుకొచ్చానో తెలీదు.

ఆ రాత్రి పశ్చాత్తాపాగ్నిలో కాలి దగ్ధమయాను. తెల్లారుతూనే నిన్ను గుండెలకు హత్తుకుని

ఒదార్చాలనుకున్నాను. అదే నా కూతుర్నే ఆయనిలా చేసి వుంటే..

కానీ తెల్లారేసరికి నువ్వు మాయమయ్యావు. ఆయన మొహం చూడటం కూడా ఇష్టం లేకపోయింది. అందుకే ఎంతో ఆలోచించి విడాకులు తీసుకున్నాను.

నీకు చేసిన అన్యాయానికి నన్ను నేను శిక్షించుకున్నాను.

అయినా నీ ఉసురు మాకు తగిలే తీరింది. సౌందర్య చూడు అన్నీ తండ్రి బుద్ధులే''

ఆవిడ భుజం మీద చెయ్యివేసి ఓదారుస్తు న్నట్టుగా దగ్గరకు తీసుకుంది మోహిత.

''నాకు నాకు గుండెలో ట్యూమర్ వుంది. అది కనుక్కుని అయిదారేళ్లైంది. కాన్సర్ ట్రీట్ మెంట్ తీసుకోదల్చుకోలేదు. నాకు జీవితం మీద ఆశలేదు. ఈ విషయం సౌందర్యకి చెప్పలేదు''

''పిన్నీ'' దిగ్భ్రాంతికి లోనైంది మోహిత.

''అవునమ్మా ఈ రోజున ఇలా నీ దగ్గరకు రావడానికి కారణం మనసులో మాట చెప్పి భారం దించుకుందామని, ట్రీట్‌మెంట్ కోసం కాదు''

''పిన్నీ''

''అవునమ్మా... నాకు బతకాలని ఆశలేదు''



మనోహర్ నెలకి రెండుసార్లు కూతురికి ఫోన్ చెయ్యడం ఎప్పుడూ మర్చిపోడు. తల్లిమీద కంటే తనమీదే ఎక్కువ ఆసక్తి చూపించడం అతనికి ఆనందం కలిగిస్తుంది. ఆ సంగతి నలుగురికీ చెప్పుకోవడం కూడా గర్వంగా వుంటుందతనికి. అంత సౌందర్యరాశి కూతుర వడం గర్వకారణం కాదూ. రాత్రి పదిన్నరైంది. నరసింహం పక్కనే వున్నాడు.

సౌందర్య ఫోన్ అది.

''ఇప్పుడే నీకు ఫోన్ చేద్దామని అనుకుంటు న్నాను ఇంతలో నీ ఫోన్. నంబర్ చెప్పు కొంచం బిజీగా వున్నాను. ఓ పది నిమిషాలయాక ఫోన్ చేస్తాను.'' అంటూ ఫోను పెట్టేశాడు

''మీకో ముఖ్యమైన న్యూస్‌తెచ్చాను'' నరసింహం అన్నాడు.

''ముఖ్యమైనదా?''

''పార్టీ హెడ్ క్వార్టర్స్‌కి వెళ్లాను. పార్టీ ప్రె సిడెంట్‌ని కలిసాను. అందరూ మీ గురించే ఆలోచిస్తున్నారు''

చనువుగా ఫ్రిజ్ ఓపెన్ చేసి గ్లాస్‌లు అయిస్ క్యూబ్స్ బాటిల్ తెచ్చి టేబుల్ మీ దుంచడమే కాకుండా రెండు గ్లాసుల్లో సగానికి ఒంపి అయిస్ క్యూబ్స్ వేశాడు.

మనోహర్‌కి అతని చనువు అయిష్టంగా వుంది, అసహనంగా వుంది, కోపంగావుంది.

నెమ్మదిగా నడిచి వచ్చాడు.

''కోపమా? నేనిలా చనువుగా డ్రింక్ తీసుకు న్నాననేగా? ఇరవై ఏళ్లు మీ కోసం శ్రమించాను. ఇంకా ఎన్నో చెయ్యాలనుకుంటున్నాను. ఏమిటి నే చెప్పేది మీరు వినట్లేదు''

''నా పేరు అనుకుంటున్నారు సరే, పోటీ మాటేమిటి?''

''అవును గట్టిపోటీ వుంటుందని అను కుంటున్నారు.''

''అందరూ అలాగని అనుకుంటున్నారా?''

''కొందరు... వాళ్లకీ అయోమయంగా వుంది మీలాగే''

అయిస్ లేకుండా స్కాచ్ వంచుకుని సిప్ చేస్తూ ''వాళ్లంతా గాజులు తొడుక్కోని ఆడంగు లు, నెక్ టునెక్ పోటీ వుండొచ్చు. కాని అపోజి షన్ గెలవడం అసాధ్యం''

నరసింహం జేబులోంచి ఓకాగితం తీశాడు

''అది నిన్నే చూశాన్నేను. ఏదో పేపర్ల వాళ్లు

పబ్లిసిటీ కోసం. ఇంకా రెండు నెలలపైనే టైం వుంది. ఏదైతేనేం నీ మనసులో వున్నదేమిటో చెప్పు''

"అందరూ మీ గురించే చర్చించుకుంటు న్నారు. ఎలాగయినా మీరే గెలుస్తారు దాని గురించి కాదు''

మనోహర్ కళ్లు చిన్నవయ్యాయి "మరి మరి దేని గురించి?''

"ఇప్పుడు గెలవబోయే మంత్రి భవిష్య త్తులో ముఖ్యమంత్రి కాగలడా అని''

నిశ్శబ్దం..

"ఎంత ఖర్చవుతుంది?''

"డబ్బా.. హు... డబ్బుతో కొనలేనిది''

"డబ్బుతో కొనలేనిది ఎలా సాధించ గలం?''

"కొందరు సాధించగలరు. దాగుడు మూత లెందుకు? నేను అపురూప టెక్స్‌టైల్స్ స్వంతం చేసుకోవాలి''

"ఏమిటీ?''

"అవును నువ్వు ముఖ్యమంత్రివి అయితే నేనో కంపెనీ అధినేతని కాకపోతే ఎలా? ఇరవై ఏళ్లుగా నీ అభివృద్ధికి రాత్రీ పగలూ కష్టపడ్డా ను. నా కోసం ఈ మాత్రం చెయ్యలేవా? మీ అన్నయ్య దాన్ని అమ్మడానికి చూస్తున్నాడు. మినిమమ్ వాల్యూలో నాకు వచ్చేట్టు చె య్యాలి''

"అది మీ ఇద్దరే ముఖాముఖీ మాట్లాడుకోవ చ్చుగా?''

"ఊహు అలా కాదు. నేను నీ భవిష్యత్తుకి పునాదులు వేస్తాను. నిన్ను ముఖ్యమంత్రిని చేసే పనుల్లో మునిగి తేల్తూంటాను. నువ్వీ పని చెయ్యాలి''

"ఆలోచిస్తాను''

"కాదు నువ్వు చేసి తీరాలి. నేను నీ పనులు చేసి తీరతాను'' ఈలోగా ఫోన్.

మనోహర్ అందుకున్నాడు.

"నా కూతురు'' అని ఒక్కక్షణం ఆగి, "ఈ విషయం రేపు మాట్లాడుకుందామా?''

"ఊహు... వద్దు... ఈ విషయం అటో ఇటో ఇప్పుడే తేలిపోవాలి''

"కాదు... సౌందర్యతో మాట్లాడాలి''

"మీ అమ్మాయితో తరువాత మాట్లాడచ్చు''

"కాదు... కాదు నాకూ నా కూతురికీ మధ్య ముఖ్యమంత్రి పదవి అడ్డం కాదు- నేను మాట్లాడి తీరాలి''

"ఆహా! ఎంత ప్రేమ- ఎంత ప్రేమ కూతురి మీద- దేశంమీద ఎంత ప్రేమో... ఇంటిమీదా అంతే ప్రేమ- సరే రేపు వస్తాన్లెండి''

"డాడీ... మనోని కలిసాను''

మనోహర్ ఛెయిర్‌లో కూలబడ్డాడు.

"ఏమిటి నువ్వనేది?'' అతని గొంతు తడారి పోయింది.

"అక్క... మనోహిత. నువ్వావిడ గురించి ఎప్పుడూ మాట్లాడలేదు. అలాగని అక్కలే కుండా పోదుగా... లాస్ట్ వీక్ కలిసాను. పేరు మార్చుకుంది తెలుసా? మోహిత. మీరంతా మనో గురించి పెదవి కదపరెందుకు? అక్కని అడిగినా నిశ్శబ్దమే జవాబు''

"మోహిత''

పేరు మార్చుకోగలదన్న ఊహేరాలేదెవరికీ. చివరికి డిటెక్టివ్‌లకి కూడా.

"అదంతా ఎలా తెలిసింది నీకు?''

"ఆమే చెప్పింది. సోనీ ఇంట్లో కలిసాను. ఆరోజు తాతగారు పోయిన రోజు వచ్చిందిగా... గుర్తుందా?''

"సోనీ ఇంట్లో వుందా?''

"ఇప్పుడు కాదు... క్రిందటివారం

ఆమె చాలా అరుదైన మనిషి. నీలా కాదు. ఎంత ఆత్మవిశ్వాసం! ఎంత మనోబలం! అందుకే ఆమెమీద నమ్మకంతో అమ్మని వైజాగ్ తెచ్చాను''

"వైజాగా, ఆమెమీద నమ్మకం తోటా?''

"ఓహ్... నీకు చెప్పలేదు కదూ... మోహిత కె.జి.హెచ్‌లో హార్ట్ స్పెషలిస్ట్. చాలా పేరుంది''

"డామిట్, ఎందుకు... దేశంలో డాక్టర్లే కరు వయ్యారా? అదో డాక్టర్.. ఇదో పేషంటా'' మాట మీద కంట్రోల్‌తప్పిపోతోంది.

"డాడీ... ఫోన్ పెట్టెయ్యనా?"

"ఒద్దొద్దు ఆగు, ఒక్క నిమిషం ఆగు" కార్డ్‌లెస్ ఫోన్ అందుకుని రూమంతా తిర గటం ప్రారంభించాడు.

ట్యూబ్‌లైట్ వెలుగు కళ్ళను జిగేల్మని పిస్తోంది. స్విచ్ ఆఫ్ చేసాడు. చుట్టూ చీకటి.

ఓ వక్కన చెరిపేసుకోలేని గతం.

మైనారిటీ తీరని బాలని రేప్- అదీ వావివ రసలు లేకుండా. మరోవక్క రాబోయే ముఖ్య మంత్రివదవి. ఈ రెంటికీ మధ్యన మనోహిత.

"ఒక్క క్షణం"

రాష్ట్రాధినేత కావాలంటే ముందు మచ్చలేని గతం కావాలి. మచ్చలేని గతం కావాలంటే...

ప్లాస్టిక్ సర్జరి...

మచ్చను తొలగించటం.

అలాంటి దానితో కూతురి స్నేహం అదీ ట్రీట్ మెంట్‌కోసం... ఆ బిచ్ కోసం. భర్త వొదిలేసిన బిచ్ ట్రీట్‌మెంట్‌కోసం.

"ఆవిడకి మీరు తప్ప పేషంట్లు దొరక లేదా?"

"ఉహు... ఎవరివల్లా కాని కేసని ఆవిడ ఇంట్రస్ట్ చూపించింది"

"ఇంట్రస్ట్ కేస్‌మీదా మీమీదా?"

"ఏదైతేనేం? మీకేమిటి బాధ?"

మనోహర్ వెనక్కు తిరిగి నెమ్మదిగా నడచి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

డైరీ, పెన్ డ్రాయర్‌లోంచి బయటకు లాగా డు.

"పేరేమిటన్నావ్. మోహిత కదూ?"

"అవును"

"కె.జి.హెచ్.లో డాక్టర్?"

"అవును. ఎందుకు నీకీ వివరాలన్నీ... ఆవిడ మన బంధువు. నీకు అన్న కూతురు. ఎందుకు, ఏం జరిగిందంటే ఎవ్వరూ జవాబు చెప్పరు. చెప్పండి. మీ మనసులో ఏముందో చెప్పండి?"

"ఏముంది? ఏమీలేదు. అందరూ ఎందుకు మాట్లాడరని నన్నడిగితే నేనేం జవా బు చెప్పగలను. మీ అమ్మ, నేను ఆమె గురించి మాట్లాడం, కారణం మాకేమీ తెలీదు గనక. ఆమె వెళ్ళిపోయిన విషయం గురించి మాకేం తెలీదు. కాని ఒక్కటి మాత్రం తెలుసు, ఆమె పెదవి కదిపితే అబద్ధాలు పుట్టలు పుట్టలుగా వస్తాయి. ఆ పిచ్చిదాని గురించి ఆలోచించటమేనా నా పని?"

"పిచ్చిదా?"

"అవును... ఓ రకంగా... ఏదైనా కానీ ఓరోజు హఠాత్తుగా మాయమైంది. ఎవరి సమస్యలు వాళ్ళవి. అందరూ పట్టించుకో దగ్గంత గొప్ప తనం ఏం ఆవిడలో లేదు. అసలిప్పుడు తిరిగి రావడమే వింతగా వుంది, ఏదో శూన్యంలోంచి వూడిపడ్డట్టు. ఎందుకొచ్చిందో ఏం కావాలో నీకేమైనా చెప్పిందా?"

"నేను అడగలేదు. మేం అమ్మ గు రించి మాట్లాడుకున్నాం, అంతే"

మనోహర్ తల పంకించాడు.

సౌందర్యకి తల్లి బుద్ధులే వచ్చాయి. తన గురించే తప్ప ఎదుటివాళ్ళ గురించి ఆలోచన రాదెప్పుడూ.

"మళ్ళీ కలుసుకున్నప్పుడు..."

"మళ్ళీ ఏమిటి ఇప్పుడు వైజాగ్‌లోనే వున్నా ను"

"ఆ దరిద్రుడికోసమేనా? నీ ప్రవర్తన మార్చుకోవా?"

"నువ్వలా మాట్లాడటం బాలేదు డాడీ. ఇహ నా ప్రవర్తన అంటావా? అది మార్చుకోవ లసిన అవసరం లేదు. ఇంతవరకూ చక్రవర్తి కనబడలేదు. అతను పెళ్ళి అంటూ ఒత్తిడి చెయ్యనంత వరకూ అతనంటే ఇష్టమేనాకు"

"సౌందర్యా చూడు... నేను ముఖ్యమంత్రి అయ్యే అవకాశాలున్నాయని అందరూ అను కుంటున్నారు. నీ ప్రవర్తన ఇలా వుంటే..."

"నువ్వు ముఖ్యమంత్రివా?"

ఆ చిన్న ప్రశ్నలో ఎన్ని అర్థాలు.

నీలాంటి వంచకుడు, తిరుగుబోతు, అవినీ తివరుడూ ముఖ్యమంత్రా? ఇలా ఊహించలే నివి ఇంకెన్నో ఇమిడివున్నాయా ప్రశ్నలో. మన సులోనే కూతుర్ని తిట్టుకున్నాడు మనోహర్.




తిట్టుకుంటూనే కూతురి ధైర్యానికి గర్వపడ్డాడు కూడా.

"పోనీలే... ఈసారి ఆవిడని కలుసుకున్నప్పుడు ఎందుకు తిరిగి వచ్చిందో ఏం కావాలో కనుక్కో"

"సరే" సౌందర్య వినీ వినిపించనట్టుగా అంది.

కాని ఆమె ఆ పని చెయ్యదని అతనికి అర్థం అయిపోయింది. ఫోన్ క్రెడిల్ చేసాడు.

★ ★ ★

డాక్టర్ మోహిత ఆపరేషన్ థియేటర్ లోంచి బయటకు వచ్చేసరికి రాత్రి పదైంది.

ఆపరేషన్ సక్సెస్‌ఫుల్.

కుర్చీలో వెనక్కు వాలి మెడ నిమురుకుంది.

ఎంత ప్రశాంతంగా వుండటానికి ప్రయత్నించినా ఆపరేషన్లప్పుడీ టెన్షన్ తప్పదు... ఇప్పుడు తెలుస్తోందా తలనొప్పి బాధ. వేడి వేడి టీ... ఓ పెయిన్ కిల్లర్... ఆపైన గోరువెచ్చని నీళ్ళతో స్నానం... తరువాత డిన్నర్. పనిమనిషి వంట చేసి వెళ్ళివుంటుంది.

జీవితంలో మొదటిసారిగా అనిపించింది, డిన్నర్‌కి ఎవరైనా తోడువుంటే బాగుండునని. అంతే ఆ కోరికని మొగ్గగానే తుంచేసింది ఆమె వివేకం.

మరో ఆలోచనకు తావివ్వకుండా గబగబా బాగ్ అందుకుని బయటకు నడిచింది. డ్రైవ్ చేసే మూడ్ లేదు. కారక్కడే వుంచి 'ఆటో'ని పిలిచింది.

అక్కడొకళ్ళు ఇక్కడొకళ్లు తప్ప రోడ్డుమీద జనసంచారం లేదు. చల్లగా వీస్తున్న ఈదర గాలి.

'అప్పుడే చలి మొదలైంది' కొంచెం ఒణికింది మోహిత ఆటో దిగుతూ.

మెయిల్ బాక్స్ ఓపెన్ చేసి లెటర్స్ తీసుకుని సన్నగా హమ్‌చేస్తూ హఠాత్తుగా ఆగిపోయింది.

ఎవరు?

ఎవరది?

ఆమె గుండె క్షణం విలయతాండవం చేసింది.

సిట్ అవుట్‌లో సోఫాలో కూర్చుని పేపర్ చదువుతున్నది.

... ... ...

మనోహర్...

"హలో..." చిర్నవ్వు అప్రయత్నంగా అతని పెదవులపైకి ప్రాకింది. జవాబివ్వకుండా నిల్చుండిపోయింది మోహిత. ఒంట్లో రక్తమంతా ఎవరో తోడేసినట్టుంది. చుట్టూ చల్లగాలి ఆమెను గడ్డకట్టించినట్టుగా వుంది.

భుజంమీద హాండ్‌బాగ్ బరువే భరించలేనట్టుగా వుంది.

"నేను నీతో మాట్లాడాలి... లోపలకు వెళ్దామా?"

మనోహర్!

ఏం మారలేదు. పిసరంతైనా మారలేదు.

నమ్మకం కలగట్లేదు. ప్రపంచం మారిపోయింది. కాని మనోహర్ మాత్రం అలాగే వున్నాడు.

అతని కంఠం అలాగే వుంది. అతని చూపు అలాగే వుంది.

కొంచెం లావెక్కివుంటాడు. అతని ఉంగరాల జుట్టు, ప్రేమను వర్షించే కళ్ళు అలాగే వున్నాయి.

ఆ చిర్నవ్వు, మనుమల్ని వశపరచుకునే చిర్నవ్వు ఇంకా ఆ స్పర్శ, అతని స్పర్శ సజీవంగానే వుంది.

ఆ జ్ఞాపకం మాత్రం వికారంగా.

తల వాల్చుకుంది.

మనసుని బుజ్జగించింది నిశ్శబ్దంగా. ప్రశాంతతను సంతరించుకుంది ఆమె మనసు కొంచెం కొంచెంగా.

ఒక్కక్షణం వెనక్కు తిరిగి ఎటైనా వెళ్ళిపోదామా అనిపించింది. కాని... ఎన్నాళ్ళలా?

ఎన్నాళ్ళలా పారిపోవడం?

ఇప్పుడు తప్పించుకుంటే మళ్ళీ... మళ్ళీ వస్తూనే వుంటాడు. ఎప్పుడో ఒకప్పుడు అతన్ని ఎదుర్కోక తప్పదు.

అది ఈరోజే ఎందుక్కాకూడదు.



'ఈరోజు' ఓ విజయాన్ని సాధించినరోజు.

నెమ్మదిగా నడిచి సింగిల్ సోఫాలో కూర్చుంది. తల వెనక్కు వాల్చి రిలాక్స యింది.

భుజాలు కొంచెం కుదించి మనోహర్ మళ్లీ సోఫాలో కూర్చున్నాడు. ఇద్దరిమధ్య సెంటర్ టేబుల్. ఎదురుగ్గా వున్న అపార్ట్‌మెంట్‌లో హడావిడిగా వుంది. జనాలు సందడిగా తిరుగుతున్నారు. ''థాంక్ గాడ్'' నిట్టూర్చింది మోహిత.

ఆమె శరీరంలో ప్రతి అణువూ టెన్షన్‌తో బిగిసిపోయి వున్నాయి. ఒళ్ళంతా కళ్ళుగా అతన్ని తలెత్తి చూసింది. ఆ కళ్ళలో ప్రపంచంలో వున్న అసహ్యమంతా పోగై వర్షిస్తోంది. పెదవి కదపలేదామె.

మనోహర్ చూపు తిప్పుకున్నాడు.

అదీ ఎంతో నిర్లక్ష్యంగా.

''ఎవరనుకుంటారు చెప్పు'' అతని స్వరంలో అదే వశీకరణి- అదే లాలన ''కనీసం తల దువ్వుకుందుక్కూడా ఆసక్తి చూపించని అమ్మాయి ఇలా పెద్ద డాక్టరవుతుందని... కంగ్రాట్యులేషన్స్. బహుశా ఇంట్లోంచి పారిపోవడమే నిన్ను చైతన్య స్రవంతిలా మార్చిందేమో''

ఆమె కళ్ళు శూన్యాన్ని వెదజల్లాయి.

''హ్ నీ బాధలు పంచుకుని నీకో చక్కటి పరిష్కారం అందించాలనుకున్నాం. కానీ నువ్వు కాదని వెళ్ళిపోవడం మా దురదృష్టం. ఇన్నేళ్ళూ ఎక్కడున్నావ్?''

మోహిత మాట్లాడలేదు.

''పోనీలే... నీకోసం మేమందరం తల్లడిల్లిపోయాం. ఏమైపోయావో తెలియక హడిలిపోయాం. న్యూస్ పేపర్ తెరిస్తే చాలు హత్యలూ, రేప్‌లూ, కిడ్నాప్‌లూ, డ్రగ్స్, వ్యభిచారం, చంపటాలు, ఎన్నో రాత్రులు నీకోసం నిద్రాహారాలు మాని బాధపడ్డాం. ముఖ్యంగా నాన్నగారు''

మోహిత అతని మాటలు వినడంలేదు.

గతంలో ఏ తప్పూ చెయ్యనివాడిలా మాట్లాడేస్తున్నాడు. బహుశా అదే అతన్ని జీవితంలో గొప్పవాణ్ణి చేసిందేమో. అంతరాత్మ లేకపోయాక, ఏ ఆలోచనలు వెన్నాడుతాయి.

''నీతో కాస్త ఒంటరిగా మాట్లాడాలి, ఎదురుగుండా అపార్ట్‌మెంట్ జనాలు లోపలికీ బయటకూ తిరుగుతున్నారు

లోపలికి వెళ్దామా?''

''వద్దు'' మోహిత గొంతు పెగుల్చుకుంది.

''పోనీ బయటకు వెళ్దామా?''

''ఊహు...నేను రాను. అవసరం లేదు''

చుట్టూ చూసాడోసారి.

''నీఇష్టం... ఇక్కడే బావుందంటే అలాగే, కానీ''

''అనవసరంగా టైమ్ వేస్ట్ చెయ్యడం నాకు నచ్చదు. ఎందుకు వచ్చిందీ సూటిగా చెప్తే బాగుంటుంది''

''నిజమే... అదే మంచిది. ఇన్నేళ్ల తరువాత తమరి పునర్దర్శనానికి కారణం ఏమిటో కనుక్కుందామని... మా నాన్న చావుకి వచ్చావు. సరే... పోనీ ముసలాడిని చివరిసారి చూడ్డానికి అనుకోవచ్చు. కానీ మళ్లీ మళ్ళీ ఫామిలీలో చొరబడాలనే నీ ప్రయత్నమే నాకు అర్థం కావడంలేదు. సోనీ ఇంటికి వెళ్ళావు. సౌందర్యను రప్పించుకున్నావు. శైలజను ట్రీట్‌మెంట్ పేరుతో పిలిపించావు. ఎందుకు?''

''అది నా యిష్టం. వాటికీ నీకూ సంబంధం లేదు''

''కాదు, సంబంధం వుంది. ఇవి నా కుటుంబ సమస్యలు. నా కుటుంబంలో ప్రతి వాళ్ళతో నాకు సంబంధం వుంది. నాకు మన మల మనస్తత్వం బాగా తెలుసు. రాజకీయం, ఎక్కడ చూసినా రాజకీయమే. కుటుంబంతో చుట్టరికం కలుపుకుందామని చూస్తున్నావు. వాళ్ళని ఆకట్టుకుని నామీద దండెత్తుదామని నీ ప్లాన్''

''నీమీదా? దండెత్తడమా? నాకలాంటి ఉద్దేశ్యం లేదు'' తల అడ్డంగా వూపింది మోహిత.

''అబద్ధం... నీకేం కావాలో నాకు తెలుసు. నా సర్వనాశనం నీక్కావాలి. లేకపోతే ఇరవైఏళ్ళ తరువాత ఎందుకు వెనక్కి వచ్చావు. నాకు మంచి పొజిషన్ దొరికే వరకూ ఎదురు చూసావు. ఇప్పుడు అసలు ఛాన్స్ దొరికింది నీకు. అందుకే సోనీ ఇంటికి వెళ్తున్నావు.




అందుకే శైలజకి ట్రీట్‌మెంట్ ఇస్తున్నావు'' మోహిత జవాబు చెప్పలేదు.

''నువ్వు బలహీనురాలివి. డాక్టర్‌గా పేరు ప్రఖ్యాతుల్ని పెంచుకోవడం నీ బలహీనత. అయినా ఎప్పుడో ఇరవై ఏళ్ళక్రితం సంఘటన తీసుకుని కాబోయే ముఖ్యమంత్రిని నిందించ లేవు నువ్వు. ఇరవై ఏళ్ళనించీ నీ అజా అయిపూ లేవు. ఇప్పుడు హఠాత్తుగా ఈ కట్టు కథ ఎవరైనా నమ్ముతారనుకుంటున్నావేమో! ఎవరూ నమ్మరు. పిచ్చెక్కింది నీకని హేళనచే స్తారు. నన్ను బ్లాక్‌మెయిల్ చెయ్యాలని కదూ నీ ఉద్దేశం. కాకపోతే ఎందుకిలా చేస్తావ్? నిన్నెవరూ నమ్మరు. అవకాశవాది అని నింది స్తారు. అది నీ జీవితాన్ని నాశనంచేస్తుంది. నీ పేరు ప్రఖ్యాతుల్ని సమాధిచేస్తుంది. అవునా? భయపడుతున్నావా? ఏదో చేద్దామని ప్రయ త్నించకు వీధులువట్టి పోతావ్''

అతను భయపడుతున్నాడు. అది మాత్రం నిజం. ఆ ఒక్క నిజం వెయ్యి ఏనుగుల బలాన్నిచ్చిందామెకి. అతని రాజకీయ జీవితం నాశనం చెయ్యగలనని భయపడుతున్నాడు. మెంటల్‌గా రిలాక్సేషన్ వచ్చింది. అతనిమీద అధికారం చెలాయించగలనని అపోహపడు తున్నాడు. పిడికిలి బిగించింది. మొట్టమొద టిసారిగా అది తన ఇల్లనే స్థానబలిమి బలాన్ని చ్చింది. చుట్టూ చూపుల్ని సారించింది. ఎదు రుగా అపార్ట్‌మెంట్, మర్చేపోయింది. రేపు అక్కడో పెళ్ళి... అందుకే జనం.

''నీకే హానీ కలిగించాలన్న ఉద్దేశ్యం నాకు లేదు. అసలు నీ గురించి ఆలోచనలే లేవు నాకు'' ఆమె గొంతు గంభీరంగా పలికింది.

''ఇంకో అబద్ధమా? నువ్వెప్పుడూ నా గు రించే ఆలోచిస్తూ వుండివుంటావు. అందుకే పిలవని పేరంటంలా దాపురించావు. అదో వంక మునలాణ్ణి చూడాల్లని. సోనీ ఇంటికెళ్ళా వు. అందుకే శైలజ కేస్ టేకప్ చేశావు''

''నీ గురించి ఆలోచించాల్సిన అవసరం లేదు'' రెండు పిడికిళ్ళూ బిగించి వున్నాయి.

''చిన్నప్పుడు చెప్పలేకపోయిన ఒక మాట ఇప్పుడు చెప్పాలి. అప్పుడు జరిగిందంతా నా ఇష్టం లేకుండానే జరిగింది. నువ్వంటే నీ వనులంటే నాకు అసహ్యం. నా బాల్యాన్ని చంపేశావు. ఆ పాపానికి నిన్ను ఈ జన్మలో క్షమించలేను. నన్ను ఓ కీలుబొమ్మలా ఆడించావు. అది తప్పించుకుందుకే పారిపో యాను. ఆ క్షణంనించే నీ గురించి ఆలో చించడం మానేశాను. నా జీవితాన్ని నేను సక్రమంగా నిర్మించుకోగలిగాను. నీ ఆలోచన, నీ జ్ఞాపకం కాలంకింద సమాధి చేశాను''

అతని మొహం పాలిపోయింది. పెదవులు వణికాయి.

''బిచ్'' అతని స్వరం పెరిగింది. ''నిన్ను నా కుటుంబం చుట్టూ తిరగనివ్వను. ఇదివర కులాగే మాయం అయిపోవాలి. ఎవ్వరినీ కల వడానికి ప్రయత్నించకు'' అతని భయం మాటల్లో ప్రవహించింది.

భయం...

భయం...

అతనికి భయం... తనక్కాదు.

తనెందుకు భయపడాలి. బలంగా వూపిరి పీల్చింది.

''నేను నా కుటుంబాన్ని కలుసుకోకుండా ఆపడానికి నువ్వెవరు? నేను వాళ్ళలో ఒకర్ని. నన్ను ఆపాలని ప్రయత్నించకు. ప్రయ త్నించావో ఓటమి తప్పదు'' దృఢంగా వుందామె స్వరం.

అతనిలో సన్నటి నవ్వు. ''చాలా చాలా ఆలోచించాను. నిన్ను చంపెయ్యడం పెద్ద కష్టంకాదు. కాని నేనలాంటివాడిని కాదు. నా చేతుల్తో నేను చంపలేను. నేను హంతకుడిని కాలేను''

తరువాత నిశ్శబ్దం... ఇద్దరిలో ఎవరూ చాలాసేపు మాట్లాడలేదు.

''ఇంత అసమర్థత భరించగల శక్తి నాకులే దు. అందుకే ఇప్పటికిప్పుడు నీదగ్గరకు రావాలని బయలుదేరి వచ్చాను ఇప్పుడిహ లాభంలేదు. నువ్వు నాకు వ్యతిరే కంగా ఏం చెయ్యదలిచినా నిన్ను చంపించడా నికి వెనకాడను. తెలిసిందా? ఏవో బెదిరింపు లు కావు. నేను దేనికీ వెనుదీయను. నువ్వు పెదవి కదపకుండా ఇదివరకులా మనవాళ్ళ



కు దూరంగా బతికావో సురక్షితంగా వుండగలవు'' అతని పెదవులమీద చిర్నవ్వు. లేచి నిల్చుని

''నువ్వు తెలివైనదానవనీ, చురుకైనదానవనీ అందరూ అనుకుంటున్నారు. ఒకవేళ అదే నిజమైతే తెలివిగా ప్రవర్తించు. మనవాళ్ళు వరినీ మళ్ళీ కలుసుకునే ప్రయత్నం చెయ్యకు. చివరకు సోనీని కూడా. ఒకవేళ నా మాట లక్ష్యపెట్టకపోయావో నిన్నెలా దూరంగా వుంచాలో నాకు తెలుసు. విష్ యూ గుడ్‌లక్'' బ్రీఫ్‌కేస్ అందుకుని చకచకా నడిచి వెళ్ళిపోయాడు.

మనో అతనివంక ఈసడింపుగా చూసింది. అతను వెళ్ళిపోయేవరకూ ఆగి గుమ్మంవైపు కదిలింది.

గీజర్ ఆన్‌చేసి స్నానం చేస్తున్నా ఆలోచనలు ఆమెను వేధిస్తూనేవున్నాయి. అయినవాళ్ళందరూ వుండి ఏకాకిగా ఇరవైఏళ్ళు జీవించడం ఒక ఎత్తైతే, అందరికీ దూరంగా ఏకాకిగా బతకమని మనోహర్ శాసించడం ఒక ఎత్తు.

హఠాత్తుగా ఆమెలో కోపం, ద్వేషం బుసలు కొట్టాయి.

'ఏంచేస్తాడు? చంపుతాడా? చంపిస్తాడా? ఇప్పటికే ఒకసారి చంపాడు. నాలో బాలికని చంపేశాడు. నా సంతోషాన్ని నా యౌవనాన్ని నిర్దాక్షిణ్యంగా చంపేశాడు. మరోసారి చావుకి భయపడను. నిన్నీసారి ఎదిరించి తీరతాను. నువ్వు నన్ను నలిపెయ్యలేవు. ఆ అవకాశం నీకివ్వను... ఇవ్వను... ఇవ్వను'

డ్రెస్ చేసుకుని బయటకు వస్తూనే ఫోన్ అందుకుంది.

''సోనీ... ఎల్లుండి వస్తున్నాను''

★ ★ ★

ఉదయం ఇంకా పూర్తిగా కళ్ళు విప్పలేదు. కామేశ్వరి మొక్కలకి నీళ్ళు పెడుతోంది. గేట్ చప్పుడు విని తల పైకెత్తింది. రామారావ్...!?

''రారా...''

'అక్క ఆశ్చర్యపోతుంది' అనుకున్నాడాయన వచ్చేముందే. ఎప్పుడూ ఉదయంవేళల్లో అంత తీరిగ్గా రాలేదతను. రాత్రిళ్ళు డిన్నర్‌కో, పిచ్చాపాటీ మాట్లాడేందుకో వెళ్ళేవాడంతే.

''రారా... బ్రేక్‌ఫాస్ట్‌కి ఎవరూ తోడులేరని అనుకుంటున్నాను''

పూలసజ్జ పూర్తిగా పూలతో నిండివుంది. దాన్ని అందుకుని ''లోపలికి వస్తావా, ఇక్కడే కూర్చుంటావా? ఒక్క పది నిమిషాలు స్నానం, పూజా ముగించి టిఫిన్ రెడీచేస్తాను''అంటూ లోపలకి వెళ్ళబోయింది

''మనో గురించి మాట్లాడదామని వచ్చాను...''

''అవును... ఇరవై ఏళ్ళ తరువాత మనో రాక వింతగా వుందికదూ. నువ్వెప్పుడైనా అనుకున్నావా? మనో తిరిగి వస్తుందని? హఠాత్తుగా ఆకాశంనించి ఊడిపడ్డట్టు రావడం, ఒక్కళ్ళతోనూ మాటైనా మాట్లాడకుండా వెళ్ళిపోవడం, నేను చాలా బాధపడ్డాను. ఆరోజు తరువాత కలుస్తుందని ఎంతో ఆశపడ్డాను. ఏదీ? ఉండు... పది నిమిషాల్లో వస్తాను''

ఆమె స్నానం, పూజ ముగించుకు వచ్చేసరికి రామారావ్ కిటికీదగ్గర నించుని బయటకు చూస్తున్నాడు.

''ఒకవేళ... ఒకవేళ మనోని కలిసివుంటే ఏం మాట్లాడేదానివి?''

''కలిసి వుంటేనా... దానికోసం ఎంత తపించిపోయామో తెలియపరచి వుండేదాన్ని. ఇప్పుడెంత సంతోషంగా వుందో చెప్పి వుండేదాన్ని. దాని వివరాలు తెలుసుకుని వుండేదాన్ని. పెళ్ళైందా, పిల్లలేమైనా వున్నారా? ఏం చేస్తోందిలాంటివి. మనోకి ముప్ఫై అయిదు... గుర్తుందా?''

రామారావ్ వెనక్కు తిరిగి ఆమెవంక చూశాడు.

''ఒకవేళ... ఒకవేళ పాత విషయాలు బయటకు లాగితే...?''

ఆవిడ విననట్టుగా ఫ్రిజ్‌వైపు నడిచి, ''ఏం టిఫిన్ చెయ్యను? ఇడ్లీనా దోశలా?''

''నీకేది నచ్చితే అదే. ఒకవేళ పాతవిషయాల గురించి అడిగితే నువ్వేం చెప్తావు?''

''ఆ విషయం నేను ఆలోచించలేదు. ఆ విషయం తిరగదోడ్తుందనుకోను. దాదాపు ఇర




వైఏళ్ళు దాటిపోయాయి. ఎందుకు మళ్ళీ మళ్ళీ గతంలోకి వెళ్ళడం? ఆ విషయం మనందరం మరచిపోయాం. మనోహర్ మంచి హోదాలో వున్నాడు. ఎవరికీ ఏ విషయంలో నూ ఎత్తిచూపే అవకాశం ఇవ్వలేదు ఇన్నేళ్ళూ. అయినా మనో ఆ ఉద్దేశ్యంతో వచ్చినట్టనిపించ లేదు ఆరోజు. ఆ రోజున... అదే ఆ రాత్రి ఏం జరిగిందో... అంతా అయోమయం. మనెవరికీ ఏ విషయం అర్థంకాలేదు. ఇప్పుడా విషయం గతం. నామటుకు నేను ఆ విషయాలేవీ కదల్చను. ఆ విషయాల గురించి మాట్లాట్టం కూడా ఇష్టంలేదు నాకు. మనో కూడా అచ్చు నాలాగే అనుకుంటుందనుకుంటున్నాను''

రామారావ్ తలాడించాడు.

''పది రోజుల క్రితం సోనీ ఇంటికి వచ్చిందట. సోనీని కలిసి వద్దామనుకుంటు న్నాను. మనో ఆలోచనలేమిటో తెలుస్తాయిగా''

''సోనీ ఇంటికి వచ్చిందా? నాకెవరూ చెప్ప లేదే? వింతగా వుంది. పాపం తల్లి పోయాక మనో నా దగ్గర ఎంత చనువుగా వుండేదని. తల్లి తరువాత తల్లిలా చూసేను దాన్ని. నీకెలా తెలిసిందీ విషయం?''

''శ్రీనాథ్ చెప్పాడు. నాక్కాదు మనోహర్‌కి. మనోహర్ నాకు చెప్పాడీ మాట''

''శ్రీనాథా... నా కొడుకు... వాడు నాకు చెప్ప లేదు? సర్లే... నాకా విషయం అనవసరం అనుకున్నాడేమో... ఎందుకంటే మనో గురించి వాడిముందెప్పుడూ మాట్లాడలేదు. సోనీ నెందుకు అడగడం? నీ కూతురితో నువ్వు మాట్లాడాలంటే డైరెక్ట్‌గా ఫోన్‌చెయ్యి''

''నాకేంచెయ్యాలో పాలుపోట్లేదు. నా గు రించి ఏమనుకుంటుందో అయిడియా వుంటే... నీకు తెలుసుగా నాతో ఒక్క మాటా మాట్లాడలేదు''

''నీకు మనస్పూర్తిగా ఏం చెయ్యాలనిపిస్తే అది చెయ్యి. మనో నీ కూతురు. కూతురితో మాట్లాడ్డానికి ఇంతగా ఆలోచించాలా?''

''సోనీని అడిగి నంబర్ తీసుకుని ఫోన్‌లో మాట్లాడనా?''

''నువ్వు చెయ్యాలనుకున్నది అదేగా? ను వ్వేం యుద్ధరంగానికి వెళ్తున్నావా అంతగా భయపడిపోడానికి''

''నీ సంగతేమిటి? నువ్వు ఫోన్ చేస్తావా?''

''నేనా? అసలు మనో ముందు ఫోన్ చె య్యాలి. మనందరిని వదిలేసి వెళ్ళినది ఆ అమ్మాయి. తిరిగి రాగానే మనందరినీ కలిసి మాట్లాడాలి. ఒకవేళ అలా జరక్కపోతే... నేనే ఫోన్‌చేస్తాను. అదీ ఎక్కడుందో తెలిసిన వెంటనే''

''సరే... సోనీని అడిగి చెప్తాను''

''అప్పుడే లేస్తున్నావేమిటి? టిఫిన్ తినవా?''

''సోనీ దగ్గరకు వెళ్తాను''

''ఇప్పుడా?''

''అవును... ఇప్పుడే''

''మంచిదే... మొదట్లో ఒకళ్ళింటికి ఒకళ్ళం ఎంత తరచుగా వెళ్ళేవాళ్ళం. తరువాత్తరు వాత మార్పు ఎందుకు వచ్చిందో నాకు తెలీ దు. నేనూ వస్తాను. మనో గురించి స్వయంగా తెలుసుకోవచ్చు. పెంచిన మమకారం. ఓ పది నిమిషాలాగు''

''ఊహూ... నేను వెళ్తున్నాను. నీకు రావాల నుంటే నెమ్మదిగా రా''

''ఓ పదినిముషాలు ఆగలేవా?''

''ఆగలేను. పది నిమిషాలు కాదు, పది సెకన్లు కూడా ఆగలేను. నా మనసు మారక ముందే వెళ్ళనీ. పిరికితనంతో సంపూర్ణంగా అలిసిపోయాను. నన్ను వెళ్ళనీ''

ఆటోలో ఎక్కి కూర్చున్నాడు మరో ఆలోచనకు అవకాశం ఇవ్వకుండా.

★ ★ ★

''తాతగారు మమ్మీ'' హరిత తలుపు తీస్తూనే పెద్దగా కేకేసింది.

''ఎన్నాళ్ళైంది తాతగారూ మిమ్మల్ని చూసి. రండి టిఫిన్ చేస్తున్నాం. మీరూ తిందురు గాని'' ఆయన చెయ్యి పట్టుకుని డైనింగ్ హాల్లోకి తీసుకువచ్చింది.

''మమ్మీ... తాతగారు''

''రండి... రండి'' శ్రీనివాస్ నిల్చుని ఓ

కుర్చీ చూపించాడు.

"ఎందుకో సడెన్‌గా మీ అందరినీ చూద్దామ నిపించింది" మనో అక్కడుందని ఎంతమాత్రం ఊహించలేదాయన.

"మీరెప్పుడు వచ్చినా స్వాగతం"

సోనీ లేచి ఆయనకోసం ప్లేట్ తేవడానికి వెళ్ళింది.

"ఎలా వున్నావు మనో?"

మనోహిత మొహంలో గాంభీర్యం గడ్డకట్టినట్టుగా వుంది.

"ఇప్పుడు టిఫిన్‌కి జున్ను కూడా వుంది తాతగారు. పెద్దమ్మ చేసింది" హరిత చెప్తోంది.

"అలాగా... జున్నంటే నాకు చాలా ఇష్టం"

సోనీ ప్లేట్‌తో తిరిగివచ్చింది. పూరీలు, కూర ఓ చిన్న గిన్నెలో జున్ను.

శ్రీనివాస్ పక్కన కూర్చుని టిఫిన్ తింటూ.

"పొద్దున లేవగానే ఇటు రావాలనిపించింది"

ఎవ్వరూ మాట్లాడలేదు. చాలాసేపు నిశ్శబ్దం. టిఫిన్ తినడం ముగిసాక పిల్లలకు బోర్నవిటా, పెద్దవాళ్ళకి కాఫీ తెచ్చింది సోనీ.

మనో సోనీ పనులు గమనిస్తోంది.

మనసులో అల్లకల్లోలత అంచెలంచెలుగా ఉపశమిస్తోంది. హఠాత్తుగా లేచి నిల్చుని.

"ముందు రూములో కూర్చుందాం రండి" పిలిచింది మనో.

మరో ఆలోచన లేకుండా లేచి నిల్చున్నాడయన.

"నేనూ రానా పెద్దమ్మా" హరిత అడిగింది.

"ఇప్పుడు కాదు. వాళ్ళిద్దరూ కొంచెం మాట్లాడుకోవాలి" ఆపింది సోనీ.

ముందు గదిలో ఓ సోఫాసెట్ మాత్రం వుంది.

ఓ సింగిల్ సోఫాలో కూర్చుంది మనో.

రామారావు కొంచెం ఆలోచించి ఆమెకు దగ్గరగా వున్న సోఫాలో కూర్చున్నాడు.

ఇరవైఏళ్ల తరువాత మొదటిసారి ఒకరినొకళ్ళు పరీక్షగా చూసుకున్నారు.

ఒకళ్ళంటే ఒకరికి నమ్మకం కలగట్లేదు. సన్నగా అప్పటికీ ఇప్పటికీ పెద్ద తేడా లేకపోయినా స్త్రీత్వం ఆపాదించుకున్న రూపు, మొహంలో పరిపూర్ణత మాత్రం కొత్తగా వున్నాయి.

"మీ ఆరోగ్యం బావుందనుకుంటాను?" అడిగింది మనో.

"ఆ... ఇంతవరకు ఎలాంటి ప్రాబ్లమ్స్ రాలేదు" అని ఒక్కక్షణం ఆగి.

"నువ్వు మాత్రం అచ్చం మీ అమ్మ ఎలా వుండేదో అలాగే వున్నావు. ఇంకా మీ అమ్మ కాస్త రంగు తక్కువ"

"అలాగా"

"నీతో ఎన్నో చెప్పాలని వుంది. ఎన్నో చర్చించాలని వుంది. కాని ఒక్క మాటా గుర్తు రావడం లేదు"

మనో నవ్వింది.

"ఇన్నాళ్లూ ఎక్కడున్నావ్? ఎలాగున్నావ్?"

బాంబే. తరువాత ఢిల్లీ, ప్రస్తుతం వైజాగ్‌లో. మెడిసిన్ చదివాను. సర్జరి స్పెషలైజ్ చేసాను. కె.జి.హెచ్‌లో హార్ట్ స్పెషలిస్ట్‌ని"

"నువ్వు డాక్టర్‌వా? నువ్వే కవయిత్రివో, రచయిత్రివో అవుతావనుకునేవాడిని. నీ నిశ్శబ్దం, నీ ఊహాలోకం నన్నలా అనుకునేలా చేసాయి"

కాస్సేపటి నిశ్శబ్దం తరువాత మళ్ళీ ఆయనే అన్నాడు.

"ఇంకా నమ్మలేకపోతున్నాను. నువ్వు డాక్టర్‌వి... ముప్పై అయిదేళ్ళు... కాని నాకు మాత్రం నా చిన్నారి మనోలాగే వున్నావు. నీ పదిహేనేళ్ళ వయసులో ఎలాగుండేదానివో అలాగే అగుపిస్తున్నావు నా కళ్ళకి. సారీ... పాత రోజుల్ని గుర్తుకు తెచ్చానా?" బిగుసుకుపోయిన మనో మొహం చూసి తడబడ్తూ,

"నాకా విషయాలు తవ్వి మాట్లాడే ఉద్దేశ్యం లేదు. గతం గతః. నీ విషయాలు, నీ జీవితం గురించి చెప్పు. పెళ్లి?"

"మనం ఆ గతం గురించి మాట్లాడాలి. అదింకా మన మధ్యన అగాథంలా అలా ఉండనే ఉంది. ఆ విషయాన్ని బయటకు లాగి మాట్లాడకపోయినంతమాత్రాన మన




మధ్యనించి అది మాయంఅయిపోదు. మీ అందరికీ... అందరికీ చేతనయింది అదొక్కటే. నాకు బాగా గుర్తుంది. సమస్యను తప్పుదారిప ట్టించడం, అసలు విషయాన్ని పాతిపెట్టి, ఏవో కుట్రలు పన్నుతున్నట్టు నిశ్శబ్దంగా వుండటం. మూగ, చెవిటి గ్రుడ్డివాళ్ళలా నవ్వు తూ వుండటం. అందుకే... అందుకే అందరినీ వదిలి నేను వెళ్ళిపోయింది''

రామారావు తల వంచుకుని చేతులు నులు ముకున్నాడు.

''అయామ్ సారీ... నిజమే నువ్వు ద్వేషించా ల్సిందే... మా ప్రవర్తనని''

''మా అంటే అందరినీ కాదు... ఒక్కళ్ళనే''

ఓ క్షణం సేపు కళ్ళు మూసుకున్నాడాయన.

''మనోహర్ ఇప్పటికీ తనకేమీ తెలీదనే అంటాడు''

మనో ఆయనవంక చూసింది. ఆమె కళ్లు మంచుముక్కల్లా వున్నాయి.

''ఇది డిబేట్ కాదు... ఆరోజున ఆ నిజాన్ని చెప్పకుండా వుండాల్సింది''

''డిబేట్ కాదు. నువ్వు చెప్పింది నేను నమ్ముతున్నాను, నమ్ముతాను''

''నిజంగా?''

''అవును. ఏం చెప్పను. నువ్వు చెప్పింది నిజం అని నమ్ముతాను నమ్మాను... మనోహర్‌తో మాట్లాడతావా?''

''ఇదివరకే మాట్లాడాను. అతను వైజాగ్ వచ్చాడు నా ఇల్లు వెతుక్కుంటూ. ఎందుకో తెలుసా? నన్ను బెదిరించడానికి. గతం గు రించి ఎవరితో మాట్లాడినా, మీలో ఎవరినైనా కలుసుకుందుకు ప్రయత్నించినా నా అంతు చూస్తాడట''

''మనోహర్ అలాంటివాడు కాదే''

''ముందు చెప్పేది వినండి'' మనో కోపం గొంతులోనే స్పష్టమైంది.

''ఇన్నేళ్ళైనా మీ తమ్ముడి ప్రవర్తన గురించి మీరేం తెలుసుకోలేకపోయారా? ఎప్పుడేం మాట్లాడినా వాడలాంటివాడు కాదంటారు. అతనేం చెయ్యగలడనేది మీ ఊహకి అంద దు. అతని నక్కజిత్తులు మీకు తెలీవు. ఎందుకు... అతను నన్ను బెదిరించాడంటే ఎందుకు నమ్మరు. ఇప్పటికే చెయ్యాల్సిన కీడు చెయ్యనేచేసాడు''

''గతం వదిలెయ్ మనో. ఇప్పుడు మనోహర్ ఓ మంత్రి అయితే గియితే ముఖ్యమంత్రి అవుతాడు. అతను నా తమ్ముడు. అతన్ని వదులుకోలేను. ఒకవేళ నీ ఉద్దేశ్యం అదే అయితే నేనాపని చెయ్యలేను. కుటుంబంలో ఎవ్వరినీ ఒదులుకోలేను''

''కానీ నన్ను ఒదులుకున్నావు''

''నేను నిన్ను నిందించలేదు. నువ్వు చె ప్పింది విన్నాక ఏం చెయ్యాలో అర్థం కాలేదు. నీ గురించి మనోహర్ గురించి నాకు పూర్తిగా తెలుసనుకోవడమే నా పొరబాటు. ఏదో ఒకటి ఆలోచించి వుండాల్సింది. అదీ ఇరవైఏళ్ళ కిందట''

''ఇరవైఏళ్ళ జీవితం''

''మేం నీకు ద్రోహం చేశామా?''

''అవును చేసారు''

''మాకలాంటి ఉద్దేశ్యాలులేవు. నువ్వు కూడా ఎవరితోటీ మనస్ఫూర్తిగా మాట్లాడేదానవు కా దు. అందరూ నీకు శత్రువులన్నట్టుగా ప్రవ ర్తించేదానవు. మేం ఏదో ఒకటి ఆలోచించేలోపే ఇల్లు విడిచి పారిపోయావు''

''ఎందుకు పారిపోయానో మీకు తెలీదు కదూ?''

''ఊహు... తెలీదు''

మనోకి గట్టిగా ఏడవాలనుంది. ఊహు కన్నీ ళ్ళు ఏనాడో ఆవిరైపోయాయి.

. హఠాత్తుగా అతని కళ్ళకి మనో ధాన్యం తీసేసిన పొట్టులా అనిపించింది. ఎండి పోయి, గాలికి ఎగిరేపోయేంత తేలికగా. ఆమె కంఠంలో బాధ, కోపం, విరక్తి ఊహు... ఏవీ లేవు. ఓ ముక్కూమొహం ఎరగనివాడితో తా పీగా మాట్లాడుతున్న భావన.

నిజానికి ఆనాడు ఆమె పారిపోవడమెందు కో అతనికి ఇప్పటికీ అర్థం కాలేదు. సమస్యకి పెద్దలు ఓ పరిష్కారాన్ని చూపేలోగానే మనో పారిపోయింది. అందుకే మనోతో అతడేదీ స్ప ష్టంగా మాట్లాడలేకపోతున్నాడు.

''నాకు తెలీదు. నాకేమీ తెలీదు'' గొణుక్కు న్నాడు. మనో తలెత్తి అతనివంక చూసింది. ఏం తెలీదో ఆమెకు అర్ధంకాలేదు. వేళ్ళు విరుచుకుంటూ చేతులవంక చూసుకుంటు న్నాడు.

అతను చాలా పొడవు. ఇప్పుడు కొంచెం ఒంగిపోయాడు. ఎండిపోయినట్టున్న మొహం. నుదుటిమీద ముడతలు.

''మిల్స్ గురించి చెప్పు. ఏవో ప్రాబ్లమ్స్ ఉన్నాయటగా?''

''వాళ్ళు చెప్పలేదా?''

''నువ్వు చెప్పు వింటాను''

''ఓ కొత్త ప్రాజెక్ట్ తీసుకున్నాం. అది పూర్తవ ట్లేదు. లక్షలు లక్షలు ఖర్చే మిగులుతోంది. మిల్స్ ఆదాయం ఖర్చులకి జీతాలకు కొంచెం బొటాబొటీగా సరిపోతుంది. ఈ కొత్త ప్రాజెక్ట్ ఖర్చులకోసం అప్పులు చేసాను. అవి తీర్చాలి. కంపెనీ అమ్మేద్దామని ఉద్దేశ్యం. అమ్మేస్తే సమ స్యలేం వుండవు. ఇదివరకే ఒక ఆఫర్ కూడా వచ్చింది. చాలా తక్కువనుకో. అయినా అదే మొదటిది. మంచి ఆఫర్ వస్తే అప్పులన్నీ తీర్చి, అంతో ఇంతో మిగిలితే కొత్త ఫ్యాక్టరీ ఆరంభించవచ్చు. అపార్ట్‌మెంట్స్ గురించి ఆలోచించాలి- ముందుగా ఆ మిల్ ఉమ్మడి ఆస్థి. అందరూ ఒప్పుకుంటే అమ్మడమే పరి ష్కారం''

''ఒప్పుకుంటారనుకో, కంపెనీ అమ్మేస్తే బతుకు తెరువెలాగా? మన అనుకునే వాళ ్ళెందరూ ఈ మిల్‌లోనే పనిచేస్తున్నారాయె''

''పోనీ ఆ కొత్త ప్రాజెక్ట్ గురించి మరింత శ్రద్ధ తీసుకోరాదూ?''

''ఎంత శ్రద్ధ తీసుకున్నా అది ఎన్నాళ్ళకు ఓ రూపానికి వస్తుందో. లాభాలు వస్తాయో రావో అర్థం కావడం లేదు''

''ఆలోచిద్దాం''

ఈలోగా పిల్లలిద్దరినీ స్కూల్‌కి పంపి- శ్రీని వాస్, సోనీ బయటకు వచ్చారు.

''కాఫీ తేనా?''

''మీరు కూర్చోండి నే తెస్తాను'' మనో లోప లకు వెళ్ళింది.

ఇంతలో ఫోన్...

''అలాగా... ఒక్క నిమిషం... వస్తాను'' శ్రీని వాస్ ఫోన్ క్రెడిల్ చేస్తూ.

''అపార్ట్‌మెంట్స్‌లో వాటర్ ప్రాబ్లమ్... చూ డాలి వెంటనే'' లోపలకు వెళ్ళి షర్ట్ తగి లించుకు వచ్చాడు.

''నేనూ రానా?'' అన్నాడు రామారావు

''రండి... మీకు ఇంట్రస్ట్ వుంటే''

ఇంతలో మనో కాఫీలు తెచ్చింది.

శ్రీనివాస్, రామారావు బయటకు వెళ్ళగానే ఇద్దరూ వంట గదిలోకి నడిచారు. ఫ్రిజ్‌లో ఏం కూరలు వున్నాయో చూస్తోంది సోనీ తండ్రికి ఇష్టమైన వంటలు చేసేందుకు.

''ఈ సౌందర్య వైజాగ్ వచ్చిందటగా... ఆ విషయాలేం చెప్పలేదు నువ్వు. శ్రీనివాస్ అడి గినా అంటీ ముట్టనట్టు జవాబిచ్చావట''

''అవును... శైలజ పిన్నిని పేషంట్‌గానే ట్రీట్ చెయ్యదల్చుకున్నాను చేసాను. అంతే. అదృష్టవశాత్తూ అన్నీ కలిసి వచ్చాయి. ఆపరే షన్ చేసాను. సౌందర్యతో పెద్దగా మాట్లాడలేద నుకో''

ఆమె మాటలు పూర్తికాకముందే ఇంటి ముందు ఆటో ఆగిన శబ్దం... వెనువెంటే డోర్ బెల్!

వెళ్ళి తలుపు తీస్తే...

ఎదురుగా కామేశ్వరి... గిరిజ.

ఒక్కక్షణం ఎక్కడైనా దాక్కుందామా అని పించింది మనోకి. ఎంత దూరంగా వున్నా ఎప్పుడో ఒకప్పుడు వాళ్లకి ఎదురుపడక తప్ప దు.

''మనో నువ్వా? నువ్విక్కడుంటావని ఏ మాత్రం అనుకోలేదు. సోనీని అడిగి వైజాగ్ వద్దామనే ఉద్దేశ్యంతోనే ఇప్పుడిక్కడకు వస్త. ఎంతైనా పెంచిన మనసుకదా''

గబగబా వంటింట్లోకి వెళ్ళింది.

మనో కాఫీలు తెచ్చి అందించింది.

''మనో మమ్మల్నందర్నీ మర్చిపోయావా?'' కప్పు పక్కనపెట్టి ఆమెను కౌగిట్లో పొదవు కుంది కామేశ్వరి.




''బావున్నారా?'' పొడిగా అడిగింది మనో.

''మనో... నిన్ను చూస్తుంటే నాకెంత గర్వంగా వుందో తెలుసా? మొత్తానికి ప్రపంచాన్ని ఎదిరించి నీ అంతట నువ్వు జీవితంలో నిలదొక్కుకున్నావు''

''పెళ్ళి చేసుకున్నావా? నీతోపాటు ఇంకెవరైనా వచ్చారా?''

''లేదు'' కామేశ్వరి కౌగిలి విడిపించుకుని ఓ అడుగు వెనక్కేసింది.

''లేదు, పెళ్ళి చేసుకోలేదు''

''ఇన్నేళ్ళూ ఎలా గడిపేవో చెప్పు, వినాలని వుంది. నువ్వు వెళ్ళిపోయిన రోజునించీ నీకోసం ఎంత తల్లడిల్లిపోయామో ఎలా చెప్పను?''

''గతం గురించి మనం మాట్లాడొద్దు అత్తా'' దృఢంగా వుంది సోనీ స్వరం.

''మీరిద్దరూ కాసేపు రెస్ట్ తీసుకుంటే మేం వంట చేస్తాం'' మళ్ళీ చెప్పింది సోనీ.

ఈలోగా శ్రీనివాస్ లోపలకు వచ్చాడు.

''డాడీ ఏరీ?''

''వనుందట వెళ్ళిపోయారు. ఏం జరిగిందో అర్థంకావట్లేదు.బోర్‌వెల్ సమస్య... ఇన్నేళ్ళుగా లేనిది. డ్రైనేజి వాటర్ బోర్‌లో కలుస్తోందనుకుంటా.. చెత్తా చెదారం... ఆ ప్రాబ్లమ్, ఎలా సాల్వ్ చెయ్యాలో అర్థం కావట్లేదు.టెంపరరీగా టాంకర్స్ తెప్పించానునుకో''



భోజనాలు కాగానే శ్రీనివాస్ మళ్ళీ అపార్ట్‌మెంట్స్ దగ్గరకు బయల్దేరాడు.

''మీతోపాటు నేనూ రానా? అభ్యంతరం లేకపోతేనే... సోనీ ఏమంటావ్?''

''తప్పించుకుందుకు మంచిదారే దొరికింది'' నెమ్మదిగా అని,

''వెళ్ళు వెళ్ళు నాకెందుకు అభ్యంతరం. మేం మాట్లాడుకుంటాంలే''

''మిమ్మల్ని క్రాస్ ఎగ్జామ్ చేసారా లేదా?'' బైక్ స్టార్ట్ చేస్తూ అడిగాడు శ్రీనివాస్.

''ట్రై చేశారంతే. సోనీ ఆపేసింది. మరో అవకాశం ఇవ్వడం నాకిష్టంలేదు''

''మమ్మల్నేం చెయ్యమంటారో చెప్పండి. వచ్చేవాళ్ళని ఆపలేంగదా. ఒకవేళ మనోహర్ మామయ్యే వస్తే, మాట్‌చెయ్యనా? పోనీ అతన్ని దేవతలకు బలి యిద్దామా? మేకలూ గొర్రెల్నెందుకు చంపడం?''

మనో నవ్వింది. ''థాంక్స్ శ్రీనివాస్. మిమ్మల్నేమీ చెయ్యమని అడగలేను. ఒకవేళ అతను వస్తే... నేనే వెళ్ళిపోతాను''

''ఇక్కణ్నుంచా?''

''అవును... మళ్ళీ పారిపోనులెండి''

''అదీ... అలా ధైర్యంగా వుండాలి''

వీలైనంత స్లోగానే డ్రైవ్ చేస్తూ ''మీరు రావడం మాకు చాలా సంతోషంగా వుంది వదినగారూ. సోనీ ఇంత సంతోషంగా వుండటం నేనెప్పుడూ చూడలేదు. పిల్లలక్కూడా మీ రాక ఆనందంగా వుంది''

''నాకూ ఇక్కడికి రావడం బాగుంది''

అపార్ట్‌మెంట్స్ పార్కింగ్ లాట్‌లో బండి ఆపాడు. ఇద్దరూ ఆఫీస్‌లోకి నడిచారు.

లోపలికి వెళ్ళాక రూమ్ తలుపువేస్తూ ''మీతో ఒంటరిగా మాట్లాడే అవకాశం కోసమే ఎదురుచూస్తున్నాను. ఇప్పుడు మనం మాట్లాడుకునే మాటలు మనిద్దరి మధ్యనే వుంటాయి. కూర్చోండి'' ఫాన్ ఆన్‌చేశాడు.

''తాతగారు మొదటిసారి హార్ట్ ఎటాక్ వచ్చి కోలుకున్నాక నాతో అన్నివిషయాలూ వివరంగా మాట్లాడారు. మీకు జరిగిన అన్యాయాన్ని గురించి చర్చించారు. మీకు తెలీని నిజం ఒకటి చెప్పనా? మీరు ఇంట్లోంచి వెళ్ళిపోయిన పదిరోజుల్లోనే తాతగారు మీ వివరాల్ని సంపాదించగలిగారు. మీ ఎదుట పడితే మీరు మళ్ళీ ఎక్కడికి వెళ్ళిపోతారో అనే భయంతో మీ ముందుకి రాలేదు. కానీ మీ చదువుకి, సౌకర్యాలకి తగిన ఏర్పాట్లు స్వయంగా చేసిమరీ వచ్చారట. ఆ సంగతి ఇక్కడెవరికీ చెప్పలేదు. తాతగారు మరో కారణం కూడా చెప్పారు. 'మనోహర్ పగబట్టిన త్రాచులాంటివాడు. ఏమాత్రం ఆచూకీ తెలిసినా మనోని బతకనివ్వడు' అని బాధపడేవారు.

చివరికి మీ చదువుకోసం విదేశాలకు పంపింది కూడా తాతగారే. అప్పుడప్పుడు మీరెక్కడుంటే అక్కడికి వచ్చి మీ కంట పడకుండా మిమ్మల్ని కళ్ళారా చూసుకుని వచ్చేవారట. రెండోసారి హార్ట్ ఎటాక్ వచ్చాక డాక్టర్లకి చెప్పివుంచారు.

'ఎప్పుడు తన చివరి ఘడియలు సమీపించినా ముందు మీకు తెలియజెయ్య'మని చెప్పి మీ ఫోన్‌నెంబర్ తాతగారే ఇచ్చారు. ఈ విషయాలు నేను ఇంతవరకు సోనీకి కూడా చెప్పలేదు. ఇంతకీ ఇవన్నీ చెప్పడం ఎందుకంటే... ఈ అపార్ట్‌మెంట్స్ తాతగారు మీ పేరిట రాశారు. దానికి కారణం కూడా చెప్పారు. 'ఇంట్లో మరెవరి పేరిటవున్నా మనోహర్ అందర్నీ నడివీధిలోకి లాగుతాడు. వాడి సంగతి నాకు బాగా తెలుసు. చాపకింద నీరులాంటివాడు. వాడిని ఎదుర్కోగలది మనో ఒక్కతే. మీ అందరి జీవితాలు మనోమీద ఆధారపడి వుంటాయి. మీ అందరి సహకారం వుంటే మనో మరింత ధైర్యంగా మనోహర్ ఆట కట్టించగలదు. వాడా టెక్స్‌టైల్ మిల్స్ కూడా మీకు దక్కనిస్తాడన్న ఆశలేదు నాకు. మనో వచ్చాక ఇవన్నీ వివరించే బాధ్యత నీది' అంటూ నామీద వుంచారు. మీరారోజు వచ్చి వెంటనే వెళ్ళిపోడంతో ఎంతో నిరాశపడ్డాను. మీరు మళ్ళీ రాకపోతే నేనే వైజాగ్ రావలసి వచ్చేది''

చాలాసేపు నిశ్శబ్దంగా వుండిపోయింది మనో.

''ఏమిటి వదినగారూ... ఆలోచిస్తున్నారా?''

''ఊహూ... లేదు... లేదు... తాతగారు నా భుజాలమీదుంచిన కార్యాన్ని సక్రమంగా నిర్వర్తించగలనా అని భయపడుతున్నాను. ఇన్నిరోజులూ గర్వంతో విర్రవీగాను. నన్నింతస్థాయికి తెచ్చిన తాతగారు బతికుండగా చూడలేకపోయానే అని బాధగావుంది''

''ఇప్పుడు మీరు అర్థంచేసుకోగలరు గనక అపురూప టెక్స్‌టైల్స్ గురించి కూడా ఒక మాట. మావగారో కొత్త ప్రాజెక్ట్ మొదలెట్టి ఏళ్ళకేళ్ళు గడచిపోతున్నా దానికో రూపురేఖా రాకపోవడంలో మనోహర్ హస్తం వుందేమోనని నా అనుమానం. అంతేనా... దాన్ని అమ్మెయ్యమని సలహా ఇచ్చిందీ ఆయనే. ముందు అది అమ్మకుండా ఆపాలి''

సాలోచనగా చూసింది మనో.

''ఇది మీ ఒక్కరికే సాధ్యం''

''ఆ విషయం అలా వుంచండి. ఈ వాటర్ ప్రాబ్లమ్ వెనకాల మనోహర్ హస్తం ఏమైనా వుందా అని ఆలోచిస్తున్నాను''

''ఓహ్... మీరు టూ ఫాస్ట్. అందుకే తాతగారికి మీమీద అంత నమ్మకం. బయటకు వెళ్ళి చూద్దాం రండి''

ఇద్దరూ బయటకు నడిచారు.

ఇంటికి ఈశాన్యం మూలన ఓ గది. ఆ గది లాక్‌చేసివుంది. తాళం తీశాడు శ్రీనివాస్. ఆ గదిలోనుంచే పెద్ద మోటార్, బోర్‌వెల్ వున్నాయి. ఈశాన్యం బోర్ వెయ్యాలని శాస్త్రప్రకారం వేయించారు''

''ఈ రూమ్ తాళం మీదగ్గరే వుంటుందా?''

''ఊహూ... మరోతాళం శ్రీనాథ్‌దగ్గర వుంది. అతనిక్కడ చేరి అయిదారేళ్ళైంది అంతే... అపార్ట్‌మెంట్ రిపేర్లవీ చూస్తూంటాడు''

''నేను చదివింది మెడిసిన్. ఇలాంటి విషయాలతో పెద్దగా టచ్‌లేదు. నరే.. అంతవరకూ రోజూ టాంకర్లతో నీళ్ళు సప్లై చెయ్యాల్సిందే. అదైతే తప్పదుగదా చూద్దాం''




ఓ పదినిమిషాలు చుట్టూ చూసుకుని బయ ల్దేరారు.

ఇంటిముందుకు వచ్చేసరికి పరుగెత్తుకు వచ్చింది సోనీ. ఆమె మొహంలో ఆందోళన.

"ఏం జరిగింది సోనీ" ఆమె మొహం చూస్తూనే అడిగాడు శ్రీనివాస్.

"సూసీ చచ్చిపోయింది"

సూసీ వాళ్ళ పిల్లిపిల్ల. అదిరిపడ్డాడు శ్రీని వాస్.

"ఎలా?"

"ఫ్రూట్‌సలాడ్‌కోసం పాలు కాచుతున్నాను. మామూలుగా తీసుకునే రెండు లీటర్లు కాక మరో పాకెట్ ఎక్కువే తీసుకున్నాను గెస్ట్‌లు వచ్చారని. ఉదయం కాఫీ, టీలకు నిన్నటి పాలే సరిపోయాయి. సూసీకి పాలులేవు. అందుకే ఉదయం పాలల్లో ఓ గ్లాస్ చల్లారడా నికి నీళ్ళలో పెట్టి మిగతాదాంట్లో సలాడ్‌కోసం కస్టర్డ్ కలిపాను. ఓ కప్ కాఫీ చేసుకుందామా అని అనుకున్నాకూడా... అయినా అలవాటు మరీ మితిమీరుతోందని ఆగిపోయాను. ఆ పాలు తాగిన వెంటనే సూసీ కళ్ళు తేలేసింది. వంట ఆపి వెటర్నరీ హాస్పటల్‌కి పరుగెత్తాను. ప్చ్... ఏంలాభం... డి.ఓ.ఏ. అని రాసుకున్నారు" ఆమె కళ్ళల్లో నీళ్ళూరాయి.

"డి.ఓ.ఏ.నా?"

"డెడ్ ఆన్ ఎరయివల్"

"రీజన్ చెప్పారా?"

"ఆ... విషప్రయోగం. పాలలో సైనయిడ్ కలిసి వుండొచ్చంటున్నారు. సూసీ ఒళ్ళు బ్లూరంగుకి మారిపోయింది"

మనో మొహం పాలిపోయింది.

"సోనీ కొంచెం ఆ సలాడ్ ప్యాక్‌చేసివ్వు. నాకు తెలిసిన ఫ్రెండ్‌దగ్గర టెస్ట్ చేయిస్తాను. అనవసరంగా కంగారుపడకండి. ఈ విషయా లుమీ అత్తయ్యలకు..."

"ఊహూ... చెప్పలేదు"

"థాంక్‌గాడ్... తొందరగా వస్తా... ఓ గంటలో వస్తాను. పెద్దగా చర్చించుకోకండి"

★ ★ ★

కెమికల్ ఎనాలిసిస్‌లో సైనయిడ్ వున్నట్టు రుజువుంది. అది పాలలోనే కలిసివుండాలి. అందుకే ఆ పాలు తాగిన సూసీ మరణించింది. శ్రీనివాస్ క్షణం ఆగి ఫోన్‌చేసి చెప్పాడు ఇంటికి ఎక్కడయినా గొయ్యి తీసి ఆ సలాడ్ పూడ్చివెయ్యమని, ఆ వెస్సెల్స్ వాడ ద్దనీ.

అట్నించటే మిల్క్‌బూత్‌కి వెళ్ళాడు. అంత కుముందే అతను లంచ్‌కి ఇంటికి వెళ్ళాడట.

ఆ షాప్‌లో వున్న కుర్రాణ్ణి అడ్రస్ అడిగి అతనింటికి వెళ్ళాడు శ్రీనివాస్. అప్పుడే భోజ నానికి కూర్చున్నాడతను.

"తొందర్లేదు. వెయిట్‌చేస్తాను. భోంచే సిరండి"

ఓ పదినిమిషాలు అసహనంగా ఎదురుచూ శాడు. అతను భోజనం ముగించి వస్తూ వస్తూ శ్రీనివాస్‌కి కూల్‌డ్రింక్ కూడా తెచ్చాడు.

"చెప్పండి"

"పాలపాకెట్స్ సాధారణంగా ఎవరితో పంపిస్తారు?"

"నేనయినా ఇస్తాను, లేదా మా బోయ్‌తో పంపిస్తాను. ఏం అలా అడుగుతున్నారు?"

"కొంచెం పనుండి. ఈరోజు ఎవరిచ్చారు?"

"ఈరోజు... ఈరోజు నేనే ఇచ్చాను"

"ఎవరినుంచైనా కంప్లైంట్ వచ్చిందా?"

"ఏరకమైన కంప్లైంట్?"

"అడల్టరేషన్... కల్తీ..."

"లేదే... ఒక్కనిముషం ఆగండి... మీ ఇల్లు... ఆ పెద్ద గార్డెన్ వున్న ఇల్లుకదూ. మీ ఇంట్లో ఈరోజు పాలు నేనివ్వలేదు"

"మరి"

"ఇంకా డిస్ట్రిబ్యూషన్ మొదలెట్టకముందే మీ ఇంటినుంచే ఒకతను వచ్చి తీసికెళ్ళాడు"

"ఇంటినుంచా? ఎలాగున్నాడు? ఓల్డేజా?"

"ఊహూ... పాతిక ముప్పైమధ్య... ఆ... బుగ్గమీద కత్తిగాటు వుంది. చుట్టాలు వచ్చా రని... అర్జంటుగా కావాలని"

ఉలిక్కిపడ్డాడు శ్రీనివాస్.

కత్తిగాటు వున్నది శ్రీనాథ్‌కి.

శ్రీనాథ్!

శ్రీనాధ్ చేశాడా ఈ పని? ఇవాళ వాళ్ళమ్మ ఇక్కడికి వస్తుందని తెలీదేమో!

సోనీ ఆ పాలే గనక కాఫీలకి వాడివుంటే... పిల్లలు, సోనీ, తనూ, వచ్చిన చుట్టాలూ... మనో...' అనుకున్నాడు భయంగా

"థాంక్యూ"

"ఏదైనా ప్రాబ్లమా? చెప్పండి. ఇరవైఏళ్ళు గా ఇక్కడ పాలు సప్లై చేస్తున్నాను. ఎప్పుడూ ఏ ఇబ్బందీ రాలేదు"

"లేదు... లేదు... వస్తాను"

ఇంట్లో అడుగు పెట్టేసరికి రెండుదాటింది. అందరూ భోజనాలు ముగించారు. సోనీ, మనో శ్రీనివాస్‌కోసం ఎదురుచూస్తున్నారు.

"సోనీ స్నానంచేసి వస్తాను... వడ్డించెయ్"

శ్రీనివాస్ స్నానం ముగించి వచ్చేసరికి వంటింట్లో వున్నారిద్దరూ.

"ఏం జరిగింది?"

మనో అక్కడే వుందని వెనకాడలేదు శ్రీని వాస్. సోనీ వీపుమీద చెయ్యేసి మరో చేత్తో ఆమె తల నిమురుతూ "ఈరోజు మన అదృ ష్టం బాగుంది గనకే బతికి బయటపడ్డాం. లేకపోతే ఈ ఇల్లు ఈపాటికి శవాలగుట్ట అయ్యేది" అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగి రెప్పల మాటున ఆగిపోయాయి. అంతలోనే తమా యించుకుని "జరగవలసినవి తరువాత ఆలో చిద్దాం... పద" డైనింగ్ టేబుల్‌మీద మూడు పళ్ళాలు చూస్తూ, "ఏమిటి! మీరింకా తిన లేదా? రండి... రండి ఆలస్యమైపోయింది" అంటూ తొందరచేశాడు.

★ ★ ★

తెల్లవారకుండానే చక్రవర్తినుంచి ఫోను. ఇంతక్రితం సన్నిహిత ఇంట్లోనే జరిగిన పరిచయానికి తనకి తెలియకుండానే మనోకి దగ్గరి స్నేహితుడయ్యాడు చక్రవర్తి.

"హలో" అంది మోహిత.

"ఇవాళ మీ తోటకి సరదాగా వనభోజనానికి వెళ్దామా?"

ఒక్కక్షణం ఆలోచించిందామె. 'శ్రీనివాస్, సోనీ మూడ్‌లోలేరు. రిలేటివ్స్‌తో అలసిపోయా రు'

"ఇలా పిలుస్తున్నానని అనుకోకపోతే పోనీ మీరు రాకూడదూ? అభ్యంతరమా?"

"లేదులేదు. దేనికి అభ్యంతరం? ఎన్నేళ్ళై ందో ఇలా ఉదయంపూట వాకింగ్‌కి వెళ్ళి"

"ఒక హాఫెనవర్‌లో రానా? డోంట్ బాదర్ అబవుట్ లంచ్. డిన్నర్‌కి మీరు రమ్మంటే ఇంటికి వస్తాను"

"ఎవరు మనో..." లేచి వచ్చింది సోనీ.

"చక్రవర్తి... వాకింగ్‌కి వెళ్దాం రమ్మంటున్నా డు"

"పోనీ వెళ్ళరాదూ... సరదాగా వుంటుంది"

"లంచ్ అరేంజ్ చేస్తాడట"

"సందు దొరికితేచాలు స్కూల్ ఎగ్గొడదా మని చూస్తారు పిల్లలు. లేకపోతే మేమూ వచ్చేవాళ్ళం. వెళ్ళు కాస్త రిఫ్రెష్ అవ్వొచ్చు. నిన్నటి గొడవతో బొత్తిగా మతిపోయినట్లైంది. డిన్నర్‌కి ఇక్కడికే తీసుకురా అతన్ని"

అరగంటలో రెడీ అయింది మనో. గులాబీ రంగు పూలున్న వైట్‌శారీ. స్లీవ్‌లెస్ రోజ్‌కలర్ బ్లౌజ్. గులాబీలా ఎర్రబడ్డ చెక్కిళ్ళు.

అతను స్కూటర్ తెచ్చాడు.

"ఓహ్... రెడీగా వున్నారా?" నిశ్శబ్దంగా అతనివెంట బయల్దేరింది.

"ఎప్పుడైనా మ్యూజియంకి వెళ్ళారా?"

"ఎప్పుడో చిన్నప్పుడు స్కూల్లో చదువుకునే రోజుల్లో... నాకంత టైమ్ దొరకదు. వాటి గు రించి చదివాను"

"ఎప్పుడైనా ఓసారి మిమ్మల్ని తీసుకెళ్తాను. మీకు ఇంట్రస్ట్ వుంటే. ఎన్నాళ్ళుంటారు?"

"రేపు వెళ్ళిపోవాలి"

"వచ్చేవారం వస్తారా?"

"ఊహూ... వీలవదు. అంత తరచుగా రావడం కుదరదు. నా వృత్తి అలాంటిది. ఏ నెలకో ఓసారి రాగలనేమో. ఇంకా తరచు రావాలనుకుంటే ఇలా ఒకరింటికి రాకుండా ఓ ఇల్లు తీసుకోవాల్సి వస్తుంది"

"అలా అని చెప్పాడా శ్రీను?"

"లేదు. వాళ్ళనలేదు. నా ఇంట్లో




నేనుండటం నాకిష్టం. వాళ్ళు బలవంతాన అప్పుడప్పుడు వచ్చినా, దానికీ ఓ హద్దుంటుందిగా''

''అక్కడుంటం బాలేదా?''

''బావుంది గనకే మళ్ళీ మళ్ళీ రావడం''

అడిగినదానికి సూటిగా జవాబు... అంతే. ఒక్క ముక్కా ఎక్కువ మాట్లాడకపోవడం... ముభావం స్వాభావికమేమో... ఎదుటివాళ్ళకి ఎక్కువ మాట్లాడే అవకాశం ఇవ్వకపోవడం తనచుట్టూ తను గిరిగీసుకుని నన్నంటుకోకు నామాలకాకీ అన్నట్టు ఎన్నో ప్రశ్నలు నీటి ఊటలా ఊరుతున్నాయి. ఎందుకు అందరికీ దూరంగా వుంది? ఎప్పుడు వెళ్ళిపోయింది? సౌందర్యతో అయిదేళ్ళ పరిచయంలో ఒక్క రోజు ఈవిడ గురించి వినలేదు. శ్రీనివాస్‌తో చనువు స్నేహం వున్నా సోనీ కూడా ఎప్పుడూ తన అక్కగురించి మాట్లాడలేదు. అతి ప్రయత్నంమీద ఆ ప్రశ్నల్ని మనసులోనే అణచివేసుకున్నాడు. చనువు పెరిగాక తనే చెబుతుంది. చనువు పెరగాలని మనసు ఆశిస్తోందా? ఏమో... స్కూటర్ తోటలో ఓ పక్కన ఆపేశాడు.

''నడిచి వెళ్దామా?''

తలూపింది మనో.

''ఎప్పుడైనా ఈ తోటకి వచ్చారా?''

''చిన్నప్పుడు... ఇరవై... ఇరవై రెండేళ్ళ కితం...''

సన్నాగా గడ్డిమొలచిన బాటమీద మంచు ముత్యాల తళతళలు. చూపందనంత ఎత్తుకి ఎదిగిన చెట్లు. వాటిని అల్లుకొన్న లతలు.

మనో వాటిని ఆసక్తిగా చూసింది. బాల్యం మళ్ళీ జీవితంలోకి తొంగి చూసినట్టనిపించింది. చిన్నప్పుడు తాతగారితో వాకింగ్‌కి వెళ్లడం, అమాయకంగా ఆ మంచుపూసల్ని ఏరుకొందుకు ప్రయత్నించడం గుర్తుకు వచ్చింది. ఒక్కక్షణం కళ్ళుమూసుకుంది. చిన్నప్పుడే ఆ పూల చెట్ల పేర్లు నేర్పేవాడాయన. నత్తగుల్లల్లో వుండే జీవులు ఎలా లోపలకు ముడుచుకుపోతాయో చూపేవాడు. ప్రపంచం రంగుల కలలా అనిపించేది ఆ రోజుల్లో.

ఎవరోపెంచి పోషిస్తున్నట్టుగా పుష్టిగా పెరిగిన మొక్కలు వంపులు తిరిగి వయ్యారాలు ఒలకపోస్తున్నట్టు కాలిబాట. చక్రవర్తి ముందు నడుస్తున్నాడు. ఇద్దరూ పెద్ద మాట్లాడుకోకపోయినా ఇలా కలిసి నడవడం మనసుకి తృప్తిగా వుంది. అప్పుడే వుదయిస్తున్న సూర్యకాంతి ఆకు పచ్చని ఆకుల మొహాలకు పసుపు రాస్తున్నట్టుగా వుంది. ఆ మధ్యలో అప్పుడప్పుడు తొంగి చూస్తున్న రంగురంగుల పూలు.

ఎండిన ఆకులు గుసగుసలాడుతున్నట్టుగా సన్నటి శబ్దం. కాలి బాట ఇరుకై రెండు చెట్లకి మధ్య ఓ మనిషి వచ్చేస్థలం అంతే. ఫక్కున నవ్వింది మనో.

'అబ్బ పారిజాతాలు వెదజల్లినట్టు' అనుకున్నాడు... తెల్లని పళ్లవరస, అప్పుడో ఇప్పుడో సోకిన వేడికి ఎర్రబారిన చెక్కిళ్లు చూస్తూ.

''కొంచం లావున్న వాళ్లైతే ఈ దారిలో పట్టరు'' తనంతట తనుగా ఆమె మాట్లాడిన మొదటిమాట అది.

వెనక్కి తిరిగి ఓ చిర్నవ్వు విసిరాడు.

కళ్లెత్తి ఒకసారి అతన్ని పరిశీలనగా చూసింది మనో. సన్నగావున్నా విశాలంగా అనిపిస్తున్న భుజాలు, ఆ భుజం మీద బాగ్... స్పోర్ట్స్ మాన్... అటూ ఇటూ బాలెన్స్ చేస్తున్నట్టు వూగుతున్న చేతులు అతని నడక వేగం ముందు ఆమె స్లోగా నడుస్తున్నట్టే వుంది. అప్పటికే మూడు నాలుగు కిలో మీటర్లు నడిచి వుంటారు. మనో కాళ్లు నొప్పెడుతున్నాయి. వెనక్కు తిరిగాడు చక్రవర్తి.

''ఆయాసంగా వుందా... గుండెనిండా గాలి పీల్చి నెమ్మదిగా వదలండి. అలసట తగ్గినట్టనిపిస్తుంది''

అలాగే చేసిందామె. ఆయాసం తగ్గినట్టనిపించిందామెకి.

''థాంక్యూ''

ఆయాసం తగ్గిందికానీ కాళ్ల నొప్పి క్షణక్షణానికీ పెరుగుతున్నట్టుగా వుంది.

అతను వెనక్కు తిరిగి వాటర్ బాటిల్ అందించాడు. చల్లటి నీళ్లు తాగుతూనే ప్రాణం లేచి వచ్చినట్టనిపించింది.

చెట్లు మరీ దట్టమై సూర్యకిరణాలు కూడా



తగలకుండా వుందా చోటు. తల పైకెత్తి చూసింది. గాలికి కదులుతున్న చెట్ల శిఖరాగ్రాలు... అవి గుసగుసలాడుతున్నట్టు శబ్దం.

స్పందన... ఎక్కడిదా పేరు? ఎందుకు జ్ఞాపకం వచ్చింది.

'స్పందనా! ఆ చెట్లు తలలు దగ్గరకు చేర్చి ఏం గుసగుసలాడుకుంటున్నాయో విన్నావా? ఏదైనా హారర్ నవల చదివాయా? ఆ చెట్లు మనుషుల్లా లేవూ? ఆ గుసగుసలు ఏదో కుట్రలావుంది కదూ? ఒక్కసారి కళ్లు మూసుకో ఈ శబ్దాలు జరగబోయే ఘోరాన్ని సూచిస్తాయిలా వుంది'

ఆమెకి తెలీకుండానే కన్నీళ్లు ధారలై కారిపోతున్నాయి. అతని వెనకాల అడుగులో అడుగు వేసి నడుస్తూనే వుంది. కన్నీళ్లు చెక్కిళ్లను కొరుకుతున్న భావన. అంతలోనే పెదవుల మీద ఉప్పదనం. ఏదో చెప్పాలని వెనక్కు తిరిగిన చక్రవర్తి నోరు తెరిచి అలాగే చూస్తూండిపోయాడు.

"మోహితా ఏం జరిగింది? ఏడుస్తున్నావా?"

"ఏం లేదు... ఏం లేదు" తల అడ్డంగా వూపింది. అతను హఠాత్తుగా ఆగటంతో అతనికి మరీ దగ్గరగా వున్నట్టనిపించింది. మాస్ సరిచేసుకుంటున్నట్టు నటిస్తూ ముందుకి వంగింది.

కన్నీళ్లు తుడుచుకుంది.

"కాళ్లు నొప్పిగా వున్నాయా?"

"లేదు"

"ఏవైనా జ్ఞాపకాలా?" అతని వంక తీవ్రంగా చూసిందామె.

"మీకిలా కన్నీళ్లు తెప్పించే జ్ఞాపకాలున్నాయా?" అతను వల్చగా నవ్వాడు.

"ఎవరైనా అలాంటి జ్ఞాపకాలు లేకుండా వుండగలరా? నాకు కన్నీళ్లు రావనుకున్నారా? నేనో శిలననుకున్నారా? కాదు కాదు నేను... నా మనసో సుకుమార పుష్పం. ముట్టుకుంటేనే ముడుచుకుపోయే అత్తపత్తి. చూపులకే కరిగిపోయే మంచుబొమ్మ" ఆవేశంగా అంది.

"సర్లెండి... వీటికేం గాని ఆకలిగావుంది. ఎక్కడైనా కూర్చుందామా?" అడిగింది మనో.

"పది గజాల దూరంలో ఓ చిన్న చెరువుంది. పదండి" మళ్లీ అతనే ముందు నడిచాడు.

ఆ చిన్న చెరువు చెట్ల మధ్య గూడులా వుంది. నీళ్లకి కాస్త దూరంగా ఇసుకలో కూర్చున్నారు.

ఆమె మనసు తిరిగి ప్రశాంతంగా వుంది. జ్ఞాపకాల్ని భద్రంగా మనసు పొరల్లో సీల్ చెయ్యడం ఆమెకు పుట్టుకతో వచ్చిన నేర్పరితనం.

"అప్పుడప్పుడు ఇక్కడికి వచ్చి గంటల తరబడి గడుపుతాను" చెప్పాడతను బాగ్ జిప్ తీస్తూ.

"ఒంటరిగానా?"

"ఒక్కోసారి ఒంటరిగా" క్షణం ఆగి "ఆకలిగా వుందా? నడిచి నడిచి అలిసిపోయుంటారు?" అడిగాడు.

"నా కాళ్ల గురించి తప్ప మరేం ఆలోచించేందుకు ఓపిక లేదు. అందుకే ఆకలిగా వుందో లేదో తెలీట్లేదు"

"మీ కాళ్లకేం? అందంగా వున్నాయి" అంటూ బాగ్‌లోంచి పేపర్ ప్లేట్స్, స్నాక్స్ పాకెట్స్ బయటకు తీశాడు.

నీళ్లు తాగి కాళ్లు బారజాపి వెనక్కి వాలిందామె. కళ్లు మూసుకుంది. ఆమె పచ్చని శరీరం వేడిలేని ఎండరంగులో బుగారు పూత పూసినట్టుంది.

"ఈజిప్ట్‌లో మీ వర్క్‌గురించి చెప్పండి... మీ కభ్యంతరం లేకపోతే"

చక్రవర్తి ఆమె వంక చూశాడు. డాక్టర్‌గా మోహిత రూపం వైట్‌కోట్‌తో అతని కళ్లల్లో మెదిలింది. ఇప్పుడు ఓ మామూలు అమ్మాయిలా, ఇమోషనల్‌గా వింతగావుంది. రిలాక్సైనట్టు కనిపించినా ఇదివరకులా నవ్వట్లేదు. ఆమె అలా గంభీరంగా వుండటం బాలేదు. నవ్వుతూ వుంటేనే అందంగా వుంటుందనిపించింది.

"ఆరేళ్లుగా రిసర్చ్ చేస్తున్నాను, ఒక పురాతన ఈజిప్ట్ ప్రభువు మీద. అతని పేరు





టెంకొరీ. ఈజిప్ట్ పాలకులని ఫరక్‌లంటారు. వాళ్లల్లో ఎనిమిదోవాడు. అతనికి సంబంధించిన వివరాలు లభించాయి. కానీ ఇంకా ప్రత్యక్ష సాక్ష్యాలేం దొరకలేదు. బహుశా అతని ప్రత్యర్థి ఎవరో అతని మరణం తరువాత సాక్ష్యాలు నాశనం చేశాడనిపిస్తోంది.

"మీకా ఈజిప్ట్ రాజుల మీద ఎందుకంత ఆసక్తి"

"ఎందుకో చెప్పనా? దాదాపు క్రీ.పూ. 1300ల ప్రాంతంలో ఓ పాలకుడుండేవాడు. అతని పేరు అకెనాటెన్"

"అతనే కదూ... తన భార్యని మనసారా ప్రేమించినది?"

"అరె మీకెలా తెలుసు?" అతని మాటల్లో ఆశ్చర్యం. పట్టుబడిపోయినట్టుగా చూసింది మనో.

"ఇంత చిన్న డిటెయిల్ ఆర్కియాలజిస్టులకీ, చరిత్ర కారులకూ తప్ప మరెవరికీ తెలవడానికి వీల్లేదే?"

"కవులకి కూడానా?"

అతని మొహం కొంచెం పాలిపోయింది.

"మీరు.. మీరు వైజాగ్‌లో..." మధ్యలోనే ఆపాడు.

"అవును"

"కెజిహెచ్‌లోనా"

"అవును"

"అంటే..."

"అవును"

అతని పెదవులు వణుకుతున్నాయి. నోట మాట రాలేదు. కళ్లు నీళ్లతో నిండిపోయాయి.

"ఆ రాత్రి మిమ్మల్ని హాస్పిటల్లో అడ్మిట్ చేసినప్పుడు డ్యూటీలో వున్నది నేనే. సాధారణంగా డ్యూటీకి పిలవరు నన్ను. కానీ ఆ రోజు ఆవిడకి హఠాత్తుగా అర్జెంట్ పని తగిలి" తలెత్తి అతని వంక చూసి,

"అరే.. ఏమిటిది? మరీ చైల్డిష్‌గా... ఏమని పిలవను మిమ్మల్ని? శేఖర్ అని పిలవనా?"

చనువుగా అతని భుజం మీద చెయ్యివేసింది. ఆ స్పర్శలో మాటల్లో వ్యక్తం చెయ్యలేని ఓదార్పు.

"ఆ రోజు స్పృహ వస్తూనే ఫిట్ ఆఫ్ ఇమోషన్‌లో చేసిన పనికి చాలా సిగ్గుపడ్డాను. అందుకే ఎవరికీ నా మొహం చూపించలేక వెళ్లిపోయాను. ఆ సంఘటన ఎవరికీ తెలీదనే అనుకుంటున్నాను"

"ఇట్సాల్‌రైట్... అలాగే అనుకోండి. కాదంటే మీ డైరీ, కళ్లద్దాలు నా దగ్గర వైజాగ్‌లో వున్నాయి... సరే లీవిట్. మీకా ఈజిప్షియన్ రాజు మీద ఎందుకంత ఆసక్తి?"

"తెలీదు.. అతని సమాధి దొరికితేగాని గట్టిగా చెప్పలేను. ఫామిలీ గొడవల్లో పడ్డాడనుకుంటాను. కొడుకుతో విరోధం పెంచుకున్నాడు. మీ సంగతేమోకానీ నాకు మాత్రం చాలా ఆకలిగా వుంది. వాటెబవుట్ లంచ్?"

"కాళ్ల నొప్పి తగ్గిందిగా ఆకలి గుర్తొస్తోంది. ఇలా వాకింగ్‌కి వెళ్తూనే వుంటారా ఎప్పుడూ?"

"ఊ... రోజూ అయిదారుమైళ్లు నడవటం అలవాటు"

"అందుకేనా ఇంత సన్నగా... స్మార్ట్‌గా..." మధ్యలోనే ఆపేసింది.

"ఆపకండి... అలా ఫ్రీగా మాట్లాడటమే నాకిష్టం"

"మీకెంత ఏజుంటుంది? థర్టీఫైవా?"

"ఉహూ... థర్టీనైన్"

"అందుకే అన్నాను వాకింగ్ మేక్స్‌యూ స్మార్ట్" మళ్లీ కాస్సేపాగి,

"ఏమైతేనేం మీ ముందు ఓడిపోయానుగా.."

"సారీ... ఆ ఉద్దేశ్యంతో పిలవలేదు మిమ్మల్ని" బాగ్‌లోంచి ప్లాస్టిక్ కారీబాగ్స్ తీశాడు... వాటిల్లోంచి ఫ్రెడ్‌రైస్... కర్డ్‌రైస్ తీసి పేపర్ ప్లేట్స్‌లో వడ్డించి స్పూన్ అందించాడు.

"ఈ లంచ్ ఏర్పాట్లు..."

"నావే... అంటే నేను వండానని కాదు. వంటమనిషి వుంది"

లంచ్ ముగిసింది. అయినా అలాగే కూర్చుండిపోయారు. చిన్నచిన్న కప్పపిల్లలు క్షణంలో నీళ్లల్లోంచి పైకెగిరి ఎగురుతున్న




పురుగుల్ను పట్టుకుని మళ్లీ నీళ్లలోకి జారడం, మరో ఆహారం దొరికే వరకు పొంచివుండటం, ఒక్కసారి ఎగిరిదూకటం సరదాగా వుంది చూస్తుంటే. అలలు చిన్నచిన్న వృత్తాలుగా మొదలై పెరగడం, నీలాకాశంలో పర్వతాల్లా తెల్లటి మబ్బుముక్కలు హఠాత్తుగా పరుగెత్తుకు రావడం, ఆ ప్రకృతి అందం, ప్రశాంతత, అదిచ్చే తృప్తి ఎందుకు ఇన్నాళ్లూ వీటన్నిటికీ దూరంగా వున్నానా అనిపించిందామెకి. ఏళ్లకేళ్ల పరిశ్రమ, గుర్తింపు కళ్లముందు కదిలాయి. జీవితం ఇంతేనేమో, ఒకటి కావాలంటే మరోటి వదులు కోక తప్పదేమో, సరే అవన్నీ తరువాత... ముందతనితో మాట్లాడాలి.

"మీకెప్పుడూ ఎదుటివాళ్లని ఓడించడమే కాని ఓడిపోవడం రాదా?"

చక్రవర్తి జవాబుగా చిరునవ్వు నవ్వాడు.

"ఒకవేళ అదే నిజమైతే కన్నీళ్లు తెప్పించ గల జ్ఞాపకాలు మీకున్నాయన్నారు అదెలాగ?"

"నేనూ ఓడిపోయాను, అదృష్టం చేతుల్లో, భగవంతుడి చేతిలో. నా చేతిలో నేనే ఓడిపోయాను. అంతేగాని మరొకరి చేతిలోకాదు. నేనే కాదు ఏ మనిషైనా మరో మనిషి చేతుల్లో ఓడిపోవడం అనేది జరగదు. మన చేతగానితనాన్ని మనం నిందించుకోలేక వేరే వాళ్లమీదకు నెట్టాలని చూస్తాం"

"ఇది మరీ అన్యాయం, భగవంతుడి చేతిలో తప్ప మనుమల చేతుల్లో ఓడిపోరా? ఓడిపోతే అది మీ చేతుల్లో మీరు ఓడిపోవడమా?"

"అవును.. అందులో తప్పేంవుంది? మన మీద మనం విశ్వాసం పెంచుకుంటే ఏదైనా సాధించగలమని మీకెప్పుడూ అనిపించలేదా? మనని మనం ఓటమికి సమర్పించుకుంటాం... ఎందుకంటే.. ఎదిరించడానికి కనిపించనిశక్తి కావాలి"

"నువ్వేం మాట్లాడుతున్నావో నీకు అర్థం అవుతోందా శేఖర్. మీకు తెలీదు. మీరెంత బలవంతులైనా ఎదుటివాళ్లు మీకు చెయ్యగల హాని" మనో మండిపడింది.

"నిజమే... మీరు చెప్పింది నిజమే. చాలా దూరం వెళ్లిపోయాను గదూ..." ఏదేదో అలా మాట్లాడుతూనే వున్నాడు ఆమె కోపం తగ్గేందుకు సమయాన్నిస్తూ.

ఒకవేళ ఆమె కన్నీళ్ల గతంతో ఆమె ఓటమికి ఏదైనా సంబంధం వుందా అనిపించిందో క్షణం.

"ఏదైనా ఆర్టికల్ రాసినపుడు ఇలాటి సంఘర్షణ నాలో మామూలే. ఇలా భావాలతో ఆడుకోవడం నాకు మామూలే. మామూలుగా మరీ దూరం పోకుండా జాగ్రత్తపడతాను. ఈ రోజు అన్నీ కారంవే తిన్నామేమో.. స్వీట్ మర్చిపోయాను"

"స్వీట్స్ నే తెచ్చానలెండి" అని ఓ క్షణం ఆగి "అయామ్‌సారీ... మరీ రఫ్‌గా మాట్లాడానా? ఎందుకంత అపసెట్ అయానో నాకే తెలీదు"

'అవును మీరు అప్‌సెటయ్యారు. దానికి కారణం మాత్రం ఘోరమైనదే అయివుంటుంది. దాన్ని మర్చి పోయానని భ్రమ పడుతున్నారు కాని ఓ చిన్న కదలిక చాలు దాన్ని బయటకు లాగేందుకు' ఈ మాటలు బయటకు అనలేదతను.

మనో స్వీట్ బాక్స్ తెరిచి అతని ముందుంచింది. "ఓ కలాకండ్.. మీకూ నాలాగే ఇష్టమన్న మాట"

ఇద్దరూ చెరో పీస్ తిన్నారు.

హఠాత్తుగా గాఢమైన మేఘాలవైపు చూసి, "వర్షం వచ్చేట్టుంది. వెళ్దామా?" అడిగాడు.

"సారీ... ఎంత మనోహరంగా వుందీ ప్రదేశం నన్ను నేను మరచిపోయాను" వాటర్ బాటిల్, స్నాక్స్ బాగ్‌లో సర్దుతూ...

"మరి సౌందర్య మాటో.. ఆమె చేతిలో ఓడిపోయారా? మీ చేతిలో మీరు ఓడిపోయారా?"

"నా చేతిలో నేను ఓడిపోటంకాదు, మీ చేతిలో కూడా ఓడిపోయాను. అందుకే ఇలా మీ ముందున్నాను. ప్రేమ నా బలహీనత. ఆ బలహీనతలోనే నన్ను నేను అంతం చేసుకుందామని చూశాను. మీరు సాగనిచ్చారు కాదు"

"మరి... మీ డైరీ..."

"అది నాలోని కవి పైత్యం.. అందరిలా సుఖసంతోషాల్లో తృప్తి పడలేడు కవి. ఏదో ఒక

అసంతృప్తి సృష్టించుకుంటాడు. గత చరిత్రలు చదివి చదివి ఈపాటికి ప్రేమ తత్వాన్ని నేను పూర్తిగా అర్థం చేసుకుని వుండాల్సింది. కాని అలా జరగలేదు. అనుభవిస్తేకాని అనుభవం రాదు''

''మీ మీద మీకు అంత కంట్రోల్ ఉన్నా ఎందుకా బలహీనతని పెంచుకున్నారు?''

''నన్ను నేను మర్చిపోడానికి. అమ్మా నాన్నా ఒకేసారి పోవడం''

''అప్పుడు మీకెన్నేళ్లు?''

''పద్దెనిమిది. అప్పుడు నాకు ఎగ్జామ్స్. అందుకని నన్ను వంట మనిషిని ఇంట్లో వుంచి ఫారిన్ టూర్‌కని బయల్దేరారు. ఎయిర్ పోర్ట్‌కి వెళ్లాం. ఫ్లైన్ టేకాఫ్ తీసుకుంది. అంతే క్షణంలో కుప్పకూలిపోయింది మంటల్లో. బాంబ్ ఎక్స్‌ప్లోజన్. అంతే ఏడాది వాస్తవం మర్చిపోయి గతంలోనే గడిపాను. పరీక్షలు రాయలేదు. ఫ్రెండ్స్‌ని కలవలేదు. పెదవి విప్పి ఒక్క మాటా మాట్లాడలేదు. వయొలిన్ ముట్టుకోలేదు. మా తాతగారు వచ్చారు, నన్ను చూసుకుందుకు. ఆయనకున్న ఒకే ఒక్క అలవాటు చదవటం. క్రమంగా ఆ చదవటానికి ఎడిక్ట్ అయిపోయాను. తాతగారు నాతో ఎంతో సహనంగా మాట్లాడేవారు. కాలేజ్ ప్రిన్స్‌పల్‌తో మాట్లాడారు. ఏడాది తరువాత కాలేజికి వెళితే నాతోపాటు కూర్చుని రెండేళ్లపాఠాలు నాతో రాత్రీవగలూ చదివించారు. ఆ విషాదంలోంచి నన్ను బయటకు లాగగలిగారు. ఒక్కోసారి అనిపిస్తుంది, పద్దెనిమిదో ఏడు ఎవరి జీవితంలోనూ రాకూడదని''

మనో అతని జీవితంలో లీనమైపోయింది.

''ఇది పూర్తి జీవితగాథకాదు, నా బలహీనత గురించి చెప్తున్నానంతే. అందుకే గతం అంటే నాకిష్టం. గతం మనని దాచగల ఓ చక్కని ప్రదేశం ఎప్పుడూ ఖాళీగా మనకోసం ఎదురు చూస్తూంటుంది. ఎంతకాలం అక్కడున్నా ఎవరూ వద్దనరు. ఆ ఎంటర్‌టెయిన్‌మెంట్‌కి మరో వ్యక్తి అవసరంలేదు''

ఒక్కక్షణం ఆగి తనలోతను మాట్లాడు కుంటున్నట్టుగా...

''వాస్తవం అలాకాదు. వాస్తవానికి తోడు కావాలి. పక్కన ఎవరూ లేకుండా ఒంటరిగా నడవడం శూన్యంలా వుంటుంది. తోడు లేకుండా మాట్లాడే వాళ్లు లేకుండా వాస్తవంలో మనలేం. అందరి విషయంలో ఏమోకాని ఇది నా విషయంలో మాత్రం నిజం. అందుకే వర్తమానంలో ప్రేమ కోసం తపించిపోయాను. ఆ తపించడంలో సౌందర్యకి దొరికిపోయాను. ఈ ప్రపంచంలో బతకడానికి సౌందర్య మంచి తోడనుకున్నాను. ఓ మామూలు మనిషిలా బతకాలనుకున్నాను. అది మనొక్కళ్ల చేతిలో వుండదు. దానికి ఎదుటి వాళ్ల సహకారం కూడా కావాలి. ఇద్దరి ఆలోచనలూ ఒకటి కావాలి. ఇద్దరి మనసులూ హృదయాలు ఒకటి కావాలి''

మబ్బులు దట్టంగా ఆకాశాన్ని ఆక్రమించు కున్నాయి. చల్లగాలి మొదలైంది.

''పదండివెళ్దాం''

ఇద్దరూ నడక ప్రారంభించారు. ఈసారి మనో ముందు, చక్రవర్తి వెనక.

అతని మాటలే మనసులో సుళ్లు తిరుగుతున్నాయి. ఎంత లోతైన మనిషి. ఎంత చక్కటి వ్యక్తిత్వం. పూర్‌చాప్ సౌందర్య దురదృష్టవంతురాలు.

అరగంటైనా నడవకముందే వర్షం... భారీ వర్షం. మళ్లీ చెట్ల పొదల్లో తలదాచుకోక తప్పలేదు.

బాగ్‌లోంచి ఫ్లాస్క్ బయటకు తీస్తూ....

''కాఫీ తాగుదాం... చివరి అయిటెమ్ ఇది''

''మీ ప్లాన్‌ని మెచ్చుకోకుండా వుండలేను. ఎప్పుడూ ఇలాగేప్లాన్ చేస్తారా?''

పొగలు వస్తున్న కాఫీ కప్ ఆమెకి అందించి నవ్వి ఊరుకున్నాడు.

''డాక్టర్ అవ్వాలని ఎందుకనుకున్నారు?''

''చిన్నప్పట్నించీ వున్న ఆసక్తితో''

''రెస్ట్ లేకుండా పని చెయ్యాల్సి రావడం''

''అలవాటే... వీలైనంత వరకూ ఎదుటివాళ్లకు బతికే అవకాశం ఇవ్వాలిగా..''

''అదే జీవితం అనుకుంటున్నారా?''

''కాక గతం ఒక్కటే జీవితమా?''

''వర్షం తగ్గుతున్నట్టుంది... వెళ్దామా?''




వాన ఆగిపోవడం ఎండ తెర ఒకటి లోకాన పరచుకోడం ఒకేసారి జరిగింది. నీళ్లలో తడిసిన మొక్కలు, చెట్లు ఎండపొడకి వింతగా మెరుస్తున్నాయి.

"ఉలిపిరి కాగితం మీద పెయింటింగ్‌లా ఈ దృశ్యం ఎంత మనోహరంగా వుంది" పరవశంగా అందామె.

"అవును:.. ఇలా మరీ హేజ్ సీనరీకంటె వెలుగునీడల దృశ్యాలు నాకు చాలా ఇష్టం"

"పెయింటింగ్ అంటే ఆసక్తివుందా?"

"చాలా రకరకాల పెయింటింగ్స్ కలెక్ట్ చేశాను. మీకు అభ్యంతరం లేకపోతే ఎప్పుడైనా నా అపార్ట్‌మెంట్‌కి వెళ్దాం.. మీకా పెయింటింగ్స్ చూపిస్తాను"

"వెళ్దాం"

స్కూటర్ దగ్గరకు వెళ్లేసరికి మబ్బులు మాయమైపూర్తి ఎండ పరచుకుంది.

తడిసిన జుట్టు... గాలిలో ఎగుర్తున్న చీర రెపరెపలు.

"మీరు చాలా అందంగా వున్నారు... ఈ రోజు జన్మలో మర్చిపోలేను థాంక్యూ"

"నాక్కూడా... మరొకరి కంపెనీ ఇంత అవసరమని ఈ రోజు వరకూ గుర్తించలేకపోయాను" మనస్ఫూరిగా వచ్చాయా మాటలు ఆమె మనసులోంచి.



"ఇప్పటికిది అయిదోసారి నీకు ఫోన్ చెయ్యటం. అంత బిజీగా వున్నావా మామయ్యా"

"ఏం అంత అర్జంట్ విషయమా?" విసుగ్గా వుంది మనోహర్ స్వరం.

"అవును. ఫోన్‌లో మాట్లాడటం బాగుండదు. రాత్రికి రానా?"

"పది తరువాత"

రాత్రి పది దాటాక కూడా మనోహర్ ఇల్లు మనుషుల్తో కళకళలాడ్తూనే వుంది.

శ్రీనాధ్ హడావిడిగా లోపలకు వచ్చాడు. ఇద్దరూ మనోహర్ పర్సనల్ రూమ్‌లోకెళ్ళారు.

"ఏమిటంత అర్జంట్ విషయం"

"అదే... నీ ఫ్రెండ్ సోనీ అక్క అది మళ్ళీ వైజాగ్‌నించి వచ్చింది" మనోహర్ చూపు శ్రీనాధ్ మొహంమీద ఆగిపోయింది.

"నువ్వు చూసావా?"

"అవును- రెండ్రోజులక్రితం- అతని పేరేమిటీ? మన సౌందర్య అఫైర్ వెలిగించింది ఆ... చక్రవర్తి... అతని స్కూటర్‌మీద చూసాను"

"చక్రవర్తా? వాడితో దానికెలాంటి పరిచయం?"

"సరే... నేను చెప్పింది అర్థమైందిగా... శ్రీనివాస్ ఇంటిమీద నిఘావుంచాను. నాల్రోజులక్రితమే మనో అక్కడికి వచ్చింది. మీ హెచ్చరిక గుర్తుకు వచ్చింది... అపార్ట్‌మెంట్స్‌లో బోర్‌వెల్ ప్రాబ్లమ్... ఆ హడావిడిలో పాలపాకెట్‌లో సైనైడ్ అడల్టరేషన్... ఆ దిక్కుమాలిన పిల్లి ఆ ఇంట్లో వుందని నాకు తెలీదు. లేపోతే ఈ పాటికి... నఫా..."

"ఇవన్నీ..."

"అవును"

కాసేపు నిశ్శబ్దం.

"ఆవిడ ఇక్కడున్న సంగతి నీకు వెంటనే చెబ్దామని..."

ఇంతలో ఎవరో వచ్చారా గదిలోకి.

"ఇక్కడున్నారా మనోహర్" అంటూ.

"నరసింహం- ఇతను నా మేనల్లుడు శ్రీనాధ్. చూసిపోడానికి వచ్చాడు"

"హాయ్... శ్రీనాధ్... మనోహర్‌కి కావలసిన వాళ్ళందరూ మాకూ కావలసిన వాళ్ళే. మీ మామ కాబోయే ఓ మహానేత. మనోహర్ మీతో

అర్జంటుగా ఓ రెండు విషయాలు మాట్లాడాలి తప్పదు. లేకపోతే మిమ్మల్ని డిస్టర్బ్ చేసేవాడిని కాదు...''

మనోహర్ ఇబ్బందిగా చూసాడు. ఒక్క క్షణం ఆలోచించి శ్రీనాధ్ వంక చూసి-

''ఏం అనుకోకపోతే... ఓ గంట... ఈలోగా డిన్నర్‌ముగించి రెస్ట్ తీసుకో... ఎంత రాత్రయినా వచ్చి మాట్లాడతాను''

''అలాగే''

నరసింహంతో మాట్లాడుతున్నా మనసు మాత్రం శ్రీనాధ్ గురించే ఆలోచిస్తోంది. ఇరవై ఆరు దాటినా అతను జీవితంలో స్థిరపడలేదు. రెండున్నరేళ్ళ క్రితం- తాగి డోస్ ఎక్కువై బార్ అటెండర్‌ని చంపేసి పోలీసుల చేతులో చిక్కినప్పుడు తనే పలుకుబడి ఉపయోగించి కేస్ లోంచి తప్పించాడు. ఆ అటెండర్ తాలూకు వాళ్ళకు డబ్బిచ్చి కేస్ విత్‌డ్రా చేయించాడు. లాయర్‌తో మాట్లాడి ఆత్మరక్షణ ఘర్షణలో అటెండర్ ప్రాణాలు పోయినట్టు వాదించేలా చేశాడు.

''అక్కడ ఏమేం జరిగేది వివరాలతో సహా కావాలి నాకు. ఎంత ఆదాయం ఎంత ఖర్చు. శ్రీనివాస్ ఏం చేస్తున్నాడు. డబ్బెక్కడ్నించి తెచ్చి ఆ అపార్ట్‌మెంట్స్ కట్టారు. రెంట్స్ ఏం చేస్తున్నారు. మొదలైనవన్నీ- నేను ఏదైనా చెయ్యమంటే చెయ్యడానికి నువ్వు సిద్ధంగా వుండాలి. శ్రీనివాస్ ఇచ్చినంత జీతం నేనూ ఇస్తాను. కాని ఒక్కమాట.

ఇదివరకులా తాగి తందనాలాడి పబ్లిగ్గా గొడవల్లో ఇరుక్కున్నావో జరిగిన కథ మీ అమ్మా నాన్నకు చెప్పడమే కాదు. నీ మొహం మరెవ్వరూ చూడకుండా చెయ్యగల్ను. ఇదివరకులాగే తాగి జైలు ఊచలు లెక్కెడుతూ కూచోడమే మిగులుతుంది. బి కేర్‌ఫుల్'' అన్నాడప్పుడు.

శ్రీనాధ్ తలవాల్చటం తప్ప మరేమీ మాట్లాడలేకపోయాడు. ఫర్వాలేదు. కుక్కలా విశ్వాసంగా వున్నాడని ఈ రెండేళ్ళుగా ఎన్నిసార్లు మనోహర్ అనుకున్నా ఈసారి అనుకోడం వేరు. నక్క వినయాలు, గోతులు తవ్వడాలు తెలియని శ్రీనాధ్‌తో పని చేయించుకోడంలో సుఖం వుంది.

ఆ రాత్రి పన్నెండున్నరకి టైమ్ దొరికింది ఇద్దరికీ మాట్లాడుకుందుకు. అప్పటికే మందు పుచ్చుకుని ఉన్నాడు మనోహర్.

''ఊ... ఇప్పుడు చెప్పు విశేషాలు''

''అపార్ట్‌మెంట్స్‌కి వాటర్ ప్రాబ్లమ్- ఇంతలో సాల్వ్‌అయ్యేది కాదు. టాంకర్స్‌తో ఎంతవరకని నీళ్ళు సప్లై చెయ్యగలరు? తొందర్లో టెనెంట్స్ ఖాళీ చేసి పోవచ్చు''

''ఎలా జరిగిందనుకుంటున్నారు?''

''ఎవరికీ ఏమీ అర్థంకాలేదు''

''ఎవరైనా ఓనర్స్‌ని బ్లేమ్ చేస్తున్నారా?''

''ఊహు... లేదు

అదిసరే... నువ్వు ముఖ్యమంత్రి అవడం ఖాయం అని అందరికీ తెలిసిపోయిందనుకో''

''ఏదో ప్రయత్నం జరుగుతోందంతే!''

''నక్కను తొక్కి పుట్టావనుకో''

''నువ్వు వాళ్ళతోటే వుండాలి! అనవసరంగా అటూ ఇటూ పరుగులు పెట్టకు. శ్రీనివాస్ ప్రతి కదలికా గమనించు. ఆ అపార్ట్‌మెంట్స్ గొడవ ఏమౌతుందో చూడు. దాని సంగతేమిటి అదే... మనో. అది అక్కడ ఎవరెవర్తో మాట్లాడేదీ కావాలి నాకు... విషప్రయోగం ఫెయిలయింది. నిన్ను అనుమానించలేదా?'' మనోహర్ అడిగాడు.

''ఊహు... ఏదో పాలు కల్తీ అనుకుని వుంటారు. అంతే''

మనోహర్ ఆలోచిస్తూ వుండిపోయాడు.

''మనో గురించి నీకేమిటి ఇంట్రస్టు? ఆమెను కనిపెట్టి వుండటమేనా? ఇంకేం చెయ్యోద్దా? నీ మనసులో వున్న మాట సూటిగా చెప్పు''

మనోహర్ పిడికిళ్లు బిగుసుకున్నాయి. కళ్ళు ఎరుపెక్కాయి.

''ఏం చెయ్యాలో ఇంకా నాకే అర్థంకావట్లేదు. చూద్దాం. ఎప్పటికప్పుడు జరిగే విషయాలు నాకు తెలియపరుస్తూండు''

''సరే... నువ్వు ముఖ్యమంత్రివయితే నేను వచ్చి నీతో వుండనా? నీ పి.ఎ.గా''

''అలాగే, చెప్పిన మాట విని చెప్పినట్టు చేస్తే''

''నిజంగా... తప్పకుండా నువ్వెలా చెప్తే




అలా చేస్తాను''

ఇంతలో నరసింహం ఫోన్.

''ఒక్క నిమిషం లైన్లోవుండు'' అంటూ మనో హర్ తన పర్సనల్ బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి కార్డ్‌లెస్ ఫోన్ అందుకున్నాడు. దానికి ముందు డోర్‌లాక్ చెయ్యడం మర్చిపోలేదు. ఎలక్షన్ల గురించి, ఖర్చుల గురించి దాదావు అరగంట విశదంగా మాట్లాడుకున్నాక,

''అపార్ట్‌మెంట్స్ విషయం ఏమైంది. టెక్స్ టైల్ మిల్ అమ్మకం గురించి మీ అన్నయ్యతో మాట్లాడాను. మీకు చెప్పానా?''

''లేదే! ఎప్పుడు?''

''ఓ వారం క్రితం. నా బేరం చాలా తక్కువ. లాభం లేదని అన్నాడు. అతనికి చాలా డబ్బు కావాలి. కష్టాల్లో వున్నట్టు ఏమాత్రం అనిపించ లేదు''

''అలా అనిపించడులే. నీక్కావలసింది నీకిచ్చే బాధ్యత నాది. తొందరపడకు. అది అతనొక్కడి ఆస్థి కాదు. ఇంట్లో అందరూ కన్విన్స్ అవాలి''

''వాళ్ళు అమ్మటానికి ఒప్పుకోట్లేదా?''

''ఒప్పుకుంటారు. ఆ విషయమే చూస్తు న్నా... ఆ విషయం నా కొదిలేయ్''

''నీకే ఒదిలి ఎదురుచూస్తున్నా''

''నువ్వేంటి నేను కూడా'' అనుకున్నాడు మనోహర్ మనసులోనే.వెనకాలంతా గూడుపు ఠానీయే. అన్నీ తెలిసినట్టే వుంటాయి. ఏ ఒక్కటీ సమూలంగా తెలీట్లేదు. మనో మన సులో ఉద్దేశ్యం ఏమిటి? ఎందుకు మాటిమాటి కీ అందర్నీ తనవేపు తిప్పుకోవాలని చూస్తోంది. ఈ నరసింహం ఇలాగ వెనకాల ఇంకేమేం చేస్తున్నాడు?

తండ్రి పోయిన క్షణంనించి దశ తిరిగిపో యినట్టనిపిస్తోంది. నిస్సహాయత, నిస్సత్తువ విషంలా ఒళ్ళంతా పాకుతున్నాయి.

ఎంత హెచ్చరించినా దానికి లెక్కలేదా?

ఆ చక్రవర్తిగాడితో ఊరంతా తిరుగు తుందా?

ఎలా ఇలాగైతే?

★ ★ ★

అది చక్రవర్తి అపార్ట్‌మెంట్.

ఆర్ట్ ఎగ్జిబిషన్‌లా వుంది ఆ ఇల్లు. గోడల మీద అందంగా అమర్చిన పెయింటింగ్స్. ఆశ్చర్యంగా వుంది అతనిలో, అతని కవి హృద యంలో ఇంత ఆర్టిస్ట్ దాగి వున్నాడా?

చాలా మటుకు వెలుగు నీడల్తో దోబూచులా డే చిత్రాలే.

ఆ మాటే అంది మనో.

ఫ్రిజ్‌లోంచి వాటర్ బాటిల్ తీస్తూ-

''వీటిల్లో చాలామటుకు మా పేరెంట్స్ కలెక్ట్ చేసినవే. ఒక పదిశాతం మాత్రం నా కలెక్షన్''

''కళా హృదయం కూడా వంశపారంప ర్యంగా వచ్చిందా మీ ఇంట్లో?''

''అవుననే అనుకోవాలి. చాలామటుకు పె యింటింగ్స్ మా తాతగారు కొన్నవట. అప్పట్లో కళ అని, కళాపోషణ అనీ... అమూల్యమైన చిత్రాలను, కళాఖండాలను కొంటున్నామనీ వాళ్ళు అనుకోలేదట. వాళ్ళకి నచ్చాయి. కొన్నా రు అంతే. బహుశా కళాకారులను చూసి జాలిపడివుంటారు. డబ్బు సంపాదించలేరు. ఆస్థులు సంపాదించలేరు. ఎలాంటి అధికారా న్ని పొందలేరు?''

''కళకంటే ఆస్థులు ముఖ్యం అనుకు న్నారా?'' మనో ప్రశ్నించింది.

''కాదు... కాని డబ్బు అవసరం అనుకుని వుంటారు ఆస్తులు సుఖాన్నిస్తే అధికారం ఉపయోగిస్తుంది. ఓ పక్కన ఉపవాసాల్తో చిక్కి శల్యమౌతూ కళారాధన, కళాహృదయం అన డంలో అర్థంలేదేమో. వాళ్ళు కళాపోషకులు, కళాపోషణ జీవితానికి సంపూర్ణతనిస్తుందని గ్రహించారు. వాళ్లకి డబ్బు సంపాదించటం తెలుసు. సంపాదించిన డబ్బును సద్వినియోగ పరచటం తెలుసు. కళాకారులను గౌర వించటం తెలుసు''

ఓ పక్క అరలు అరలుగా వున్న షోకేసుల్లో వివిధ రకాల శిల్పాలు శిలలతో, చెక్కతో, లోహాలతో.

''ఇలాంటి కలెక్షన్ నేను ఎక్కడా చూడలే దు'' విభ్రాంతితో అంది మనో.

చక్రవర్తి తలూపి.

"వీటిల్లో ప్రతి ఒక్కటీ నాకెంతో నచ్చింది. ఇప్పుడు కాదు చిన్నప్పట్నించీ నా తద నంతరం ఇవన్నీ మ్యూజియమ్‌కి ఇవ్వాలని నిశ్చయించుకున్నాను"

'ఇదెక్కడి కోరిక? ఎవరైనా తమ ఆస్తి తమ తదనంతరం తమ పిల్లలకివ్వాలని అను కుంటారు... బహుశా అలాంటి ఆలోచన లేదేమో...' మనసులోనే అనుకుని ఆ గదంతా తిరిగింది. మళ్ళీ మళ్ళీపరీక్ష చేస్తూ- చూసిన చిత్రాలనే మళ్ళీ మళ్ళీ చూస్తూ.

తరువాత ఇద్దరూ హాల్లోకి వచ్చారు.

"ఈ ఆల్బమ్ చూస్తూండండి... రెండు నిమిషాల్లో కాఫీ తెస్తాను"

యధాలాపంగా ఆల్బమ్ తిరగేసింది.

అతని కలెక్షన్‌లాగే అతని ఫ్రెండ్స్ కూడా చదువుకోని పల్లె జనాలనించీ ప్రపంచ ప్ర ఖ్యాతి పొందిన విదేశీయులవరకూ వున్నారు.

ట్రేలో పొగలు చిమ్ముతున్న కాఫీ కప్స్‌తో వచ్చాడు.

"కాఫీ మీరు చేసారా?"

"అవును... కానీ తాగడానికి ఏం భయపడ క్కర్లేదు"

"మీ కళాభిరుచిలాగే కాఫీ రుచి కూడా..." కాఫీ సిప్‌చేసి అంది.

"నర్లెండి... ఇహ పొగడకండి. ఇల్లు చూ స్తారా... రండి" అతని వెనకాలే వెళ్ళింది. అన్ని గదులు విశాలంగా గాలీ వెలుగులకు నిలయంగా వున్నాయి. అతని బెడ్‌రూమ్‌లో పూరెక్కల్లాంటి ఎడ్జెస్‌తో వున్న రౌండ్ టేబుల్. దానిమీద ఫొటోస్... సిల్వర్ ఫ్రేమ్స్‌లో... అన్నీ ఒక జంటవేలా వున్నాయి.

మనో దగ్గరగా వెళ్ళి చూసింది. ఆ ఫొటో లోని వ్యక్తికీ చక్రవర్తికీ చాలా దగ్గర పోలికలు న్నాయి. ఆవిడ అద్భుత సౌందర్యం జీవంలేని ఫొటోల్లో కూడా సజీవంగా అగుపిస్తోంది.

"మీ తల్లిదండ్రులా?"

"అవును"

"ఈ ఫొటోలు ఎక్కడ తీసారు? వెనకాల వున్న గోడలే పెయింటింగ్స్‌లా వున్నాయి"

"మా తాతగారి ఇంట్లో... మా అమ్మా నాన్నా వుండివుంటే మీరంటే ఇష్టపడేవారనుకుంటా ను. ఎవరి భవిష్యత్తును వాళ్ళు మలచుకునే వాళ్ళంటే ఇద్దరికీ ఇష్టం"

"నా భవిష్యత్తును నేను తీర్చిదిద్దుకున్నా నని మీరనుకుంటున్నారా?" హఠాత్తుగా అడి గింది మనో.

"అనే అనుకుంటున్నాను. మీ జీవితంలో ఏదో వివశత కలిగించేది జరిగివుండాలి... నా జీవితంలో మా అమ్మా నాన్నల మరణంలా... ఆవేదన తట్టుకోలేక మీరు ఇంట్లోంచి వెళ్ళిపో యివుండాలి. మీరు మీజీవితంలో, నేను నా జీవితంలో బాధ పడ్డాము. అడ్జస్ట్ కాలేకపోయా ము. అలాగని... జీవితాలు అక్కడే ఆగిపోలే దు. మీ జీవితాన్ని మీకు నచ్చిన రీతిలో మలచుకున్నారు. ఈరోజు నలుగురూ మిమ్మ ల్ని మెచ్చుకునే స్థితిలో వున్నారు. అది నాకు చాలా నచ్చింది. మీరు నచ్చారు. మా అమ్మా నాన్నా కూడా మిమ్మల్ని మెచ్చుకుని వుండేవా రు. పదండి" ఒక్క నిమిషం కూడా ఎదురు చూడకుండా అతను ముందుకు నడిచాడు. నడుస్తూ మళ్ళీ హఠాత్తుగా పెయింటింగ్స్ గురించి, వాటి కలెక్షన్ గురించి మాట్లాడటం ప్రారంభించాడు.

ఎక్కువ చనువుగా మాట్లాడేశానేమో అనే భయంతో అతనలా తననితాను కవర్‌చేసు కుంటున్నాడేమోననిపించింది. ఒకవేళ తను అప్‌సెట్ అయిందేమోనని అలా దూరంగా వుంచాలని మళ్ళీ పెయింటింగ్స్ గురించి మాట్లాడుతున్నాడా? చిత్రం. అతనలా మాట్లా డినా మనసు ముడుచుకుపోలేదు. అతనిమీద కోపం రాట్లేదు. ఇంకేదయినా తన గురించే మాట్లాడితే బాగుండుననిపిస్తోంది. "కాదు... కాదు... ఒద్దు అతనెందుకు నా గురించి మాట్లా డాలి" వెంటనే అనుకుంది. అతను నా గు రించేం మాట్లాడక్కర్లేదు. ఓ మంచి ఫ్రెండ్ కావాలి అంతే. చక్రవర్తికీ అంతే. అందుకే ఇద్దరూ సరదాగా కాలక్షేపం చెయ్యగలరు.

ఇద్దరూ అతని లైబ్రరీలో కూర్చున్నారు. ఎక్కడ చూసినా పుస్తకాలే.

"ఇఫ్ యు డోంట్ మైండ్... డిన్నర్‌కి




బయటకు వెళ్దాం'' టేబుల్ మీద మాగజైన్స్ చూస్తున్న మనో ఉలిక్కిపడింది.

''మీకు అభ్యంతరం లేకపోతేనే మోహితా'' లేచి వెళ్ళి డెక్ ఆన్ చేసినట్టున్నాడు. సన్నగా మ్యూజిక్ వినబడుతోంది. బహుశా అతనికిష్టమైన గదేమో ఇది అనిపించిందామెకి.

''మీ హాస్పిటల్ గురించి, మీ ఆపరేషన్స్ గురించి ఏమైనా చెప్పండి మోహితా... ఇన్నేళ్ళ తరువాత ప్రతి మనిషి గుండె ఒకలాగే కనిపిస్తుందేమో...'' ఒక ప్లేట్లో ఆలూ చిప్స్ తెచ్చి ముందు టీపాయ్ మీదుంచుతూ అడిగాడు.

''మీ ఈజిప్ట్ ఫరక్‌లలా... మ్యూజియంలలా మాత్రం కాదులెండి'' మనో నవ్వింది.

చిప్స్ తింటూ ఇంట్రస్టింగ్ కేసెస్ గురించి వివరించింది. అసలు పేర్లు చెప్పకుండా వివరాలను చెప్తూ- మెడికల్ చరిత్రకి అందని కేస్‌లు. చిన్న మస్క్యులర్ పెయిన్‌కే హార్ట్‌ఎటాక్ అని హడావిడి చేసే లేడీస్ గురించి. మాసివ్ హార్ట్‌ఎటాక్ వచ్చినా నవ్వుతూ మాట్లాడే స్థితప్రజ్ఞుల గురించీ. ఉదాహరణలతో సహా వివరించింది.

''వీళ్ళందరినీ చూస్తే మీకేమనిపిస్తుంది?''

''మనిషిగానా? డాక్టర్‌గానా?''

''మనిషిగా''

''మనిషిగా ఆలోచిస్తే ఎంత తేడా మనిషికీ మనిషికీ అనిపిస్తుంది. డాక్టర్‌గా ఆలోచిస్తే శరీరంలో ఏ పదార్థం మనిషిలో ఈ తేడాని సృష్టిస్తుందా అనిపిస్తుంది. డాక్టర్స్ దేవుళ్ళనీ మృత్యుముఖంనించి రోగులని వెనక్కు తేగలరనీ అనుకుంటారు. కానీ ఆలోచిస్తుంటే మా చేతుల్లో ఏంలేదనిపిస్తుంది. ఎంతో బాగా కోలుకునే పేషంట్ సడెన్‌గా కొలాప్సయి పోతాడు. లాభం లేదనుకున్న వాళ్ళు ఆశ్చర్యపోయేలా కోలుకుంటారు. ఈ భావాలన్నీ పైకి వ్యక్తం చెయ్యలేం. మేం ఏం మాట్లాడినా కోడి గుడ్డుకే ఈకలు లాగినట్టు మాట్లాడతారు.

మీరు అదృష్టవంతులు. మీ క్లయింట్స్ వేల సంవత్సరాల క్రిందట పోయిన వాళ్ళు. వాళ్ళ తరఫున మీరేం మాట్లాడినా నోరు మెదపరు. ఖండించరు. కాదనరు''

''మీరనుకుంటున్నంత అదృష్టవంతులం కాదు, పేషంట్ల ప్రవర్తన మీలో సంతోష విచారాల్ను కలిగించగలదు. కానీ మాకేం వుంది. నిశ్శబ్దం ఏవైపు కదులుదామన్నా. పెట్టని గోడలా అడ్డుపడే నిశ్శబ్దం''

ఇద్దరూ నవ్వుకున్నారు. ఏసీ హమ్మింగ్ వినిపిస్తోంది. చల్లదనం ప్రశాంతతలా ఆమెను అలుముకుంది. జీవితంలో మొదటిసారిగా మనసులో ఏదో నిశ్చింత.

''డిన్నర్‌కి బయటకే వెళ్ళాలా? నాకు ఇక్కడే బాగుంది''

''మీకు నా వంట తినగల ధైర్యముంటే ఇక్కడే ట్రైచేస్తాను. అఫ్‌కోర్స్ మీరేదైనా సాయం చేస్తే కాదనను'' తలెత్తి ఆమెవంక చూసాడు. కొంచెం నవ్వుతున్నట్టుగా విచ్చుకున్న పెదవులు, గులాబీలు కలబోసిన చెక్కిళ్ళ రంగు.

''మీలాగే నాకూ బయటకు వెళ్ళడం నచ్చదు. ఈ లైబ్రరీ నా ఫేవరెట్ డైనింగ్ రూం...''

''నాకూ ఏదో కాస్త వంటనేది వచ్చులెండి. ఏం చెద్దాం చెప్పండి''

''ఇంకో డోస్ కాఫీ తాగుదాం. వంట ప్రారంభానికి ముందు'' అంటూ లేచాడు.

మనో అక్కడే కూర్చుంది.

ఒంటరిగా ఉండేసరికి తన అపార్ట్‌మెంట్ గుర్తొచ్చిందామెకి. మామూలుగా ఎప్పుడైనా సాయంత్రాలు ఇంట్లో వుంటే ఏవో పాటలు వినడం లేదా ఒక్కదానికోసం వంటెందుకని బద్ధకించి ఏ పాలో త్రాగటం ఆపైన ఏదో ఒక నవల చదవటం, లేకపోతే ఏదో ఫిల్మ్‌చూసి నిద్రపోవటం, ఆ రొటీన్ తప్ప మరో పద్ధతికి తను అడ్జస్ట్ కాలేనని అనుకుంది చాలాసార్లు. కాని ఇప్పుడిలా ఇతనితో కాలక్షేపం కూడా బాగానే వుంది, మనసు ప్రశాంతంగా మరో ఆలోచన అనేది లేకుండా...

ఆలోచించాలి, మనుమలకి దూరంగా వుండి పొరబాటు చేసానేమో...

ఇప్పుడేనా... ఈ క్షణమే ఆలోచించాలా?

★ ★ ★

ఉదయం లేస్తూనే అపార్ట్‌మెంట్స్‌వైపు వెళ్ళాడు శ్రీనివాస్.

ఆశ్చర్యం...! ఎప్పుడు స్విచ్ ఆన్‌చేసినా నీళ్ళు మురికిగానే వస్తున్నాయి. ఎందుకు? ఎందుకిలా జరుగుతోంది. ఇన్నేళ్ళుగా లేనిది... పోనీ బోర్‌వెల్ ఎండిపోయిందా అడుగున బురదనీరు రావడానికి? లేదే నీళ్ళు వస్తూనేవున్నాయి. ఒకవేళ... ఒకవేళ... ఏ దేవతలైనా ఆగ్రహించారా? దాదావు రెండువందల గజాల అడుగున వున్న నీళ్ళలోంచి ఎముకలు మాంసంలాంటివి ఎలా వస్తున్నాయి?

పోనీ భూగర్భంలో మిగిలిపోయిన శకలాలా అనుకుందుకు ఊహూ... మనసొప్పుటంలేదు. పది అడుగులు దాటకమునుపే రాయి మొదలైందనీ, రాళ్ళలో నీళ్ళు గనక, స్వచ్ఛంగా వుంటాయనీ చాలాసార్లు చెప్పారు తాతగారు.

అన్యమనస్కంగానే బోర్‌వెల్ రూమ్‌వైపు అడుగులువేస్తున్న శ్రీనివాస్ ఓరగా తీసివున్న తలుపు చూసి ఆశ్చర్యపోయాడు. ఇంకా తెల్లవారనేలేదు. ఇంత ఉదయాన్నే శ్రీనాథ్ వచ్చాడా? మరో అడుగు ముందుకు వేసేలోగానే శ్రీనాథ్ గబగబా బయటకు వచ్చి హడావిడిగా రూమ్ వేసేశాడు. విజిల్ వేస్తూ తాళం వేశాడు గదికి. తాళంచెవి పాంట్‌జేబులో వేసుకుంటూ వెనక్కు తిరిగి ఆశ్చర్యపోయాడు. కొంచెం కంగారుపడినట్టుగా కూడా అనిపించింది శ్రీనివాస్‌కి. ఇద్దరూ మాట్లాడలేదు. ఒకళ్ళనొకళ్ళు చూసుకున్నారు. ఇద్దరి చూపుల్లోనూ అపనమ్మకం, ఒకరిమీద మరొకరికి అనుమానం.

చటుక్కున పాల పాకెట్ల సంగతి, సయినైడ్ విషయం గురించి జ్ఞాపకం వచ్చింది శ్రీనివాస్‌కి. పిడికిళ్ళు బిగుసుకున్నాయి. అయినా ఎంతో బలవంతాన కోపం అపుకున్నాడు.

"నీళ్ళ ప్రాబ్లమ్ అటగా... నిన్న రాత్రి వచ్చినప్పుడు అపార్ట్‌మెంట్స్‌వాళ్ళు చెప్తేకాని నాకు తెలియలేదు. ప్రతివాళ్ళూ ఆ విషయమే మాట్లాడుకుంటున్నారు. నాకేవిషయం తెలీంది?"

"అందరూ ఆ విషయంలోనే తలమునకలై వున్నారు. ఎందుకిలా జరుగుతోందన్న బాధ. నీకు చెప్పాలన్న విషయమే గుర్తులేదు"

"నాకూ కాస్త బాధ్యత వుందని మీకు తెలుసుగా? ఓమాట నా చెవిన వేస్తే తప్పేమిటి? బయటవాళ్ళందరి ముందూ తెల్లమొహం వెయ్యాల్సివచ్చింది" నిష్ఠూరంగా వుందతని స్వరం. శ్రీనివాస్ అతన్ని పరిశీలనగా చూశాడు.

ఇదివరకు చిందరవందరగా వుండే జుట్టు నీట్‌గా నూనెరాసి, దువ్వివుంది. గడ్డం నున్నగా గీసుకుని ట్రిమ్‌గా తయారయ్యాడు. అయిరన్ చేసిన బట్టలు, చూడటానికి బాగానే వున్నా తన మనసుకెందుకు నచ్చట్లేదో శ్రీనివాస్‌కి అర్థంకాలేదు. ఈలోగా ఒకటి రెండు అపార్ట్‌మెంట్లలోవాళ్ళు లేచివచ్చి నీళ్ళగురించి అడిగారు.

"ఏమైందండీ? ఇవాళైనా బోర్ బాగయ్యే అవకాశం వుందా?"

"ఆ విషయమే చూస్తున్నాం" ఎటూ తేల్చకుండా చెప్పాడు శ్రీనివాస్.

నిజానికి ఆ క్రితంరోజు సాయంత్రమే అయిదారుగుర్ని అడిగిచూశాడు. ఏ ఒక్కళ్ళూ సరైన కారణం చెప్పలేకపోతున్నారు. అందరూ భయాన్ని వ్యక్తంచేసేవాళ్ళే. నీళ్ళు వాసన, ఎముకలు, మాంసం తునకలు రావడమా? అది మూసేసి ఇంకో బోర్ వేయమనేవాళ్ళే ఎక్కువమంది. ఇంకోబోరు అంటే మాటలా? రోజూ టాంకర్లతో వాటర్ సప్లై కూడా అంత సులభంకాదు. దేవతలు అలిగారా? కోపగించుకున్నారా? మనసులో సంకోచాలు మనుమలను మార్చేస్తాయా? ఏం జరుగుతోంది? మనుమల మీద హత్యాప్రయత్నం, మూగవైన మెషీన్ల మీద? అన్నీ ఒకేసారి రావాలా? ఎవరైనా కావాలని... ఆ ఆలోచనకే అతని మనసు నొచ్చుకుంది. అన్నీ అనుకుందుకు ఎన్ని బాధలు గనుక? తాతగారు పోవడం సర్వసాధారణ విషయం. వయసొచ్చాక అదీ తొంభైదాటాక ఎన్నేళ్ళుండాలని ఎదురుచూస్తాం? టెక్స్‌టైల్ ఇండస్ట్రీలో ప్రాజెక్ట్ అయిదేళ్ళుగా సాగుతూవున్నదే. కొత్తగా వచ్చినది కాదు. విషప్రయోగం! కావాలని ఎవరో ఏ ప్రయోజనాన్ని ఆశించి... అలా చేశారో?

"ఈ వార్త బయటకు పొక్కకుండా జాగ్రత్త





పడాలి మనం. ఎవరికైనా తెలిసిందే...'' శ్రీనివాస్ మొహం చూసి ఆగిపోయాడతను.

''నువ్వు ఇప్పుడే పరీక్షించావుగా లోపల... ఏదైనా కారణం దొరికిందా?''

''ఊహూ... అంతా మామూలే''

''చూద్దాం... ఏమైనా రిపేర్ చేయించగలమేమో''

''రిపేరా? మోటార్ మెకానిక్‌ని అడిగాను. మోటార్ మంచి వర్కింగ్ కండిషన్‌లోనే వుంది. ప్రాబ్లమంతా నీళ్ళతోటే అని చెప్పున్నాడు''

పొరబాటు చేశానేమో! చక్రవర్తినో మాట అడిగి వుండాల్సింది. ఏదైనా పరిష్కారం దొరికి వుండేది. అతనితో చెప్పడానికి మొహమాటపడి... అతని ఆలోచనలు అలా సాగుతూనే వున్నాయి.

★ ★ ★

''హలో డాక్టర్ మోహిత''

''చక్రవర్తిని''

''ఓహ్... మీరా? ఎక్కణ్ణించి? హైదరాబాదా?''

''కాదు... వైజాగ్‌నించే...''

''ఇక్కణ్నించేనా? ఎప్పుడు వచ్చారు? ఏదైనా పనిమీదా?''

''ఓ గంటక్రితం వచ్చాను ప్లేన్‌లో. మీరు ఆపరేషన్ థియేటర్లో వున్నారని గంటాగి ఫోన్ చెయ్యమంటే... పనిమీద వచ్చానా అని అడిగారుకదూ... అవును పనిమీదే... మిమ్మల్నొకసారి చూసివెళ్దామని''

ముందు ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళి అతన్ని కలిసి మాట్లాడి పంపించేద్దామా అనుకుంది. అంతలోనే మనసు మార్చుకుని ''ఓ పదినిమిషాల్లో ఇంటికి వచ్చేస్తాను. అక్కడికి అపార్ట్‌మెంట్స్ దగ్గరేగా. సిటవుట్‌లో సోఫాలున్నాయి. వెయిట్ చేస్తారా?'' అంతవరకూ ఆమె తన అపార్ట్‌మెంట్‌కి ఎప్పుడూ ఎవర్నీ ఇన్‌వైట్ చెయ్యలేదు. పదిరోజులకిందట చక్రవర్తి వైజాగ్ వచ్చినప్పుడు బీచ్‌లో రాత్రివరకూ కబుర్లాడుకుని, డాల్ఫిన్స్‌లో డిన్నర్ తీసుకున్నాక టాక్సీలో మోహితను డ్రాప్‌చేసినా పైకి రమ్మని పిలవలేదతన్ని. ఇప్పుడుమాత్రం ఏ ఇంపల్స్ అతన్ని ఆహ్వానించేలా చేసిందో ఆమెకే అర్థంకాలేదు.

మరింక ఒక్కక్షణం కూడా వెయిట్ చెయ్యలేదు. ఆటో పిలిచి అయిదు నిమిషాల్లో అపార్ట్‌మెంట్ చేరుకుంది. ఇంకా అతను రాలేదు. లోపలకు వెళ్ళి ఫిల్టర్‌లో కాఫీపౌడర్ వేసి వేణ్ణీళ్ళు కాచి పోస్తూంటే డోర్‌బెల్ వినిపించింది. తలుపు తీసి

''రండి... లేటయిందా? కాఫీ రెడీగా వుంది రండి...''

హాల్లో కూర్చున్నాడు చక్రవర్తి. చాలా పెద్ద హాల్. అందులోనే ఒక ఉడెన్ పార్టిషన్, డైనింగ్ టేబుల్ చెయిర్స్‌ని వేరుచేస్తూ. ఎక్కడ చూసినా తెల్లటి తెలుపు. వైట్ సిమెంట్‌తో మెరుస్తున్న గోడలు, వైట్ కర్టెన్స్, వైట్ కార్పెట్, చివరికి సోఫా రెక్సిన్ కవర్స్ కూడా తెల్లటివే.

గోడలమీద పెయింటింగ్స్ అన్నీ మోడరన్ పెయింటింగ్సే. ట్రేలో కాఫీ కప్స్ తీసుకువచ్చింది మనో.

''మీ అంత బాగా చెయ్యగలనో లేదో, టేస్ట్ చేసి చూడండి''

''మీరు నాకోసం కాఫీ చెయ్యడమే ఎక్కువ'' కాఫీ అందుకుంటూ అన్నాడు.

''ఏమిటంత హఠాత్తుగా బయల్దేరారు? వస్తున్నానని కనీసం ఫోన్ అయినా చెయ్యలేదేం? నేను బిజీగా వుంటే మీకు ఇబ్బంది కదా!'' మనో అడిగింది.

''నిజం చెప్పమంటారా? ఈరోజే లెటర్ ఒకటి వచ్చింది ఈజిప్ట్‌నుంచి. నెక్స్ట్‌వీక్ వెళ్ళాలి. ఎప్పుడూ లేనిది ఈసారి ఒక్కడినీ వెళ్ళాలంటే విసుగ్గా వుంది. హఠాత్తుగా ఓ ఆలోచన వచ్చింది. ఆ ఆలోచన మీతో పంచుకుందామనిపించి...''

''చెప్పండి''

''మీరు కూడా నాతోపాటు ఈజిప్ట్ వస్తే...''

వెంటనే ఏం చెప్పలేకపోయింది మనో. అలాంటి ఆహ్వానం, అతనివైపునించి ఎదురు చూడనిది.

''వీసా, పాస్‌పోర్ట్‌ల సంగతి నాకొదిలెయ్యండి. ముందు మీ అభిప్రాయం చెప్పండి'' అన్న అతడి మాటలకి అడ్డువస్తూ,

''మొహం కడుక్కుంటారా? డిన్నర్‌కి బయటకు వెళ్దామా?''

ఆలోచించుకుందుకు సమయం కావాలన్నట్టుగా అడిగింది మనో.

''నాకూ మీలాగే బయటికి వెళ్ళడం పెద్దగా నచ్చదు'' క్షణం ఆగి, ''మీరు హాస్పిటల్లో చాలా అలసిపోయారా? లేదంటే డిన్నర్ ఇంట్లోనే చేద్దాం. మీ కుకింగ్‌లో నేను హెల్ప్‌చేస్తానులెండి''

నవ్వింది మనో.

''రండి... ఇల్లు చూద్దురుగాని''

హాల్లోంచి ఓ చిన్నదారి, ఓవక్కన వంటగది, మరోవక్క బెడ్‌రూమ్. ప్రశాంతంగా వున్న గది. బెడ్‌పక్కనే ఫోన్. మరోపక్క బుక్‌రాక్. ఆ వెనకే మరో గది, బహుశా ఎక్కువ వాడినట్టులేదు.

''చాలా చిన్న అపార్ట్‌మెంట్. మీకు తెలుసా? ఈ ఇంటికి వచ్చిన మొట్టమొదటి అతిథి మీరు. సోనీని కూడా పిలవాలన్న ఆలోచనే రాలేదు నాకు''

గదులన్నీ పరిశీలించినా ఒక్క ఫొటో కూడా కనిపించలేదు ఎక్కడా.

''మీ ఇల్లు ఓ అద్భుత చిత్రంలా వుంది'' ప్రశంసిస్తున్నట్టు అన్నాడు చక్రవర్తి.

''సాహిత్యం అంటే ఆసక్తా చాలా పుస్తకాలు వున్నాయి'' యధాలాపంగా ఒకటిరెండు పుస్తకాలు తిరగేశాడు.

అంతలో డోర్‌బెల్.

''ఒక్క నిముషం'' మనో అతన్నక్కడే వుంచి గబగబా తలుపువైపు వెళ్ళింది.

ఎవరివో మాటలు వినిపిస్తున్నాయి. అంతలోనే ఫోన్ శబ్దం. తప్పదన్నట్టుగా ఫోన్ తీశాడు చక్రవర్తి.

''హలో మనో... సోనీని''

''మనో'' అంటే... జవాబివ్వకుండానే ఫోన్ పక్కనుంచి హాల్లోకి నడిచాడు. అప్పుడే డోర్ లాక్‌చేసి వస్తోందామె.

''మీకు ఫోన్. నేను జవాబివ్వలేదు. సోనీనించి''

మళ్ళీ పరుగెడుతున్నట్టుగా బెడ్‌రూమ్‌లోకి వెళ్ళింది మనో.

చక్రవర్తి హాల్లోనే ఆగిపోయాడు. ఆ గది కూడా ఓ పెయింటింగ్‌లా అలంకరించిన స్టేజ్‌లా ఎక్కడి పుస్తకాలక్కడ, న్యూస్‌పేపర్ చక్కగా పొందికగా పేపర్‌వెయిట్‌కింద, ఎక్కడా ఓ మచ్చకూడా అగుపించని పూర్ణ చంద్రబింబంలా ఆ గది...

అయినా ఇల్లంతా అనస్థీషియా ఇచ్చినట్టుగా చైతన్యరహితంగా, మత్తులో వున్న అనుభూతి. ఒక్క భావనాతరంగంకూడా ఎక్కడా ప్రవహిస్తున్న అలికిడిలేదు. బెడ్‌రూమ్‌లోంచి బయటకు వస్తూ అతనివంక చూసింది మనో.

ఆమె మొహం మారిపోయింది. ఆ మొహంలో కాస్త అయోమయం. కాస్త ఆలోచనాముద్ర. అతని కళ్ళతో ఆమె తన ఇంటిని మొదటిసారిగా చూసుకుందా అనిపించింది. అతనికి ఒక్కసారి తన అపార్ట్‌మెంట్ గుర్తుకువచ్చింది. ఓ మ్యూజియంలా ఎక్కడ చూసినా ఏదో ఒక షోపీస్. తన అపార్ట్‌మెంట్ ఆమె ఏమనుకుని వుంటుందా అన్న ఆలోచన మొదటిసారి వచ్చిందతనికి.

''సోనీ... అక్కడి ప్రాబ్లమ్స్ ఎలా సాల్వ్ చెయ్యాలో తెలీట్లేదట''

''ప్రాబ్లమ్సా?'' ఆశ్చర్యంగా వుందతని స్వరం.

''శ్రీనివాస్ చెప్పలేదా మీకు''

''లేదే!''

''నేనక్కడ వున్నప్పుడే మొదలైంది వాటర్ ప్రాబ్లమ్. అపార్ట్‌మెంట్స్‌లో, డైరీ మిల్క్ పాకెట్స్‌లో సయినైడ్ విషం, ఇలాంటివే... ఆలోచిద్దాం... ఇంతకీ మీకేం ఇష్టమో చెప్పండి. డిన్నర్ ప్రిపేర్‌చేద్దాం''

''మీరు మీ స్వహస్తాలతో ఏది వండినా నాకు ఇష్టమే. కాని ఓ మాట. లేడీ ఆర్టిస్ట్‌లంటే ఎంత ప్రేమ ఉంటేమాత్రం కనీసం పికాసోకో, హుస్సేన్‌కో కూడా మీ గోడలమీద చోటులేకపోయిందా?''

మనో అతనివంక ఆశ్చర్యంగా చూసింది.

''ఈ ఆర్టిస్ట్‌లని గుర్తించారా? వీళ్ళగురించి ఎవరూ పెద్దగా వినకపోవచ్చు. అంత పేరుప్ర





ఖ్యాతులున్నవాళ్ళు కాదు''

''నిజం చెప్పనా? నా ఫ్రెండ్ ఒకావిడకి లేడీ ఆర్టిస్టలంటే చాలా ఆసక్తి. ఆవిడే చాలా బుక్స్ ఇచ్చింది చదవమని. ఆవిడ మ్యూజియమ్స్ అసోసియేషన్ బోర్డ్ మెంబర్. ఈజిప్షియన్ సమాధుల్లో కొన్నయినా లేడీస్ డిజైన్ చేసివుంటారని ఆవిడ ఊహ. ఇంతవరకూ ఎలాంటి సాక్ష్యం, ఆధారం దొరకలేదనుకోండి!'' ఓ క్షణం ఆగి

''ఇప్పుడు చెప్పండి. ఎందుకు అన్నీ లేడీ ఆర్టిస్టల పెయింటింగ్స్ కలెక్ట్ చేశారు?''

''లేడీ ఆర్టిస్టలంటేనే ఇంట్రస్ట్ నాకు. మీ ఫ్రెండ్ గురించి చెప్పారుగా. అలాగ. వాళ్ళ పెయింటింగ్స్ నచ్చాయి నాకు. చూడండి. వాటిల్లో ఎంత తీవ్రత దాగివుందో? ఆ తీవ్రతలో ఎన్ని అర్థాలు పొంచివున్నాయో! పొరలు పొరలుగా తెరలు తెరలుగా ఎంత భావం ఇమిడి వుందో. ఒక్కో చిత్రంమీద ఓ పుస్తకం రాయచ్చు.

''ఇహ పికాసో, హుస్సేన్‌ల కలెక్షన్లకి మీలాంటివాళ్ళున్నారుగా''

''మగ ఆర్టిస్టుల పెయింటింగ్స్‌లో అంత తీవ్రత లేదా?''

''ఉండొచ్చు. కాని... ఇలాంటిది కాదు''

''తేడా ఏమిటి?''

''శక్తి... సాధారణంగా మేల్ ఇగో అది. బలవంతులైనా కాకపోయినా మేం గొప్ప అనుకుంటారు ప్రతివాళ్ళూ. కానీ లేడీస్ అలాకాదు. అబలలం అని అందరూ ఒప్పుకుంటారు''

అతని కళ్ళు చిన్నవయ్యాయి. తలపైకెత్తి

''అబలలం అనుకునేవాళ్ళల్లో తీవ్రత మీకు నచ్చిందా?''

''కాదు... బలవంతుల డామినేషన్‌నించి స్వేచ్ఛ పొందే తీవ్రత నాకు నచ్చింది''

''మీరు నమ్మినా నమ్మకపోయినా మగవాళ్ళకు బలవంతులైనా బలహీనులైనా ఉన్న బలం ఎలా ఉపయోగించాలో బాగా తెలును.''

'అవును. స్త్రీలకంటే బలవంతులు, ఆ బలం అబలలమీద చూపటం వాళ్ళ జన్మహక్కనుకుంటారు. సంఘర్షణ, ఓ అంతంలేని సంఘర్షణ. తరువాత స్వేచ్ఛ ఎంత మధురంగా వుంటుంది?'' అంది మనో

''ఇంతకీ మీరు ఈజిప్ట్ వస్తారా? మీ నిర్ణయం చెబితే రాత్రి పదింటికి ప్లేన్ వుంది''

''రాత్రే వెళ్ళిపోవాలా? ఉదయం వెళ్దురుగాని. ఈజిప్ట్ గురించి నేను నిర్ణయించుకోలేకపోతున్నాను. మీరు రమ్మంటే వస్తాను''

''రమ్మనేకద ఇక్కడికి వచ్చి...''

ఆమె ఒంటినుంచి వాడిన సబ్బు తాలూకు సుగంధం అతన్ని ఉక్కిరిబిక్కిరి చేసేంత దగ్గరగా వున్నా ఇదివరలో ఏ స్త్రీ వుండనంత దూరంలో వుంది మనో.

''అయితే రెండు టికెట్స్ బుక్‌చేస్తాను. రేపు వెళ్ళగానే ఆ పని చూడాలి. పోనీ ఈ రాత్రికే వెళ్ళిపోనా?''

భావోద్రేకాన్ని అదుపులో పెట్టుకుంటూ

''ఊహూ! రేపు ఉదయం వెళ్దురుగాని'' అంది మనో వెంటనే.

★ ★ ★

శనివారం ప్లేన్ దిగుతూనే ఎదురుగా వస్తున్న సుందరాన్ని సులభంగానే గుర్తుపట్టింది మనో. దగ్గరకు రాగానే చేతులు చాచి ఆహ్వానించి చెక్కిళ్ళు నిమురుతూ, ''నువ్వు నన్ను చూడాలని రాకపోయినా నేనే నిన్ను వెదుక్కుంటూ వచ్చాను'' నిష్ఠూరంగా అన్నాడు.

''చాలా సంతోషం. ఎన్నేళ్ళకి మళ్ళీ చూడగలిగాను!'' మనో ముందుకి నడుస్తూ అంది.

మనోహర్‌లాగే అతను కొంచెం పొట్టి. కాస్త లావు కూడా. అందుకే మనిషి గుండ్రంగా వున్నట్టనిపిస్తాడు. మొహంలో చెరగని చిరునవ్వు ముద్ర, పచ్చటి పసిమిఛాయ. మాట్లాడినప్పుడల్లా కదిలే మీసాలు, తెల్లటి పత్తికాయల్లా.

''మనో! ఇన్నేళ్ళూ మా అందరినీ ఒదిలి ఎలా ఉండగలిగావ్? మేమెవరం జ్ఞాపకం రాలేదా?''

''ఎందుకు రాలేదు? ప్రతిక్షణం గుర్తొచ్చేవాళ్ళు. ముఖ్యంగా మీరు చాలాసార్లు గుర్తొచ్చేవారు. ఒక్కోసారి ఎంతో విచారంగా ఉండే మీరు కళ్ళముందు కదిలేవారు. ఎలావున్నారో అని అనుకునేదాన్ని''

''ఆ విచారాలూ, సంతోషాలూ ఎప్పటికీ

వుండేవేలే. ఒకటికాపోతే మరొకటి. అయినా నేనెప్పుడూ వాటి గురించి మాట్లాడలేదే? మాట్లాడానా?''

''లేదు... ఒక్కోసారి అలా అనిపించేవా రంతే''

''అవునా? నన్నంతగా గమనించేదానవన్న మాట. నిజమే... ఎంత మర్చిపోదామన్నా నీడలా వెన్నాడే గతం నన్నలా కనిపించేలా చేసివుండాలి. జీవితం నన్ను వెలివేసినట్టుగా అనుకునేవాడిని. సరేలే... నా సంగతికేంగాని, నీ విషయం చెప్పు. ఏమిటింకా పెళ్ళి చేసుకోలే దట? నచ్చినవాళ్ళు దొరకలేదా?''

''కావచ్చు. మీ గురించి చెప్పండి? ఏంచేస్తు న్నారు?''

సుందరం నవ్వాడు. ''వాళ్ళందరూ నీగు రించి చెప్పింది అక్షరాలా నిజం. నీగురించి నువ్వు మాట్లాడవు. ఎవరైనా అడిగినా మాట మారుస్తావు. నేనందరిలాంటివాడిని కాదు. నా గురించి నన్నడక్కు. ముందు నీగురించి చె ప్పు. ఎలావుంది జీవితం?''

''మామూలుగానే''

''నిజమా? తృప్తిగా బతుకుతున్నావా?''

''మరీ అంతగా అడిగితే ఏం చెప్పను? నేనెప్పుడూ లోతుగా ఆలోచించలేదు. నాకంత టైమ్ దొరకదు. అయినా ఆలోచించి ఏం లాభం? నేను తృప్తిగా లేకపోతే దాని గురించి బాధపడి లాభంలేదు. ఒకవేళ తృప్తిగా బతు కుతుంటే ఆలోచించాల్సిన అవసరమేలేదు. అయినా ఇంతవరకూ ఎవరూ నన్ను మీలా అడగలేదు మనవాళ్ళెవరూ...''

''ఏం? ఎందుకని? నాలాగే వాళ్ళకీ అని పించి ఉండొచ్చుగా?''

''అనిపించినా అడగడానికి భయపడి వుంటారు. ఏమైనా అడిగితే మళ్ళీ మనోహర్ ప్రసక్తి రావచ్చని వెనకాడివుంటారు''

రెండుక్షణాల నిశ్శబ్దం.

''అతని విషయం మాట్లాడాలనుందా నీకు?'' సుందరం ప్రశ్న.

''ఊహూ! అతని గురించి మాట్లాడకూడ దని నిశ్చయించుకున్నాను''

నెమ్మదిగా తల ఊపాడాయన.

''మనో! నా ఉద్దేశాలు ఎప్పుడూ బయటకు వ్యక్తంచెయ్యలేదు. అయినా మనసులోమాత్రం అనుకుంటూ వుండేవాడిని. ఉమ్మడి కుటుంబాలన్నాక ఏవో సమస్యలు. సామరస్యా లు లేకపోవడం మామూలేననుకో. కానీ మనంమాత్రం మరొకరికి ఆదర్శప్రాయంగా వున్నాం అనుకునేవాడిని. మనం అందరం ఒకళ్ళనొకళ్ళు అర్థంచేసుకున్నవాళ్ళం, సంస్కారవంతులం. అందుకే ఎలాంటి గొడవ లూ లేవనుకున్నాను. ఒక్కసారి నువ్వు ప్రక టించిన నిజం, గరళంకంటే చేదైన నిజం జీర్ణించుకోలేకపోయాం. అది నిన్ను నమ్మకపో వటంకాదు. నువ్వు అబద్ధాలు చెప్పవని నాకు తెలుసు. నువ్వు చెప్పింది విన్నాక ఏం చె య్యాలో తెలీని అయోమయంలో పడిపోయాం. ఆ విషయాలన్నీ నీకు ఇష్టంలేదని తెలిసీ పైకి లాగానుకదూ... సారీ. కానీ మనసులో మాట చెప్పందే మా ఉద్దేశాలు నీకెలా తెలియాలి?''

''థాంక్స్'' ఆమె గొంతు ఒణికింది. బయట వేడిగా వున్నా ఆమెలో ఒణుకు. మళ్ళీ ఆ పాత జీవితంలోకి వెళ్ళిన అనుభూతి. తల పైకెత్తి దూరానికి దృష్టి సారించింది. దూరంగా ఆకాశా న్ని కప్పేసిన చెట్ల కొనలు. ఆ కొనల్ని స్పర్శిస్తు న్నట్టుగా ఆమె చూపు. ఊపిరాడక ఉక్కిరిబి క్కిరి అవుతున్న భావన. చిన్నగా ఆయాసం.

''ఆయాసంగా వుందా? గుండెనిండా గాలి పీల్చి వదలండి. నెమ్మదిగా ఆయాసం తగ్గు తుంది''

'ఎవరిదా సలహా!'

''ఏదైతేనేం మళ్ళీ తిరిగి వచ్చావు. అదే పదివేలు. మా అందరికీ ఇష్టమైనదది. ఇంతకీ చెప్పదలుచుకున్నదేమిటంటే గతాన్ని తుడిచె య్యలేం. ఒక్కటే ఇహ. మమ్మల్ని కాస్త అర్థంచే సుకో. వీలైతే క్షమించు. ఈ మాటే ఇరవైఏళ్ళ కిందట నువ్వు వెళ్ళకపోయినా చెప్పేవాళ్ళం. జరిగింది జరిగిపోయింది. ఇహపైన మనందరం ఒకటే. నీ ఉద్దేశ్యం కూడా అదేక దూ!''

మనో తలూపింది. ''ఎంత బాగా చెప్పా రు!'' మెచ్చుకోకుండా ఉండలేకపోయింది.





"ఈ విషయాలకేంగాని. జీవితంలో ఓ పెద్ద డాక్టర్‌వైనంతమాత్రాన సరిపోతుందా? పెళ్ళి సంగతేమిటి?"

"ఇంకా ఆలోచించలేదు. ఆలోచించాలి"

"ఇంకెప్పుడు?"

"తొందర్లోనే" ఆమె మనసులో చక్రవర్తి మెదిలాడు. హఠాత్తుగా ఆగిపోయారు సుందరం.

"ఏం ఆగిపోయారు?"

"మరింక వస్తాను... నేను..."

"ఇంటికి రారా?"

"ఊహూ... పనుంది మళ్ళీ కలుద్దాం"

వడివడిగా నడిచిపోతున్న ఆయనవంక చూస్తూ నిల్చుండిపోయింది కాసేపు.

'ఆలోచనాపద్ధతికీ, చదువుకీ, సంస్కారానికీ ఏం సంబంధంలేదేమో!' ననిపించిందామెకి.



మనో ఇంటిముందు ఆటోదిగేసరికి శ్రీనివాస్, సోనీ ఎదురువచ్చారు.

"ఏమైంది? వాటర్‌ప్రాబ్లమ్ సాల్వయిందా?"

"ఊహూ... కారణం తెలీదు. ఏంచెయ్యాలో అర్థంకాల్లేదు"

"కాని ఎలా? చక్రవర్తి వస్తాడుగా ఇవాళ... అడగాలి!"

"డాడీ... నీళ్ళలా ఎందుకొస్తున్నాయో నాకు తెలుసు. చెప్పనా?" హఠాత్తుగా హరిత సంభాషణలో తల దూరుస్తూ అడిగింది.

మనో బ్రీఫ్‌కేస్, సూట్‌కేస్ తీసుకుని లోపలకు నడుస్తూ "చెప్పమ్మా... మాకేం తెలీక తలలు బాదుకుంటున్నాం" అంది.

శ్రీనివాస్ ఆశ్చర్యంగా కూతురివంక చూశాడు.

"ఏముంది డాడీ... ఇందులో ఏదో విదేశీహస్తం వుండి వుండాలి. ఎవరికేం కావాలో ఈరకంగా వేధిస్తున్నారు"

"హరీ" కంగారుగా ఆ పిల్లను ఆపింది సోనీ.

"ఎవరైనా వింటే నిజమేననుకోగలరు. ఇప్పటికే వున్న సమస్యలతోటే సతమతమవుతున్నాము. ఇంకా ఇలా ప్రచారం చేశారో, జుట్లూ, జుట్లూ పట్టుకుని తన్నుకోవాలి బంధువులంతా. మీరు పిల్లలు! మీ చదువులు మీరు చూసుకోక ఈ మాటలెందుకు?" గట్టిగా మందలించింది సోనీ.

"ఏంటి మమ్మీ మాట్లాడితే పిల్లలు, పిల్లలంటారు? మాకుమాత్రం తెలీదేంటి? మా స్కూల్లో అపార్ట్‌మెంట్స్‌నించి వచ్చే పిల్లలంతా ఈ విషయమే మాట్లాడుకుంటున్నారు!"

సోనీ తల పట్టుకుంది. "ఓ నెలారెణ్ణెళ్ళు ఇలాగే సాగితే వాళ్ళంతా వెకేట్ చేసి వెళ్ళిపోతారు. ఇంకో బోర్‌వెల్ వేయించటం తప్ప గత్యంతరం లేదు" తనలో తను అనుకుంటున్నట్టుగా అన్నాడు శ్రీనివాస్.

"ఆ విషయాలన్నీ చక్రవర్తి వచ్చాక ఆలోచిద్దాం. ముందేమైనా ఓ కప్పు కాఫీ అయినా ఇస్తావా?" అడిగింది మనో.

"సారీ మనో! ఏమిటో ఈ గొడవల్తో మెదడు బొత్తిగా పనిచెయ్యడంలేదు. రాగానే అనుకున్నాను. మర్చిపోయాను పద" ఇద్దరూ వంటింట్లోకి కదిలారు.

"ఆమధ్య చక్రవర్తి వైజాగ్ వచ్చాడా?" యధాలాపంగా అడిగినట్టు అడిగింది సోనీ.

"అవును... రెండుసార్లు వచ్చాడు"

"మనిషి చాలా సెన్సిటివ్. మాకు బాగా నచ్చాడు. సౌందర్య ఎక్కువ రాకున్నా అతను తరచూ వస్తూండేవాడు. ఇప్పటికీ వస్తూనే వుంటాడు. మరి నీకు నచ్చాడో లేదో తెలీటంలేదు" అక్కను క్రీగంట చూస్తూ అడిగింది సోనీ.

"పదిహేనురోజులక్రితం ఓసారి వచ్చాడు. డాల్ఫిన్స్‌లో డిన్నర్ తీసుకున్నాం. సరదాగా ఓ రెండుగంటలు మాట్లాడుకుని ఎవరిదారిన వాళ్ళం వెళ్ళిపోయాం. నాల్రోజులక్రితం వచ్చాడు. ఓపూట మాట్లాడుకున్నాం?"

"అంతేనా?"

"అవును... సరదాగా... ఇన్నాళ్ళూ అనిపించలేదుగాని ఇప్పుడిప్పుడే తెలుస్తోంది. సరదాగా మాట్లాడుకుందుకు ఎవరైనా తోడుండటం అదోతరహా అని"

"ఒట్టి సరదాగా మాట్లాడుకోడమేనా?"

"ఆ ప్రశ్న నువ్వు నన్నడగడం కాదు. నన్ను నేనే వేసుకున్నాను. అతనో మంచి స్నేహితుడు. అతని సమక్షంలో మనను తనను తాను మరిచిపోగలదు. మనిషి సంస్కారవంతుడు. ఎవర్నీ నొప్పించడు"

"ఇంతేనా?"

"ఇంకేం కావాలి. ఇద్దరిమధ్య స్నేహం చాలదా?"

"మనో! ఒక మాటడగనా? ఏం అనుకోవు గదా! నువ్వు పెళ్ళి అంటే భయపడుతున్నావా?"

"భయమా? ఎందుకలా అనుకుంటున్నావు?"

"చిన్నప్పట్నించి మనింట్లో పరిస్థితులు చూసి చూసి, సుందరం పెదనాన్న జీవితం అలాగయింది. డాడీ ఇలాగ. ఇహ మనోహర్‌ని శైలజ పిన్ని వదిలెయ్యడం, గిరిజత్త వైధవ్యం... పెద్దత్త అస్తవ్యస్తపు బతుకు..."

"కష్టాలన్నవి మనుమలకు రాకుండా వుంటాయా?"

"ఇంతకీ చక్రవర్తి నీకు నచ్చాడా?"

"మనిషిగా నచ్చాడు"

ఆరోజంతా ఆ సంభాషణ గురించే ఆలోచిస్తూండిపోయిందామె మళ్ళీ మళ్ళీ...

"చక్రవర్తి నచ్చాడు"

ఆ మాటే వింతగా, కొత్తగా మళ్ళీ మళ్ళీ మనసులో ప్రతిధ్వనిస్తూంటే తలస్నానం చేసి జుట్టు తుడుచుకుంటూ అద్దంలో చూసుకుంది. ముప్పైదాటినా ఇంకా సౌకుమార్యం తగ్గని ఆ రూపం పాతికేళ్ళేనన్నా నమ్మేట్టుగా వుంది.

"ఊహూ... నేనేం ఆలోచించను"

ఆ మాట అనుకోవడం అది ఏ వందోసారో. అతనితో మాటలు తగ్గించుకోవాలి. అతని ఉద్దేశం కనుక్కోవాలి ముందు. ఏ క్షణంలో అలా అనుకుందో మనోహిత, చక్రవర్తితో మాట్లాడటం కుదరనేలేదు. అనుకోని అతిధిలా వూడిపడ్డాడు శ్రీనాధ్.

"మీరా? మిమ్మల్ని కలుసుకోగలనని కల్లో కూడా అనుకోలేదు. ఇది నిజంగా ఎదురుచూడని వింతే. అందరూ మీ గురించి మాట్లాడుకోగా వినడమేగాని ఇంతవరకూ మిమ్మల్ని చూసే అవకాశమే రాలేదు"

కళ్ళు పెద్దవి చేసింది మనో.

"నాగురించా? ఎవరబ్బా నాగురించి మాట్లాడేది?"

"జనాలు!"

"ఎవరా జనాలు?" పెదవి విరిచింది మనో.

"మీ[రా]వటం చూసినవాళ్ళు... పోనీలే ఆ విషయం వదిలెయ్. ఈరోజు ఇక్కడికి అనుకోకుండా రావడం నా అదృష్టమే. ఎన్నిరోజులుంటారు? ఇక్కడే వుండే ఉద్దేశ్యం ఉందా? అయ్‌మీన్ ట్రాన్స్‌ఫర్ చేయించుకుని... అఫ్‌కోర్స్ ఇక్కడా వీధికి పదిమంది డాక్టర్లున్నారు. అయినా ఎవరి పేరూ ప్రతిష్టా వాళ్ళదే"

"ఆ విషయం ఇంకా ఆలోచించలేదు" ఒక్కక్షణం ఆగి, "ఏం అనుకోకు, సోనీకి హెల్ప్ చేయాలి" అంటూ అతన్ని తప్పించుకుని ముందుకు వెళ్ళింది మనో.

"వాడేమైనా సి.ఐ.డి.యా?" సమయం చూసి సోనీని అడిగింది.

"ఎవరు?"

"శ్రీనాధ్... పెదవి కదిపితే ప్రశ్నల పరంపరే. ప్రశ్న తప్ప మరోమాట రాదతనికి"

"నాకూ ఆశ్చర్యంగానే వుంది. ఇదివరకెప్పుడూ ఇలా మా ఇంటికి రాలేదు. ఇప్పుడిలా పిలవకుండానే రావడం... వింతే"

మనోహిత సాలోచనగా తలూపి తలుపు





కొంచెం తీసి హాల్లో కనిపిస్తున్న శ్రీనాథ్‌వంక చూసింది. అతను శ్రీనివాస్,చక్రవర్తిలతో మాట్లాడుతున్నాడు.

"అతని ప్రవర్తన వింతగా లేదూ?" సోనీని ప్రశ్నించింది మనో.

"వింతగానా?"

"అవును... ఏదో తెలుసుకోవాలనే క్యూరియాసిటీ"

"నిజమే... ఇదివరలో ఎవరితోటీ పెద్దగా సాన్నిహిత్యం, సామరస్యం లేవతనికి. ఇప్పుడిప్పుడే అందరితో పరిచయం పెంచుకోవాలనుకుంటున్నాడేమో? ఏదో తన పనేదో తనది. ఇదివరకు అత్త ఇతని గురించి చాలా బెంగపడేది. తాగి తందనాలాడేవాడని... పోన్లే ఇప్పుడిప్పుడే జీవితంలో స్థిరపడుతున్నాడు" నవివరంగా చెప్పింది సోనీ. ఇద్దరూ మొహాలు చూసుకున్నారు.

"చక్రవర్తిని తప్పించుకు తిరుగుతున్నావా?" ఉన్నట్టుండి సోనీ ప్రశ్న.

"లేదే... అందరితోనూ మాట్లాడతాను. ఇంకా చాలా టైమ్ వుందిగా!" మనో జవాబిచ్చింది.

"శ్రీనాథ్ అంకుల్‌తో కూడానా?" హరిత గొంతు వినేవరకూ ఆ పిల్ల అక్కడికెప్పుడు వచ్చిందో ఇద్దరూ గమనించలేదు.

"హరీ... ఈ మాటలు ఎవరిదగ్గరా అనకు. మనం వేరేవాళ్ళను కామెంట్ చెయ్యకూడదు" సోనీ మందలించింది.

పిల్లనైతే మందలించగలిగిందిగాని ఆమె తన మనసుని ఆపలేకపోయింది. నిజమే... శ్రీనాథ్ మనోని ఎందుకంతగా గమనిస్తున్నాడు. మనో వచ్చాకే అతనీ ఇంటికి రావడం మొదలైంది. ఎందుకు?

డిన్నర్ టైమ్‌కి టేబుల్ అరేంజ్ చెయ్యడం మొదలైనవన్నీ చూసుకుంది మనో. సోనీకి వంటలో హెల్ప్ చేసింది.

"మన అదృష్టానికి ఏ వక్రగతి ప్రాప్తించిందో అర్థంకావడంలేదు. ఓవక్క అపురూప టెక్స్టైల్స్ భారంగా పరిణమించి అమ్ముకునే స్టేజ్‌కి వచ్చాం. మరోవంక అపార్ట్‌మెంట్స్‌కి ఈ ప్రాబ్లం. మామగారు ఎంత విసిగిపోయారంటే, ఏదో ఒకరేటుకి అమ్మేద్దామంటున్నారు. ఎవరో ఒకరిద్దరు ముందుకి వచ్చినా చాలా తక్కువరేటు ఆఫర్ చేస్తున్నారు. ఈమధ్యే ఎవరో ఫోన్ చేసి అపార్ట్‌మెంట్స్ అమ్ముతున్నారా? అని అడిగారు" శ్రీనివాస్ చెప్తున్నాడు.

"ఆ నీళ్ళ సంగతెలా... మరో బోర్ వేయిస్తారా?" శ్రీనాథ్ ప్రశ్న.

"చూద్దాం... ఇప్పటికైతే టాంకర్స్‌తో సప్లై చేస్తున్నాంగా"

"అవుననుకోండి. ఎన్నాళ్ళలాగ. టెనెంట్స్‌కి నీళ్ళు స్టోర్ చేసుకోడం కూడా ప్రాబ్లమేకదా. సగం రెంట్ వాటర్ సప్లైకి సరిపోతుంది. ఏం లాభం ఇక?" శ్రీనాథ్ రెట్టించాడు.

ఇంతలో డిన్నర్ సర్వింగ్ మొదలైంది.

"కొత్త బోర్ వెయ్యాల్సివస్తే ఎంత ఖర్చవుతుంది? ఇవన్నీ అమ్మేస్తే మన భవిష్యత్తేమిటి?"

శ్రీనాథ్ ఆ టాపిక్ విడిచిపెట్టట్లేదు.

"పరిస్థితి అంతవరకూ రాదనే అనుకుంటున్నాను" పొడిగా జవాబిచ్చాడు శ్రీనివాస్.

"మరెలా సరిదిద్దుతారు? ప్రతినిముషం నా మనసు ఆ విషయమే ఆలోచిస్తోంది. ఏం చెయ్యాలన్న తపనే"

"శ్రీనాథ్! తినే తిండి కాస్త ప్రశాంతంగా తినండి. ఎప్పుడూ ఆ గొడవలేనా? కనీసం ఇంటికి వచ్చిన గెస్ట్‌లనన్నా ప్రశాంతంగా వుండనివ్వండి" మందలింపుగా వుంది సోనీ స్వరం.

"చక్రవర్తి... మీ టూర్ సంగతి చెప్పండి. ఎప్పుడు మీ ప్రయాణం?"

"ఎల్లుండి ఉదయమే. ఈసారి రెండు వారాలవని. బహుశా నా రిసర్చ్ పూర్తయ్యే అవకాశాలు దొరకచ్చు" శ్రీనివాస్ ఉద్దేశ్యం గ్రహించి నేర్పుగా టాపిక్ తప్పించాడు చక్రవర్తి. పదినిముషాల్లో శ్రీనాథ్ సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

"ఏమిటి మోహితగారూ! పెదవి కదవటంలేదు" చక్రవర్తి ప్రశ్నించాడు.

"ఒక్కోసారి నిశ్శబ్దంగా వినడమే బాగుందనిపిస్తుంది"

''థాంక్స్ చక్రవర్తీ! శ్రీనాథ్ ప్రశ్నల్ని ఎలా తప్పించుకోవాలో నాకు అర్థంకాలేదు. అత నెందుకలా ప్రవర్తిస్తున్నాడో నాకు తెలీదు. హఠాత్తుగా ఎందుకతనికి ఆసక్తి పెరిగిందో తెలీట్లే దు. పైగా మేం అతనికేం ద్రోహంచేశాం? పాలల్లో సైనైడ్ కలిపి... అయామ్ సారీ... ఆ సంగతి నీకు చెప్పలేదుకదూ...''

చక్రవర్తి తల ఊపుతూ ''కిందటివారం మోహిత చెప్పారు''

''క్రితంవారమా? మనో ఇక్కడికి రాలేదే!''

''ఇక్కడ కాదు. నేను వైజాగ్ వెళ్ళాను''

''సరే... ఈ విషయం రహస్యంగానే వుంచమని నీకు చెప్పక్కర్లేదనుకో''

''నాకలా స్టోరీస్ చెప్పటం అలవాటు లేదని నీకు తెలుసుగా''

''ఆ సంగతి నాకు తెలుసనుకో. ఈ వాటర్ ప్రాబ్లమ్ వెనకాల కూడా ఏదో కుట్ర వుందని పిస్తోంది. రాళ్ళమధ్యన ఎప్పటివో జీవాలు ఫాసిల్స్‌గా మిగిలినా మాంసం ప్రిజర్వయే దారిలేదు. నీకు తీరిక వుంటే రేపుదయం ఓసారి చూద్దాం. ఏవైనా సమస్యలు తలెత్తితే పారిపోవడం వంశపారంపర్యంగా వచ్చిన లక్షణం. టెక్స్‌టైల్ మిల్స్ అమ్మేద్దామంటున్నారు. కాదు, మొదలెట్టిన ప్రాజెక్ట్ పూర్తి కానప్పుడు అది డ్రాప్ చేసుకుని కొత్త ప్రాజెక్ట్ గురించి ఆలోచిస్తే కంపెనీ ప్రాస్పర్ అవచ్చని నా ఉద్దేశ్యం'' రాయిలా మారిన మనో మొహం చూసి ఆగిపోయాడు.

''అయామ్ సారీ... మిమ్మల్ని కామెంట్ చెయ్యడం నా ఉద్దేశ్యం కాదు. సరే... మాట్లాడుతూ వుండండి. సోనీ ఏం చేస్తోందో చూసి వస్తాను'' అంటూ కిచెన్‌లోకి జారుకున్నాడు.

చక్రవర్తి మనోవంక చూశాడు. అతని చూపుల్లో ఆత్మీయత తొణికిసలాడింది.

''ఏం జరిగింది మనో?'' చాలా మామూలుగా వచ్చిందా ప్రశ్న.

ఆమె తలెత్తి అతనివంక చూసింది. ఒక్క క్షణం గతం అతనికి సవివరంగా చెబ్దామా అనిపించింది. ఇంట్లోంచి పారిపోవడం, ఎందుకలా పారిపోయినదీ, ఊహూ... లాభంలేదు. గొంతు సహకరించట్లేదు. ఇంతవరకు ఎవరికీ ఆ గతాన్ని వినిపించలేదు. క్షణం ఆగింది. మాటలకోసం వెతుక్కుంది. ఊహూ... లాభంలేదు. తల తిప్పుకుంది. మనసులో ఏదో నిరాశ. అతని గురించి తెలిసింది చాలా తక్కువ. అతనితో ఈజిప్ట్ వెళ్ళడం సమంజసమేనా?

''ఈజిప్ట్‌లో ఎన్నిరోజులుంటారు మీరు?''

''తెలీదు. అక్కడికి వెళ్ళాక చెప్పగలనని అనుకుంటున్నాను. ఓ రెండు వారాలు''

మళ్ళీ నిశ్శబ్దం.

చాలాసేపటి తర్వాత తలెత్తింది మనో.

ఆమెనే దీక్షగా చూస్తున్నాడు చక్రవర్తి. ఆ కళ్ళల్లో సన్నటి చిర్నవ్వు.

★ ★ ★

ప్లేన్‌లో చాలామంది అరబ్స్. చాలా తక్కువమంది ఇండియన్స్ వున్నారు.

అంతం లేకుండా పరచుకున్న నీలిసముద్రం, ఎక్కడ చూసినా నీళ్ళే. కళ్ళు విప్పార్చుకుని చూసింది మనో.

పక్కసీట్లో చక్రవర్తి.

''అమ్మయ్య... కనీసం ఒక సమస్య పరిష్కరించగలిగాను? నాకు చాలా సంతోషంగా వుంది. శ్రీను మీకు చెప్పాడా?''

''చెప్పాడు... పెద్దగా అర్థంకాలేదు. మీరు చెప్పండి''

''నిన్న ఉదయం అయిదింటికే శ్రీనివాస్, నేనూ అపార్ట్‌మెంట్స్‌వైపు వెళ్ళాం. అయితే మా రాక ఎవరూ గమనించలేదక్కడ. సరాసరి చివరి అంతస్థులో ఓవర్‌హెడ్ వాటర్‌టాంక్ చూట్టానికి వెళ్ళాం. శ్రీనివాస్ తెలివిగా బండి నాలుగు ఫర్లాంగుల అవతలే మిల్క్‌బూత్ ముందుంచాడు. మోటార్ ఆన్‌చేసి చూశాం. నిజమే... చిన్న చిన్న ఎముకలు ఫ్లెష్... నీళ్ళు కుళ్ళువాసన. మోటార్ ఆఫ్‌చేసి శ్రీనివాస్ పైకొచ్చాడు.

ఆ చిన్న ఎముకలు చెప్పిన సత్యం ఒకటే. అవి చాలా చిన్న జంతువులవి. ఎలకల్లో, తొండల్లో, ఉడతల్లో మొదలైనవి. రెండోది - అవి మరణించి నాలుగురోజులు మించివుండదు. ఎందుకంటే ఆ ఎముకల్లో మ్యారో ఫ్రెష్‌గా




వుంది. అయితే అవి బోర్‌వెల్‌లోకి ఎలా వస్తున్నాయి? మా ఆలోచనలో కొలిక్కి రాకముందే వినిపించింది. బైక్‌శబ్దం. అది వచ్చి గేట్ ముందాగింది.

దాని మీద శ్రీనాథ్.

మేం పైనించే గమనించటం ప్రారంభించాము.

కాస్సేపు అటూఇటూ చూసి ఎవరూ గమనించటం లేదనిపించాక లోపలికి వచ్చాడు. చీకట్లో అతని చేతుల్లో ఉన్నదేమిటో గమనించలేకపోయాం. సరాసరి బోర్‌వెల్ రూమ్ తాళం తీసి లోపలకు వెళ్లాడు. లోపల్నించి తలుపు జాగ్రత్తగా వేసుకున్నాడు. పది నిమిషాల తరువాత మళ్లీ యధావిధిగా రూమ్ తాళంవేసి ఎవరూ గమనించటం లేదని రూఢి చేసుకుని మరీ వెళ్లిపోయాడు. మేం ఇంక ఒక్కక్షణం కూడా వృధా చెయ్యకుండా లిఫ్ట్‌లో క్రిందకి వస్తూనే బోర్‌వెల్ రూమ్‌లోకి వెళ్లాం.

రూమ్ యధాతథంగా వుంది. ఎప్పటిలాగే బోర్‌వెల్ మెషీన్. కాదంటే ఇక్కడ మేం గమనించినదొకటి. బోర్‌వెల్‌కి, మెషీన్‌కి మధ్యన స్థలం. అది జట్‌పంప్ కాదు. కేసింగ్‌కి పైప్‌కి మధ్యన ఖాళీ... ఆ ఖాళీకి కవర్ ఓ ఇనుప కవర్. కొంచం జాగ్రత్తగా పరిశీలించాక ఆ కవర్ ఓపెన్ చేశాం. కవర్ పైకి లేవటం ఆలస్యం, బయటకు ఉరికి వచ్చాయి రెండు తొండలు.

ఎప్పుడైతే కవర్ క్లోజ్ చేస్తామో వాటికి క్రిందకు వెళ్లడం తప్ప మరోదారి దొరకదు. క్రిందకు వెళ్లి వాటర్‌లో మునిగి చావటమే దారి. చచ్చి శవాలై సర్‌ఫేస్ మీద తేలినప్పుడు మోటర్ ఆన్ చెయ్యగానే పైప్‌లోకి వస్తాయి... రాడ్ కదలికలకు ముక్కలు ముక్కలై. అర్థమైందిగా ఇలాంటి ప్లాన్ ఆలోచించగలిగిన శ్రీనాథ్ బ్రెయిన్... అది ఓ క్రిమినల్ బ్రెయిన్. శ్రీనివాస్ నిర్ఘాంతపోయాడు. వీలైనంత వరకు పైప్‌కి కేసింగ్ మధ్య ఖాళీని క్లీన్ చేయించాం. ఓ గంట నీళ్లు టాంక్‌లోకి వచ్చాక... డెడ్ మాటర్ కంప్లీట్‌గా వచ్చిందనిపించాక ఆ నీళ్లు వదిలేసి టాంక్ కడిగించాం. మంచి నీళ్లు రావడం మొదలెట్టాయి.

క్రింద కేసింగ్ మీద కవర్ మార్చి దానికో లాక్ వేశాడు శ్రీనివాస్. రూమ్ తాళం కూడా మార్చి మంచి గాడ్రెజ్ లాక్ వేశాడు. ఈ విషయాలు బయటకు పొక్కనివ్వద్దు. ఏం తెలీనట్టే వుందామంటాడు''

''శ్రీనాథ్ ఇంతపని చేశాడా? ఎందుకతనికంత కక్ష...''

''ఇదంతా అతని ప్లానింగ్ అని కూడా అనిపించడంలేదు. వెనకాల ఇంకెవరో వుండి వుంటారు'' అన్నాడు చక్రవర్తి

అప్రయత్నంగానే మనో ఒళ్లు జలదరించింది.

''మీరు నిన్న ఫోన్ చేసి చెప్పేవరకూ నాకు తెలీదు మీ వాళ్లతో మీరిలా వస్తున్నట్లు చెప్పలేదని. ఇంకా నయం శ్రీనివాస్ ముందు నోరు జారాను కాదు''

''చెప్పకూడదని కాదనుకోండి. కాని చెప్పాలని కూడా అనిపించలేదు'' మళ్లీ ఇద్దరూ లక్జర్‌లో దిగేవరకు ఒక్కమాటా మాట్లాడుకోలేదు.

ఆ లోహపు మెట్ల మీద దిగుతుంటే వేడిగాలి స్వాగతం పలికింది. ఫ్లేన్‌లోనే విప్పిన కోట్ అతని భుజం మీద వేళ్లాడుతోంది. మరో భుజాన కెమేరా బాగ్, రెండు చేతుల్లో రెండు లెదర్ సూట్‌కేసులు, పక్కనే మనో.

''సారీ మనో... మీ సూట్‌కేస్ బరువుగా వుందా?''

''లేదు... లేదు... ఇట్సాల్‌రైట్''

''హలో మిస్టర్ చక్రవర్తీ'' టర్మినల్ దగ్గర లేడీ గౌరవంగా పలకరించింది.

''మిస్టర్ చక్రవర్తీ! వెల్‌కమ్ బాక్'' టాక్సీ డ్రైవర్ స్వాగత వచనం అది.

''మిస్టర్ చక్రవర్తి... మీరాక మళ్లీ చైతన్యాన్ని తెచ్చినట్టుగా వుంది'' అంటూ హోటల్ మేనేజర్ అతనితో పాటు ఆరో అంతస్తులోవున్న అతని గది వరకూ వచ్చాడు. అదృష్టవశాత్తూ ఆ పక్క గది కూడా ఖాళీగానే వుంది. రెండు గదులకీ మధ్య ఓ తలుపు.

''గ్లాడ్‌టు మీట్‌యూ మిసెస్ చక్రవర్తీ''

చక్రవర్తి కంగారుపడ్డాడు. కాని మనో నవ్వు

తూ చేతులు జోడించింది తప్ప మరేం జవాబి వ్వలేదు.

"ఇప్పుడు ఈ సెమీ మాడర్న్ సిటీలో 1922 తరువాత ఇదే మొట్టమొదటి ఎక్స్‌ప్లొరేషన్ అవుతుంది. ఇంతవరకూ ఏ ఆర్కియాలజిస్టూ సాధించని విజయం ఇది"

మనో ఏదో అనబోయేలోపలే తలుపు మీద చిన్నగా శబ్దం... "కమిన్ కరోల్"

"నేనే అని మీకెలా తెలును?" లోపలికి వస్తూ అడిగిందామె. ఆరడుగుల పొడుగు, చీకటి ముక్కను తెచ్చి అతికించినట్టుగా నల్లని జుట్టు, బాదం కాయల్లాంటి కళ్లు, చకచకా పరిసరాలను పరిశీలిస్తున్న చూపు. మ్యూజియమ్స్ బోర్డ్ఆఫ్ మెంబర్స్‌లో ఒకరు, చిన్న వయసులో ఆ పదవి పొందడం అంత తేలికైన పనేమీ కాదు.

ఓ గంట తరువాత ముగ్గురూ డిన్నర్‌కి కూర్చున్నారు.

"థాంక్యూ చక్రవర్తీ... చాలా రోజుల తరువాత సరదాగా ఓ సాయంత్రం గడిపే అవకాశం ఇచ్చినందుకు. ఎక్కడికి వెళ్లినా జాన్సన్ సడెన్ డెత్‌కి సానుభూతి, వాళ్ల ఓదార్పులు భరించలేకుండా వున్నాను. నా ఒంటరితనాన్ని ఎత్తి చూపటం ఓహ్... హెల్... చాలా రోజుల తరువాత మీ ఇద్దరితో ఆ ఒంటరితనాన్ని మర్చిపోగలిగాను"

"మీ కంపెనీ మాకూ సంతోషమే ఈ ప్రాజెక్ట్ మీద ఆరేళ్లుగా పనిచేస్తున్నాం. తవ్వకాలే మిగిలాయి కానీ ఫలితం లేకపోయింది. ఈసారి ఏమౌతుందో?"

"ఈసారి విజయమే తథ్యం. రేపటినుంచి మన షెడ్యూల్ ఏమిటి?"

"ఈ దరిదాపుల్లోనే షాంక్రైర్ సమాధి ఉండి తీరాలి... అతని గురించి మీకు తెలును. ఎక్కడైనా క్లూ ఏమైనా దొరుకుతుందేమో ట్రైచేద్దాం"

"ఆయనా ఓ ఫరల్ అని కదూ మీ ఊహ".

"ఊహ కాదు నిజమే. అందుకే ఆరేళ్లుగా విసుగన్నది మరచిపోయి ఈ పని చేస్తుంట. అది నిజమే అనడానికి ఫరల్‌ల చరిత్రలో ఆధారాలు కూడా వున్నాయి. ఏదో కుటుంబ కలహం, కుట్ర అతని మరణం, ఆ పైన అతని వివరాలను సమూలంగా నాశనం చెయ్యడం జరిగివుండాలి. అదే జరిగితే అతని సమాధి ఈ ప్రాంతంలోనే ఉంటుంది. ఇవ్వాళ కాకపోతే రేపైనా మన కళ్ల బడక తప్పదు"

కరోల్ నిట్టూర్చింది.

"ఫరల్‌ల గురించి మాట్లాడితే చాలు మిమ్మల్ని మీరు పూర్తిగా మర్చిపోతారు. ఆ మైమరపు మీ గొంతులో ప్రతిధ్వనిస్తుంది. అసలు నన్నడిగితే ఈ ప్రపంచంలో ప్రతివాళ్లకీ ఏదో ఒక ప్రాజెక్ట్ వుండి తీరాలి. అదీ మనస్ఫూర్తిగా నచ్చినది, ఒంటరిగావున్నా ఆ ప్రాజెక్ట్‌లో ఎంతగా మునిగిపోతామంటే మనని మనం పూర్తిగా మర్చిపోవాలి"

"మిసెస్ కరోల్... మీరు జాన్సన్‌ని మర్చిపోలేకపోతున్నారు కదూ" అడిగింది మనో.

"అవును... ఆశ్చర్యంగా వుందా? నాలుగేళ్లైపోయింది. ఆ బాధ తట్టుకునే శక్తి సంపాదించుకుని వుంటాననుకున్నాను. ఊహు... నలభై ఏళ్లైనా నాలుగు వందల సంవత్సరాలైనా అతని జ్ఞాపకాలు చెరిగిపోవు. ఎప్పటికైనా అతను తిరిగి వస్తాడేమోనని ఓ పిచ్చి ఆశ. నన్నొంటరిగా వదిలి అలా అర్థాంతరంగా వెళ్లిపోయినందుకు అతని మీద గొంతువరకూ కోపం. ఏకాంతంగా ఉన్నప్పుడు అతను నా ఎదురుగా ఉన్నట్టే అనిపిస్తుంది. ముఖ్యంగా రాత్రివేళ నిద్రరాక ఎటూ వెళ్లలేక అతని మరణాన్ని నా మనసు అంగీకరించట్లేదు"

చక్రవర్తి మనసులో అనుకోకుండా సౌందర్య తొంగి చూసింది.

"ఇది జీవితం, లెటజ్ ఎంజాయ్ ఇట్. ఈ పెళ్లి శాశ్వతబంధాలు ఇవన్నీ ట్రాష్. నా మనసు నిన్ను కోరుకున్నన్నాళ్లూ నీతో ఉండగలను. అంతేగాని పెళ్లిపేరుతో మూడు ముళ్ల భాగ్యానికి జీవితాన్ని నీతో ముడివేసుకోలేను"

మనసుకి దేశ కాల సంస్కృతులు అడ్డం రావేమోననిపించింది. సనాతన సాంప్రదాయాలకు ఆలవాలమైన ఇండియాలో సౌందర్య భావాలవి. ఈజిప్ట్‌లో పుట్టి పెరిగిన కరోల్ భావాలివి. మరి మనో? తల తిప్పి ఆమెవంక చూశాడు.




కరోల్ బాధ ఆమె కళ్లలో ప్రతిఫలిస్తోంది.

తెల్లారిలేస్తూనే తవ్వకాల దగ్గరకు వెళ్లారు ముగ్గురూ.

నదీ తీరాన ఆరొందల అడుగుల ఎత్తున్న కొండలు, లోయల్ని వాటి వెనక దాచివుంచుతూ. ఉషోదయం వెలుగులో కొండలు బంగారు రేకుల్లా మెరుస్తున్నాయి.

''ఓహ్ ఎంతందంగావుంది''

''ఓహ్... వినడమేగాని ఇంత అద్భుతంగా వుంటుందని కలలో కూడా అనుకోలేదు''

మనో స్వరంలో ఆశ్చర్యం.

''ఎడారి సూరీడు... అతని ప్రభావం అది. అసలింకా సాయంత్రం పూట చూడాలి... ఈ కొండలు పసిడి ముద్దల్లా ఓ వంక, పగడపు రాశుల్లా ఓ వంక అవుపిస్తాయి'' చక్రవర్తి వివరించాడు.

ఇరవై సంవత్సరాల వృత్తి జీవితంలో మొదటిసారి కెమేరా ఉపయోగించాడు. త్రవ్వకాలను ఫొటో తీసేందుక్కాదు... మనోని శాశ్వతంగా భద్రపరచుకొందుకు. వెనకాల సుందరమైన దృశ్యాలను ఫొటో తియ్యడం ఓ వంక అంతే.

సౌందర్య నిరాకరణ, ఆత్మహత్యా ప్రయత్నం... జీవితంలో మరోసారి ఆడవాళ్ల వంక చూడకూడదనుకున్న నిర్ణయం ఏమైపోయింది? ఎందుకిలా ఎదురుగావున్నా మనసు ఆమె గురించే ఆలోచిస్తోంది? కరోల్, మనో ముందు నడుస్తున్నారు. సన్నగా గుసగుసలు. చక్రవర్తి, పనివాళ్లు వెనకాల నడుస్తూ లోయలోకి దిగుతున్నారు.

గంటన్నర రెండు గంటలు నడిచాక హఠాత్తుగా ఆగాడు చక్రవర్తి.. ''ఇక్కడే''

''ఇక్కడే మా తవ్వకాలు జరగాల్సింది. ఈ స్థలం మరెవరూ ఆక్రమించకుండా కావలా... ప్రభుత్వమే ఏర్పాటు చేస్తుంది. ప్రభుత్వం సహకారం లేకుండా ఈ పనులు చెయ్యలేం. ఇదివరకు ఆర్కియాలజిస్టులు వాళ్లంతట వాళ్లే తవ్వకాలు సాగించే వారనుకో''

''ఈ చోటే ఎందుకు ఎంచుకున్నారు? ఏ ప్రత్యేకతా కనిపించటంలేదే'' కరోల్ ప్రశ్న అది.

''కనిపించదు... అదీ ఉపరితలం మీద అసలు కనిపించదు. వాషింగ్టన్‌నించి నా మిత్రుడొకడు సాటిలైట్ ఫొటోలు పంపించాడు. ఇక్కడ భూమి పొరలు సక్రమంగా లేవు. ఆ ఫొటోలతో కంప్యూటర్ మీద వర్క్ చేశాను. ఇదివరలో కంప్యూటర్లులేవు. ఇప్పుడా అవకాశంవుంది. కంప్యూటర్ తప్పు చెప్పదు. ఇదివరకు ఎన్నో అపజయాలు ఎదుర్కొన్నాం. ఈసారి నా అంచనా తప్పుకాదని చెప్తోంది నా మనసు''

ఇంతలో ఓ వ్యక్తి వచ్చాడక్కడికి. కొంచం పొట్టిగా, నల్లగా వైట్‌పాంట్, గ్రీన్‌షర్ట్.

''ఇతను రోస్నీ''

కరోల్‌ని, మనోని పరిచయం చేశాడు చక్రవర్తి.

''ఇతను కైరో యూనివర్సిటీ ఆర్కియాలజీ ప్రొఫెసర్. ఈ తవ్వకాలకి ఇతను అధికారి. సమాధి గనుక కనుక్కోగలిగితే ఆ క్రెడిట్ మా ఇద్దరిదీ. ఏం చేద్దాం రోస్నీ?''

మోకాళ్ల మీద వంగి ఆ తవ్విన రంధ్రాన్ని పరిశీలిస్తున్నాడు రోస్నీ.. చక్రవర్తి కూడా ముందుకు వంగాడు.

''తవ్వి చూడాల్సిందే'' ఎంత ప్రశాంతంగా వుందామన్నా అతని గొంతులో ఆత్రుత.. ఆసక్తి తొంగి చూస్తూనే ఉన్నాయి. ఇదివరలో చూసిన అపజయాలు అతన్ని స్థిమితంగా వుండనివ్వడంలేదు.

''రండి... అలా ఆ గట్టు మీద కూర్చుందాం'' మనోని, కరోల్‌ని తీసుకుని అటు నడిచాడు.

''చక్రవర్తీ''

క్షణంలో రోస్నీ పక్కనున్నాడు చక్రవర్తి. ఆ వెనకే మనో, కరోల్ వెళ్లారు. సొరంగంలా తయారైన దారి వంక చూశాడు చక్రవర్తి. రోస్నీ నోటివెంట మాట రావడంలేదు. కుడిచేతి చూపుడు వేలితో చూపిస్తున్నాడు. ఆ మట్టిలో మెట్లు. ఆ సొరంగంలో ముందుకు వెళ్లాడు చక్రవర్తి. చివరికంటా వెళ్లి మోకాళ్ల మీద వంగి మెట్ల చివరను చేతితో తాకి చూశాడు. మట్టి రాళ్లు చేత్తో తుడిచి మరీ చూశాడు. మనసు రెక్కలు కట్టుకొని ఎగరడం ఆరంభించింది.

ఆ మెట్లు లోపలికి లోలోపలికి భూ గృహం లాంటి సమాధి తలుపు దగ్గరకు వెళ్తాయి. కరోల్ కూడా ఆ సొరంగం గుండా ముందుకు వెళ్లింది.

''ఇది.. ఇది నిజమేనా?'' నెమ్మదిగా లేచి నిల్చుంటూ అడిగాడు చక్రవర్తి.

''అవును.. ఇది నిజమే'' రోస్నీ చెప్పాడు.

''నమ్మలేకపోతున్నాను. నాలుగువేల సంవత్సరాల క్రిందటి సమాధి. మనకోసం ఇంకా ఇలాగ... సాధారణంగా దొంగలు చాలా సమాధుల్ని తవ్వి సంపదల్ను కొల్లగొట్టుకుపోయారు. సమాధుల మీద గ్రామాలు వెలిసాయి. ఆ గ్రామాలను బందిపోట్లే నిర్మించారు. సంపదలను తరలించే అవసరం ఉండదని వాళ్ల వారసులంతా సగర్వంగా ఆ సంపదల మీద బతికేస్తున్నారు. ఈ తవ్వకాలుఎంతమంది సాగిస్తున్నారో తెలీదు. ఈ సమాధుల్ని రక్షించడం ఎవరి తరంకాదు. వచ్చే జన్మకి కూడా సరిపోయేంత ధనధాన్యాలతో శవాలను సమాధి చెయ్యడం ఫరల్‌ల సాంప్రదాయం, వాటిని దోచుకు తినడం దొంగల సాంప్రదాయం మనం ఏం చెయ్యగలం''

''ఇది మాత్రం నిజంగా ఓ అద్భుతమైన విజయమే. మనకి సంపదలతో పనిలేదు. సమాధి కొల్లగొట్టబడినా గోడల మీద శిల్పాలు రాతలు, చిత్రాలు చాలు మనకి. అయినా ఇవన్నీ ఊహలే కదా. సమాధి తవ్వే వరకు నిజం ఏమిటన్నది తెలీదు''

హఠాత్తుగా చక్రవర్తిచూపు మనో మీద పడింది.

మనోని వెంట తేవడమే ఈ అదృష్టాన్ని తెచ్చి పెట్టిందా... అనిపించిందో క్షణం. ఆ ఆలోచనే చూపుల్లో వ్యక్తం చేశాడు.

ఆ మెట్లని ఫొటో తీసుకున్నాడు. పని జరుగుతూనే వుంది. మట్టి తవ్వి ఎత్తి పోస్తూ మెట్లు శుభ్రం చేస్తున్నారు. చక్రవర్తి ప్రతి దృశ్యం ఫొటో తీస్తూనే వున్నాడు... మనోతో సహా. పక్కన మనో వుండగా ఇలాంటి అపూర్వమైన క్షణాల్ని అనుభవించటం అద్భుతంగా వుంది.

ఒంటిగంట వరకు పని నిర్విరామంగాసాగుతూనే వుంది. ఒంటిగంటకు పని ఆపి లంచ్‌కి బయల్దేరారు.

''మాట్లాడేందుకు టైమ్ దొరకలేదు. బోర్ కొట్టిందా?'' మనోని అడిగాడు.

''లేదు... కరోల్ మంచి కంపెనీ ఇచ్చింది'' నవ్వుతూ చెప్పిందామె.

''మనం ఇంకొంచం శ్రద్ధ తీసుకుని అంటే ఆ పనివాళ్లను ఎక్కువమందిని పెట్టుకుంటే కాని ఈ తవ్వకం త్వరగా పూర్తవదు. ఇలా సమాధి కనుక్కున్నామంటే దొంగల ముఠాలు వీటికోసం ప్రయత్నిస్తాయి'' రోస్నీ సూచించాడు.

''నిజమే... కానీ మనకి ఫండ్స్‌లేవుగా. ప్రభుత్వం ఇంతకంటె ఎక్కువ డబ్బు గ్రాంట్ ఇవ్వదు''

''సరేమరి''

చక్రవర్తికి ఆ ఈజిప్షియన్ పద్ధతి బాగా నచ్చింది. ఎంత సులభంగా రియాలిటీని ఒప్పుకుంటారో వీళ్లు. ప్రభుత్వాన్ని విమర్శించకుండా అదేదో వాళ్ల దురదృష్టంలా.

''ఆలోచిద్దాం. తెలిసిన వాళ్లెవరైనా వుంటే అఫీషియల్‌గా ఇన్‌ఫ్లూయెన్స్ చేయిద్దాం''

''అయినా ప్రభుత్వం పెద్ద ఆసక్తి చూపటంలేదులెండి. తీరా ఖర్చు చేసి తవ్వకాలు పూర్తి చేశాక నిధులు దొరకవేమోనని వాళ్ల భయం''

''ప్రభుత్వం ఒప్పుకోకపోతే ప్రైవేట్ వ్యక్తుల్ని అడుగుదాం. రేపు కైరో వెళ్దామా?''

''నేను వస్తే ఇబ్బందికదా... ఇక్కడ తవ్వకాలను చూడాలి. మీరు కైరో వెళ్లండి. నేనిక్కడ పనులు చూస్తాను''

★ ★ ★

రామారావుగారికి మన సు చికాగ్గా వుంది. అప్రయత్నంగానే మనోహర్ దగ్గరకు బయల్దేరాడాయన. మనోహర్ ఏవో కాగితాలు చూసుకుంటున్నాడు.

''కాఫీ తాగుతావా?'' తలెత్తకుండానే అడిగాడు.

''ఊహు.. వద్దు నీతో కాస్త మాట్లాడాలి''

''అలాగా... ఏమిటది టెక్స్‌టైల్ మిల్స్





అమ్మే విషయమేనా?'' అప్పటికీ తలెత్తలేదు మనోహర్.

''అవును... కానీ మరీ అంత తక్కువ రేట్‌కి అమ్మలేం. మరీ సగానికి సగం తగ్గించి అడుగుతున్నాడా నరసింహం''

''అలాగా.. నాకా విషయం తెలీదే! ఇంకెక్కడయినా ఎక్కువిస్తారంటే అక్కడే అమ్మెయ్యి''

''దాని విలువ నాకు బాగా తెలుసు. అయినా మనం ఇబ్బందుల్లో వున్నామని, అమ్మక తప్పదనీ చెప్పావా నువ్వు?''

''లేదే... నేనూ ఆ విషయమే ఆలోచిస్తున్నాను. ఏదో ఒకాటి చెయ్యాలి''

తన గురించి తమ్ముడు ఆలోచించటం ఆయన మనసుకు తృప్తి నిచ్చింది.

''ఏం చేద్దాం?'' కాస్త ముందుకి వంగి అడిగాడు.

''ఆ విషయం మనం సీరియస్‌గా ఆలోచించాలి. నువ్వు నిజంగా అమ్ముతావో లేదో తెలీక నరసింహం అంత తక్కువకి అడిగి వుంటాడు. ఇంట్లో అందరూ ఒప్పుకోవాలి గదా!''

''ఆ విషయం అతనికి తెలీదుగా? ఎలా తెలుస్తుంది?''

''నువ్వేం చెప్పలేదా?''

''లేదు''

''అయితే... ఎక్కడో విని వుంటాడు. ఈమధ్య ఆవైపుకతను చాలాసార్లు వచ్చినట్టు విన్నాను మరి. మన ఫామిలీ గురించి ఏమేం విన్నాడో తెలీదు. సరే చూద్దాం''

''మనోహర్... ఈ విషయం కాదు. మిల్స్ గురించి కాదు నేను మాట్లాడదలుచుకున్నది'' హఠాత్తుగా ఏదో గుర్తొచ్చింది రామారావుగారికి.

''ఇదికాక ఇంకేం వుంది మన మధ్య మాట్లాడుకుందుకు?''

''మనోహర్. ఒకమాట సూటిగా చెప్పు- మనోని బెదిరించావటగా. మనింట్లో ఎవరినైనా కలిసినా, మాట్లాడినా చంపిస్తానని అన్నావటగా''

మనోహర్ ఎగిరిపడ్డాడు.

''మైగాడ్... ఈ మాటలు నువ్వు... నీ తమ్ముడిని అడుగుతున్నావా?''

''నిజమే... నిన్ను అడగకూడదు. కాని నిజం ఏమిటన్నది నాకు తెలవాలిగా?''

''నిజం ఏమిటనేది నీకు తెలీదా? ఎవరు చెప్పారీ మాటలు? మనో నీతో మాట్లాడిందా? నీ దగ్గరకు వచ్చిందా?''

''అవును''

''ఎప్పుడు? ఎక్కడ?''

''సోనీ ఇంట్లో''

''ఏం చేసావు నువ్వు? నీ తమ్ముడితో మాట్లాడుతున్నందుకు క్షమార్పణ అడిగావా? నేన్నిన్ను గౌరవిస్తున్నందుకా ఈ మర్యాద? పైగా నేనామెను బెదిరించానని చెప్పిందా? అయితే అదేం మారలేదన్నమాట. ఎప్పుడూ నన్ను నిందించటమేనా, దాని పని?''

''మనోహర్... నువ్వు బెదిరించావా? లేదా? దానికి జవాబు చెప్పు''

''లేదు... మనుమల్ని చంపటం, చంపించటం నా హాబీ కాదు. ఆ మాట నీకు తెలీదా? నువ్వు చెప్పలేదా నా తమ్ముడు అలాంటి వాడు కాదని చెప్పావా?''

రామారావుగారు అతనివంక నిస్సహాయంగా చూసారు.

''నువ్వు చెప్పవు. నువ్వు నా స్వంత అన్నవై వుండి నన్ను సమర్థించవు. బహశా కూతుర్ని ఓదార్చి వుంటావు. ''నేను వాడినడుగుతానుగా?'' అని.

''రామారావుగారికి నోటమాట రాలేదు. తల అడ్డంగా వూపాడు. మనోహర్ ఎందుకింత రెచ్చిపోయాడు? చేసిన తప్పు కప్పిపుచ్చుకుందుకా? అమాయకత్వం వెలిబుచ్చడానికా?

హఠాత్తుగా మంట. గుండెల్లో మంట. మనసూ శరీరం ఏకమై కాలిపోతున్న బాధ. దానికి తోడు ఒణుకు.

''గుండె నొప్పా?''

చేతులు వణికాయి. కాళ్ళకున్న చెప్పులు నేలమీద టకటక శబ్దం చేస్తున్నాయి.

ఓ సన్నటి మూలుగు.

కళ్ళు గట్టిగా బిగించేసాడు.

''ఏంటన్నయా? ఏమైంది?'' మనోహర్ లేచి వచ్చాడు.

రామారావ్‌గారు గుండె నిమురుకున్నారు.

క్షణాల్లో మనోహర్ సెక్రటరీని పిలిచాడు. అంతే తెలుసు. తిరిగిఆయన కళ్లు తెరిచేసరికి అంబులెన్స్‌లో వున్నారు. పక్కనే మనోహర్. మరో పక్కన డాక్టర్.

★ ★ ★

ఆఫీస్‌కి తిరిగి వెడుతూనే శ్రీనాథ్‌కి ఫోన్ చేసాడు మనోహర్.

''పెద్ద విశేషాలేం లేవు'' శ్రీనాథ్ గొంతు.

''నువ్వు నాతో మాట్లాడి నెల దాటి వుంటుంది. ఏం విశేషాలు లేవా?''

''ఏం వున్నాయి. పెద్దగా ఏం లేవు. ఓ రోజు సోనీ ఇంటికి డిన్నర్‌కి వెళ్ళాను''

''ఆ మాట చెప్పలేదు నాకు''

''మీకు తెలీందేమీ తెలుసుకోలేదు నేను. మనోతో మాట్లాడేందుకు ప్రయత్నించాను. నామీద పెద్ద ఆసక్తి చూపించలేదు''

''ఏం? ఎందుకని?''

''నాకెలా తెలుస్తుంది?''

''ఎందుకొస్తోందో చెప్పిందా?''

''నేను అడగలేదు. అపార్ట్‌మెంట్స్ విషయాలే మాట్లాడుకున్నాం. నేనూ శ్రీనివాస్''

''ఏం మాట్లాడారు?'

''అదీ పెద్ద ఉపయోగం లేకపోయింది. శ్రీనివాస్, చక్రవర్తి టాపిక్ మారుస్తూ పోయారు''

''చక్రవర్తి వచ్చాడా?''

''అవును... ఈ మధ్య వీళ్ళతోటే తిరుగుతున్నాడు. అదీ మీ మనో రావడం మొదలయాకే.

''ఇంకేమిటి?''

''శ్రీనివాస్‌కి, సోనీకి మిల్స్ అమ్మటం ఇష్టంలేదు. కాని ఇద్దరూ టెన్షన్‌లోనే ఉన్నారు. బోర్‌వెల్ గొడవ తెలీదు. అపార్ట్‌మెంట్స్‌లో టెనెంట్స్ ఖాళీ చేసే సూచనలేం లేవు. నీ మనో ఏవో సలహాలిచ్చి వుంటుంది. మామయ్యా, వింటున్నారా?''

''ఊ చెప్పు''

''శ్రీనివాస్ ఎంత ఖర్చయినా అపార్ట్‌మెంట్స్‌ని అమ్మే ఉద్దేశ్యంలో లేడు''

ఓహ్ శ్రీనాథ్... ఇంత బాగా మనుమల మనసుల్ని కూడా చదవగలిగావా? చెప్పింది అక్షరాలా చేసాడు. ఇతన్ని ఇలా వదిలేస్తే ఇంతింతై వటుడింతై అమ్మో.

''ప్రస్తుతానికి ఇంతే''

''రేపు ఉదయం ఓసారి ఇక్కడికిరా'' ఫోన్ పెట్టేసాడు మనోహర్.

★ ★ ★

రాత్రి ఎనిమి దాటింది.

మనో, చక్రవర్తి బాల్కనీలో కూర్చుని వున్నారు.

నెమ్మదిగా అతనివైపు చూసిందామె.

''మనో నువ్వు డైరి చదివావనుకో... అయినా జరిగిన విషయం ఒక్కసారి నా నోటితో నన్ను చెప్పనీ...

సౌందర్య ఎందుకలా నా వెంటపడి కవ్వించి- నవ్వించి, నన్ను తనవైపుకు తిప్పుకుందో నాకు ఇప్పటికీ అర్థంకాలేదు. శాస్త్రోక్తంగా పెళ్ళికాకపోయినా మనసా వాచా ఆమెను భార్యగానే స్వీకరించాను. ఎన్నిసార్లు పెళ్ళి విషయం ఎత్తినా మాట తప్పిస్తూ వచ్చింది. చివరకు తల్లి కాబోతోందని విని ఇహ పెళ్ళికి అడ్డు పెట్టదనుకున్నాను.

కాని నా ఊహలు తలక్రిందులయాయి. ''నా బిడ్డకు తండ్రి అవసరం లేదని' ఆమె చెప్పడం నా మనసు తట్టుకోలేకపోయింది. అయినా బిడ్డ మొహం చూసయినా మనసు మార్చుకుంటుందనుకున్నాను.

దురదృష్టం. ఆ బిడ్డ కళ్ళు తెరవనేలేదు. ఆ షాక్ తట్టుకోలేకపోయాను''

''మరి మీతో సాన్నిహిత్యం ఎందుకు పెంచుకుంది?''

''ఏముంది ప్రపంచం తన మాటమీద నడవాలని ఆమె ఉద్దేశ్యం. నడిపించగలనన్న శక్తి తనకుందన్న ధీమా- తండ్రిలాగే- అయినా ఆ జ్ఞాపకాలన్నీ సమాధి చేసి కొత్త జీవితం ప్రారంభించాను. అందుకే మనసంతా నా పని





మీదకు మరల్చాను. అయినా సుడిగాలిలా నువ్వు నా జీవితంలోకి ప్రవేశించావు. కన్ను మూసినా తెరచినా నిద్రలో వున్నా మెలుకువ వచ్చినా నీ ధ్యాసే. నా సమాధులే నా ఈజిప్టు రాజులే నాలోకం అనుకున్న నా మనసును మళ్ళించి నువ్వే నాలోకం అనుకునేస్థితికి తెచ్చావు''

హఠాత్తుగా మాట్లాడటం ఆపేసాడు.

నిశ్శబ్దం. ప్రపంచమే నిశ్శబ్దంగా మారిపోయిందా అనిపించింది. ''మనో... ఈమాట ఈ భావుకత్వం ఏ టీనేజ్ అబ్బాయిదో కాదు. నా నోట వస్తోంది. నువ్వు లేకుండా నా ఉనికిని కూడా ఊహించలేను మనో... ఈ విషయం ఇదివరకే అస్పష్టంగా సూచించాను నీకు. నీ అయిష్టత కూడా గమనించాను. ఆ అయిష్టత సహజంగా వచ్చినది కాదు. నీ అయిష్టత వెనకాల సంఘర్షణ నా మనసుకు స్పష్టంగా తెలుస్తూనే వుంది. అందుకే నీ మనసులో ఏముందో చెప్పెయ్యి''

కాలం ఆగిపోయినట్టు అనిపించిందామెకి. అతనికి చెప్పెయ్యాలి. అయినా మాటలు పెగలడం లేదు.

అతను గతాన్ని సమాధి చేసాడు. అది అతనికి శవంతో సమానం. మరి తనకో, ఆ గతాన్ని మనసు నట్టింట పెట్టుకుని రాత్రీ పగలూ ఏడుస్తూ... అందుకే అతను సలహా ఇస్తున్నాడు. గతాన్ని సమాధి చెయ్యమని.

''మీకు... మీకేమైనా చెప్పాలంటే, ఇరవైఏళ్ళక్రితం జరిగినది చెప్పాలి ముందు. ఇంతవరకు ఆ విషయం ఎవరితోనూ చర్చించలేదు. మాట్లాడలేదు అనేకంటే మాట్లాడలేకపోయాను అనడం బాగుంటుంది.

అప్పుడు నా వయసు పదమూడు.

''ఏం జరిగింది మనో... నీకు పదమూడేళ్ళ వయసప్పుడు?''

''మనోహర్ నన్ను రేప్‌చేసాడు''

ఆమె ఊపిరందక ఉక్కిరిబిక్కిరైంది. బాధ, అవమానం ఆమెను చుట్టుముట్టాయి. మొదటిసారిగా ఆ మాటలు ఆమె నోటినించి ఆమే వినడం షాకింగ్‌గా వుంది.

చక్రవర్తి ఒక్కక్షణం ఊపిరి పీల్చడం మర్చిపోయాడు.

''అవునా...? నిజమా...?''

ఇదివరకే ఊహించాడా నిజాన్ని అయినా ఆమె నోటివెంట వినడం, ఆమె స్వరంలో అవ్యక్తమైన వేదన, మనసులో చెలరేగిన కోపంతో అతను మాట్లాడలేకపోయాడు.

నిస్సహాయంగా చిన్నారి మనో. మనోహర్ చేతుల్లో నలిగిపోవడం అతని కళ్ళల్లో మెదిలింది. ఆ దృశ్యం మనసులోకి రాకుండా తుడిచెయ్యాలని ఎంతగానో ప్రయత్నించాడు. అయినా లాభంలేకపోయింది. తట్టుకోలేకపోయాడు.

ఆమెను మనోహర్ చేతుల్లోంచి లాక్కోవాలన్న తపనతో ఆమెవైపు కదిలాడు.

చటుక్కున మనో లేచి రైలింగ్ వైపు కదిలింది.

''ఒకరోజు రెండ్రోజులు కాదు, రెండేళ్ళు నా మనసుతో నా శరీరంతో ఆడుకున్నాడు. అతను చెప్పినట్టు తూచా తప్పకుండా చెయ్యాలి. అతని మాటల్ని పెంపుడు చిలకలా పలకాలి. నేనతని చేతిలో ఆడించినట్టల్లా ఆడే కీలుబొమ్మని. అంతే'' బాధగా కళ్ళు మూసుకుందామె.

ఆరోజు మళ్ళీ తిరిగి వచ్చిన బాధ. అతని ఆజ్ఞ అతని బోధనలు...

''నావల్లకాదు... ఊహు నా తరంకాదు. లాభం లేదు'' పిడికిలి రెయిలింగ్ మీద బిగుసుకుంది.

చక్రకర్తి కోపంతో జాలితో రగిలిపోయాడు.

''ఈ విషయం ఇంట్లో చెప్పలేదా?''

ఆమె జ్ఞాపకాల అగ్నిగుండంలో అతని స్వరం విని ఉలిక్కిపడింది. జ్ఞాపకాలతో ఇన్నేళ్ళుగా సమరం చేస్తున్నా ఏనాడూ ఇలా ఎవరి కంఠస్వరమూ అదుకుందుకు రాలేదు. ఆమె మనసులో రోదనే మిగిలేది.

''నేనిహ ఒంటరిదాన్ని కాదు'' కళ్ళెత్తి చక్రవర్తి వంక చూసింది. అతను ఆమెనే చూస్తున్నాడు. ఆ కళ్ళల్లో బాధ, కోపం. ఆ బాధ, కోపం ఆమె మనసులోవి. అతని కళ్ళలో ప్రవహిస్తున్నాయి.

‘‘నేను ఒంటరిదాన్ని కాదిక’’

ఇహ ప్రేక్షకుడిలా చూస్తూ కూర్చోడం చక్రవర్తికి సాధ్యంకాలేదు. ఒక్కంగలో మనోదగ్గరకు వెళ్ళి ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

‘‘ఆగండి’’ ఏదో చెప్పాలనుకుంది. హఠాత్తుగా మనసు శూన్యమైనట్టనిపించింది. శరీరం మైనపు ముద్దలా కరిగిపోతున్న భావన. హఠాత్తుగా ఏడవడం మొదలెట్టింది. చక్రవర్తి గుండెల్లో తలదాచుకుని ఇంట్లోంచి పారిపోయిన పదిహేనేళ్ళ అమ్మాయిలా ఏడుస్తోంది.

చక్రవర్తి ఆమె వీపు నిమిరాడు ఓదార్పుగా, జుట్టు సవరించాడు. చెక్కిళ్ళను స్పర్శించాడు. ఒక్క మాటా లేకుండా ఇద్దరూ చాలాసేపు అలా వుండిపోయారు. కొంచెం కొంచెంగా మనో దుఃఖం నెమ్మదించింది. వెక్కిళ్ళు ఆగిపోయాయి. అప్రయత్నంగానే ఆమె చేతులు అతని వీపుని గట్టిగా పట్టుకున్నాయి.

‘‘తరువాత జరిగినవి మీకు తెలుసుగా?’’

‘‘ఊహూ... చెప్పు... నువ్వే చెప్పు’’

చెప్పింది మనో!

చక్రవర్తి చేతులు ఆమెచుట్టూ బిగుసుకున్నాయి. ఒంటిని కసిగా నలిపి పోగెయ్యటం తప్ప కౌగిలిలో ఇంత సుఖం వుంటుందని వూహించని ఆమెకు ఆ సుఖం మొదటిసారి అనుభవంలోకి వచ్చింది. ఒళ్ళంతా తేలిపోతున్నట్టు, పరిసరాలు కొత్తగా... ఇంకేదో రాబోయే దానికి ఆత్రంగా ఎదురుచూస్తున్న భావన.

అర్ధరాత్రి దాటి వుంటుంది. అతని ఊపిరి వెచ్చగా ఆమె ముంగురులను ఊయల్లూగిస్తోంది.

ఎప్పటిలా అతని స్పర్శతో ఆమె శరీరం కుంచించుకుపోడంలేదు. కృంగిపోవట్లేదు. మొహం అతని గుండెలవైపు తిప్పింది. అక్కడ జీవితం నిశ్చింతగా నిద్రపోగలదనిపించింది.

అతని మొహం చూడాలనే ఉద్దేశ్యంతో తలెత్తింది. అతని కళ్ళు ఆమె అణువణువునూ ప్రేమగా నిమిరాయి. తల కొంచెం ముందుకు వాల్చి పెదవులతో రహస్యాలు పంచుకుంటున్న క్షణాలవి. గతాన్ని మరచిపోయి ఆమె అతన్ని స్వీకరించగలిగితే... అది జరుగుతుందా?

‘‘మనో ఇకపైన మనిద్దరం ఒంటరివాళ్ళం కాదు. నాకు నువ్వు, నీకు నేను. అంతే... ఇప్పటికే ఒంటరిజీవితాన్ని గడిపి గడిపి విసిగిపోయాం. గతంనించి పారిపోతూ నువ్వు, గతంలో నన్ను నేను మర్చిపోతూ నేను, ఇహ చాలా ఒంటరితనం... ఇకపైన కష్టమైనా, సుఖమైనా కలిసే అనుభవిద్దాం’’

మనో అతని స్వరం వింటోంది. ఆ స్వరంలో ఎంత సాన్నిహిత్యం, ఎంత ఆత్మీయత. మొదలు అతని మాటలు వినడం ఆరంభించింది. తరువాత ఆ మాటలు సంగీత స్వరాలై ఆమె మనసును పూర్తిగా వశపరచుకున్నాయి. ఆ స్వరాలు ఆమె శరీరంలో ఇంకిపోయి ఆమెలో ప్రవహించసాగాయి. కళ్ళు మూసుకుందామె నిశ్చింతగా.

‘‘చక్రవర్తీ... మీరు మాటల్లో చెప్పగలిగారు. నేను చెప్పలేకపోయాను. కాని మనిద్దరి భావాలూ ఒకటే. మీరు లేకుండా నేను మిగిలిన జీవితాన్ని ఊహించలేను’’

చక్రవర్తి ఆశ్చర్యం దాచుకోలేకపోయాడు.

‘‘ఈ మాటలు నీ నోట్నించి రావాలని ఎన్ని కలలు కన్నానో తెలుసా?’’

‘‘అసలు ఇలాంటి రోజు నా జీవితంలో వస్తుందనుకోలేదు. మనోహర్ ప్రవర్తన నాకు జీవితం మీద విరక్తిని కలిగించింది’’ అంది మనో అరమోడ్పు కన్నులతో.

ఇద్దరిచుట్టూ నిశ్శబ్దం.

చెక్కిళ్ళు నిమురుతున్న అతని చేతివేళ్ళు నెమ్మది నెమ్మదిగా కిందకు జరిగాయి. మెడను తడిమి ఆపైన... ఒక్కసారి తుళ్ళిపడింది మనో. చీకటి దయ్యాల్లా వెన్నాడుతూ మనోహర్ జ్ఞాపకాలు.

‘‘వద్దు... వద్దు’’ ఆ మాటలు ఆమె పెదవులు దాటి రాలేదు. ఆ జ్ఞాపకం ఓ చీకటి తెరలా తొలగిపోయింది.

అతనే ఆమెను గదిలోకి నడిపించాడో, ఆమే నడిచి వచ్చిందో ఇద్దరికీ తెలీదు.

ఇదివరకంతా అసహ్యించుకున్నట్టు నగ్నత్వం ఈసారి భయపెట్టడంలేదు. మాటల్లో




అతను ఎప్పుడు నైటీని తప్పించాడో తెలీనేతెలియదు.

"ఓహ్... వీనస్ శిల్పంలా... చీకట్లో కూడా నీ ఒళ్ళు తళుకులీన్తోంది"

ఆ స్వరం ఆమె ఉద్విగ్నమైన మనసును లాలించింది. చల్లటి గాలి అణువణువునూ స్పర్శించింది. ఇప్పుడిక... వద్దు... వద్దు... వద్దు... ఆ నరకం వద్దు. భయంగా కళ్ళు మూసుకుంది.

చక్రవర్తి చేతులు ఆమె అణువణువునూ స్పర్శిస్తున్నాయి.

హఠాత్తుగా అతని పెదవులు ఆమెను ముద్దాడాయి. మెలికలు తిరిగిపోయింది మనో. ఒళ్ళంతా విద్యుత్తు ప్రవహించినట్టు... అణువణువూ ముద్దాడుతూ... ఓహ్... ఏమిటీ భావం. శరీరంలో ప్రతి అణువూ కోరికను ఉత్తేజపరచ గలదని మొదటిసారి గ్రహించిందామె. భయం వేడి తగిలిన మంచుతెరలా కరిగిపోయింది.

"మనో... బయట చూడు... ఆ వెన్నెల.. వెన్నెల్లో ఇసుక తెన్నెలు ఎంతందంగా వుంటాయో తెలుసా? ఓ గంట వాకింగ్‌కి వెళ్దొద్దామా?"

"ఇప్పుడా? ఈ అర్ధరాత్రి..."

"వెన్నెల రాత్రిపూట కాక పగలు వస్తుందా?"

"అయినా..."

"ఏం ఓపికలేదా? నేను ఎత్తుకు తీసుకెళ్ళనా?"

అయిష్టంగానే లేచింది మనో.

పగలు ఎంత వేడిగా వుందో రాత్రి అంత చలిగా వుంది బయట. ఆ చలిలో, వెన్నెల్లో నడక... ఆ మాధుర్యం అనుభవిస్తేనే తెలిసేది. ఇసకమీద ప్రతిఫలిస్తున్న వెన్నెల బంగారు తీగల్తో పలకసర్లను కూర్చినట్టనిపిస్తోంది. చక్రవర్తి ఏవేవో మాట్లాడుతున్నాడు. వినడం మనోవంతైంది.

తిరిగొచ్చేసరికి లాడ్జింగ్ ముందంతా జనాలు, చాలామంది నైట్ డ్రెస్‌లోనే వున్నారు. కంగారుగా మాట్లాడుకుంటున్నారు అరబ్‌లో.

"ఏమిటి హడావిడి? ఏం జరిగింది?"

గబగబా ముందుకు వెళ్ళి ఎవరినో ఏదో అడిగాడు చక్రవర్తి. అతను చెప్పింది వినగానే చక్రవర్తి మొహం పాలిపోయింది.

"మర్డర్ అటెంప్ట్! సిక్స్త్ ఫ్లోర్‌లో... లోపలికి గ్యాస్ వదిలారెవరో. అది మండుతోంది. ఆ రూమ్‌లోవాళ్ళు మరణించి వుండచ్చని భావిస్తున్నారు"

"సిక్స్త్ ఫ్లోర్ ఏ నంబర్ రూమ్...?" వణుకుతున్న పెదవుల్తో అడిగాడు చక్రవర్తి.

"వన్ అండ్ టు"

వింటూనే నిశ్చేష్టురాలైంది మనో.

"ఇక్కడ... ఇక్కడ కూడా..." తలెత్తి అతని వంక చూసింది.

"మనం బయటకు వెళ్ళకపోయివుంటే ఈపాటికి..." ఆపైన ఆలోచించే ధైర్యం లేకపోయిందామెకు.

"ఒక్కసారి పైకి వెళ్ళి చూద్దాం. చూడకుండా ఎలాంటి నిర్ణయాలూ తీసుకోలేంకదా"

చక్రవర్తిని చూస్తూనే ఆశ్చర్యం, సంభ్రమం వ్యక్తంచేశాడు హోటల్ మేనేజర్.

"మీరు... మీరు రూంలో లేరా?"

"వెన్నెట్లో వాకింగ్‌కి వెళ్లామనిపించి..."

లేచి వచ్చి అతన్ని కౌగిలించుకున్నాడాయన. "భగవంతుడే మిమ్మల్నా కోరిక రూపంలో ప్రమాదంనించి బయటకు లాక్కెళ్ళి వుంటాడు. అగ్నిప్రమాదం ఎలా జరిగిందో తెలీదు. మీకు వేరే రూమ్ ఏర్పాటు చేస్తాను. మీ లగేజ్ పంపిస్తా. సారీ ఫర్ ది ఇన్‌కన్వీనియెన్స్"

"ఒకసారి పైకి వెళ్ళి చూడచ్చా"

"వైనాట్... పదండి వెళ్దాం"

ముగ్గురూ పైకి వెళ్ళారు. రెండుగంటల క్రితం వరకూ కూర్చుని మాట్లాడుకున్న బాల్కనీ, నల్లబారిన గోడలు, రూఫ్... అప్పటికే రంగంలోకి దిగిన రెస్క్యూ అంతా సరిచేస్తున్నారు. మిగతా రూమ్‌ల వాళ్ళు భయంతో ఖాళీ చేసి కిందకు వెళ్ళిపోయారు. రెండు గంటల క్రితం చక్కగా గదులతో, పరదాలతో, లైట్లతో

వెలిగిన ఆ అంతస్థు ఇప్పుడు నల్లబారిన గోడలు, రూఫ్, కాలిన తలుపులతో...

ఇహ వెనక్కు తిరిగి కిందకు వెళ్దామనుకుంటుండగా వినబడిందో పిలుపు.

మానేజర్‌తోపాటు అటు వెళ్ళిన చక్రవర్తి, మనో అప్రయత్నంగా ఓ అడుగు వెనక్కు వేశారు. నగం కాలి పడిపోయిన తలుపుకింద ఓ శవం.

"శ్రీనాథ్..." పైకి రాబోయిన ఆ మాటలు చక్రవర్తి చెయ్యి నొక్కటంతో అతి ప్రయత్నంమీద ఆపుకుంది.

మనసులో ఏ మూలో బాధనిపించింది. అంతలోనే అది తనమీద హత్యాప్రయత్నమన్న నిజం కళ్ళముందు గోచరించింది.

"చివరికి నా భయమే నిజమైంది చూడండి..."

"కాని మనో చూశావుగా... ఏ శక్తి మనల్ని రక్షించిందో ఆశక్తిమీదే భారంవేసి మిగిలిన జీవితాన్ని గడుపుదాం. శ్రీనాథ్ గురించి నోరు మెదపకు. అనవసరంగా గొడవల్లో ఇరుక్కుపోతాం"



శ్రీనాథ్‌ని అర్జంటుగా పిలిచిన మనోహర్ అతనా రాత్రి రాగానే ప్లేన్ టికెట్స్ చేతిలోపెట్టాడు.

"ఏమిటవి...?"

"ఒకటి బాంబే ప్లేన్ టికెట్. మరొకటి లక్జర్ టికెట్. నువ్వు ఓ గంటలో బయల్దేరి వెళ్ళాలి. రాత్రి పన్నెండుకి ప్లేన్"

"నేను ఈజిప్ట్... లక్జర్‌కి వెళ్ళడమా? వెళ్ళి ఏం చేయడం?"

"ఇదిగో... ఇటు చూడు"

మనోహర్ చేతిలో స్ప్రే బాటిల్. పైన రూమ్ ఫ్రెషనర్ అని లేబుల్. అది చేతిలోకి తీసుకున్నాడు. ఇంతలో అతని పెంపుడుపిల్లి వచ్చి అతని కాళ్ళదగ్గర కూర్చుంది.

ఆ రూమ్ ఫ్రెషనర్ మూత తీసి ఆ పిల్లి మొహంమీద స్ప్రే చెయ్యడం, రెండుక్షణాల్లో అది గిలగిలా తన్నుకుని ప్రాణాలు విడవడం జరిగింది.

"ఇందులో వున్నది రూమ్ ఫ్రెషనర్ కాదు. సైనైడ్‌గాస్. కొత్తగా కనుక్కున్నారు. ఈ రెండో దాంట్లో మరోరకం గ్యాస్. ఈ కొంచెం చాలు పెద్ద అగ్నిప్రమాదం సృష్టించడానికి. ఇహ వాళ్ళిద్దరూ ఈజిప్ట్‌కి వెళ్ళారన్న నీ ఊహ కరెక్టే. వాళ్ళు ఎక్కడ వున్నదీ కూడా కనుక్కున్నాను. నీ పనల్లా ఒకటే. ఏ అర్ధరాత్రో వెళ్ళి తలుపు తట్టి పిలుస్తావు. కొత్తవాడివి కాదు గనక పెద్ద ఇబ్బంది వుండదు. ఈ గ్యాస్ వాళ్ళ మొహంమీద స్ప్రే చెయ్యడం లేదా రెండోదిరూంలో వదిలి, ఓ అగ్గిపుల్ల... బస్... అంతే"

"మరి... పట్టుబడితే..."

"పట్టుబడడమా? ఆ ప్రశ్నేలేదు. ఈ పనికి ఎంత ఖర్చు పెడుతున్నానో తెలుసా? కొన్ని లక్షలు. పని పూర్తవుతూనే ప్లేన్ వుంది నీకు. ఇక్కడికి వచ్చేసరికి నీకోసం ఓ వెల్ ఫర్నిచర్డ్ ఫ్లాట్ నీ పేరుతో రిజిష్టరై వుంటుంది. ఓ డిటెక్టివ్ ఏజన్సీలో నీకో ఉద్యోగం కూడా చూశాను"

ఆ బాటిల్స్ అందుకుని ఓసారి పిల్లిమీదే స్ప్రేచేసి చూసుకున్నాడు.

మనోహర్ ఎయిర్‌పోర్ట్‌కి కారులో తీసుకెళ్ళి బ్రీఫ్‌కేస్ కొత్తది అందించాడు.

'ఈ దెబ్బతో ఈ అస్తవ్యస్తపు జీవితం ఓ దారికి వస్తుంది' ఇది శ్రీనాథ్ ఊహ.

'ఒక దెబ్బకు రెండు పిట్టలు' మనసులో ఉప్పొంగిపోయాడు మనోహర్.

మనోహర్ తనకి ఇచ్చిన రెండోబాటిల్‌లో వున్నది పవర్‌ఫుల్ లిక్విడ్ ఎక్స్‌ప్లోజివ్ కూడా అని శ్రీనాథ్‌కి తెలియదు. అందుకే సిక్స్త్





ఫ్లోర్‌లో రెండో నంబర్ గదిముందు ఆగి, తలుపుకొట్టకుండా, తలుపుల కిందనుంచే గ్యాస్ వదిలి, మంటపెడదామని, అంతగా వాళ్లు బయటకు రాగలిగితే అప్పుడే స్ప్రే వుపయోగించాలని అనుకున్నాడు. కానీ అత ను ఆ లిక్విడ్ గ్యాస్ స్ప్రే చేసీచేయకముందే పెద్ద శబ్దంతో పేలి మంటలు వ్యాపించి అతణ్ణి పైలోకాలకి పంపాయి.

★ ★ ★

మూడు నెలల త్రవ్వకాల తరువాత లక్షర్ ఎయిర్‌పోర్టులో మనోని రిసీవ్ చేసుకున్నాడు చక్రవర్తి.

"అప్పుడే మూడు వారాలు దాటింది నిన్ను చూసి" ఆత్రంగా ఆమెను దగ్గరకు తీసుకు న్నాడు.

మనోకి హైదరాబాద్ ట్రాన్స్‌ఫరై రెండు నెల లు. ఇద్దరూ పెళ్లి చేసుకుని నెలన్నర. ఆ పెళ్లికి ఎక్కువగా సంతోషించింది శ్రీనివాస్, సోనీలు.

"నువ్వు లేకుండా సమాధిలోకి అడుగు పెట్టాలనిపించలేదు. అందుకే నిన్ను అర్జంటుగా రమ్మన్నది"

రెండు వేల సంవత్సరాల క్రిందట కట్టిన మెట్లు వెచ్చటి ఎడారి కింద గచ్చు పగిలి గరుగ్గా వుంది. మధ్యమధ్యన రాతి ప్రదేశాలు, మళ్లీ మెట్లు, క్రిందకి నేలమాళిగలోకి, లోపలికి చీకటిలోకి, మూడు వందల గజాల పైనున్న కారిడార్.

ముందు చక్రవర్తి, మనో, రోస్నీ పవర్‌ఫుల్ లైట్స్‌తో వెనకాల పనివాళ్లు పార పలుగుల్తో ఇరుకైన దారుల వెంట నడుస్తూ మయసభలా వెళ్లిన ద్వారం గుండానే వెనక్కి వస్తూ, కారిడార్ చివరకు వెళ్లి మళ్లీ మొదటికి వస్తూ... చక్రవర్తి వివరించాడు, "దొంగలను మభ్యపెట్టేందుకు ఫరవ్‌ల పనివాళ్లు ఈ టెక్నిక్ ఉపయోగించా రు" చివరకు ఎన్నో లెక్కలేసి జాగ్రత్తగా కదిలాక కనిపించిందో రాతిద్వారం. అది ఓ పెద్ద రాతి పర్వతంలో ఓ బీటలావుంది. ఆ చదరం మీద పడగలు విప్పి ఆడుతున్న పాముల చిత్రాలు. పరాకుగా చూస్తే పాములే అనిపించేలా ఉన్నాయా రాతి చెక్కడాలు... వాటి రంగులు. కాలు ముందుకేస్తే కన్నున కాటేస్తాయా అనేంత సహజంగా వున్నాయి.

"మంచి టెక్నిక్" రోస్నీ నవ్వాడు. ఎంత ప్రయత్నించినా లోపలికి వెళ్లేమార్గం తోచటం లేదు. పనివాళ్లు గడ్డపారల్తో ప్రయత్నించారు. కొంచం తలుపు లూజయింది తప్ప కదల్లేదు.

చక్రవర్తి ఆ రాతి తలుపు మీద చెయ్యేసి చూశాడు. వేడిగా వుందది.

"చూద్దాం" అతని స్వరంలో ఉత్సుకత. ఈ క్షణం కోసం ఎన్ని యుగాలుగా నిరీక్షణ. ఇప్పుడిక ఈ రాతి ద్వారం ముందు నిలబడి లోపల ఆశించిన సమాధి వుందో... దొంగలు దోచుకుపోయిన శూన్యమందిరమే వుందో, ఒట్టి శవాన్ని ఒదిలి వెళ్లిపోయారో... ఒక్క క్షణం కళ్లుమూసుకున్నాడు.

వాళ్లక్కడికి వచ్చే ముందే ఆ తలుపును కనిపించకుండా రాతి రంగులో వాడిన లక్క ను చెక్కి తీసేసారు. ఇప్పుడు గడ్డపలుగుల్తో తలుపును తొలగించాలన్న ప్రయత్నం గోడకీ తలుపుకీ మధ్య సందులో చిన్నచిన్న చెక్కముక్కల్నుంచి, మరీ ప్రయత్నాలు సాగిస్తున్నారు. నాలుగు గంటల నిరంతర ప్రయత్నం తరు వాత తలుపు కొంచం కదిలింది. రోస్నీ చక్రవ ర్తితో సహా ప్రయత్నించాక ఓ మనిషి మాత్రం దూరగల సందు ఏర్పడింది. చక్రవర్తి, వెన కాల రోస్నీ ఆ వెనక మనో ఆ సందుముందు నిలబడ్డారు. వెలుగు ఆ సందులోంచి పరుగు లు పెట్టి లోపలి గోడల్ను ఉత్తేజ పరుస్తోంది. ఆ గది మూలలేవీ చూపుకందట్లేదు. అంటే ఆ గది చాలా విశాలమైనదై వుండాలి. కాని చక్రవ ర్తి గది వైశాల్యం గురించి ఆలోచించటం లేదు. ఆ తలుపుకి ఎదురుగా గోడ మీద చెక్కిన పేరు... అది ఫరవ్ సీలు. చేతిలో లైట్ ఆ వైపు తిప్పి చూశాడు హేరీ గ్లిఫిక్స్‌లో చెక్కిన ఆ పేరు టెంకౌరా. అప్రయత్నంగా అతని పెదవులా పేరును ఉచ్చరించాయి.

"మనో టెంకౌరా" గట్టిగా చెప్పాడతను.

ఆ మాటే మరోసారి రోస్నీకి చెప్పి, అతన్ని కౌగిలించుకున్నాడు.

ఒకరి వెనక ఒకళ్లు లోపలకు నడిచారు.

లైట్ల వెలుగులో గోడల్ను పరిశీలిస్తున్నారు. ఆ గోడల మీద స్తంభాల మీద, రూఫ్ మీద పెయింటింగ్ చెక్కుచెదలేదు.

"ఇంత వరకూ ఎవరూ అడుగు పెట్టలేది క్కడికి" టెంకొరా సమాధి దోపిడీ దొంగల కళ్లబడలేదు. శతాబ్దాలుగా ఇది ఇలాగే అసూర్యంపశ్యలా చక్రవర్తి స్పర్శకోసం ఎదురు చూస్తూ ఉండిపోయింది. గది మధ్యలోకి నడిచారు.

"మైగాడ్" రోస్నీ ఆశ్చర్యం! అతనికి నోటి వెంట మాటరాల్లేదు. ఆ వెనకాలే పనివాళ్లు ఎక్కడి వాళ్లక్కడ శిల్పాలైపోయారు. వాళ్ల మధ్య లైట్ల వెలుగులు అవసరం లేనట్టుగా బంగారం జిలుగు. గోడ షెల్ఫ్‌లలో బంగారపు ఇటుకలు. ట్రాన్స్‌పరెంట్ జార్‌లలో అపురూప మైన నగలు, వజ్రాలు, వైఢూర్యాలు. చెక్క కంటెయినర్‌లలో ధనరాసులు, మూలికలు, చెక్కబోర్డులు, ఆ బోర్డ్‌ల మీద ఓ ఆవు, చిన్నచిన్న ఆకారాలు, మరణం తరువాత రాజుల సేవకై వినియోగించబడిన ఆకారాలు. గోడల మీద, పిల్లర్లమీద, సీలింగ్ మీద ప్రతి అంగుళం చిత్రకళతో శిల్పకళతో నిండిపోయి వుంది.

ఆ ఎడారిలో ఆ తీవ్రమైన వేడి క్రింద చీకటిలో పగలు ఎలా జిగేల్మని మెరుస్తామో అలాంటి మెరుపుతోటే తళుకులీనుతున్న పెయింటింగ్స్.

చక్రవర్తి, మనో, రోస్నీ గదులన్నీ తిరిగారు. సజీవంగా వున్నట్టనిపిస్తున్న టెంకొరా చిత్రపటాలు, అతను, అతని భార్యపి గోడలన్నీ చిత్రాలే.

"మైగాడ్... ఇవన్నీ... ఇవన్నీ నిజమేనా?"

చివరికి శవగృహాన్ని చేరుకున్నారు. నలుచదరంగా ఉన్న గది గోడలమీద టెంకొరా జీవిత సత్యాలు చిత్రాలుగా.. ఆ గది మధ్యలో ఓ రాతి శవపేటిక. దాని మీద టెంకొరా చిత్రం, ఇసిస్ దేవతా చిత్రం. మూత బిగిసివుంది. లోపల శవం ఉన్నందుకు గుర్తది. "చివరికి సాధించావ్ చక్రవర్తీ"





చక్రవర్తి కలలోలా నడుస్తున్నాడు. శిఖరాగ్రాన్ని చేరుకున్నట్టుంది అతని మనః స్థితి. ఊపిరందక ఆయాసపడుతూ, కాస్త అయోమయంగా జీవిత గమ్యం సాధించినట్టుగా, పక్కన మనో... ఎదురుగా కోరుకున్న గమ్యం.

ఆ గదిలో ఆ సంపదల మధ్య వేలకొద్దీ వస్తువులను ఎంతో గౌరవంతో ఆ గదిలోకి చేరవేసి వుంటారు. అంతులేని సంపద, అనమానమైన చిత్రాలు, శిల్పాలు ఈ గదిలో... మనోతో తను. ఇంకా మిగిలిన ఏడు గదుల్లోనూ గతం గురించి చరిత్ర గురించీ అమూల్యమైన వస్తువులుండి వుంటాయి. ప్రతి పరిశోధకుడూ ఇలాంటి రోజు కోసమే కలలుగంటాడు. అక్కడో ఇక్కడో వేళ్లమీద లెఖ్క పెట్టేంత తక్కువ మంది మాత్రం కలలు నిజం చేసుకోగలరు.

రోస్నీ ముందుకు వాలి. మోకాళ్ల మీద వంగి సమాధి చిత్రాన్ని గీస్తున్నాడు. ఆ సంపదల గురించి ప్రభుత్వం నిర్ణయిస్తుంది. అది మిగతా ఫరల్‌ల మమ్మీలాగానే వుంది. శతాబ్దాలుగా వాడుతున్న లేపనాలనే వాడి వుంటారు. అదే వాసన. ఆ శిలా ఫలకం ఎత్తాలంటే అంగుళానికో మనిషి చొప్పున కావాలి. ఆ లోపల కూడా అపారమైన సంపద... బంగారంలా వజ్రవైఢూర్యాలుగా వుండే వుంటుంది. ఒక దానిలో ఒకటి పేటికలు పేటికలుగా వుంటూనే వుంటాయి. ఆ పేటికలో బంగారంతో వజ్రవైఢూర్యాలు పొదిగి మరీ వుంటాయి. ఒకదానిలో ఒకటి... ఒకదానిలో ఒకటి అలా చివరకు మమ్మీ వుంటుంది. వందలకొద్దీ గజాల మృదువైన బట్టలో చుట్టి ఆ పొరల చివర్న టెంకొరా సజీవ శిల్పంలా చర్మం, జుట్టు... చాలా మామూలుగా వేల సంవత్సరాల మరణం తరవాత కూడా సుస్పష్టమైన ఆకృతితో...

ఆ సమాధి కనుక్కోవడమే ఒక ఎగ్జైట్‌మెంట్. కానీ చక్రవర్తికి మాత్రం ఆ గోడల మీద చిత్రాలు, శిల్పాలమీద, సమాధి మీద అక్షరాలు అమూల్యమైనవి. వంట పాత్రలు ఆట వస్తువులు ఫర్నిచర్... అవన్నీ అతన్ని మూడు వేల సంవత్సరాల వెనక్కు సజీవంగా లాక్కెళ్లగలవు. గత చరిత్ర అతని ఊపిరి. గతాన్ని వర్తమానంతో జోడించటం అతని హాబీ. ఒకటి బంగారు పళ్లెమైతే, మరొకటి గోడ.

ఆ సమాధి అతనిది - చిన్నపిల్లాడిలా సంబరంగా వుందతనికి.

"కనీసం ఓ ఏడాది పని- ప్రతి వస్తువూ లిస్ట్ రాయాలి. ఇక్కడ్నించి తరలించాలి. అవునా?" రోస్నీని ప్రశ్నించాడు.

"తక్కువలో తక్కువ ఏడాది కావాలి. తొంద రపడటం ఎందుకు? ఇబ్బందులు పడట మెందుకు?".

"ఇంతవరకు ఎంతమంది గార్డ్స్ ఉన్నా రు?"

"ముగ్గురు"

"సరిపోరు కదా! లోకల్ పోలీస్ హెల్ప్ అడుగుదాం. కైరోనించి ప్రభుత్వం పంపేవ రకు"

"మన పని మాటేమిటి?"

"అదిప్పుడు మనం ఒంటరిగా చెయ్యలేం పురావస్తుశాఖ- టూరిజానికి సంబంధించిన డైరెక్టర్ని పిలవాలి... వాళ్ళ సహాయ సహకారా ల్లేకుండా మనం ఏం చెయ్యలేం. ఇది ఎంత పెద్ద విషయమంటే అధికార్లని తృప్తిపరచక పోతే ఈజిప్ట్ ప్రభుత్వం నన్ను బయటకునెట్టి దీన్ని ఆక్రమించుకోగలదు. అలా వద్దు. మనకూ కాస్తో కూస్తో దక్కనీ"

"అవును- ఇదంతా మీ చలవేగద..."

"ఇది ఈజిప్టు సంపద. చాలావరకు ఈజిప్టు కే చెందాలి. డబ్బు సంపదలు కాదు. ఈ సమాధి నా పేరుతో ముడివడి వుండాలి. రోస్నీ! గార్డ్స్ గురించి చూడు. నేను కైరో వెళ్ళి జనాలతో మాట్లాడతాను. ఈ రాత్రికే ఇక్కడ గట్టి ఏర్పాట్లు చెయ్యాలి. వారం పది రోజుల్లో పని మొదలెట్టచ్చు"

రోస్నీ వెళ్ళాడు. పనివాళ్ళు లంచ్ చెయ్యా టానికి పైకి వెళ్ళారు. చక్రవర్తి- మనోతోపాటు ఆ గదులన్నీ మళ్ళీ మళ్ళీ పరిశీలించాడు.

టెంకొరా ఫరల్ శోధన ఒక విజయం, అపూర్వ ధనరాసులు దొరకటం మరో విజయం.

ఇద్దరూ ఒకరి చేతులొకళ్ళు పట్టుకుని, మళ్ళీ ఈ ప్రపంచంలోకి వచ్చి పడ్డారు.

టి.వి.లో అతని ఇంటర్వ్యూ కవర్ చేసారు. పక్కనే మనో.

"నా ప్రతి విజయానికీ కారణం - నా పక్కనున్న నా అర్ధాంగి" సగర్వంగా చెప్పుకు న్నాడు.

విషయాలన్నీ తెలుసుకున్న మనోహర్ కో పంతో బుసలుకొట్టాడు.

★ ★ ★

ఆర్నెల్ల తరువాత.

అర్ధరాత్రి,

చక్రవర్తి కౌగిట్లో గువ్వలా ఒదిగి పడుకున్న మనోని ఫోన్ శబ్దం నిద్రలేపలేకపోయింది.

ఆమెకు మెళుకువ రాకుండా చెయ్యి చాపి ఫోనందుకున్నాడు చక్రవర్తి.

"హల్లో... ఎమర్జెన్సీ కేస్... మాసివ్ హార్ట్ఎ టాక్... వాన్ పంపించమంటారా?"

హాస్పిటల్‌నించి.

"వద్దు... కారులో వస్తాం" ఫోన్ పెట్టేశాడు చక్రవర్తి.

ఆరో నెల కూడా దాటిపోయిందేమో కొంచెం ఆయాసపడుతూ పనిచేస్తున్న మనోని చూస్తే అతనికి బాధగా వుంది. ఇప్పుడు హాయిగా, విశ్రాంతిగా నిద్రపోతున్న ఆమెను లేపి,

రెండు నిమిషాల తరువాత చక్రవర్తి టీ పట్టుకువచ్చేసరికి లేచి జుట్టు సరిచేసు కుంటోందామె.

"లేచావా? నిన్నెలా లేపాలా అని ఆలోచిస్తు న్నాను"

"ఇవి అలవాటేగా"

టీ అందుకుని కళ్ళతోటే కృతజ్ఞతలు తెలి యజేసింది.

ఆమె డ్రెసప్ అయి బయటకు వచ్చేసరికి కారు గారేజ్‌లోంచి బయటకు తీసి సిద్ధంగా వున్నాడు చక్రవర్తి.

"నిన్నీ స్థితిలో ఇలా రాత్రనకా పగలనకా తిప్పటం ఏ మాత్రం ఇష్టంలేదు... కానీ..."

"జబ్బులు మన సదుపాయాలను బట్టి రావుగా..." చాలా తేలిగ్గా జవాబిచ్చింది మనో.

''మన చిన్నారి గురించి కూడా ఆలోచించాలిగా'' ఓ చేత్తో డ్రైవ్ చేస్తూనే మరో చేత్తో ఆమె పొత్తికడుపుమీద నిమిరాడు.

''మీరు నీడగా వున్నంతవరకు- మేం సౌఖ్యంగానే వుంటాం. కాదంటే మీ కప్పుడప్పుడిలా డ్రైవర్ పని తప్పదు''

''ఎట్ యువర్ సర్వీస్ మాడమ్''

కారు హాస్పిటల్ ద్వారం ముందాగింది.

రిసెప్షన్‌లో పట్టపగల్లా జనం. ఆ గందరగోళం నందడే చెప్తున్నాయి, వచ్చిన పేషంట్ చాలా గొప్పవారెవరో అయ్యుండాలని.

ఓసారి చక్రవర్తివంక వీడ్కోలుగా చూసి లోపలకు నడిచింది మనో.

''డాక్టర్, మోహితగారు వచ్చారు. ఇహ బెంగపడాల్సిందేంలేదు. ఆవిడ హస్తవాసి చాలామంచిది''

ఒకరికొకరు ధైర్యం చెప్పుకుంటున్నారు. అప్పటివరకు బాగానే ఉన్నాడు. మాట్లాడుతూ మాట్లాడుతూనే ఒక్కసారి చెమటలు పట్టి వాలిపోయాడు...

''ఒకవేళ ఏదైనా జరిగితే... మనగతేమిటి?''

ఓ చిన్న రాజకీయనాయకుడి ఆవేదన.

''ఇంతకీ పేషంట్...'' చక్కవర్తి ప్రశ్న పూర్తికాలేదు.

''ముఖ్యమంత్రిగారు''

ఉలిక్కిపడ్డాడు చక్రవర్తి.

''మనోహర్''

''అవును. ఆయనే...''

చక్రవర్తి ముందుగా ఆలోచించినది మనో గురించి. ఒకసారి లోపలకు వెళ్ళి మనోతో మాట్లాడదామనిపించింది.

ఆమె మనసెంతగా ఘర్షణ పడుతోందో...

ఇహ ఆగలేక డాక్టర్స్ రూమ్‌వైపు కదిలాడు.

కాని అప్పటికే డాక్టర్లందరూ ఇంటెన్సివ్ కేర్ యూనిట్‌లోకి వెళ్ళిపోయారు.

నిట్టూర్చి వచ్చి రిసెప్షన్‌లో కూర్చున్నాడు.

ఇంటెన్సివ్ కేర్ యూనిట్‌లో మనోహర్ మొహం చూస్తూనే ఉలికి పడింది మనో...

ఒళ్ళంతా ఒక్కసారి బిగుసుకుపోయింది.

వీడికి, ఈ నరరూప రాక్షసుడికి... ట్రీట్‌మెంటా... ఒక అడుగు వెనక్కు పడింది. మళ్ళీ అంతలోనే తమాయించుకుంది.

గబగబా పేషంట్‌ని కార్డియాలజీ డిపార్ట్‌మెంట్‌కి షిఫ్ట్‌చేసారు.

చేయవలసిన ప్రథమ చికిత్స ఇదివరకే చేసాడు డ్యూటీ డాక్టర్.

''బ్లడ్ షుగర్''

ఆమె నోటివెంట మాట రాకముందే గ్లూకోమీటర్ తెచ్చి అమర్చారు.

సెకండ్స్‌లో షుగర్ రీడింగ్ చూపించిందది.

హై బ్లడ్ షుగర్.

అదే హార్ట్‌ఎటాక్‌కి కారణం అయి వుంటుంది.

''బి.పి''

క్షణంలో వచ్చింది బి.పి. రీడింగ్. చకచకా ఇవ్వాల్సిన మెడిసిన్స్ చెప్పింది.

హఠాత్తుగా ఒక్కక్షణం ఆగిపోయిందామె. ఫ్లాష్ ఆలోచన...

దాదాపు రెండు గంటల తర్వాత స్పృహ వచ్చిందతనికి. ప్రమాదం తప్పింది. స్పెషల్ ఏ.సీ. రూమ్ అరేంజ్‌చేశారు. పేషంట్‌ని జాగ్రత్తగా ఆ రూమ్‌లోకి మార్చారు. ఆ గది హాస్పటల్ గదిలా లేదు. ఫైవ్‌స్టార్ హొటల్‌లో ఖరీదైన గదిలా వుంది. కిటికీలకు ఖరీదైన కర్టెన్లు... నిశ్శబ్దంగా, ప్రశాంతంగా...

నిర్వికారంగా బెడ్‌మీద పడుకునివున్న మనోహర్ తలుపు తీసిన శబ్దానికి తల తిప్పి కళ్ళెత్తి చూశాడు. అప్పుడే తలుపు మూసి అతనివైపు తిరిగింది మనో...

''నువ్వు... నువ్వా...'' భయంతో అతని గొంతు పిడచగట్టుకుపోయింది. కళ్ళు పెద్దవయ్యాయి.

''అవును... నేనే. నువ్విప్పుడు నా పేషెంటువి. మనోహర్! కాలచక్ర గమనంలో అదృష్టం ఎప్పుడూ ఒకరిదే పైచేయిగా వుండదు. కొన్నాళ్ళది ఒకరిదయితే మరికొన్నాళ్ళకు




వేరొకళ్ళను వరించవచ్చు. నీకు ట్రీట్‌మెంట్ ఇవ్వకపోయినా, కనీసం కరెక్ట్ ట్రీట్‌మెంట్ ఇవ్వకపోయినా ఈపాటికి నువ్విలా మాట్లాడగలిగే స్థితిలో వుండేవాడివి కాదు. ఇప్పుడు నీ గుండె చప్పుడు నా సంరక్షణలో వుంది. హై షుగర్, బీ.పీ.తో హార్ట్ ఎటాక్ వచ్చింది నీకు.

నరే! ఇప్పుడు చెప్పు... నేనడిగే ప్రతి ప్రశ్నకీ సరైన సమాధానం చెప్పు... గతంలో ఏం జరిగిందీ అన్నది నీ నోటినుంచే వినాలని వుంది. నీనోట అబద్ధం వచ్చిన మరుక్షణం నాదగ్గరున్న రిమోట్ కంట్రోల్‌తో ఒక స్విచ్ ఆపరేట్ చేస్తాను. చాలు... నీ ఒంట్లోకి ఆటోమేటిగ్గా అవసరంలేని ఇన్సులిన్ ఇంజక్ట్ అవుతుంది. ఫలితం... నువ్వూహించుకోగలవనుకుంటాను...''

ఒక్కసారిగా చచ్చిపోతేనేం అనిపించింది మనోహర్‌కి. కానీ ఓ ఆడదాని చేతిలో, ఓ అబలకి భయపడి బంగారంలాంటి జీవితాన్ని అంతకంటే విలువైన రాజకీయ భవిష్యత్తును పాడుచేసుకోవడమా... నో... ఈ కాసేపే నేను దీనిచేతిలో. అటుపైన దీని బతుకు... నేను నడిపిస్తాను... ఆలోచనల్లో మునిగిన మనోహర్‌కి అరిచినట్టు వినిపించింది.

''చెప్పు! నేను ఒట్టి అబద్ధాలకోరును కదూ!''

''కాదు... కాదు... నువ్వెప్పుడూ అబద్ధాలు చెప్పలేదు!''

''గాలితో, ధూళితో మాట్లాడే పిచ్చిమొద్దును కదూ''

అతని మొహంలో అవమానం తాలూకు ఆవేశపు చెమటలు. ఎ.సి. రూమ్‌లో ధారాపాతంగా చెమటలు.

''నేను మెంటల్ పేషెంట్‌నా... నాది పిచ్చి వాలకమా...?'' కఠినంగా పలుకుతోంది ఆమె స్వరం.

''నేను చెప్పేవన్నీ కట్టుకథలు కదూ! నన్ను ముట్టుకునే ఆలోచనైనా నీకెప్పుడూ రాలేదు కదూ!''

''నేను నిన్ను ప్రేమించాను. నీవెంటపడ్డాను... అవునా... ఆ తరువాత ఎవడితోనో లేచిపోయాను... కదూ!'' ఆ మాటలు విసిరిన కత్తుల్లా అతని మరుగునపడిన గతాన్ని పొడుస్తున్నాయి.

''అప్పుడు చెప్పడంకాదు. ఇప్పుడు చెప్పు... ఆ గతమంతా పొల్లుపోకుండా చెప్పు''

అతడి బుర్ర అతి వేగంగా ఆలోచిస్తూనే వుంది. ఈ గండం గడిచాక... ఆమెను ఎలా పడగొట్టాలి... అని...

అంతలోకే ఆమె గద్దించడంతో ఒక్కొక్క విషయాన్ని... ఇరవైఏళ్ళనాటి... జుగుప్సాకర గతాన్ని... కళ్ళముందు సినిమా చూస్తున్నట్టు చెబుతున్నాడు.

అంతా చెప్పాక ఆమె మరోప్రశ్న వేసింది.

''నీ జోలికి రాకపోయినా నన్ను చంపాల్సిన అవసరం ఏమొచ్చింది?''

''గతాన్ని బయటకు లాగి, నా భవిష్యత్తుకు అడ్డుపడతావనీ, ముఖ్యమంత్రిగా నన్ను పైకి రానివ్వవని...''

చాలాసేపు నిశ్శబ్దం. నిశ్శబ్దం అంత భయంకరంగా వుంటుందని అప్పుడే తెలిసిందతనికి.

''జరిగినవన్నీ వున్నవి ఉన్నట్లు చెప్పాను. అన్నీ నీ ఇష్టప్రకారమే చేశాను...'' అన్నాడు.

నవ్వింది మనో...

''తరువాత ఈ చెప్పిన ప్రతి మాటా నీకు అనుకూలంగా మార్చుకోగల రాజకీయవేత్తవని కూడా నాకు తెలుసు...''

క్షణం ఆగి... ''అందుకే... అందుకే...'' అంటున్న ఆమెకేసి భయంభయంగా చూస్తున్న అతడితో ఆమె అంటున్న మాటలు అతని మీద పిడుగులు కురిపించాయి.

''అవతలి గదిలో పత్రికావిలేకర్లు నిన్ను టి.వి.లో చూస్తూ, నీ మాటలు స్పీకర్లలో వినేలా ఏర్పాట్లుచేశాను. అవన్నీ వాళ్ళు జాగ్రత్తగా నోట్‌చేసుకుంటున్నారు...''

తను కలలుకన్న బంగారుభవిష్యత్తు కూకటివేళ్ళతో పెకలించుకుపోయినట్లు అనిపిస్తున్న అతడి కళ్ళకి ఆ క్షణంలో ఆమె దుష్టశిక్షణకు నడుంకట్టిన మహిషాసుర మర్దనిలా కనపడుతోంది.



# 'కృష్ణాతరంగాలు'పై సమీక్షలు

**ఫిబ్రవరి చతురలో ప్రచురితమైన పులిగడ్డ శ్రీరామచంద్రమూర్తి నవల 'కృష్ణాతరంగాలు'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.**

## ప్రగతికి మూలం

*(ప్రథమ బహుమతి రూ: 100/- పొందిన సమీక్ష)*

సమాజంలో నైతిక విలువలు దిగజారకుండా మనం ఏర్పరచుకున్న కట్టుబాట్లే మన ఆచారాలూ, సంప్రదాయాలూ. ఇవి కాలానుగుణంగా మారి మనిషి మనుగడకు తోడ్పడవలసింది పోయి, మూఢాచారాలుగా మారి, మూర్ఖత్వాన్ని పెంచి, బలవంతుని చేతిలో బలహీనుల్ని వేధించే అస్త్రాలుగా మారుతున్నాయి. ముఖ్యంగా స్త్రీలపాలిట ఇవి ఇనుప సంకెళ్ళు. కారణాలు కనిపించే వరకట్నపు చావులకన్నా, కనీసపు సానుభూతికి కూడా నోచుకోని కృష్ణవేణిలాంటి సంప్రదాయపు చావులు ఎన్నో! క్రమశిక్షణతో కూడిన జీవితానికి నిర్దేశించబడిన ఒక్కో ఆచారం, సంప్రదాయం ఎంత వికృత రూపం దాల్చిందో అవి ఈ పురుషాధిక్య ప్రపంచంలో స్త్రీని వేధించటానికి ఎలా ఉపయోగించబడుతున్నాయో ఈ నవలలో పులిగడ్డ శ్రీరామచంద్రమూర్తిగారు కళ్ళకు కట్టినట్లు చిత్రించారు.

ఆరోగ్యానికి అనుబంధంగా శుచి, శుభ్రత కోసం ఏర్పరచిన 'మడి' అంటరానితనాన్ని బోధిస్తోందీనాడు. భార్య అనారోగ్యం కూడా లెక్కచేయని భర్తకోసం అతని ఆయురారోగ్యాలకోసం భార్య నోములూ, వ్రతాలూ చేసి మొక్కుబడులు చెల్లిస్తూ ఉంటుంది. ఇలాంటి ఏ ఒక్క వ్రతమూ భర్తలకి లేవు. ఉపవాసం పేరుతో అన్నం తప్ప అన్నీ మింగుతూ, దైవధ్యానంకన్నా, ఉపవాసానంతరం ఆరగించబోయే భోజనంలోని రుచులగురించే ఆలోచిస్తారు చాలామంది. తమకు కలిగినదానిని ఆనందంతో నలుగురితో పంచుకోవటానికీ, పేదసాదలకు దానధర్మాలు చేయటానికి ఏర్పరచిన నోములూ, వ్రతాలూ సంకుచితత్వంతో మురిగిపోతున్నాయనేదానికి పరాకాష్ఠ నందికేశుని నోము. ఆకలిగొన్నవారినోట మట్టికొట్టి ప్రసాదాన్ని మట్టిపాలు చేసే ఈ ఆచారాన్ని ఖండించి, చివరికి సూరమ్మ విషయంలో ఆకలి ఆచారాన్ని జయించినట్లు చిత్రించారు రచయిత.

చుట్టూ ఉన్న సమాజంద్వారా ఎదురవబోయే విముఖత్వాన్నీ, విమర్శలనీ, ఏటికి ఎదురీదలేని కృష్ణవేణీ, వేణుల పరిస్థితినీ దృష్టిలో పెట్టుకుని వారి కులాంతర వివాహానికి అడ్డుతగిలినా, నిజమైన ఆచారాలకి అర్థంచెప్పిన కృష్ణమాచార్యులుగారి మహోన్నత వ్యక్తిత్వం మనందరికీ ఆదర్శం. తప్పు చేశానేమోనన్న భావనతో ఆయనలో కలిగిన ఆత్మవిమర్శతో కూడిన అంతర్మథనం. ఛాందసవాదులందరిలోనూ కలిగితే అదే ప్రగతికి మూలమవుతుంది.

**-తూములూరి కనకదుర్గ**
గుంటూరు

## జరుగుతున్న చరిత్ర

*(ద్వితీయ బహుమతి రూ: 75/- పొందిన సమీక్ష)*

పులిగడ్డ శ్రీరామచంద్రమూర్తిగారి నవల 'కృష్ణాతరంగాలు' కథకాదు, జరుగుతున్న చరిత్ర. మనమధ్యనే తిరుగుతున్న మనుషుల మనస్తత్వాలకు సజీవరూపకల్పన. కేవలం మారుమూల పల్లెల్లోనేకాదు, పట్టణాల్లో కూడా వికటాట్టహాసం చేస్తున్నాయి ఈ ఆచారాలు, మూఢనమ్మకాలు.





ఈ నవలలోని సూరమ్మ, మాధవరావు ల్లాంటి తల్లీ కొడుకులను నేనెరుగుదును. వారి బాధల వాతబడి పుట్టింట జేరిన కృష్ణవేణి లాంటి ఓ కోడలు న్యాయంకోసమని కోర్టులచుట్టూ తిరుగుతోంది పదేళ్ళుగా. ఆమె కన్నబిడ్డలకు పెళ్ళీడు వచ్చింది కాని కోర్టు తీర్పుమాత్రం రాలేదు. ఆచార వ్యవహారాల్లో సూరమ్మను మరిపించగల దిట్ట ఈమె అత్తగారు. ఆమె కొడుకుకన్నా నవలలోని మాధవరావే నయమనిపిస్తాడు.

గతంలో వరదలు వచ్చినప్పుడు మా తణుకు పట్టణం ఆరడుగుల లోతున జలదిగ్బంధమై నానుతున్నప్పుడు మాకు తెల్సిన వారి డాబాపైకి మకాం మార్చాము. నూతులు నిండి, పైపులు మునిగీ మునగని స్థితిలో నీళ్ళు కొట్టుకొనేవాళ్ళం. తగు అవకాశాలు లేకపోయినా కులమత భేదాలు మరచి అందరం కలిసి వంటలు చేసుకొనేవాళ్ళం. ప్రాణాలరచేత పట్టుకొని ఎప్పుడేమవుతుందో తెలియని సమయంలో ఓ బామ్మగారు మీరు వండిన అన్నం తిననంది. ఆచారం, మడీ అంటూ అసలు ఇల్లు వదిలి రావడానికే ఒప్పుకోలేదు. చివరిక్షణంలో కట్టుబట్టలతో బలవంతాన బయటకు వచ్చింది. తను వేరే కుంపటి పెట్టి తనకో రెండు బిందెలు నీళ్ళు తడిబట్టలతో తెమ్మంది. పంపు నీళ్ళు కొట్టినప్పుడు వరదనీళ్ళు కలిస్తే పనికిరావంది. వంట వండుకున్నప్పుడు మడి చీర కట్టుకున్న తనను తాకవద్దంటుంది. డాబామీద ఉన్న జాగాలో ఆరు కుటుంబాలవాళ్ళం సర్దుకున్నాం. చిన్నపిల్లలున్నారు. వాళ్ళని దూరందూరం అంటుంది. తనేమో తడిబట్టలతో, తడికాళ్ళతో... అదీ తడిసి తడిసి తెల్లగా పాలిపోయినట్టున్న కాళ్ళతో తిరుగుతుంది. ఉన్న ఆ కాస్త జాగాని తడిపేసేది. మరోసారి ఆ రోజుల్ని కళ్ళకు కట్టినట్లు చూపింది 'కృష్ణాతరంగాలు' నవల.

ఆద్యంతమూ హృద్యంగా సాగినా మాధవరావును వరదనీటిలో ముంచి హత్య చెయ్యడం వేణు, గిరిల వ్యక్తిత్వాలకు మాయని మచ్చగా మిగిలిపోయేలా ఉంది...

-కె.సువర్చలాజ్యోతి
తణుకు

## విషాదగాథ

**(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)**

ఫిబ్రవరి నవల 'కృష్ణాతరంగాలు' ఒక పెద్ద విషాదగాథగా పాఠకులచేత కంటతడి పెట్టించడమే ధ్యేయంగా రాసినట్టున్నారు రచయిత! కృష్ణవేణి పాత్రను చూస్తే హృదయం ఆవేదనా తరంగమై కంట నీరు తెప్పించింది. కానీ ఎన్నేళ్ళయినా ఎన్ని తరాలయినా 'ఓ స్త్రీ నీ గతి ఇంతే' నని సరిపెట్టుకోమనేదే రచయిత ఉద్దేశ్యమా!?

ఏ నవలకయినా ఓ మంచి సందేశం ఉంటుందంటారు. కానీ ఈ నవల ఉప్పెనల కరాళ నృత్యం గురించి వివరంగా తెలుసుకోవడానికే చదివినట్టుగా ఉంది. ఈనాటికీ కృష్ణవేణిలాంటి అమ్మాయిలు ఉన్నారు, మూఢాచారాలతో పట్టి పీడించే ఛాందసులూ ఉన్నారు. అలాంటప్పుడు ఎలాంటి కష్టనష్టాలనయినా తెలివిగా, ఓర్పుగా ఎదురించగలిగేలా, సబలగా కృష్ణవేణిని చిత్రీకరిస్తే ఎంతో బావుండేది. అలాగాక ఒక అబలగానే ఆమె జీవితం అంతంకావడం బాగోలేదు.

అమాయకులైన అమ్మాయిలు ఇలాంటి నవలలు చదివి 'అమ్మో! పెళ్ళంటే ఇదా! అత్తగారంటే సూరమ్మలా ఉంటుందా! మొగుడంటే ఇలాగే ఓ మరబొమ్మలా ఉంటాడా?' అని బెదిరిపోయి అసలు పెళ్ళే వద్దనే ప్రమాదం ఉంది.

ఈరోజుల్లో అందరూ చదువుకుంటున్నారు గదా! అయితే, చదువొక్కటే ముఖ్యంకాదు. జీవితాన్ని అందంగా తీర్చిదిద్దుకునే నేర్పు, సహనం, తెలివితేటలు కూడా ఉండాలి! అనే సందేశం వచ్చేలా రాస్తే ఈ నవల ఇంకా బాగుండేది.

-జె.విజయలక్ష్మి
సంగారెడ్డి



## ముగింపు మునిగింది!

*(నాలుగవ బహుమతి రూ: 50/- పొందిన సమీక్ష)*

ఆచారం, సంప్రదాయం పేరుతో మూర్ఖంగా ప్రవర్తిస్తే పర్యవసానం ఏమౌతుందో, చక్కగా గ్రామీణ వాతావరణం, గ్రామస్తుల పరస్పర సహకారం, ఆప్యాయత, అనురాగాలు ఎలా ఉంటాయో ఈ నవలద్వారా తెలుసుకోవచ్చు. కాలానుగుణంగా ఎన్నో మార్పులు వచ్చినా, రవాణాసౌకర్యం లేని పల్లెలలో ఆలోచనాపరిధి బావిలో కప్ప చందంగానే ఉందనేది వాస్తవం. మడి ఆచారాలేగాదు, కుటుంబ గౌరవం, కులం, అంతస్తులు వివాహబంధాలను విషాదాంతంగా మారుస్తున్నాయి.

పాత్రలను అవధులు దాటకుండా హృదయాలకు హత్తుకొనేలా నడిపించారు రచయిత. స్వయం ఉపాధితో గౌరవంగా బతకడంతోపాటు, ఇతరులకు సహాయం ఎలా చేయవచ్చో గిరి, వేణు పాత్రలు నిరూపిస్తాయి.

కాని గ్రామస్తులకు సలహాలు ఇవ్వడం, మధ్యవర్తిత్వాలు చేయడంలాంటి పనులు చేసే కృష్ణమాచార్యులుకు గిరిధర్‌కు కులంపట్టింపు ఉండదనే విషయం తెలియదనుకోలేం. ఆ చిన్న ఊళ్ళో పల్లెకారువారి యిండ్లలో గిరిధర్ భోజనం చేయడం యిందుకు ఉదాహరణ. అలాంటప్పుడు కృష్ణవేణి, వేణుల ప్రేమ విషయం కృష్ణమాచార్యులు గిరికి చెప్పకపోవడం క్షంతవ్యంగాదు. యిది పెద్ద లోపం. అలా కానప్పుడు గిరికి కులం పట్టింపు ఉన్నట్లు చిత్రించి ఉండవచ్చు. రెండుమూడు వాక్యాల తొలగింపు లేదా సవరణ, కృష్ణమాచార్యులను కళంకంనుండి కాపాడి ఉండేవి.

ముగింపు సహజంగా లేదు. కృష్ణవేణిని వేణుచేత రక్షింపచేసి ప్రేమజంటను కలిపినా బాగుండేది. లేదా కృష్ణవేణి మరణంతో ముగించినా సరిపోయేది. మాధవరావు జీవించినా, మరణించినా ఒకటే. వేణుచేత హత్య చేయించడం సమంజసంగా లేదు.

కృష్ణవేణి మరణంవరకు ఏకబిగిన చదివించిన నవలలోని ఆఖరి పదిపేజీలు సినిమా తరహాలో పరిగెత్తాయి. ఎలాగో ఒకలా నవలను త్వరగా ముగించేయాలనే ఆతృత కన్పించింది.

-బి.శంకరప్రసాద్
నెల్లూరు

## దర్పణం

*(అయిదవ బహుమతి రూ: 50/- పొందిన సమీక్ష)*

నవల మొదలుపెట్టినప్పుడు ఒక గొప్ప నవల చదవబోతున్న అనుభూతిని కలిగించిన 'కృష్ణాతరంగాలు' పోనుపోను సబ్జెక్ట్‌లో డెప్త్ తక్కువ అన్న ఫీలింగ్ కలిగించింది. కథకు సరిపడే సబ్జెక్ట్‌ను రచయిత నవలకు పెంచినట్లు అనిపించింది.

పాత్రలు బాగున్నాయి కాని, సంపూర్ణతను సంతరించుకోలేకపోయాయి. వేణు, కృష్ణవేణిల మధ్య ప్రేమసన్నివేశాలు మరింత హృద్యంగా మలచి ఉండవలసింది. అలాగే కృష్ణవేణిని అత్తగారింట్లో కేవలం మడికి మాత్రమే కట్టడి చేసినట్లు కాకుండా, ఇతర సమస్యలను కూడా వారికోణంనుంచి స్పృశించి ఉండవలసింది. గిరి, సంధ్యల కారెక్టర్లు కూడా అసంపూర్ణంగా ఉన్నాయి.

రచయితలో మంచి శైలి, భావుకత ఉన్నాయి. ప్రకృతి వర్ణనలు మనోహరంగా ఉండి పాఠకులను ముందుకు నడిపిస్తాయి. బ్రాహ్మణ కుటుంబాల్లోని వాతావరణాన్ని పాఠకుల కనులముందు ఉంచడంలో రచయిత కృతకృత్యుడయ్యాడు. ముగింపు సాధారణంగా ఉంది. రచయిత సబ్జెక్ట్ విషయంలో మరింత శ్రద్ధ వహించి ఉంటే మూఢాచారాల ముసుగుకు దర్పణం పట్టిన ఒక మంచి నవలగా 'కృష్ణాతరంగాలు' పాఠకుల హృదయాలలో చోటుచేసుకునిఉండేది.

-శివ
మునగపాక




# చతుర ప్రపంచం

## బటన్ న్యూస్ పేపర్

పొద్దున్నే కాఫీ కప్పుతోపాటు న్యూస్ పేపర్ కూడా లేందే మనిషికి తోచదు. ప్రతివారికీ దేశ విదేశాల్లో ఏం జరుగుతున్నదీ తెలుసుకోవాలనే కుతూహలముండటం అత్యంత సహజమయిన విషయం. మన ఇంటిలో మనమే తయారు చేసుకోగల ఓ కొత్తరకం న్యూస్ పేపరు వెలుగులోకి రాబోతోంది.

రేడియో, టి.వి. సెట్లలాగే ఈ వార్తా యంత్రానికి కూడా ఒక బటన్ వుంటుంది. దాన్ని రాత్రి నొక్కి వుంచాలి. తెల్లవారి మరో బటన్ నొక్కగానే రాత్రంతా అది కూడబెట్టిన జాతీయ, అంతర్జాతీయ సమాచారం తెరపై కనబడుతుంది. ఈ పద్ధతిలో ఎడిటర్‌గాని, కంపోజిటర్ లేదా ప్రూఫ్‌రీడర్స్ వగైరా ఎవరి ప్రమేయమూ వుండదు. ఈ పద్ధతిని ఫాసిమెయిల్ అంటారు. ఇది రేడియోలా ఆపరేట్ చేయబడినా పనిమాత్రం టెలివిజన్ పద్ధతి ప్రకారం నడుస్తుంది.

ఈ పద్ధతి ప్రకారం ముందుగా సమాచారమంతా ఒక సెంట్రల్ రిసీవింగ్ స్టేషన్‌ద్వారా సమీకరించబడుతుంది. మొట్టమొదట వ్రాతప్రతి దానికి సంబంధించిన ఫొటోలతో సహా ట్రాన్స్‌మిటింగ్ మెషీన్‌లోకి ఫీడ్ చేయబడుతుంది. అటుపైన ఈ వ్రాతప్రతి మీద అత్యంత కాంతివంతమైన లైటు ప్రసరించబడుతుంది. సన్నటి కాంతి కిరణాలు సమాచార వాక్యాల గుండా ప్రయాణిస్తాయి. ఈ పసంతా ఎలక్ట్రో మాగ్నెటిక్ పరికరాలు చేస్తాయి. దీన్నే స్కానింగ్ అంటారు.

తరువాతి దశలో ఈ సన్నటి కాంతి కిరణాలు ఎలక్ట్రోమాగ్నెటిక్ వేవ్స్‌లా పరివర్తన చెందు



తాయి. తిరిగి ఇవి ట్రాన్స్‌మిటింగ్ స్టేషన్స్‌లో రిలే చేయబడి అక్కడినుంచి రిసీవింగ్ స్టేషన్ల ద్వారా స్వీకరించబడతాయి.

వార్తా పత్రికలోని ప్రతి అక్షరము, ప్రతి భాగము ఒకే కాంతిని ప్రతిబింబించదు. ఒక శక్తివంతమైన భూతద్దాన్ని పెట్టుకుని ప్రతి అక్షరాన్ని పరిశీలించి చూసినట్లయితే ప్రతి అక్షరం చిన్నాపెద్దా చుక్కలతో రూపుదిద్దబడి వుంటుంది. కొన్ని చుక్కలు తెల్లగాను, మరికొన్ని లేత రంగులోను, మరికొన్ని నల్లగాను వుంటాయి. తెల్లచుక్కలనుంచి ఎక్కువ కాంతి, నల్లచుక్కలనుంచి తక్కువ కాంతి ప్రతిబింబిస్తుంది. దీన్నిబట్టి రేడియోతరంగాల గాఢత కూడా మార్పు చెందుతూ వుంటుంది.

ఇప్పుడు ఫాసిమెయిల్ యొక్క అసలు పని ప్రారంభమవుతుంది. ట్రాన్స్‌మీటర్ ద్వారా పంపబడిన తరంగాలను ఫాసిమెయిల్ రిసీవర్ అడ్డుకోవడంతో అవిసాధారణ తరంగాలుగా పరివర్తన చెందుతాయి. ఇవి ఎలెక్ట్రో మాగ్నెట్‌కి తగులుకుంటాయి. ఆ ఎలెక్ట్రో మాగ్నెట్‌కి ఒక పెన్సిలు తగిలించి వుంటుంది. తరంగాల గాఢతనుబట్టి పేపరు మీద అక్షరాల ముద్రలు మార్పుచెందుతూ వుంటాయి.

తరంగాల గాఢత ఎక్కువయిన కొద్దీ కార్బన్ పెన్సిలు ముద్రకూడా దట్టంగా వుంటుంది. గాఢత తగ్గినపుడు పేపరు మీద పడే ముద్ర పలుచగా వుంటుంది. ఈ పేపరు కూడా మామూలు పేపరులాకాక ప్రత్యేకంగా వుంటుంది. అమెరికాలో ఈ ఫాసిమెయిలు పద్ధతి అత్యంత వేగంగా అభివృద్ధి చెందుతోంది. అమెరికాలోని రేడియో, టీవీలు రాత్రి 12 గంటల వరకు వార్తా ప్రసారం చేస్తాయి. కాబట్టి 12 నుంచి ఉదయం 6 గంటల వరకు వార్తా ప్రసారం చేసే పని ఫాసిమెయిలుది. ఇది వార్తలతోపాటు వాతావరణ వివరాలను, శాస్త్రీయ విషయాలను, వ్యాపార ధరవరల వివరాలను అన్నింటినీ అందిస్తుంది.

అయితే వచ్చే చిక్కు ఎక్కడంటే ఈ ఫాసిమెయిలు కారణంగా వార్తా పత్రికల ఉనికి దెబ్బతినే ప్రమాదముందని చాలామంది అభిప్రాయపడుతున్నారు. కానీ ఈ వాదన సరియైందికాదని కొందరంటున్నారు. ఎందుకంటే ఫాసిమెయిలు వార్తాపద్ధతి ప్రతివారి వద్ద వుండటం కష్టం. అంతేకాకుండా ఫాసిమెయిలుద్వారా తెలుసుకోలేని అనేక ఇతర విషయాలను వార్తా పత్రికలద్వారా వివరంగా తెలుసుకోవచ్చును.

ముఖ్యంగా క్షణం తీరికలేని పనులతో సతమతమయ్యే వ్యక్తులు ఈ ఫాసిమెయిలుద్వారా ముఖ్యమయిన వార్తలను సంక్షిప్తంగా సకాల్యంలో తెలుసుకోగలుగుతారు.

---

## నోట్లు - నాణాలు

కరెన్సీ నోట్లు చలామణిలోకి రావడానికి మూడు వేల సంవత్సరాలకి ముందు లోహపు నాణేలు వాడకంలోకి వచ్చాయి. నాణేలు కూడా రాకపూర్వం వస్తువును మరో వస్తువుతో కొనుక్కునే బార్టర్ పద్ధతి అమలులోవుండేది. ఈ పద్ధతిలో అనేక సమస్యలుత్పన్నమవడంతో అందరికీ ఉపయోగించే ఓ పద్ధతి కనుగొనడం వల్లనే నాణేలు వాడకలోకొచ్చాయి. మన్నికలో గానీ, వాడకంలోగానీ మిగతా కరెన్సీకన్నా నాణేలే గొప్పవని పేరొచ్చింది.

చైనీయులు ఈ నాణాల వాడకాన్ని క్రీ.పూ. 1000వ శతాబ్దంలోనే మొదలెట్టారు. చైనాలోను, లిబియాలోను మొట్టమొదటిసారిగా నాణాల వాడకం ప్రారంభమయింది. మొదట్లో కేవలం రాగి నాణాలనే ముద్రించారు చైనీయులు. క్రీ.పూ. 5వ శతాబ్దంలో ఇత్తడి, వెండి లోహాలను కూడా నాణాల తయారీలో వుపయోగించేవారు. అటుపైన బంగారు, వెండి, ఇనుములను కూడా నాణాల తయారీలో వాడుతూ వస్తున్నారు. కొన్నాళ్ళు చిన్నచిన్న ఇనుప మేకులను కూడా రూపాయి నాణాల స్థానంలో వాడారు. మొదట్లో ఈ లోహపు నాణాల మీద ఎటువంటి ముద్రలు వుండేవికావు. కేవలం వాటి బరువునిబట్టి విలువలో తేడాలను తెలుసుకునేవారు. రానురాను ఈ పద్ధతి కష్టతరంగా తోచి వాటిమీద గుర్తుకోసం ముద్రలు వేయించడం ప్రారంభించారు. ఈ పని మొట్టమొదట ఇండియా, గ్రీసులలో ప్రారంభమయి




అటుపైన ప్రపంచమంతా పాకింది.

ఏథెన్స్‌లో నాణాలు చూడ్డానికి వింతగా కనుపించేవి. నాణాలపై ఒకపక్క గుడ్లగూబ బొమ్మ, మరొక పక్క వారి ఆరాధ్యదైవమయిన యాంటినో బొమ్మ వుండేవి. గ్రీసు నాణేలపై దేవుళ్లు, రథాలు, వన్యమృగజీవనం, అడవిలో దొరికే వస్తువుల బొమ్మలు, మతపరమైన చిహ్నాలు ఇలా ఎన్నో చిత్రాలు చోటు చేసుకున్నాయి.

గ్రీకు రాజు అలగ్జాండరు మొట్టమొదటిసారిగా తన చిత్రాన్ని నాణాలపై ముద్రించడాన్ని ఆరంభించాడు. హిందూదేశపురాజులు




మాత్రం ఈ పద్ధతికి వ్యతిరేకత చూపారు. ఏవో కొన్ని మామూలు గుర్తులు తప్ప ఇండియాలోని పురాతన నాణాలు పరిశీలిస్తే ఎక్కడా పాలకుల బొమ్మలున్న దాఖలాలు కనిపించవు. కానీ కొన్ని శతాబ్దాల తరువాత హిందూదేశాన్ని పాలించిన సౌదామిని బుద్ధిర్‌యజ్ఞేశ్వరి నదర్కని అనే పేరుగల హిందూదేశపురాజు మొట్టమొదటిసారిగా తన చిత్రాన్ని నాణేలపై ముద్రింపచేశాడు. అప్పట్లో హిందూదేశంలోని నాణాలు పేర్లు కూడా చాలారకాలుగా వుండేవి. పానమ్, కాసుమ్, రుప్పయ్యా, వరగన్, దమ్, పువ్వరగన్, దండి మొదలయినవి. ఆరోజుల్లో ఎక్కువ ఖరీదులో వుండే నాణేలు మాత్రమే వుండేవి. ఇప్పట్లా నయాపైస వగైరాలుండేవి కావు.

1/4వ వంతు దండి అణాకు ఆరోజుల్లో ఎంతో విలువ వుండేది. అణాలో 1/4వంతు కాసుకి ఇంకా రకరకాల పేర్లుండేవి. కుంభినీకలాన, ఎడ్వర్డ్‌కలాన, బాల్డ్‌హెడెడ్‌కలాన, హార్స్ ఫేస్‌డ్ కలానా వగైరాలు.

దక్షిణ భారతదేశంలో అమ్మన్ నాణాలు ఎక్కువ చలామణిలో వుండేవి 1/4వ వంతు అణా అంటే 55 అమ్మన్ పైసలకు సమానం. ఒక రూపాయి 320 అమ్మన్ పైసలకు సమానం. ఆ రోజుల్లో 6 అమ్మన్ పైసలకు మంచి భోజనం లభించేది. ఆ రోజుల్లో ఇండియా, శ్రీలంకదేశాల్లోని నాణాలే చాలా దేశాల్లో చలామణి అయ్యేవి.

# చతుర కతలు

## దండోపాయం

ప్రభుత్వోద్యోగం చేస్తున్న సూర్యంకి ఆమధ్య ఏవో ఎరియర్స్ భారీగా వచ్చాయి. దానికితోడు స్వంత ఊళ్ళో ఉన్న ఇల్లు అమ్ముడుపోయింది. దాంతో అతడు పనిచేస్తున్న వూరి దగ్గర్లోని పట్నంలో రెండు వాటాల పెద్ద ఇల్లొకటి చవగ్గా బేరానికొస్తే ఎప్పటికైనా పనికొస్తుందని కొని బాగుచేయించాడు. కాస్త తెలిసినవాళ్ళకి ఒక వాటా అద్దెకిచ్చి రెండోవాటాని ''మంచివారెవరైనా వస్తే అద్దెక్వ్యండి'' అని వాళ్లకే అప్పగించి వెళ్ళాడు. ఇది జరిగిన సంవత్సరం దాటినా ఇంతవరకూ ఆ రెండో వాటా అలాగే ఖాళీగా ఉంది. రెండుమూడుసార్లు వెళ్ళి విచారిస్తే కొన్ని గదుల్లో స్టూడెంట్స్ వుంటున్నారు. మరో కొన్ని గదులు మొదటి వాటావారే. వాడుకుంటున్నారు.

వాళ్ళనడిగితే... ''ఏం చేస్తామండీ? అప్పటికీ మేము ప్రయత్నిస్తూనే వున్నాం. ఎవరూ రావటంలేదు'' అని సమాధానం చెప్పేవారు.

స్టూడెంట్స్ విషయమడిగితే... ''వాళ్ళు చుట్టాల పిల్లలండీ ఊర్లో గదులు ఖాళీలేకపోతే ఎలాగూ ఖాళీయే కదా అని ఎవరేనా దిగేవరకూ ఉండమన్నాం'' అనేవారు. ఆ మాటలు నమ్మశక్యంగాలేక పోయినా సహజంగా మొహమాటస్థుడైన సూర్యం ఏమనలేకపోయేవాడు.

పోనీ ''ఆ స్టూడెంట్స్ దగ్గరే అద్దె తీసుకోండి'' అందామంటే, తనే ఇదివరిలో, ''స్టూడెంట్స్‌కి అద్దెకివ్వకండి, ఇల్లు పాడుచేసేస్తారు'' అని చెప్పాడు. ఇప్పుడీమాటంటే వాళ్ళు శాశ్వతంగా ఆ వాటాలోనే ఉండిపోయే ప్రమాదముంది. అందుకే ఏమనలేక వచ్చేసేవాడు.



''ఇళ్ళకి కటకటగా వున్న ఆ పట్నంలో అన్ని సదుపాయాలూ వున్న తన ఇల్లు ఎవరూ అద్దెకి అడక్కుండా వుండడమేంటి?'' అనే సమస్యని ఒకసారి స్నేహితుడు రామం దగ్గర చెబితే అతనది తను పరిష్కరిస్తానని చెప్పి ఇల్లు కావాల్సినవాడిలా ఆ ఇంటికెళ్ళాడు. ఇల్లంతా చూపించాక ఆ ఇంట్లో వున్నవాళ్లు అతడికిలా చెప్పారట.

''వేసవిలోనేగానీ, వర్షంవస్తే ఉండలే మండీ, అంతా కారిపోతుంది. అదీకాక ఇంటి నిండా చెదలే. ఏపాటివస్తువులు పెట్టినా చెద లు కొరికేస్తాయి. పైగా ఎలకలు, బొద్దింకలు విపరీతం. సాయంత్రమయినా, ఏమాత్రం ఎండ తక్కువున్నా దోమలు విపరీతంగా ము సిరేస్తాయి. బాగుచేయించమని ఎంత చె ప్పినా ఓనర్ విన్పించుకోరు. పైగా అద్దె మాత్రం అయిదువందలకి తగ్గదు. కరెంట్ మనమే కట్టుకోవాలట. ఈ బాధలు పడలేక మేమే ఏదైనా ఇల్లు దొరికితే వెళ్ళిపోదామను కుంటున్నాం'' అంటూ కుటుంబమంతా ఒక్కొ క్కపాయింట్ చొప్పున ముక్తకంఠంతో పలికారు. ఆ మాటలు విన్న రామం భయపడినవాడిలా బయటికొచ్చేశాడట. అతడికి విషయం పూర్తిగా అర్థమైంది. తమని నమ్మి ఇల్లు అప్ప జెప్పిన సూర్యం వీక్‌నెస్ కనిపెట్టిన వాళ్ళు ఒక వాటా అద్దెతోనే మొత్తం ఇంటిని వాడుకోడ మేకాకుండా స్టూడెంట్స్ దగ్గర అద్దెలు వసూ లుచేస్తూ ఇంచుమించు స్వంత ఇల్లులాగానే చెలామణీ చేసుకుంటున్నారని అర్థమైంది.

అదే విషయం సూర్యంతో చెప్పాడు. సూ ర్యంకి షాకే అన్పించింది. పెద్ద మిస్టరీ విడిపో యినట్లయింది, తేరుకున్నాక,

''ఏం చెయ్యమంటావ్?'' రామాన్ని సలహా అడిగాడు. ఏదో చెప్పాడు రామం ఆ మర్నాడే పట్నంలోని తన ఇంటికెళ్ళి వాళ్ళతో, ''ఏమండీ! ఎలాగూ పక్క వాటా అద్దెకి కుదర టంలేదు కదా? అందుకని ఒకాయన పెద్ద ఇల్లు కావాలి. పూర్తిగా రెండువాటాలు తమకే కావాలంటే సరే, ఇచ్చేద్దామనుకుంటున్నాను. అందుకని మీరు వేరే ఇల్లు చూసుకోండి. వారంరోజులు టైం ఇస్తున్నాను'' అంటూ మరో మాటకవకాశం ఇవ్వకుండా గుమ్మం దిగిపో యాడు సూర్యం.

ఆ మాటకి పచ్చివెలక్కాయ ముక్క గొంతులో అడ్డుపడినట్లయింది వాళ్ళకి.

సూర్యం వెళ్ళిన మూడోరోజు తెల్లారే అత డింటి తలుపు తట్టారెవరో. తలుపుతీసిన అత డి ఎదురుగా వాళ్ళింట్లో అద్దెకుంటున్నాయన, అతని పక్కన మరొకాయన వున్నారు. లోపలికి వచ్చి కూర్చున్నాక ఆయన అన్నాడు.

''బాబాయిగారూ! అంత పెద్ద వూరిలో మమ్మల్ని వేరే ఇల్లు వెతుక్కోమంటే ఇప్పటికి ప్పుడెలా చెప్పండి. పక్కవాటా ఖాళీగా వుందనే కదా మమ్మల్ని ఖాళీ చెయ్యమన్నారు. ఇదిగో ఈయనకి ఆ పోర్షన్ నచ్చిందిట. అడ్వాన్స్ ఇవ్వడానికి వచ్చారు. దయచేసి ఒప్పుకోండి సార్'' అన్నాడు బతిమాలుతున్నట్లుగా.

తన పథకం పారినందుకు సంతోషించినా బయటపడకుండా, కాసేపు బెట్టుచేసి మరింత బతిమాలించుకుని, చివరికి ఒప్పుకోక తప్పని వాడిలా ముఖం పెట్టాడు.

''సరే! నష్టం వస్తున్నా మీరు చాలారోజు ల్నుంచీ వుంటున్నారు. కాబట్టి కాదనలేకపోతు న్నాను'' అని అడ్వాన్స్ అడిగి పుచ్చుకున్నాడు.

పెద్ద సమస్య తీరినందుకు ఆనందపడి ఆ అద్దెకున్నాయన వెళ్ళిపోయాడు. అదే స్థితిలో సూర్యం కూడా వున్నాడని పాపం ఆయనకి తెలీదు.

-అయ్యగారి శ్రీనివాసరావు

---

## తెలుగువాడు

కరమ్‌సింగ్ పంజాబీ

రాజన్ మలయాళీ

సుబ్బారావు తెలుగువాడు

-ముగ్గురూ ఒకేసారి మిలటరీలో చేరారు. చేరిన కొన్ని రోజులు తరువాత శత్రుదేశం ఒకటి మనదేశంమీద దండెత్తడంతో పై అధి కారి వారి ముగ్గురిని పిల్చి ఇలా చెప్పాడు.

''సీ మిస్టర్ యంగ్‌ఫ్రెండ్స్! మనదేశ విమా నాలన్నీ యుద్ధరంగంలోకి వెళ్ళగా ఈ యుద్ధ



విమానమొకటే మనదగ్గర వుండిపోయింది. ఈ విమానంలో ఇంధనం చాలా తక్కువగా వుంది. అందువల్ల మీలో ఒకరు ధైర్యంచేసి ముందుకు వచ్చి, ఈ విమానంలో వెళ్ళి శత్రు సైనికుల్ని పారదోలి, మాతృదేశాన్ని కాపాడండి''

వెంటనే కరమ్‌సింగ్ ధైర్యంగా ముందుకు వచ్చి, ఆ ఇంధనం తక్కువగా ఉన్న విమానంలో పైకి ఎగిరి, శత్రుసైన్యంమీద బాంబుల వర్షం కురిపించి, శత్రువులని ముప్పుతిప్పలు పెట్టి, మూడు చెరువుల నీళ్ళు తాగించి, ఇంధనం అయిపోయేలోగా పని పూర్తిచేసి అత్యంత చాకచక్యంగా కిందికి వాలి, విమానాన్ని సురక్షితంగా దింపాడు.

''బంగాళాఖాతంలో శత్రుదేశ సబ్‌మెరినొకటి ప్రవేశించింది. దాని జాడ తెలుసుకొని, పేల్చేసి ఆ శత్రుదేశానికి బుద్ధిచెప్పండి'' అని కబురు రావడంతో రాజన్ ఆ శత్రుదేశ సబ్‌మెరిన్ ఓడను తెలుసుకోవడమే గాకుండా దానిని అత్యంత రిస్క్ తీసుకొని బాంబులతో పేల్చివేసి, ఒడ్డుకు చేరాడు.

ఈసారి అధికారి సుబ్బారావుని పిల్చి ఇలా చెప్పాడు, '' సీ మిష్టర్ సుబ్బారావు! మనదేశంలో ఫలానా రాష్ట్రంలో, ఫలానా ప్రదేశంలో భూకంపం సంభవించి, ప్రజలు నానా అవస్థలు పడుతున్నారు. అందువలన నీవు ఈ ట్రక్కుతో వెళ్ళి ఆహారపొట్లాలు ఆ బాధితులకు అందించి రావాలి'' అని ఆర్డర్ జారీచేశాడు.

కొద్దిసేపట్లోనే సుబ్బారావు తిరిగిరావడం చూసి ''వాట్ సుబ్బారావు? వై ఆర్‌యూ రిటర్న్‌డ్?'' అని ప్రశ్నించాడు ఆఫీసర్.




''సారీ సార్! ట్రక్కు టైర్ పంక్చరైంది'' చెప్పాడు సుబ్బారావు.

-ధూళిపాళ ప్రసాదరావు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004 Regd No. H/HD/402

# కొందరికి తీపి తగిలితే తగని మక్కువ




ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, [illegible], మీకు నచ్చే, మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు మీ ముందు సిద్ధం

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' [illegible] పసందైన విందుకు [illegible]!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది [illegible] 'ప్రియ' [illegible]. 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కేజీ, 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును



Mango Avakaya · Mango Thokku · Cut Mango · Tender (Vadu) Mango · Sweet Mango Chutney · Amla · Gongura · Drumstick · Lime · Tomato · Mixed Vegetable



Bitter Gourd · Green Tamarind · Ginger · Sweet Ginger · Mango Ginger · Garlic · Onion · Red Chilli · Green Chilli (Sliced) · Green Chilli (Paste) · Gongura & Red Chilli · Green Tamarind & Red Chilli




Pickles
ఏ పచ్చడంటే
ఆ పచ్చడి సంసి

ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్, (ప్రియ ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ 500 48